# కృ తి ప తి



ఉ. వేంకట శైలమం దటులు వేడుకతో నివసించుచుం “గలౌ
వేంకట నాయకో” యనెడు పేర్మికి నై వివిధస్థలంబులం
దంకిలి లేక మెట్టుచుఁ గళాలయ మైన త్రిలింగపీఠముం
బొంక మెసంగఁ జేయుచును బొల్చెడు నట్టి విభున్ భజించెదన్.

గానే పరిగణింపఁ బడు నని తచ్చరిత్రమందు రామకృష్ణాదుల చరిత్రము లందుం బలె శృంగారాద్భుతాదిరసంబులకుఁ దావు లభింప దని నే నెఱింగియు నిట్లుద్యమించితిని. కథాక్రమము:—

"కథానాయకుని తల్లిదండ్రులు పుత్రులకై తపము చేయుట, వారికడ కొకయోగి వచ్చి వర మిచ్చుట, పుత్రుఁడు పుట్టుట, నాగభూషణుఁ డని పేరు పెట్టుట, శైశవక్రీడలు, ఉపనయనాది సంస్కారములు, విద్యాభ్యాసము, వివాహము, సతీవియోగము, ద్వితీయ వివాహము, తీర్థాటనము, తత్త్వవిచారము, ఆశ్రమనిర్మాణము, బ్రహ్మజిజ్ఞాస, బోధములు, సత్రయాగము, నిర్యాణము, ఇంతమాత్రమే నొక చరిత్రను దీసికొని యిట్లు పెద్ద ప్రబంధముగాఁ జేసియుంటిని. ఇందు నా యజ్ఞానకృతదోషంబు లున్న విజ్ఞులు నన్ను మన్నింతురుగాక.

ఇందు వేంకటేశ్వరచరిత్రము శ్రీకాకుళాంధ్రదేవ చరిత్రము లోనగుకొన్ని ఘట్టంబు లప్రస్తుతంబు లైనను ప్రస్తుతంబులు గాఁ దలఁచుకొని వర్ణించితి. వానిమాట కేమి గాని మఱికొండగుహలో నమృతలింగకథయును స్వామి ప్రత్యక్షమై నీ వమృతనాథుఁడ వని చెప్పుటయును స్వర్గద్వారముకడ నొకయోగి దర్శన మిచ్చి "ఇప్పుడు నీ కీ సొరంగదారి కాదు" అని చెప్పుటయును నైమిశారణ్యములో నొకయొకయోగి దర్శన మిచ్చి తొల్లి నీ వగస్త్యముని శిష్యుండ వనియును నిన్నతఁడు శపించుటం జేసి యిట్లు పుట్టితి వనియు నగస్త్యుని గురుఁడు సుబ్రహ్మణ్యుఁ డతఁడే వేంకటేశ్వరుం డయ్యె నీ వా వేంకటేశ్వరుని నారాధించి వానిలో నైక్యము నొందుదు వనియు లోనగునవి కొన్ని కొన్ని నా కీశ్వరుఁడు తోఁపించుటం జేసి యిందు వ్రాసితిని. ఈ వ్రాఁత లత్యుక్తు లని కించిజ్జ్ఞులు నన్ను గర్హింతు రేమో యని సంశయించితిని గాని యాయాభాగములు వినినప్పుడు శ్రీవేంకటరెడ్డిగారుమీఁదు వ్రాసిన యీవిషయము లన్నియు నతిశయోక్తులు సద్భూతములు కావు నాగురువుగారి జాతకగ్రంథములో (నాడీగ్రంథములో) వారిపూర్వజన్మ

ప్రాచ్యవిద్యాభిపోషకుఁ డయి గురుబోధామృతజనితానందుఁ డయి సంతర్పితసకలార్థిజనుం డయి యమృతభండారమున నమృతానంద నాథభజనంబున నమృతానందము నందుచు సుఖమున్నవాఁడు శ్రీ చుండూరు వేంకటరెడ్డి మహాస్యశేఖరుండు. శారదయై నిగమవిశారదయై గురుమూర్తి సన్నిధినుండి పరమహంస సందేశంబు నంది రసనిష్యంద మయిన కవితాప్రవాహమున గురుబోధార్థ జాతంబును వహించుచు సత్త్వపవిత్రయాత్ర గురుద్విజ ప్రశంసఁగనుచు మేటి వన్నెగాంచి తుల లేక వెలపెట్టరాని విజ్ఞానంబున నుతినందుచున్నది కవితిలకంబగు కనకాంబా కవయిత్రి. అకారోకారమకారంబుల కేకత్రసంధానం బయిన యట్టి ముప్పురకును గురుమూర్తి యైన శ్రీనాగభూషణునియందే యాంతరంగికైక్యము శ్రీసుత్రిలింగ విద్యాపీఠమే యద్దానిబాహ్యచిహ్నము.

ఈవిద్యాపీఠము యొక్క ముఖ్యాంగమే సర్వతంత్ర స్వతంత్ర కళాశాల పండితసత్కారము. దీని యపూర్వఫలము ప్రాచ్యవిద్యావ్యాప్తి. దీని నిర్వాహకురాలు శ్రీసతి కనకాంబయే దీని నంతర్గతమయిన శక్తిస్వరూపము. శ్రీ చుండూరు వేంకటరెడ్డి దీనిసిత్రికి మూలము. శ్రీ సుబ్బావధాని దీనికి నిర్మాత. ఇది యంతయును శ్రీకృష్ణభూషణుని లీలావిలాసము.

ఇట్టి శ్రీకృష్ణభూషణుని చరిత్రమును శ్రీయుతులయిన వేంకటరెడ్డి కనకాంబా సుబ్బావధాని ప్రముఖుల నామాదిక కీర్తనంబునం గలిపి, ప్రాచ్యపద్ధతి నుల్లసిల్లు స్థలపురాణాది సంకీర్తన మార్గమును మేటి సత్కథమున నిర్మించుచున్న దేశవర్ణనాది స్వభావోక్తిం గూర్చి పరమమగు కావ్యరాజమును వ్రాసిన శ్రీకవిసార్వభౌము నెంతయు నభినందించుచు నీగ్రంథము చిరస్థాయిగఁ బ్రజలకు సమ్మోదంబు నొసంగుఁ గావుత మని యీశ్వరునిఁ బ్రార్థించు

సుధీవిధేయుఁడు,

విద్వాన్ గంటిజోగి సోమయాజి M. A. L. T.

# ఉదాహారము

"శా. శ్రీమీఱన్ నిజభక్తసంఘమునకున్ మృత్యుంజయత్వమ్ము ని
త్యామోదమ్మును బుత్రపౌత్రవిభవం బారోగ్యభాగ్యంబులున్
బ్రేమం గూర్చుచు లోకమేలు నలసావిత్రీమహాదేవి దా
నీమర్త్యాళికి సౌఖ్య మిచ్చి కరుణన్ వీక్షించి రక్షించుతన్."

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మూగురు కవులు మూఁడు శతాబ్దములకెట్లో యాంధ్రీకరింపఁ గలిగిన శ్రీకృష్ణ (వ్యాస) భారతమును శ్రీకృష్ణభారత మనుపేర స్వస్వరూపముతో సర్వలక్షణ లక్షితముగా రచియించి యాంధ్రులకుఁ బ్రసాదించుటయేగాక సుమారు నూటయేఁబది గ్రంథములను వ్రాసి దేశ మెల్లెడను జ్ఞానబీజములను వెదచల్లిన కవిమూర్ధన్యులు. మఱియు మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ వేదవిద్యావిశారదేత్యాది బిరుదముల నంది యనేకస్థలములఁ గవిగండపెండేరము పంచగంగాంచితస్వర్ణాభిషేకము గజారోహణోత్సవము శిలావిగ్రహ ప్రతిష్ఠ మున్నగుగౌరవముల నంది యాంధ్రలోకమునకుఁ బరిచితులై రనుట నిర్వివాదాంశము. పురాతనకవీశ్వరులపలుకుబంగరునకుఁ బరిమళ మొనగూర్చు రచనాచమత్కృతి యీకవిసార్వభౌమునకు స్వాభావసిద్ధమై యద్యతననవ్యకవితాప్రవాహమున కెదురీదుచున్నందుకును, మన పూర్వకవులకీర్తిని మూర్తీభవింపఁ జేయుచున్నందులకును, అశీతివర్షదేశీయుఁ డయ్యు శృంగారతరంగిణి, మధుకరవిజయము, గణేశ్వర పురాణము, మున్నగు మహాప్రబంధముల నత్యల్పకాలములో రచియించి జ్ఞానభిక్ష నొసంగుచున్నందులకును ఆంధ్రలోకము గర్వింపఁ దగియున్నది. ఇందు శృంగారతరంగిణి యనుపేర స్వతంత్రముగా రచియింపఁబడిన నైషధీయచరితమును, కళాపూర్ణోదయముం బోని మధుకరవిజయమను కల్పితప్రబంధమును జూచిననాఁడు నాకుఁ గలిగినయానందము నిట ప్రస్తావించుటకంటె నాంధ్రలోకము తప్పక చూచి యానందింపనిచో మహాపరాధ మొనర్చిన దగుననుటకు సాహసించుచున్నాను.

మఱియు దినపత్రికలు లేనిదినములలో నాంధ్రమున "గౌతమి" యనుదినపత్రికను నెలకొల్పి రెండుసంవత్సరములు నడపుటయేగాక

అమృతానందుని తీర్థయాత్రలను వర్ణించుసందర్భమున మనోహరముగ నాయాకథలను వర్ణించినారు. మొత్తముమీఁద సాంధ్ర దేశమునఁ గల తీర్థము లన్నియు వర్ణింపఁ బడినవి. అందు కణ్వమని చరిత్రము పోకలదమ్మక్కకథ ఓరుగంటి ప్రతాపరుద్రుని చరిత్రము మణికొండగుహావృత్తాంతము, జీడికంటిచరిత్రము నైమిశారణ్యాబుధుల వృత్తాంతము, మనోహరముగా వర్ణింపఁబడినవి. ఈ వర్ణించుటచేత భారతదేశమందే గాక యాంధ్రదేశమునందు వీరికిఁ గల విశేషాభిమానము విశద మగుచున్నది. ప్రకృత దేశకాల పరిస్థితుల నిటఁ జెప్పియున్నారు. ఇం దనేకాపూర్వవిషయములు గుంభితములై యున్నవి. ప్రసంగవశమున నాయాయిచోటుల ననేకకథలను వ్రాసి పురాణశైలిని, అనేకవర్ణనములను గూర్చి కావ్యశైలిని నీకవిరాజయోగిరాజుచరిత్రము వ్రాసినట్లు తెలియ నగును. పూర్వ మహాయోగివర్యుని శ్రీశాస్త్రిగారు స్వయముగా నెఱిఁగియుంట నేమో కవితాతాదాత్మ్యము నంది వ్రాసినట్లు.

సీ. పదియాఱు వన్నెమేల్పసిడికి నెనవచ్చు
పసిపచ్చ మేనను బరఁగువాఁడు
పని తేంద్రనీలము లన నల్ల నగుమీఁన
ములును గడ్డము జుట్టు గలుగువాఁడు
సప్తకచ్ఛంబులు సరి గాఁగ మేటినీ
ర్కావిదోవతి కట్టఁ గట్టువాఁడు
పొడుగు బొట్టియు సన్నమును లావునుం గాని
కమనీయరూపము గలుగువాఁడు
ఎలనగవుఁ జూపువెరామున నలరువాఁడు
ధవళధవళంబు లగుజన్నిదములవాఁడు
మృదుమధుర భాషణంబులఁ బొదలువాఁడు
భూషణుఁడు సర్వలోకైక భూషణుండు.

దీనివలన తెలియుచున్నది. ఇందు కృతిపతి వేంకటేశ్వరుని వర్ణించుచు నాతనిచరిత్రమిందు పొందుపరచినారు. ఇందు సత్రియాగ వర్ణనాధికము కన్నులకుఁ గట్టినట్లు చిత్రింపఁ బడియున్నది. స్వామినిర్యాణ

మును వర్ణించునట్టి వేంకటేశ్వరైక్యమును ప్రతిపాదించి యమృతత్వ నిరూపణముఁ జేయుచు శ్రీశాస్త్రి నెఱుకపరచుసందర్భముఁ జమత్కార విశేష మెఱింగించినారు.

మఱియు నగ్నిహోత్రవర్ణనమున తదనుకూలముగ శారికాదు లచే బ్రహ్మయజ్ఞము మన వేదవిద్యావిశారదులు చేయించినారు.

సీ. "అగ్న్యగ్నిహోత్రంబు పంటయుండినవన
మున నొప్పుతీరము లనుదినంబు
"నోమిషేత్వా" యని యుచ్చరించినమీఁద
నగ్నిమీళే" యని యచటిశారి
కలు పల్కఁ గోకిలమ్మలు "నగ్న ఆయాహి"
యని పాడు స్వరము తప్పని విధమున
నంత "శన్నోదేవి" యని కపోతమ్ములుఁ
బలుకుఁ జతుర్వేదములు క్రమముగ"

శ్రీ శాస్త్రిగారు పదునాఱేండ్లకే శ్రౌతస్మార్తాది పాండితీ విశేషమున యజ్ఞముల నాధ్వర్యవ మొనర్చుట నేమి పంచమ వేదమగు భారతము నాంధ్రీకరించి వేదవిద్యావిశారద బిరుదమునందుట నేమి స్మార్తప్రక్రియ కనకాశము కలిగినపు డద్దానిని భట్టీయాను సారముగఁ బ్రమాణబద్ధముగ నిరూపించుటయందు వీరి కెక్కుడు ప్రీతి.

ఆ. ముంజరశనఁ జుట్టి మొలకుఁ బచ్చనిగోచి
పెట్టి లేడితోలు గట్టి బ్రహ్మ
సూత్ర మఱుత వైచి శుభవేళ బ్రహ్మోప
దేశమాచరించె దేశికుండు

తే. అందు సహభార్యుఁడై దాత యధివసించి
వరునిఁ దోతెచ్చి యట మధుపర్క మొసఁగి
పాలు పెఱుఁగును గుడమును వరుస మంత్ర
పూతముగ జేసి మెసవించి పూజఁ జేసి

తే. "ప్రస్థమాత్రతండులములు పళ్లెరమునఁ
బోసి సరిజేసి దాని పైమీఁదు రేఖ

బడ్డముగ గీచి యపరంజి కడ్డితోడ
మానసనక్షత్రనామములు వ్రాసి వెనుక.

వ. మూడవపంక్తి నాగభూషణుం డనువ్యాఖ్యావతారికనామంబు వ్రాసి
నామత్రయ దేవతల నర్చించి" యిట్లనుచున్నాఁడు.

— దేశీయములు - సామెతలు —

"పుట్టి నేర్చె నోక్కొ - పుట్టక నేర్చె నోక్కొ"
"బ్రతుకు జీవుఁడ"
"కోటలమీఁదఁ బెండ్లి"
"ఆఁ యుంచు నూఁయంచు"
"అజముఖవ్యాఘ్రము"
"గుడుగుడుగుంచములు తిరిగి"
"ధవుడుగీచినగీటునుదాటకుండ"
"కలిచెడుపాము కుబ్బెడుతేలు"
"బతిమాలి బామాలి"
"ఆయురన్నం ప్రయచ్ఛతి"
"దాహిత్రః కులప స్త్రీణాః"
"ధర్మస్య క్షుధితం పాత్రం"
"భవతి భిక్షాం ప్రదేహి"
"సంశయాత్మా వినశ్యతి"
"జాతస్య మరణం ధ్రువం"
"కుతోసి త్వ మస్మదీయ ! సిద్ధి రస్తు తే" యని కొన్నోకట్టు.

— ఆంధ్రదేశవర్ణనము —

శా. "మున్నానన్నయభట్టు మెట్టుటను పెంపుంగాంచె రాణ్మందిరం
బెన్నం దిక్కనకల్మి సింహపురియుక్ హేమించె గుప్తా ని దే
జ్ఞన్నం గాంచుట వాసి గాంచె ముగురుయ్యా ల్యాసు లింగంబు లై
వన్నం బెట్టఁ దిలింగదేశ మిది భవ్యం బయ్యె. దేశంబులన్.

## — అలమేలు మంగ బాల్యవర్ణనము —

సీ. "చిడిముడినడకల చిన్నెలన్నియు నేర్చెఁ
బాఁతిదిరాయంచల పోఁకువలన
చిలిబిలిపలుకుల తళుకు లన్నియు నేర్చెఁ
బెనుచు రాచిలుకల పెంపువలన
నడచెమపాటల హొరువు లన్నియు నేర్చెఁ
బూపల సల్లాపుతుమ్మెదల వలన
చిటిపిటినడకల సిరులన్నియును నేర్చెఁ
దడికారునెమ్ములదండము వలన.

సీ. తలవొగ్గి చూచుచు లలి నొత్తిగిలుచును
కొన్నినాళ్లకుఁ దాన కూరుచుండె
నడి యుంచి చేయూని పదిలంబుగా లేచి
క్రమముగాఁ దుదకు నిద్దెములు చేసెఁ
బడుచు లేచుచు వేడ్కపడి తప్పటడుగులు
వైచుచు నేర్చె చివరకు నడచె
ఆఁ యనుచు నూఁ యనుచు సట్టిట్టు లాడుచు
నాఁటికి నాఁటికి మాటలాడె

తే. బొమ్మలను గూర్చుకొని చాల సమ్మతమునఁ
బొంగి యాడుచు సంతోస సంగతిం దగ్రిఁ
గూడి యాడుచుఁ బాడుచుఁ దోడివారి
వేడుకల కయ్యె బుడుతఁ పెర్మి నపుడు.

## — బా లి కా క్రీ డ లు —

తే. గుమగుమంగుంచములు చిళ్ళ కుందనగిరి
కాళ్ళగజ్జెలు చిపచిప్పగోళ్లు వాన
బప్పు చెమచెక్క వెన్నెలకుప్పలు మొద
లైన యాటలాడెడు నపుడు బాల.

## హ రి హా ర వ ర్ణ న ము

సీ. వెన్నెల వెదచల్లి కన్నుల ముద మల్లి
నివ్వటిల్లెడుతలపువ్వుఁబోడ

వన్నెచిన్నెల నొప్పి పొన్నువన్నెల గుప్పి
జోకగునెమ్మని కోకతోడ
యాగంబులను డాసి నాగంబులను రాసి
సంతసం బిడునెక్కురింతతోడ
నెమ్మి నటింగ నొంది ఆ మ్మాని వగఁ జెంది
కీవిఁ జెన్నలరారు దేవితోడ

తే. మొక్కులిచ్చెదుననకాదిమునులతోడ
జగము లేలెడుకరుణారసంబుతోడ
నార్యసంస్తుతశివకేశవాహ్వయంబు
స్వామియుగ్మము కెలన సాక్షాత్కరించె.

— స్త్రీవర్ణనము —

తే. జానుగుల శ్రీల్ పిఱుందుల దా నడుమున
శా నుదుటఁ గ్రిర పొక్కిటిలోన బొట్టు
ఘ్రాణమున నొత్తు కేల దీర్ఘములు దోఁప
రమణి బుధు లెంతు రక్షరబ్రహ్మమనుచు.

— మంథెన స్త్రీలు —

సీ. చెఱఁగు మేల్ముసుఁగుగా శిరముపై వ్రేలాడ
చిక్కనై మెఱసైన చీరఁ గట్టి
పసుపుపూసిన మోముపై బెద్దరూపమ్ముఁ
బోలినకుంకుమ బొట్టుఁ బెట్టి
గానుగఱోటికిం గట్టు వేసినయట్లు
మెలికవొడ్డాణంబు మొలకుఁ జుట్టి
యద్దాలఁ గుట్టిన ముద్దుబాఱినడొల్ల
రవిక మోచేతులఁ దవులఁ దొడిగి
వాడవాడలనుండినచేడెలెల్ల
సందెవేళల ముంగిళ్ల యందుఁ జేరి
వదుగురుం గువ్వకరిగొని పలుకుచుండ్రు
మంథెనపురంబునం గలమగువ లెల్ల.

—• గుర్విణీ వర్ణనము •—

సీ. లోనచ్ఛతేజము తా నుంటఁ గలుషంబు
వెలిఁ బుచ్చు టనఁగ డోఁకులు జనించె
బ్రహ్మంబు తనలోనఁ బ్రజ్వలించుట నన్య
మగురుచుల్ సడలునా నరుచి వొడమె
భూతమయుండు లోఁ బొలుచుఁ గావున దాని
సూచింప నా మట్టి వాచవిఁ గొను
గట్టువిల్తాల్పరి కమపునం గలిగిన
బరువున నడలందు బడలిక లగు
తే. దేవతాంశభవుం డయ్యె దేవుఁ డయ్యె
నకట కట గర్భనరకమ్ము ననుభవింప
వలయుఁ బోఁ యిట్టు లనుచును దెలుప నేమొ
పొలఁతి ముఖమప్డు వెలవెలఁ బోవ నయ్యె.

—• హోమ ధూమము •—

ఉ. "కమ్మనిహోమధూమ మటఁ గ్రొలెడువారల మేనఁదాఁకి నే
త్రమ్ములనుండి శ్రోత్రములదాపుల నుండియు ముక్కుటమ్ముమా
ర్గమ్ములనుండి లోనికి నిరంతరముం జని కల్మషమ్ము స
ర్వమ్మును బాపునట్టి దయి పర్వె మొనర్చును సత్త్రివాటికన్.

—• మృగయా వర్ణనము •—

సీ. కాండ్రుకాండ్రని వచ్చి తీండ్రించుగోల్పులి
బోనునఁ బడఁ ద్రొబ్బి బోయ యొకఁడు
గీపెట్టుకొని యేపు చూపెడు మదహస్తిఁ
బట్టి గోతను బెట్టె జెట్టి యొకఁడు
బొబ్బరించుచుఁ జెంప దెబ్బదీయఁగ నున్న
యెలుఁగుఁ జీలిచి చంపె నొకఁ డొక్క-
డోఁక్క రంచును మోజఁ ద్రొక్కు శార్దున్న గొ
మ్ముల్లబోఁ బెకలించె భిల్లుఁ డొకఁడు
తే. చించె శరభంబు జేతులఁ జెం చొకండు
గండభేరుండమును జెండె దండి యొకఁడు

కుక్క నుసికొల్పు (బంది యైకోదొకండు
డేగ విడి పట్టెఁ బక్షుల నేగి యొకఁడు

—• చెలికత్తెలదుండగము •—

సీ. మా రామ సరివాఁడవా రామ యని చేతి
విల్లమ్ముల నొకర్తు వెఱికి వైచెఁ
గులగోత్రములు లేక కులగోత్రముల నేలు
నెఱుకా యని యొకర్తు వెఱికె జడలు
తలిదండ్రుల నెఱుంగ కిలఁ బుట్టి తని నెత్తి
నెమిలియీఁకల నొర్తు నెఱికెఁ జెఱికె
నొకచో నునికి లేక సకలభూముల మెట్టు
మొఱకా యని యొకర్తు నెఱులు జుట్టెఁ
జేపలం దీవు నీటిలోఁ జేప వగుదు
పందులం దీవు కాటిలో పంది వగుదు
సింగముల నీవు గుహలలో సింగ మగుదు
వెట్టివాఁడైన నగుదువో యెఱుక! పోర.

పిచ్చిచేష్టలు

సీ. బిడ్డ రా! రా! యని బెడ్డచేతం బూని
గొణుఁగుచు ముద్దాడు కొంత సేపు
నాబనారసుచాందినీబాబుగా! యని
గుడ్డచింపులు చుట్టుఁ గొంత సేపు
బువ్వఁ బెట్టెదను బాబూ! యేడ్వకుర యంచుఁ
గుండ చేకొని యాడు కొంతసేపు
నాతండ్రి! యాడునో నాతలపై నని
కొట్టుకొనుం గట్టి కొంత సేపు
గుడుగుడంచును బాఱును గొంత సేపు
కొట్టు కొట్టంచు నేడ్చును కొంత సేపు
కూడిమాడంచు నవ్వును కొంత సేపు
కడు వెడఁగువోలె నున్న యుగంధరుండు.

—• శృంగారము •—

చ. అనటుల పైపదంబునను నల్పపదార్థము వెట్టి దానిపై
ఘన మగుబర్వ్వ గట్టి పయిఁ గంబువు నిల్పి తదగ్రి మెక్కి విం
ష్ణును శరము ధ్ధరించి తనలోఁ గొను లోకము చందమామ మే
లని సకలప్రపంచమును బ్రాంజలి యై తనవంకఁ జూడఁగన్.

—• కరుణరసము •—

శా. అర్యా! యోగివరేణ్యా! మే మధికపాపావిష్టకష్టాత్ములై
యిర్యోజం బడియున్నవారము గృహం బీనాళ్ళలో దుఃఖసా
హాయ్యంబుం గొని యుండె నగ్ని వెలుగం డంధంబు సర్వంబునన్
దయ్యం బిట్టిది మాకు రాదు మృతి మాతండ్రి చనం జూడుమా.

—• ఉపమాలంకారము •—

క. పూర్వుం దావి తెలుంగున
నావిద్ధంపతులు లోక మభినందింపన్
శ్రీవిజయవాటికాపురి
చెవియు దేవరయు వోలె దీపించి రొగిన్.

—• ఉత్ప్రేక్ష •—

మ. కలదృశ్యంబు లవన్నియు న్లయము గాఁగన్ బంధురధ్వాంత మై
తిలకింపం దగు స్థానము ల్గడచి పై తేజంబు వీక్షించుటల్
చెలిమం జేయఁగ నున్నవో యనఁగ నుద్దీపించుకన్యామణీ
విలసద్దేహ సముద్భవద్యుతులు భావింపంగ నాశ్చర్యమై.

—• స్వభావోక్తి •—

సీ. నీలి పీలికలు పట్టీలు గా వేసి కు
ట్టినబొంత మొలచుట్టు దనరఁ జుట్టి
మోచేతులను దాఁకఁ బొలుపగు నద్దాల
రవపని గలడొల్ల రయికఁ దొడిగి
నులివెట్టి నెమిలికన్నుల నెటుల్ నవరాలు
మెడలపైఁ బడ జారుముడిని వైచి
కాళ్లఁజేతుల గల్లు గల్లు మంచును మ్రోయ
నిత్తడినగ లెన్నియేనిఁ బెట్టి

గీ. పూసపేరులు మెడనిండఁ బొందుపఱిచి
గవ్వపురిత్రాడు నిలువెల్లఁ గలయఁ జుట్టి
లీలమైఁ గేల నొకకుంచె గాళ్లిఁ బట్టి
చలిమలకుమారి యెఱుకలసాని యయ్యె.

—• శబ్దాలంకారము •—

కం. శాంతు మునీంద్రదస్వాంత ని
శాంతుఁ భక్తాంతరాయ చయపరిశాంతుఁ
గాంతానంతనుతమహో
దంతు నకృతిమంతు నేకదంతుఁ దలంతున్.

సీ. మేలైనమగటాల డాలుడీలింపఁ జాల్
మేనితో సామేనసానితోడ
వెన్నెల వెదజల్లు కొన్నెలసికసల్లు
పువ్వుతో మవ్వంపు నవ్వుతోడ
నల్లనఁ దలనల్ల కల్లోలమగు తెల్ల
వాకతో చూత్రితోల్ కోకతోడఁ
బెనుపల్కు లొల్లని నెనగొల్కు చల్లని
చూపుతో దొరలేనిరూపుతోడ

—• పురవర్ణనము •—

సీ. పాలునేయూరికిఁ బశ్చిమంబునయుండు
రంగదుత్తుంగ తరంగగంగ
నలువొందునేవీట నడుచక్కి దితభక్త
బహుళార్తిమదనగోపాలమూర్తి
యలరునేపోలి పాలిగాశాతటంబున
నవితభక్తకదంబ శ్యామలాంబ
వెలయునే నగరంబు పొలిమేరలోసేవ
కులభుక్తి శ్రీముల్ల గూరిశక్తి

తే. కలుగునే పురమందు మృకండుసూతి
కల్పితేశ్వరలింగ మనల్పదివ్య
శక్తిమహిమాతిసంగ మొసంగునద్ది
యింద్రవిభవాకరముర్మాహేంద్రపురము.

—• సముద్రవర్ణనము •—

చ. పెనఁగ జగంబు లెల్లు మగబిడ్డను బొడ్డునఁ గన్నదొడ్డవే
ల్పున కిడె లచ్చిఁ బ్రెబ్బుతనముద్దులకన్నియఁ బెండ్లిసేసి పెం
పనువడఁ గూఁతుతోడఁ దనయల్లుని నిల్లటముంచు కొంటి నే
నని కడుసంతసంబునఁ గదా యదె మిన్నులు ముట్టు నెట్టనన్.

—• శైలవర్ణనము •—

సీ. చరమసంధ్యారాగ సంభ్రాంతి కృద్ధాతు
రంజితాతిప్రస్తరంములు గలిగి
మఘ్యప్రసూనదామముఁ దాల్చెనో నా భ
గణముల రాయుశృంగములు కలిగి
నందనానంద మాకందబృందములతోఁ
గనిపట్టు బలుకోనగములు కలిగి
దక్షిణభాండాగారశతి బోలి మేలిమిఁ
గాంచనమణి కందరములు కలిగి
తే. పూలతావి గుబుల్కొను పొదలు గలిగి
కోళ్ళనుండి జాలెడు సెలయేళ్ళు గలిగి
యనుపమస్వామినను జూడ నొప్పిగోత్ర
నాథుఁ డయ్యె భుజగగోత్రనాథుఁ డపుడు.

—• ఋతువర్ణనము •—

త్రిభంగి. కలకల మనుచును బలికెడుచిలుకల
పలుకులఁ జేటుల పాటన్ బడినాటున్ బోటుల కాటున్
వలుగడ గమగమ వలచెడుబాగడలు
పొలుపగుమల్లెలు మొల్ల ల్వెదజల్లు న్వాసన లెల్లన్
మలయుచుపవనము చలువలఁ గొలుపుచు
నిలఁ బడి తాఁకఁగ వచ్చు న్వగ హెచ్చుం దాపముఁ దెచ్చున్
బలములు గొలువఁగ బలసినమదనుఁడు
వలపులు గూర్చి తలిర్చున్ దమిహెచ్చున్ గెవ్వననార్చున్.

ఇట్లనేక వర్ణనములతో నీ చరిత్రము రచియించిన కవిసార్వభౌముల
కును జేరిరేచి దీక్షతోఁ బూర్తిసేయించిన గురుభక్తశిఖామణులకును
నాంధ్రులు తమకృతజ్ఞతను తప్పక వెలిబుచ్చెద రని నమ్ముచున్నాను.

శ్రీ కవిసార్వభౌముల యాజ్ఞానుసారము వారి యాశీర్వాద మపేక్షించి యీ యుపహారమును వ్రాయ సాహసించినందులకు పెద్దలు నన్ను మన్నింతురుగాక యని ప్రార్థించుచు విస్తరభీతి నింతటితో విరమించుచున్నాను.

తే. శ్రీమదానందమూర్తి యశేషతంత్ర
నిశితవిజ్ఞానఘనుఁడు మనీషిలోక
హృదయగమ్యుఁడు నాశ్రితహృదయవర్తి
నాగభూషణయతిలోకనాథుఁ డోము.

సీ. వ్రాసినాఁడవు గదా భారతము న్వేద
విద్యావిశారదాభిఖ్య తోడ
నెక్కియుంటివి గదా యేనుఁగంబారి పైఁ
గవిసార్వభౌమ విఖ్యాతితోడ
నందెవేసితి గదా యల్లికజిగిబిగిఁ
గవిగండపెండేరకలన తోడఁ
దల నెత్తితివి గదా తగువారిలోపల
స్వర్ణాభిషేచనోత్సవము తోడ

తే. వఱలితివిగాదె వ్యాఖ్యాతృవంశమందు
నలమహామహోపాధ్యాయుఁ డనఁగ నగుచు
నెదురు నీదితి ప్రాక్కృతినదుల లోన
నటులు నభినవశ్రీనాథు డనఁగఁ గృష్ణ.

తే. క్రమముగా నీదురక్త మక్షరము నగుచు
రోమకూపాళి సంభిన్నరూప మంది
గాంచె రసభావ మని నీదుకళలఁ జిమ్మ
కవనము కళాపరిపూర్ణ ! సాక్ష్య మ్మొసంగు.

14-4-45
బెజవాడ.

తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి,
ప్రధానాచార్యుఁడు,
సర్వతంత్ర స్వతంత్ర కళాశాల.

శ్రీ భాష్యాయ నమః

# ప్రకాశకుల విజ్ఞప్తి



శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ స్థాపనా చార్యులు శ్రీమాన్ అమృతానందనాథ స్వామివారు. వారిని దొలుత 1917 సంవత్సరమున నేను దర్శించితిని. ఆ నాటినుండియు స్వామివారి శిష్యుఁడనై శ్రీ వారి నిర్యాణమువఱకు విశేషకాలములలో సన్నిధి కేగి తత్త్వబోధముఁ బడయుచుండు వాఁడను.

వేదశాస్త్రసహిత స్వధర్మతత్త్వ నిరతసదాచార పరాయణులైన వారికి గురుముఖంబున సర్వసంశయనివృత్తిద్వారా పరమశాంతిని లభింపఁజేయు భగవద్భాగవత కైంకర్యము శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠముయొక్క ప్రధానోద్దేశము. ఈ త్రిలింగ పీఠస్థాపనాచార్యులగు శ్రీమదమృతానందనాథస్వామివారు తమసన్నిధికి వచ్చిన భక్తులకుఁ గరతలామలకముగఁ దత్త్వబోధముఁ జేయుచుండెడి వారు. జీవబ్రహ్మైక్యతానుభూతి నధికారానుసారము జిజ్ఞాసువులకుఁ గలిగించుటయే వారి యాశయము. ఆంగ్లేయభాషా పరిచయము గలవారికి, కార్లైలు, ఎమర్సన్, కాంటు, ష్యూసర్ మొదలగు పాశ్చాత్యవేత్తల గ్రంథములఁ జదివించి వానితో మన గ్రంథములఁ బోల్చి పాశ్చాత్యప్రవక్తల యసమగ్రతను ఆర్యుల సంపూర్ణతను నిరూపించుచుండువారు.

అమృతానందుల తత్త్వబోధ మనన్యము. తాము చెప్పఁదలఁచు కొన్న విషయములను సమగ్రముగా సామాన్యభాషలో పరిభాషావర్జముగ సుబోధముగ ప్రతిపాదించినపిమ్మట భాష్యాది గ్రంథములలో నీవిషయమెక్కడ వివరింపఁబడినది నిరూపించుచుండువారు. అంతియ కాని గ్రంథము మొదలుపెట్టి పంక్తివెంటఁ బంక్తికెన్నఁడు నర్థముచెప్పి

గ్రంథము ముగించువారు కారు. శ్రీవారి పద్ధతిలో విశేష సామాన్యముగా వారి బోధము విన్నవారికి గ్రంథములు చూచినంతమాత్రముననే ప్రత్యేక పాఠము చదువనక్కరలేకయే సమన్వయించును. ఈ పీఠము స్థాపించిన పిమ్మట శ్రీవారి బోధములో నొక ప్రత్యేకమార్పు కలిగినది. పరమ కరుణాళుండగు నమృతానందనాథస్వామి వారి కాలపు విషమ పరిస్థితుల గమనించి మూలగ్రంథము చదువఁగలి గిన కొలఁది యాశ్రితులకు వాని జాడ లందు నిరూపించి పెక్కు విధ శిష్యుల కాంధ్రభాషా ప్రధానులగు వారికై తమ బోధములన్నియు ప్రసాదిం చిరి. శ్రీవారు మేఘము వర్షించినట్లు బోధములు కురిపించుచుండఁ బట్టఁగలవారెవ్వరు? ముగ్ధులమై మేమందఱము వినుచుండెడి వారము.

ఆంధ్రుల భాగ్యవశమున శ్రీమతి కాంచనపల్లి కనకాంబ గారు శ్రీవారి బోధములకు శ్రోత్రిగాఁ గుదురుట తటస్థించెను. ఆ మహాకవయిత్రి వచనమున మొదట శ్రీవారి బోధము లన్నియు లిఖించుకొని ప్రతిదినము జపావసానమున నావచనమంతయుఁ జక్కని పద్యములలోనికి మార్చిరి. అట్లైనవియే జీవయాత్రాదర్శనంబు.

ఉ. అందఱు విన్నవారె కనకాంబకు సాటియె యెవ్వరీ సుధా
నందుని బోధమెల్లఁ గవనంబునఁ బట్టిన పుణ్యశీల మే
మందఱముం దరింప నికె నామె యటంచుఁ ద్రిలింగపీఠమం
దందఱు నామెగ్రంథముల నొదలఁదాల్చి పఠింతు రెంతయున్
'అవధానీయము'

ఆధునికకాలమున వెలువడిన కొన్ని సాంప్రదాయములలో స్నానసంధ్యాది నిత్యకర్మానుష్ఠానములకుఁ బ్రాధాన్యము లేదు. విడిచి వేసినను బ్రత్యవాయము లేదు. నూత్న పద్ధతులలో మంత్రప్రవర్గముగా భాషాబహుళముగాఁ బ్రార్థనలను జరుపుచున్నారు. త్రిలింగపీఠమందు సాధకులు స్నానసంధ్యాది నిత్యకర్మానుష్ఠానములు వర్ణాశ్రమాచారోచితముగ నొనరించుటయే శ్రీవారి యాశయము "నబుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం" పీఠములో నన్నియధికారములకుఁ గలిసివచ్చు

నట్టి పంచాయతన దేవతార్చనము నిత్యము జరుగునట్లు అమృతానంద స్వామివారు ఏర్పాటు చేసినారు, సిద్ధసంకల్పముగాన నది యవిచ్ఛిన్నముగా పీఠములో నేటికిని జరుగుచున్నది. అమృతానందములో కవిసార్వభౌము లీవిషయమును వివరముగ వ్రాసిరి. కవిసార్వభౌములు మా గురువులను బ్రత్యక్షముగా నెఱిఁగి యుండుటచే వారి చరిత్రముఁ జక్కఁగాఁ బెక్కెల్లముగాఁ వ్రాసియేయున్నారు. కాన నే నది విడిచి పీఠభక్తుండ నగుటచేఁ బీఠాధీశులను మాత్ర మిందు వివరించుచున్నాను.

ఆర్యవిజ్ఞాన బీజసంరక్షణ మీపీఠముయొక్క బాహ్యకృత్యములలో ముఖ్యమైనది గురువులయాశయము.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'నేహ నానాస్తి కించన' యనుటలో 'హరిమయము విశ్వమంతయు' ననియున్నది. కాన మానవలోకముపై నిచ్ఛాద్వేషములు లేవు. అన్వయ వ్యతిరేకముగా ధర్మాధర్మంబు లీవిశ్వంబునఁ బరమగురువుల బోధనము కొఱకును, తన వినోదము కొఱకును బరమేశ్వరుఁడు సృష్టించెను. అం దధర్మప్రవృత్తి నేఁడు విశేషముగనున్నది. ఇట్టితఱి లోకకల్యాణమునకై యార్యవిజ్ఞానమును గాపాడవలయును. రాజబలము, సంఘబలము దీనికి తోడ్పడుట నేటి కాలమున నరిది. కావున గాయత్రీమంత్రార్థానుసారముగ ధర్మనిర్వాహణోత్సాహ మెవరికి గలుగునో వార లేకీభవించి యథాశక్తిగ నధీతిబోధాచరణప్రచారములు గావింపవలయును.

వేదవేదాంగములు, కళలు, భాషాగ్రంథములు పోష్యములు. శేషించియున్న విద్వాంసుల నందఱను బరిగణనము చేసి తారతమ్యములు నిరూపించి యుత్తమోత్తములకు సన్మానము చేయుచుండవలయును. ఒక్కొక్క విద్య కొక్కొక్కరిచేనైనఁ బరంపర నిలువఁబెట్టుటకై పోషింపవలయును. కలికాలవశమున బహుళప్రచారము లేక పోయినను దేశకాలము లనుకూలించిననాఁడు విస్తరించుటకై జ్ఞానబీజములు విస్తరించి యుంచవలయును. గీర్వాణ భాషా వైరళ్యము గల యీకాలమున తొల్లింటి మహానుభావులాంధ్రమునఁ జేసిన తత్త్వబోధమునకుఁ దోడుగా

సంపూర్ణ విజ్ఞానలబ్ధికిఁగావలసిన సామగ్రి యీ త్రిలింగపీఠమున దైవ యోగముచే నెలకొల్పఁబడియున్నది. త్రిలింగదేశమున కీ పీఠము నీ పీఠమునకుఁ ద్రిలింగదేశము నన్యోన్య పోషకంబులై యుండ నీశ్వర సంకల్పము సిద్ధించుఁగాక.

అమృతానంధనాధస్వామి యంతరంగ మీనాఁటికిఁ బ్రచురించి కృతార్థులమైతిమి. ఆంధ్రమహాజను లీ స్వధర్మము నిర్వహించుదురుగాక. ప్రపంచమున భరతఖండమెట్లు ప్రత్యేకవ్యక్తిత్వముఁ దాల్చియున్నదో భరతఖండమున నాంధ్రదేశమునందు గురుపరంపరలో నిలిచియున్న తత్త్వబోధమొక విలక్షణమై యనన్యదుర్లభమైన వన్నెకలిగియున్నది. దానిని వ్యక్తీకరించుటయే ఈ త్రిలింగపీఠ కర్తవ్యము.

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠము సృజించినది బ్రహ్మీభూతులగు శ్రీ అమృతానందనాథ పరమాత్మ. ఈ పీఠమునకు ఆత్మస్వరూపముధరించి చైతన్యమొసంగువ్యక్తి శ్రీ జీవయాత్రాక ర్త్రి గురుపుత్రికయగు శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకాంబగారు. తోడఁ బుట్టువై మొదటినుండి గుర్వీశ్వర కైంకర్యమునందుఁ దోడుపడి కన కాంబగారి ద్వితీయశరీరమో యన్నట్లు లామెతోఁబాటు అభేదముగ నున్నవారు పంగనామాల అమ్మణమ్మగారు.

ఈ పీఠమునకు శరీరమై సకలకార్యములు నిర్వహించుటకు గురువులచే నియమింపఁబడినవారు దంటు సుబ్బావధానులుగారు. అవ ధానులగారి విలువ అమృతానందనాథులవారెఱుఁగుదురు. అమృతా నందనాథులవారి యంతరంగము నవధానులవారెఱుంగుదురు. గురు మూర్తి యాజ్ఞానుసారము అవధానిగారు తమ వైద్యవృత్తిని నిమిత్త మాత్రముగఁ జూచికొనుచుఁ బీఠకృత్యమునే స్వకృత్యముగనెంచి ధర్మ ప్రచారము సల్పుచు గురునిర్యాణపర్యంతము పీఠమును తిరుపతి యందు నిర్వహించిరి.

1932 సంవత్సరమున గురుస్వాములవారు నిర్యాణము నొందిరి. అప్పటినుండి గురువులు సూచించినట్లి "ఆర్యవిజ్ఞానపీఠ సంరక్షణోద్య

ము" శిశకృత్యములలో నగ్రగణ్యమయ్యెను. అందుఁ బండిత సన్మానము ప్రథమ కర్తవ్యమయ్యెను.

బ్రాహ్మణులు మొదలు పంచములవఱకు, బంగరుపని చేయువారు మొదలు తోలుపని చేయువారలవఱకు భరతఖండములోనున్న పాండిత్యమునకు పనితనమునకున్న గౌరవమును గాపాడి యాపండితులలో నుత్తములను, మఱియా పనివాండ్రలో నుత్తములను సత్కరింప సమకట్టి ఈకలికాలములోఁ గూడనింతసాహసముతో ధర్మప్రచారము చేయఁబూనిన వారీ త్రిలింగ మహావిద్యా పీఠమువారు.

ప్రాచీనగురుపీఠములకు నమస్కరించుచు శ్రుతియొక్కయర్థమును స్మృతివివరించునట్లు ధర్మప్రచార విషయమున విజ్ఞానబీజసంరక్షణ విషయమున నీ పీఠము సర్వజనులకు శుభసందేశమునే ప్రాచీన సంప్రదాయము ననుసరించి యాచార్యమతాను సారముగఁ దెలుపుచున్నది. అమృతసందేశమును సంస్కృతాంగ్ల భాషలలో యావద్భారత వర్షము ప్రచారముచేయు నధికారము నాకుగురువు లొసఁగియున్నారు. ఆర్య విజ్ఞాన బీజసంరక్షణోద్యమము నిర్విఘ్నముగ శ్రీత్రిలింగమహా విద్యా పీఠమున వృద్ధిపొంది భరతఖండమునకుఁ గీర్తిప్రతిష్ఠలు సంపాదించుఁ గాక.

వర్ణములకు ధర్మభేదమున్నను జిజ్ఞాసకల యధికారులకుఁ దత్త్వ బోధవిషయమున నేమాత్రము భేదములేదని శ్రీత్రిలింగపీఠమువారు సర్వ జనసాధారణముగ నాంధ్రభాషలో పరతత్త్వము ప్రకటించిరి. శ్రీపీఠము వారి సమదృష్టి గొప్పది. ధర్మము నెల్లరకు బోధింపఁదగుఁగానితత్త్వము తత్త్వజిజ్ఞాసకల యుత్తమాధికారులకే బోధింపఁదగునని త్రిలింగ పీఠమువారు ప్రతిపాదింతురు. నిజజిజ్ఞాసువులు లక్షలజనులలో నొకా నొకరు గాని లభింపరని పీఠస్థాపనాచార్యులగు అమృతానందనాథ స్వామివారు ఏ నలుగురైదుగురికో తప్ప తత్త్వము బోధింపలేదు.

1939 సంవత్సరమున బెజవాడకుఁ బీఠమును మార్చినయెడల నాంధ్రదేశమున ధర్మప్రచారమునకు మిక్కిలి యనుకూలమని యెంచి

యవధానులగారి నిటకు రమ్మని నేనును శ్రీ యవధానులవారి సోదరు లిరువురము బ్రార్థించితిమి. ప్రపంచయుద్ధమును సమసిపోయియుండెను. మా వేడికోలంగీకరించి వెంటనే త్రిలింగపీఠము నిటకుం దెచ్చిరి. విజయ వాడ వచ్చినదిమొదలు పండిత సమ్మానములు, గురుజయంతులు, ధర్మప్రచారము చక్కగ సాగుచుండెను.

గురుదేవులు సూచించిన సర్వతంత్ర స్వతంత్ర కళాశాలను స్థాపింప గట్టిప్రయత్నము లొనర్పంబడెను. దీనికంగముగ గురుమండల ములు పల్లెలయందు స్థాపించునవసరము కానవచ్చెను. గోపవరపు గ్రామమున శ్రీ యవధానులుగారు సచ్చిదానందనాథ గురుమండలమును స్థాపించిరి. ధర్మప్రచారము పల్లెలకుం బట్టణములకుంబోయి గావించు చుండిరి. విజయవాడయందు సర్వతంత్ర స్వతంత్ర కళాశాల నారం భింప నిశ్చయించితిమి. ఇట్టి ఫలసమయమున శ్రీ యవధానులుగారు కాలధర్మము నొందిరి. అవధానులుగారి తమ్ములు శ్రీ పార్థసారథి గారును, శ్రీనివాస శర్మగారు, నేనును, "నీవు వస్తాదంపు, మేము ప్రక్క లెగుర వేయుదు" మనునట్లు శ్రీ యవధానులవారు శ్రీకార్య ముల నిర్వహింపుచుండగా మేము తోడ హంగుచేయుచుండెడి వారము. అవధానులవారి నిర్యాణానంతరము ధర్మప్రచారభారము సర్వతంత్ర స్వతంత్ర కళాశాలా నిర్వహణభారము మా తలలపైం బడినది. ఆ సంవత్సరమే నేను ఇతరులు పూనుకొనినను పూనుకొన కున్నను ఒక్క లక్ష రూప్యములను కళాశాలకొఱకిచ్చెదనని సభలో చెప్పితిని. గురువులు సూచించినట్టిదియు అవధానులు గారు సభలలో ఘోషించినట్టిదియునగు సర్వతంత్ర స్వతంత్రకళాశాల వెంటనే ప్రారం భింపంబడెను. ఆ విషయములు కవి సార్వభౌము లమృతానందమున వ్రాసియున్నారు. భరతదేశమునందెవ్వరికిని నేశాస్త్రము నందు గాని, యేధర్మమునందుగాని చిన్నది పెద్దది యనక యేవిషయమునందుగాని సంశయము గలిగినట్లయిన త్రిలింగపీఠమున సర్వతంత్రస్వతంత్ర కళా శాలయందు తప్పక తీరంగలదను ఖ్యాతిరావలెను. పూర్వపు నలందా, తక్షశిలా విశ్వవిద్యాలయముల మఱపించు నట్టిది యీ సర్వతంత్ర

# కవిసార్వభౌమ ప్రశంస

శ్రీ మాంత్రికచక్రవర్తి ప్రొఫెసర్ తొండపి అంజనాగారు, నెల్లూరు



శ్రీమన్మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిసార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవశ్రీనాథ వేదవిద్యావిశారద శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిని నేను సుమారు 20 సంవత్సరములనుండి యెఱుంగుదును. వారి పాండిత్య విషయమై పండితులచేతను ప్రభువులచేతను వారికీయఁబడిన బిరుదములు జరుపఁబడిన గౌరవములే ప్రత్యక్ష సాక్ష్యములై యుండఁగ విశేషించి వారిశక్తి సంపదలలో సహస్రాంశమైనను లేని నేను ఏదో చెప్పఁబూనుట వెఱ్ఱితనమనిపించుకొనును. శారద పూర్ణిమ నాటి తారాపనోహరునిఁ జూపుటకు దివిటీలాంతరు కావలెనా? అయినప్పటికి నుపలభక్తివశాఁ జిరకాలమునుండి శ్రీవారి యాదరణమున నేర్కొంచె పలుకనేర్చిన నేను ఈ రీతిగా నా వాక్కును ధన్యమొనర్చుటకు మాత్రమే యుద్దేశించి ఈ నాలుగు మాటలు వ్రాయఁబూనితిని.

శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు ఆశ్రితపక్షపాతులు, అనితరాత్మగౌరవసంపన్నులు, సత్యప్రతిష్ఠాపనా బద్ధకంకణులును. వారట్టివారు కావుననే వేనవేలు ధనమార్జించియుఁ దమ యుత్తమాశయములు ఫలింపఁజేసికొనుటకు 'యదహ్నాత్ కురుతే పాపం, తదహ్నాత్ ప్రతిముచ్యతే' యన్నట్లు ఎప్పటి సొమ్మప్పుడే వ్యయించి 'అసంచయవాన్' అని కల విప్రలక్షణమునకు లక్ష్యభూతులైనారు.

భారత రచనానంతరము శ్రీశాస్త్రిగారు విక్రమాభ్యుదయము, శృంగారతరంగిణి, యాజ్ఞవల్క్య చరిత్రము, బ్రహ్మానందము మధుకర విజయము మున్నగు ననేక కావ్యములనే గాక "గణేశపురాణము"ను గూడఁ బలికించిరి. వయసు మీఱినకొలఁది వారి కవిత్వముచే వలు, దేరి విద్వల్లోకము నుఱ్ఱూత లూగించుచున్నదనుట నిస్సంశ

యము. ఇటీవలికృతియగు మధుకరవిజయము అత్యద్భుత కల్పనలతో నపూర్వవిధంబున వ్రాయఁబడినదని దానిం జదివినవారికిఁ దోఁపకపోదు.

ఇట్టి సిద్ధహస్తులగు శాస్త్రిగారు సిద్ధపురుషులైన శ్రీ అమృతానందుని దివ్యచరిత్రమును వ్రాయుట బంగరమునకుఁ దావియబ్బినటులున్నది. లోకోత్తరకృతియగు నీ యమృతానందవిజయముగూడ గంగవోలె త్రిలోకపావనకారణమై సంతసప్రదమై యలరారుననుట నిస్సంశయము. అందుచేత నిట్టువంటి కావ్యము రచించిన శ్రీ శాస్త్రిగారికిని, రచనకుఁ దగు సర్వసౌకర్యములు గల్గించిన శ్రీ తిరుపతి శ్రీనివాస త్రిలింగమహా విద్యాపీఠమువారికిని ముముక్షువులగు యావద్భక్తకోటికిని, గథానాయకుఁడు శ్రీ నాగభూషణుఁడు సకలసౌఖ్యము లొసంగి కాపాడునుగాత.



# తప్పొప్పుల పట్టిక

అవతారిక

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 27 | సంగాగం | సంగాతం |

పీఠిక

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 1 | భారతాద్యాకేక | భారతాద్యనేక |

ఉదాహారము

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 27 | [illegible] | దినపత్రిక |
| 10 | వ్యాఘ్రము | వ్యాఘ్రము |

పత్రికాపాఠకుల విజ్ఞప్తి

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 1 | దేవతాగ్ర్వనము | దేవతాగ్న్వన |
| 13 | అప్పుడొకొ | అప్పుడొక్క |
| 14 | త్రిభంగివ్యత్తము | త్రిభంగివృత్తము |
| 2 | పంచ | పంచ |
| 23 | జాయాసహితుండై | జాయాసహితుండై |
| 1 | అమృతకుండము | అమృతకుండము |
| 20 | పెగ్గడ యదుగుల | పెగ్గడ యదుగుల |
| 21 | పల్కిరిట్టు | పల్కిరిట్టు |
| 15 | పరేణ్యాలు | పరేణ్యులు |
| 4 | విద్యాంసులిట | విద్వాంసులిల |
| 3 | తెలిపి | తెలిపి |
| 12 | గోర్కులాప్పెను | గోర్కులొప్పెను |
| 13 | జాల | జాల |
| 2 | పుత్రజన్మంబులజ | పుత్రజన్మంబులజ |
| హెడ్డింగు | ద్వితీయాశ్వాసము | ద్వితీయాశ్వాసము |
| 25 | లభించెదు నోనమాలెం | లభించెదు నోనమాలె |
| 24 | గిలియంబోయిన | గిలియంబోయిన |
| 13 | గత్నభూసుగా | గత్నభూసుడు |
| 21 | యుంగపేగ | యుగపేగ |
| 17 | సరగి | సరగ |
| 13 | కుపత | కుతప |
| 14 | జేయువా | జేయువాం |
| 16 | అనుడు | అనుడు |
| 18 | అంతసయ్యామృతానందస్వామి | అంతనయ్యామృతానందస్వామి |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 191 | 26 | నట్టిఁ | నట్టిఁడై |
| 195 | 13 | తల్లితంండ్రుంు | తల్లిదండ్రులు |
| 196 | 14 | ల్లరకు | నెల్లరకు |
| 199 | 13 | వేఁ | వేడ |
| 199 | 15 | కోర్కిం | కోర్కిం |
| 204 | 10 | సుదరగర్భం | సుదరకోశం |
| 207 | 21 | ఇందుకు | ఇందులకు |
| 212 | 4 | విశ్రాంతింగోనం | విశ్రాంతింగొనం |
| 235 | 16 | దేవతార్చనను | దేవతార్చనం |
| 277 | 7 | అయ్యొక్క నాఁడు | ఆయ్యొక్క నాఁడు |
| 238 | 5 మార్జినులో | భూషణస్వామి చర్య | భూషణస్వామి చర్యలు |
| 238 | 25 | జొక్కనుండి | జొక్కనుండి |
| 240 | 16 | శాంతి మొసంగును | పర్వ మొసగ్చును |
| 251 | 7 | నాకొనుమిటి | నాకొనుమిట్టి |
| 251,252 | 29,1 | నివర్తిల్లిన | నివర్తిల్లిన |
| 256 | 26 | నెప్పుడు | నెల్ల |
| 257 | 1 | కలుపు | కలుపు |
| 269 | 1 | చక్రముతన్ | చక్రముతనుఁ |
| 282 | 7 | సంహరించు | సంహరించు |
| 283 | 12 | నాసఁజేసిఁ | నాసఁజేసి |
| 289 | 14 | గన్గొన | గన్గొన |
| 296 | 19 | అర్వవిజ్ఞాన | అర్వవిజ్ఞాన |
| 314 | 13 | జిహ్మాంబింతయు | జిహ్మాంబింతయు |
| 319 | 24 | సినంబున | సినంబున |
| 320 | 21 | జనువ | జనువ |
| 322 | 12 | చరిచె | కఱచె |
| 323 | 21 | నీవొనప్పు | నీవొనప్పు |

# అమృతానందము

## విషయసూచిక



శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠస్థాపనాచార్య

**శ్రీమాన్ అమృతానందనాథస్వామి**

శ్రీరస్తు.

# అమృతానందము

## ప్రథమాశ్వాసము



### ఇష్టదేవతా ప్రార్థనాదికము

రాకారామణి మంగ పేర మెఱుఁగై చెన్నొందు వక్షస్థలిన్
గారుణ్యాంబుధి భక్తజాతకములం గావంగ శేషాద్రిపై
నీర జిల్లెం వేంకటేశ్వరఘనుం డైశ్వర్యసంధాయియై
నేరన్ వచ్చి త్రిలింగపీఠపతులన్ జేకొంచు రక్షించుతన్.

మ. చను వక్షస్థల నొక్క-పద్మనయనన్ సామేన వేఱొక్క-చం
దనగంధిం దొడలం గుమారయుగమున్ దాఁ దాల్చి ప్రేమించుచు
న్మనమందుం గడు సంతసించు త్రిజగన్నాథుండు సంపద్యశో
ధనసంపన్నముఁ [1]గాంచనాంచితము విద్యాపీఠముం గాచుతన్. 2

మ. వెలిదమ్మిం గొలువుండి పాలితసమితిన్ విజ్ఞాన మేపాఱఁగాఁ
గలుగం జేసి పురాకృతంబు తపశ్శీకంబందు ముబ్బంతులన్
వెలయం జేయుమ భారతీసహితుఁడై నెల్గొందు వేల్పేలు భా
గ్యలస [2]ద్వేంకటనాథగుప్తమగు విద్యాపీఠ మెల్లప్పుడున్. 3

మ. [3]అలరుం బువ్వుల మెట్టుచుం బువులతో నాటాడుచుం దోటలో
పల నాకాశనరేంద్రపుత్రి యగుచు న్వాసిం బ్రకాశించు న
య్యలమేల్మంగ దయాంతరంగ యగుచుం బ్రాణేశ్వరుం గూడి వి
ద్యల[4]కాణాచిఁ ద్రిలింగపీఠమును సౌహార్దంబునన్ బ్రోచుతన్. 4

---

1. కాంచనాంచితము = సువర్ణాలంకృతము, కన కాంబాపూజితము.
2. వేంకటనాథగుప్తము = వేంకటేశ్వరరక్షితము; వేంకటరెడ్డిగుప్తపోషితము
3. అలరుంబువ్వులు = ఒప్పునట్టి పుష్పములు 4. కాణాచి=వాసస్థానము.

జయంత్యుత్సవ సమయంబున నాహూతుండనై మదరాసు పురమ్ము నకుం జని తిరుపతుల వేంకటేశ్వర త్రిలింగ మహావిద్యాపీఠ పరిసర మ్మునం దగు పరిషత్సభాసంబునఁ బ్రథమ బహుమానంబు నొంది యున్నయప్పు డొక్క దినంబునఁ బీఠనిర్వాహకు లగు పండితరాజ దంటు సుబ్బావధానియుఁ, గవితిలక కాంచనపల్లి కనకాంబయు, సకలకళాకుశల వదాన్యశేఖర గురుభక్తావతంస చుండూరి వేంకట రెడ్డియు, నవీన తులసీదాస, సహజపాండిత్య దంటు శ్రీనివాస శర్మయు, నైసర్గిక విద్యావిశారద దంటు పార్థసారథియుఁ గొంద ఱగు మిత్రులతోడఁ గూర్చుండి విద్యావ్యాసంగంబు గావించుచు నన్ను తెలంగాణనాథుని పవిత్రచరిత్రం బంతయుఁ బద్యప్రబంధంబుగాఁ జేయింప నెంచి. 9

సీ. *నను శ్రీనిదాస్యయజ్వసుతుని వేంకట
రామయాజికి సుబ్బసోమిదమకు
నాత్మజునిఁ జతుర్విధాంచితసుకవిత్వ
తత్త్వవిజ్ఞుని భారతప్రభృతిశా
స్త్రార్థసంగ్రంథ కృత్యాకృతనామకుని శాస్త్రి
విద్యావిశారదు నడుపుదునిఁ
గవిసార్వభౌమవిఖ్యాతు మహామహో
పాధ్యాయముఖబిరుదాంచితాఖ్యు

తే. గండపెండేరధారి గంగాజలాది
సత్కనకాభిషిక్తుని శతవధాన
చతుర కళాప్రపూర్ణుని కృష్ణశాస్త్రిఁ బిల్వఁ
బంచి యుచితముగ వారు పలికి రిట్లు. 10

ఉ. ఏపుర మీము శిష్యులము కృష్ణవిభూషణమూర్తి కమ్మహా
భావుని నీ తెలుంగునఁ బ్రవాని ప్రభావము చెప్ప గిప్పుఁగా
దేవుఁడు నైనఁ జాలఁ డనఁ దెల్పఁగ మే మెటు చాలియుందు మో
పావనమూర్తి! నీ కిపుడు నాకొన నుంటి మొకండు విందువే. 11

* చతుర్విధాంచితకవిత్వము = గర్భ, బంధ, చిత్ర, శువులని నాల్గు.

## కథానాయక ప్రశంస

చ. గురుకులవాసముల్ సలుపుకొంచు శ్రమంపడఁ బోక విద్యలఁ
గఱచె ననేకముల్ మఱియుఁ గ్రొత్తకిఁ గాక సమస్తరోగముల్
తెఱలఁగఁ జేయుశక్తిఁ గొనె దివ్యతరం బగుశ్రోత్రిసుంబునన్
జరిగెడునన్నియుం దెలుపఁ జాలె మహాత్ముఁ డతండు పొందితిన్. 12

సీ. కరతలామలకముల్ గదె రసాయనముఖ
ప్రకృతిశాస్త్రములు సర్వమును దలఁప
దివ్యమహాత్త్వముల్ తేజరిల్లెడుఁ బెక్కు
మాట లాడిన నవి మంత్రము లగు
నతనిపే ర్సెప్పిన నఖిలపిశాచ గ్ర
హములు తొలంగెడు నంతలోనఁ
జే ముట్టినంతన చేకూఱెడిని శక్తి
చావంగ నున్నట్టి జనున కేని

తే. దూరదృష్టిశ్రవణము లాభూరితేజు
నకుఁ గలుగు నన్న సత్యమునకును దవ్వు
గాదు వేదాంతియై బ్రహ్మకల్పుఁ డయ్యెఁ
గృష్ణభూషణుఁ డాతండు కేవలుండె. 13

తే. తిరుగుఁ గుమ్మరిపుర్వునా ధరణినతఁడు
వ్యాసనారదశుకశౌనకాంబరీష
పరమభాగవతులఁ బోలు భాగవతుఁడు
కృష్ణభూషణుఁ డందు మోక్షణశాస్త్రి. 14

చ. గురునిమహోపదేశ మొకకొంచెమునేఁ జెవి సోఁకినంతనే
పురువళి యైన చందమున మూర్ఖుఁడు నేనియు జ్ఞానమూర్తియై
దురితము లెల్లఁ బో నడఁచి దొడ్డతపం బొనరించుయోగి నాఁ
బరమపదంబు నొందఁ గల భవ్యచరిత్రుఁ డగు న్నిజంబుగన్. 15

క. ఇట్టి మహోత్తరుఁడై కని
పట్టినమా గురునిచరిత పద్యముల న్నీ
యట్టిమహాకవిచే ని
ప్పట్టునఁ జేయించి చదువ వలచితి మనసా! 16

క. దేశికచారిత్రము లో
కేశుఁడు శ్రీవేంకటేశుకృతి గా నిడ మే
మాశింతు మట్లు సేయఁ గ
వీశా మది సేయు మనుచు నే మందు మిటుల్. 17

క. కృష్ణాంశమునం బుట్టెను
గృష్ణవిభూషణుఁడు నీవు కృష్ణాంశమునన్
గృష్ణుఁ డనఁ బుట్టి తిద్దఱు
కృష్ణులు మీమహిమ మీఱ లెఱుఁగుదురు గదే. 18

ఉ. కావున నీవు మాగురుని కమ్రచరిత్రము పద్యపద్ధతిన్
జేవలు దేఱుతీఱున రచింపఁగ నోపుదు కాదనాక మా
భావము దీర్పు మే మెపుడు భాగవతంబుగ దాని నెంచుచున్
బూవుల మాఁపుఁ బ్రొద్దులను బూజలు చేసి పఠింతు మెంతయున్. 19

క. ఈకాలంబున నాకృతి
నీకంటె మఱొక్కరుండు నేర్పునఁ జేయన్
లేకుండు నిజము చెప్పెద
మేకవి నే ననుచుఁ జెప్ప నేర్పడి యున్నన్. 20

వ. అని వా రేకగ్రీవంబుగం బలికి బహూకరించి రంత నేను వారిం దిలకించి. 21

సీ. పదియాఱువన్నె మేల్పసిఁడికి నెనవచ్చు
పసిపచ్చ మేనను బరఁగువాఁడు
పనితేంద్రనీలము లన నల్ల నగు మీస
ములును గడ్డము జుట్టు గలుగువాఁడు
సప్తకచ్ఛంబులు సరి గాఁగ మేటినీ
ర్కావిదోవతి కటిఁ గట్టువాఁడు
పొడుగుఁ బొట్టియు సన్నమును లావునుం గాని
కమనీయరూపము గలుగువాఁడు

తే. ఎలనగవుఁ జూపుమోమున నలరువాఁడు
ధవళధవళంబు లగు జన్నిదములవాఁడు

మృదుమధుర భాషణంబులఁ బొదలువాఁడు
భూషణుఁడు సర్వలోకైకభూషణుండు. 22

క. అంతర్ముఖుఁ డని మాత్రము
స్వాంతమునం దోప వచ్చె నాకృతిఁ గనుటం
గొంత గ్రహించితి మహిమఁ
వింతగ శుశ్రూష కరితి విశ్రుతులారా ! 23

శా. శృంగారాద్భుతహాస్యముఖ్యరసముల్ చెల్వొందఁగా నున్నచో
బంగారం బని యెంతురు కావ్యమును విద్వాంసు ల్పలీ యందు రా
సంగాతం బిసుమంత లేమి విమతుల్ సాగింతు హాసంబు లే
భంగి న్నేను రచింతునో చరిత యేభంగిన్ బ్రసన్నించునో? 24

వ. ఎదియెట్లయిన మీయభ్యర్థనంబు కాదనక సర్వంబునకున్ బ్రధానమే ప్రమాణం బని దేవునిపై భారంబు వైచి గురుచరిత్రంబు మహా ప్రబంధంబుగా నొనరింప నెంచితి నని యోంకారంబు సంఘటించి నంత వారును సంతసించిరి నేనును ముదమంది ముందు మంగళా చరణంబుగాఁ గృతీశ్వరుం డగువేంకటేశ్వరుని దివ్యావతారం బభి వర్ణించెద. 25

—• కృతిపత్యవతారవర్ణనము •—

ఉ. శేషుఁడు దేవతానుతవిశేషుఁడు సంభరితోర్వీమండలా
శేషుఁడు సద్విసృష్టజనిశేషుఁడు శోషితదోషుఁ డుజ్జ్వల
ద్భూషణశూన్య సర్పవరవేషుఁడు నిర్గతరోషుఁ డాత్తసం
తోషుఁడు శతుమిత్రకృతమాషణభూషణనిర్విశేషుఁ డౌ. 26

ఉ. ఆతఁ డమర్ని శాదులు శుభార్థమునేఁ బెడబాయ కెప్పుడుఁ
బూతశరీరు లార్యజనపూజ్యు లుమాధవ మాధవు ల్పయిఁ
బ్రాఁతిగ నుండఁ గోరి యొకభవ్యవనంబున నుండి సత్తపం
బాతతిఁ జేసె మాను లవు నాఁడగ వేల్పులు పిచ్చలింపఁగ. 27

వ. ఇ ట్లధికనిష్ఠాగరిష్ఠుండై శేషుండు శివకేశవుల నంతరంగంబునం దిడుకొని యనేక దివ్యవర్షంబు లత్యుగ్రతపంబు గావించె నయ్యవసరంబున. 28

సీ. వెన్నెల వెదచల్లి కన్నుల ముదమల్లి
నిక్కటిల్లెడు తలపువ్వుతోడ
వన్నెచిన్నెలనొప్పి పొన్నునన్నెల గుప్పి
జోకగునెమ్మేని కోకతోడ
యాగంబులను డాసి నాగంబులను రాసి
సంతసం బిడు నెక్కుటింతతోడ
నెమ్మి నఱుఁగ నొంది ఆ మ్మౌని వగఁ జెంది
శివుఁ జెన్నలరారు దేవితోడ
తే. మ్రొక్కు లిచ్చెడు సనకాది మునులతోడ
జగము లేలెడు కరుణారసంబుతోడ
నార్యసంస్తుత శివకేశవాహ్వయంబు
స్వామియుగ్మంబు కెలన సాక్షాత్కరించె. 29

వ. అట్లు సాక్షాత్కరించి వాత్సల్యంబున వత్సా! వరంబు వేఁడు మనుటయు శేషుండు శివకేశవులం గాంచి వినయవినమితోత్తమాంగుండై చేతులు దోయిలించుకొని నే నచలంబనై యుండ మీ రిరువురు నా ఫణాపుచ్ఛంబుల నెపుడు నెడఁబాయక యుండి నాకుఁ గైవల్యంబు నొసంగుఁ డనిన వా రట్లగుం గావుత మని యంతర్ధానంబు నొంది రనంతరంబ. 30

సీ. చరమ సంధ్యారాగ సంభ్రాంతికృద్ధాతు
రంజితాతిప్రస్తరములు గలిగి
మాఘ్యప్రసూనదామముఁ దాల్చెనో నా భ
గణముల రాయు శృంగములు గలిగి
నందనానందమాకంద బృందములతోఁ
గనిపట్టు బలుకోనగములు గలిగి
ద్రవిణభాండాగారతతిఁ బోలి మేలిమిఁ
గ్రాలెడు మణికందరములు గలిగి
తే. పూలతావి గుబుల్కొను పొదలు గలిగి
కోళ్ళనుండి పాఱెడు సెలయేళ్ళు గలిగి
యురుమహత్త్వంబునను జూడ నొప్పె గోత్ర
నాథుఁ డయ్యె భుజగగోత్రనాథుఁ డపుడు. 31

## — వేంకటాచల వర్ణనము —

వ. ఆ త్రైకయోజనోన్నతియు దశయోజనాయతియుఁ ద్రింశద్యోజన
విస్తృతియుంగల మహాచలంబై మహీమండలంబున మహామహిమం
బొలుపొందుచు. 32

తే. జనులపాపంబు లెల్లఁ జో సలుపుకతన
వేంకటాచల మను పేర వెలయు దాని
మహిమ కొనియాడఁ దరమె యీ మహితలమున
నోళ్ళు వేయున్నఁ గాని వేయేళ్ళకైన. 33

తే. కృతయుగంబున నగ్గిరి వృషనగ మనఁ
త్రేతయందున గరుడధాత్రీధర మన
ద్వాపరమ్మున శేషభూధర మనంగఁ
గలియుగంబున వేంకటాచల మనఁ దగు. 34

క. తిరుమల యనఁ దిరుపతి యన
మఱియుం బేరులను బొంది మహితలమందున్
గర మలరారెడు నగ్గిరిఁ
బరికించినఁ బాప మెల్లఁ బరిశాంతి యగున్. 35

వ. అట్లు మహావైభవంబునం దనరారు నప్పర్వత శిరోభాగంబు
శ్రీశైలంబు నాఁబడు నట దివ్యామృత జ్యోతిర్లింగమూర్తియై గంగా
ధరుండు మల్లికార్జునుం డను పేర భ్రమరాంబాసహితుండై నివ
సించె నంత వైకుంఠుండు నేడుమలకలు గలిగి వేంకటాచలంబు
నా నొప్పునప్పర్వతపుచ్ఛభాగంబున మున్ను భూదేవి చేసిన తపం
బునకు మెచ్చి యిచ్చినవరంబునను శేషుని కిచ్చిన వరంబునను
వేంకటేశ్వరుం డనం బేరంది మానవుల కగోచరుండై నివసించి
యుండె నంత నష్టావింశతితమ ద్వాపరాంతంబున భారతరణం బైన
పదంపడి కొంతకాలంబునకు. 36

ఉ. ఆయతపుణ్యగణ్య మగు నగ్గిరి కింత సమీపమందు నా
రాయణనామపత్తనము రాజిలు నందు వియన్మహాఖ్యభ
ద్రాయితమూర్తి భూమిపతి రాజ్యము సేయుచునుండు ధాత్రియన్
శ్రీయుతనామ మందిన కుశేశయపాణి దలిర్పఁ బత్నియై. 37

వ. అమ్మహారాజు కడికిఁ గాలం బైనను సంతతిం బడయఁ జాలని వాఁ డగుటం జేసి భూసురానుమతంబునఁ బుత్త్రకామేష్టిం జేయువాఁడై పుణ్యప్రదేశంబున నాఁగలిం గట్టి దున్నుచున్నంతఁ దొల్లింటి సీత యగు వేదవతి శ్రీరామునివలన వరం బంది యున్నయది కావునఁ బుడమిసుత యై వెండియుం బుట్టి నాఁగేటికఱ్ఱునకుం దగిలి పైకి వచ్చిన రాజేంద్రుం డబ్బాలికామణిం గాంచి సంతసించుచుం గొని పోయి భార్య కిచ్చి పెంచుచు నలరుమేలుమంగ యని పేరు పెట్టె నంత నబ్బాలికామణియు దినదినప్రవర్ధమానయై ప్రవర్తిల్లుచు. 38

—॰ అలమేలుమంగబాల్యము ॰—

సీ. చిడిముడిపడకల చిన్నె లన్నియు నేర్చెఁ
బ్రోదిరాయంచల పోఁగువలన
జలిబిలిపలుకుల తళుకు లన్నియు నేర్చెఁ
బెనుచురాచిలుకల పిండువలన
నడరెడుపాటల హాయి లన్నియు నేర్చెఁ
బాదల నల్లాడుతుమ్మెదలవలనఁ
జిటిచిటినటనల సిరు లన్నియును నేర్చెఁ
దడికొప్పునెమ్ముల దడము వలన
తే. ఇట్టు లాయలమేల్మంగ పుట్టి నేర్చె
నో కొ- పుట్టక నేర్చెనో కో- యటంచు
జనులు నుతియించు నడువున సకలధర్మ
ములను నేర్చెను దను దాన పొలుపు మీఱ. 39

క. ఈరీతిని బాల్యంబునఁ
గోరిక లిగురొత్త మనుజకోటికి ముద్దా
కూరిమికూఁతునిఁ గలల వి
శారదఁ జేయించెఁ దండ్రి శాస్త్రజ్ఞులచేఁ. 40

తే. ఘనుఁడు ప్రత్యగ్రుఁ డగునధికారి యులఁతిఁ
బ్రితను బరివృఢు గెలిచి తద్యాన మైన
పదవి నాక్రమించె నన నప్పుడతి దేహ
మునను బాల్యంబు జాఱె యావనము మీఱె. 41

వ. ఇట్లమూల్యయావనాలంకారాలంకృతయై మదనదేవతామోహన మంత్రశక్తి యనంబొల్చి చూపఱుమనంబు సూఱలాడుచుండె నంత. 42

చ. దినదిన మాసతీమణి ధృతిఁ స్తుతిపాఠకవేళలందుఁ దాఁ
డిని గొలువంగ నేగి యట నేప్పున వేల్పుల నేలతాల్పులఁ
గొనకొని వందు లెన్న విని కోరిక లీరిక లెత్తి నత్రుతిఁ
ఘనుఁ డగు విష్ణుని న్వని మనంబున సంబర మందుచుండెఁగాఁ. 43

క. ఈ రీతిని దన మనమున
నారాయణుఁ బెండ్లియాడ నలు వగు ననుచున్
గోరిక నాయమ యుండియు
నేరికి నెఱిఁగింప దయ్యె నెంతయు లజ్జన్. 44

వ. ఇట్లు మందాక్షకాంతాబద్ధాంతరంగయై యలమేలుమంగ సర్వకాలంబుల, సర్వావస్థల, సర్వభావంబుల సర్వేశ్వరుండగు వేంకటేశ్వరుఁ బ్రాణేశ్వరుఁగా భావించి, భావంబున సేవించుచుఁ దదేకశరణంబుగాఁ బ్రవర్తిల్లుచుండె. నా సమయంబున, 45

వసంతర్తువర్ణనము.

సీ. మావిపూఁదేనెల మత్తిల్లి యలిగాయ
కాళి సుస్వరముల నోలిఁ బాడ
శుకశారికాది సచ్ఛకున సంతాన మై
తాళికాళి ఘనశబ్దములు వలికెఁ
జివురు రాని మత్తకోకిలఁ జిరరవంబున వన
ప్రియకోటి కాహాళఁ బ్రీతిఁ బట్ట
తెక్కలల్లార్చుచు నొక్కటఁ గొలఁకుల
హంసకాంతాళి నాట్యంబు లాడ

తే. అట్టియామని సంతన మావహిల్ల
మన్మథోత్సాహజనకుండు మాధవుండు
సొగసులకు నెల్లఁ దాఁక మగుచు నెపుడు
వెలయుచున్నట్టి వనలక్ష్మిఁ బెండ్లియాడె. 46

వ. అట్లు శృంగారంబులకుం బానకం బగు వసంతాగమంబున నొక్క
నాఁ డయ్యలమేలుమంగ కనకమాలికాది సఖీజనంబుతో వేంకటా
చల ప్రాంతభూభాగంబున నందనంబునుం బోని యుపవనంబునకుం
జని విహరించుచుండె నప్పుడు. 47

తే. కాలఁ దన్నె నశోకముఁ గాక నొకత
కేల నంటెను లేమావి లీల నొకత
పాడె నొగిఁ బ్రేంకణముకడఁ గ్రీడ నొకత
కౌఁగిలించెను గురవక మేగి యొకత. 48

తే. తావిఁ గొన నూర్చె వావిలి తీవి నొకత
కాంచెఁ దిలకంబు వేడుక గాఁగ నొకత
యామనికి మన్కియై తగు నావనమున
నతివ లొప్పిరి స్వైరవిహార మలర. 4

వ. అప్పుఁ డొక్కచక్కెరబోఁడి యుయ్యాల నూఁగుచు. 50

త్రిభంగివృత్తము. కలకల మనుచును బలికెడుచిలుకల
పలుకులఁ దేటులపాటల్ బడి నాటల్ బోటుల కాఁకల్
నలుగడ గమగమ వలచెడుఁ బోఁడలు
పొలుపగు మల్లెలు మొల్ల ల్వెదచల్లు న్వాసన లెల్లన్
మలయజ పవనము చలువలఁ గొలుపుచు
నిలఁబడి తాఁకఁగ వచ్చు న్వగ హెచ్చుం దాపముఁ దెచ్చున్
బలములు గొలువఁగ బలసినమదనుఁడు
వలపులుగూర్చి తలిర్చున్ దమి హెచ్చున్ గెవ్వన నార్చున్. 51

మానిని. మేటిమరందపుఁ దేటల నానుట మీటగు తేఁటుల పాటలతో
నాటులు పోటుల వేటివియో మది నాటనిబోటుల యాటలతో
మాటికి మాటికి బోటికిఁ గూటమి మాటుశుకంబుల మాటలతోఁ
బాటిలు నామని నీటుసయాటలఁ బాటిల దీటిడు మేటులకున్. 52

వ. మఱియొక్కత చెట్లకు నీళ్ళు వోయుడు మూఁగిన తేఁటిదాఁటులఁ
దోలుట నభినయించుచు. 53

పంచచామరము. అనంగసంగరాంగణం బనం గనుం గనుంగొనన్
గనుంగొనం గదున్ గదున్ వగం జెలంగునివ్వనిన్
మనంగ నీవ యంగడంబున న్మెలంగు భృంగముల్
చనంగఁ ద్రోలుఁ డంగ మందెసంగుఁ గంప మంగనల్. 54

వ. మఱియు నిద్దఱు పువ్వుఁబోండ్లు పువ్వులు గోయుచు. 55

మధుర. మల్లెపువ్వు లే నెంచి కోసితిని మంచివి మఱి లేవే
మొల్లమొగ్గలే మోద మిచ్చు నని ముచ్చటపడి రావే
పల్లవంబు లేఁ గోసి తెచ్చి రతివల్లభునకు సిస్తున్
గల్ల గాదు నా కెల్లసౌఖ్యములు గల్గగ మఱి వస్తున్. 56

వ. ఇట్లు పలుతెఱంగుల నాటలాడుచుఁ బాటలు పాడుచు నాయములు
సోఁక నాడుకొనుచుఁ బోకంతయు నడ్డాకలు లేక పేఁక విహరించు
చుండి రక్కడ. 57

—॰ వేటవర్ణనము ॰—

ఉ. వేంకటనాయకుం డపుడు వేడుక పెంపున భిల్లమూర్తియై
జం కిసుమంత లేని భటసంఘముఁ జాల నమర్చి పేర్చి యా
వేంకటశైలమం దటవి వేటకు నై తిరుగాడి డొంకలన్
జింకలఁ బట్టి సింగములఁ జించె జ్వలించెడువాలుఁదూపులన్. 58

సీ. కాండ్రు కాం డ్రని వచ్చి కీండ్రించుగొల్పులి
బోనునఁ బడఁ ద్రోబ్బె బోయ యొకఁడు
గీ పెట్టుకొని యేపు చూపెడు మదహస్తిఁ
బట్టిగోతను బెట్టె జెట్టి యొకఁడు
బొబ్బరించుచుఁ జెంప దెబ్బ దీయఁగ నున్న
యెలుఁగుఁ జీలిచి చంపె నెఱుక యొక్కఁ
డోఁడ్క రంచును మోఁటఁ ద్రొక్కు శార్దున్న కొ
మ్ముల్లఁబోఁ బెకలించె భిల్లుఁ డొకఁడు

తే. చంచె శరభంబుఁ జేతులఁ జెంచొకండు
గండభేరుండమును జెండ దండ యొకఁడు
కుక్క నుసికొల్పెఁ బందిపై కోదొకండు
జేగ విడి పట్టెఁ బక్షుల నేగి యొకఁడు. 59

వ. ఇట్లు వేట లాడి యాడి మాయాకిరాతుం డొక్కచో నొక్క శీతల వృక్షచ్ఛాయ నర్మసచివుని నధివసించి యించుక తలఁచి కావంచ నుండి పంచమస్వరంబుతో మలయమారుతం బను వారువంబు నెక్కికొని మలయమారుతిరాగంబు జంత్రగాత్రసంయోగంబున వచ్చి కర్ణరసాయనంబు గావించుటయు నతండు దృష్టి నిగిడించి నలుదిక్కులుం గలయం బరికించి యించుక విచారించి వినుతించి మోదించి సంభ్రమించి కామించి మోహించి మది నెంచి చన సంకల్పించి యుచ్చటించి మించి వెంచురాజుంగాంచి యిట్లనియె. 60

శా. గానం బియ్యది యాలకించితివి యీ గాంధర్వనారీమణీ
గానంబో? నగకన్నరీజనలసద్గానంబో? దివ్యాప్సరో
గానంబో? భుజగాంగనాకలిత సద్గానంబో? కాకున్న ని
ర్వాణంబౌ పఁగాననే మదికి నాహా! యెంత వింతయ్యెడిన్. 61

ఆ. నర్మసచివ! నీవు నాపాలికూర్మిసైఁ
బోఁక యిట్టి దాని పూల మొల్ల
నరసి వచ్చి నన్ను నానందవార్ధిలో
నోలలార్చి యుంచుము నుంటిఁ జుమ్ము. 62

వ. అనిన నతం డట్ల కాక యని తదాజ్ఞ శిరంబునం గొని పని విని సర్వం బెఱింగి యుచ్చటపడి వచ్చి వేంకటేశ్వరునితో నిట్లనియె. 63

క. మీనన్న నొవలం గొని
యానార మేతె చుపాయ నరిగి యచట నే
బా ననఁగం బొడఁగనొక
రాసుతఁ గని వచ్చితిన్ దొరకుఁ దెలుపంగన్. 64

వ. ఆకర్ణింపు మేను దొలిదొల్త వారిసమీపమునకుం బోక చెంత నొక లతాకుసుమగుంఫంబుచాటుననుండి తారకామధ్యంబునఁ జంద్రలేఖయుం బోలె సఖీజనమధ్యంబున మద్రమధ్యమతారయోగంబున వీణ వాయించు మించుఁబోఁడి నిరీక్షించి సంతసించుచుంటి నప్పుడు. 65

● లస: మునిజనులఁ బ్రోచుమునిముఖ్య! పరమాఖ్యా!
చెనఁటులకుఁ గాని సురసింహా! నరసింహా!

మొనసి జగ మేల నగుప్రోవ! బలుజేఁడా!
కనికరముతోడ మముఁ గావఁ దగు దేవా! 66

వ. అనునీపద్యంబు వీణాగానంబున విన వచ్చి [illegible] బూజించి సేవించుచుండి రే నటఁ బోయిరం బోవచ్చు [illegible] మన్నింపం బడి యాకన్నెసఖులతోడం బ్రసంగించి వచ్చి నా కర్ణింపుము. 67

— అలమేలుమంగా వృత్తాంతము —

క. ఆకాశ రాజచంద్రుని
కాకన్నియ కూఁతు రమర హల్లకపాణుల్
ఆకాంత కాలిగోటికిఁ
బోకంతయుఁ బోల రామె పొగడఁగ నోపన్. 68

సీ. లీలారవిందంబుఁ గేలఁ ద్రిప్పుచుఁ జూప
లమునఁ గన్గొను వేళ లక్ష్మి యనఁగ
సింగంపు గద్దెపైఁ జేరి యీశిత్వంబు
సొరుఁ జూపె వేళ గౌరి యనఁగ
వీణ వాయించుచు వెలినవ్వుఁజూపులు
రాణింపఁ గను వేళ వాణి యనఁగ
దివ్యాంగనాసేవఁ దేలి వైభవదృష్టి
పచరించి చను వేళ శచి యనంగ
తే. ఆచెలియ నామదికిఁ బోలఁ దోఁచుఁగాని
పూతమగు యజ్ఞవేదికఁ బుట్టుటయును
సన్నుతుండగు జేనికిఁ గన్నె యగుట
యరసి చూచిన సీతయే యగు నిజంబు. 69

ఉ. విష్ణుపదావనీశుఁడు త్రివిష్టపమధ్య విరాజమానులన్
జిష్ణు సమానులన్ రిపువిజిత్వరుల న్వరులన్ యశోఽర్జ్య వ
ర్ధిష్ణుల నెంద ఱెందఱినొ తెల్పెను గాని యొకానొకండునున్
విష్ణునిఁ గోరు నా రమణి నెమ్మది కెక్కఁ డొకింత యేనియున్. 70

క. హరి నీవు నిన్నజన్రము
వరుసగఁ బడయంగ నెడఁద వాంఛించెఁగనా
తరుణి సిరి మీకు సౌఖ్యము
పెఱుఁగున్ దాంపత్య మైన వేంకటనాథా! 71

—• వేంకటేశ్వరుం డలమేలుమంగం గాంచుట •—

వ. అనిన నత్యంత కుతూహలాయత్తచిత్తుండై తత్తఱంపడి లేచి వేంకటేశ్వరుండు నర్మసచివునిం గూడి యచటికిం జని పరిచారికాకృతకాలోచితోపచారాపచితులం బడసి యొక్క భద్రాసనంబున నాసీనుండై యలమేలుమంగాంగసౌష్ఠవంబు మది కిష్టంబాపాదించి నేత్రపర్వంబు గావించుటయు. 72

తే. కాంచి మది నుంచుకొని నెంచి కన్నమూయ
కుంచి కృశియించి పెరయిచ్చ నొంచి సిగ్గు
డించి వెడఁగుమాటలు పచరించి సొమ్మ
సించి యించుక తెప్పిర్లి మించి యలఁకు 73

వ. లేచి సమీపించి తనయభిప్రాయం బెఱింగించిన నయ్యలమేలుమంగయుఁ గేవలకిరాతుం డన కతనియందు బద్ధానురాగ యయ్యు నియ్యకొనమి నభినయించి యించుక తొలంగి చనియె నప్డు డామెచెలికత్తియలును. 74

సీ. మారామసరివాఁడ వా? రామ! యని చేతి
విల్లమ్ముల నొకర్తు వెఱికి వైచె
కులగోత్రములు లేక కులగోత్రముల నేలు
నెఱుకా! యని యొకర్తు వెఱికె జడలు
తలిదండ్రుల నెఱుంగ కిలఁ బుట్టి తని నెత్తి
నెమిలియీఁకల నొర్తు నెఱియఁ బెఱికెఁ
నొకచో నునికి లేక సకలభూముల మెట్టు
మొఱకా! యని యొకర్తు నెఱులు వెఱికెఁ

తే. జేపలం దీవు నీటిలోఁ జేప వగుదు
పందులం దీవు కాటిలోఁ బంది వగుదు

సింగముల నీవు గుహలలో సింగ మగుదు
వెట్టివాఁ డైన నగుదు వోయెఱుక! పోర. 75

—• అలమేలుమంగా వివాహము •—

వ. అని యిట్లు మెలఁత లెల్లరు నతనిం దర్జనభర్జనంబులం గేలి సల్పు టయును. 76

చ. ఎఱుకలవేషము న్విడిచి యెంతయు సంతసమావహిల్ల న
త్తఱి వరశంఖచక్రము లుదారతఁ జూపఁగఁ బైడికోక పై
మెఱయఁగ వేంకటేశ్వరుఁ డమేయఘనాఘన నీలవర్ణుఁడై
నెఱిఁ దరుణీసమక్షమున నిల్చెఁ గను ల్మిఱుమిట్లు గొల్పఁగన్ 77

వ. ఇట్లుతత్సమక్షంబున నక్షీణకరుణాకటాక్షంబునఁ బ్రత్యక్షంబైన పుండరీకాక్షుని నిరీక్షించి జలజాక్షులు తాము తన్నెఱింగి మనసి తడఁబడుచుండ నతం డలమేలుమంగవిక్క మొగంబై తన వృత్తాంతం బాద్యంతంబుగా నెఱింగించి పెండ్లియాడుమని ప్రార్థించుటయు సమ్మోహించు బోఁడి తాను వలచుచున్నదియైనను గించిల్లజ్జానమ్రవదనయై కన్నవాని కెఱింగించినంగాని కాదని సఖిజనంబుచే పలికించిన నతం డట్టకేల కట్లయగుం గావుతమని యథాగతిస్మృతిగఁ జనియె నయ్యలమేలు మంగయు నింతింతనరానిచింతాసాగరంబునం బొరలు చుచు సఖీజనపరివృతయై పితృగృహంబునకుం జనియె. నంత నక్కడ వేంకటేశ్వరుండు నిక్కడ నలమేలు మంగయు విరహవేదనా దూయమానమానసులై పరితపించు చుండుట విని వియన్మహారాజు చంద్రుండు దూతం బుచ్చి వేంకటనాథుని సపరివారంబుగాఁ దోడి తెచ్చి విధిదృష్టవిధానంబున వివాహంబు గావించి కన్నె నిచ్చిపుచ్చుటయు నతండు జాయాసాహితుండై నిజనికేతనం బగు శేషాచలంబునకుం జనుదెంచి శ్రీభూనీలాలమేలు మంగానాంచారులంగూడిసుఖంబుండి భక్తజనసులభుండై శుభంబు లొసంగుచుండి కొంతకాలంబు కడచనినంత నొక్కనాఁ డలమేలు మంగాదులంగాంచి యిట్లనియె 78

—•త్రిలింగ విద్యాపీఠ ప్రశంస•—

చ. పులులు నెలుంగులున్ మఱియు బొబ్బమెకంబులు లోనిసత్వముల్
గలిగి భయంకరాటవులఁ గప్పఁగనైన చోర రాక యేరికిన్

పులకలు గల్గి మ్రొక్కుటకు మార్గము గల్గక పెద్దదుర్గమై
వెలసినకొండపై నిలువ వేడుక తోడిక లెత్తు కొండెసెన్. 79

క. నే నా సెష్టున కిచ్చిన
హా నస్వర మీనగంబుఁ దలఁగుట సరి కా
దైనం జెప్పెద వినుఁడీ
సానందంబుగ నోకంతు సగసీజాక్షుల్! 80

సీ. మునుపులు చెల్లించి మ్రొక్కు పో భక్తులు
నడచి రా నెంతయు నడలు గుడుతు
రది మైచి నడతేర నసుఁగడ్డునకు దుష్ట
మృగముల బాధయు మిగులఁ గలుఁగుఁ
గడచి కలుసుకాలఁ గా క్లోత్తఁ గిపలు చో
దోసపీకాం డెల్లి వోఁచు కొండ్రి
పై గుడ్డయును లేక బయుసిమూంలి భుజింప
నిసుపుంతయును లేక పసఁ వోలంగి

తే. "బ్రిమువు జీవుఁడ!" యాస బైటఁ బడఁగ నుంపు
కాని ననుఁ జూచి సేవింప మానసంబు
పలుప జాలరు వారలసిలుగు దొలఁగ
నాచరింపఁగ నెంతు నోయతివలార! 81

సీ. ఆంధ్రభూమండలమందుఁ గృష్ణానదీ
కూలమునం దింద్రకీల మనఁగ
నగ మొండు గల దందు నరుఁడు తప మొనర్చి
యిష్టార్థసిద్ధుల నెల్లఁ బడసెఁ
గనకదుర్గాదేవి కల దందు భక్తుల
దెస సంతతము కామధేను వగుచుఁ
దత్ప్రాంతమునఁ బురి దనరు విజయవాటి
యన బెజవాడ నా నాహ్వయముల

తే. అందు వేంకటరెడ్డి సుధ్యావధాని
కనకమాంబిక లోసుభక్తవ్రిజంబు

నాదు పేరఁ ద్రిలింగవిద్యాదిపీఠ
మును బ్రతిష్ఠించె స్వగురుసేవన మెసఁగ్ప. ౮౩

మహాస్రగ్ధర.
కనకప్రాసాదమందుం గనుగొన సగునాకమ్ర ప్రముఖగంధక
దినముం బ్రోక్షాపరాహ్ణాదిసమయములం బెంతె సహస్రనామార్చన
పౌనఃపున్యం దర్చిం పంబడ మెనుమున మాపూర్వులోంకార దీక్షాపరున్
ననుఁ గూడన్ రండు తత్స్థానమున నిటను నుండన్మతెం జేయుఁ డా గ్రే.

తే. విజయవాటిక నగు గురుపీఠమందు
నెడ తెగక వేంకటేశ్వరుఁ డెపుడు నుండుఁ
గాన ముడుపులు మ్రొక్కు లక్కడ నొసంగ
నొప్పు నని వేంకటేశుఁడే చెప్పె నపుడు. ౮౪

ఉ. వేంకటశైలమం దటులు వేడుకతో నివసించుచుం "గిలా
వేంకటనాయకో" యనెడు పేర్మికి నై వివిధస్థలంబులం
జంకిలి లేక మెట్టుచుఁ గళాలయ మైన త్రిలింగపీఠము
బొంక మెసంగఁ జేయుచును బొల్చెడు నట్టి విభున్ భజించెదన్ ౮౫

— షష్ఠ్యంతములు —

క. పతాద్విగ్విధ మహిమ
ఖ్యాతునకున్ విజయవాటికా పురకనకా
పేత త్రిలింగ విద్యా
న్వీతమహాపీఠ దర్శనీయాకృతికిన్. ౮౬

క. శ్రీశునకున్ శేషాచల
వేశునకున్ సర్వలోక వీక్షణ దీక్షా
వేశునకున్ రక్షితమా
నీశునకున్ వేంకటేశ బుధవేశునకున్. ౮౭

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనిన యమృతానందం బను పురుష చరిత్రంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్య పుణ్యక్షేత్రనివాసులగు శుకశౌనకాదిమహర్షులు హర్షోత్కర్షం బునం జేయుద్వాదశవర్షసత్రయాగంబున సమాగతుం డైన సూతుం గాంచి పూజించి కలియుగంబున శంకరాచార్యుఁడు త్యాగరాజా

[illegible] కృష్ణ పరమహంస వివేకానందాదులును బుట్టిన వెనుక
[illegible] గాంధియుం బుట్టె నని చెప్పితి వతనిచరిత్రంబు నవిస్త
రంబుగ [illegible] వ్రాసిన నతం డోంకారంబు గావించుచు. 88

శా. శ్రీ మాతా నిజభక్తసంఘములకున్ మృత్యుంజయత్వంబు ని
త్యామోదంబును బుత్రపౌత్రవిభవం బారోగ్య భాగ్యంబులున్
బేర్మిం గూర్చుచు లోకమేలు నలసావిత్రీమహాదేవి దా
నీమర్త్యాళికి భిక్ష యిచ్చి కరుణ న్వీక్షించి రక్షించుతన్. 89

—* హిందుఁడు భారతదేశమును బ్రశంసించుట *—

శా. ఎందుం దన్నువ లేక సేతువు హిమాద్రిం ద్రెంచెబుం బ్రాక్పశ్చిమా
నందాంభోధులు చుట్టు నెల్లలగుచుండం బేర్మి భాసిల్లునీ
హిందూదేశజనిత్రికిన్ సకలదేహీష్టార్థ సంధాత్రికిన్
"వందే మాతర"మంచు భక్తిభరితస్వాంతుండనై మ్రొక్కెదన్. 90

చ. భరతుఁడు నాయకుం డగుచుఁ బాలనముం బొనరించు దాన నా
భరతునిపేర నొప్పితివి భారతమాత! క నీదుగర్భమం
[illegible] నదీనదంబులు మహాధరణీధరము ల్వనంబులున్
బరగుచు నుండు నెక్కులవి భారతజాతికిఁ బ్రాణంబులై 91

ఉ. భారతవర్షమా! కవులు వర్ణనముం బొనరించునట్లు ని
న్నారయ లేక స్వర్గమున కౌ దని చెప్పుచు నుందు తప్పు ని
స్సారము నీకు బాహ్య మగుస్వర్గపురం బది యేడ నర సు
స్వైరపు సౌఖ్యదం బవయి వర్తిలు నీ విది యేడ తల్లిరో! 92

ఉ. నీయుదరంబునం గలమణీప్రకరంబుల రత్నగర్భవై
పాయక పాలునేలలను బండినపంటల సస్యగర్భవై
యేయెడ రంతిదేవ రఘు నృగ్వనరణ్య ముఖు ల్భజింపఁ దే
జోయుత వైనతల్లి వని స్తోత్రము చేయుదు నిన్ను భారతీ! 93

సీ. రామకృష్ణాదీశ్వర వరాంశసంభవుల్
ప్రహ్లాద శుకముఖ భక్తవరులు
కాళిదాసాది సత్కవిరాజచంద్రులు
శంకరాదిమత సంస్కారగురులు

పాణినిప్రముఖ శబ్దప్రపంచజ్ఞులు
జనకరాజాది విజ్ఞానఘనులు
శిబికర్ణముఖ దాతృ శేఖరులును వివే
కానందముఖ్య మహామహులును
తే. త్యాగరాజాది గాన విద్యా విశార
దులు మహాత్ములు పెక్కండ్రు తొల్లి నీవు
కన్నబిడ్డలు నీయశం బెన్నఁ దరమె
దివ్యసద్గుణ సముపేత! దేశమాత! 94

శా. స్వార్థత్యాగము చేసి నైజ మగు దేహం బెన్న లోకోపకా
రార్థం బే యని దేశభక్తి గలవారై యెల్లకాలంబునున్
వ్యర్థం బింతయుఁ గాని యత్నమున సత్కార్యారంభము న్సేసి ప్ర
త్యర్థివ్రాతముఁ దోలి మేలుఁ గొను నాంధ్రాచార్యులన్ గొల్చెదన్.

—* ఆంధ్రదేశ ప్రశంస *—

శా. ము న్నానన్నయభట్టు మెట్టుటను బెంపుం గాంచె రాజ్యోదరం
బెన్నం దిక్కనకల్మి సింహపురియున్ హెంపుంచె గుల్లా ర డ
జ్జిన్నం గాంచుట వాసిఁ గాంచె ముగురయ్యల్ మూఁడులింగంబులై
వన్నం బెట్టఁ ద్రిలింగదేశ మది భవ్యం బయ్యె దేశంబులన్. ౯౬

సీ. గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రా పి
నాకినీముఖ మహానద్యవిశము
శ్రీశైలపట్టన శ్రీకూర్మ సింహాద్రి
శేషాచలాది విభూషితమ్ము
వీరభద్రేశ్వర వేంకటేశ్వర మల్లి
కార్జున భీమేశ్వరాంచితమ్ము
బందరు నెల్లూరు వరపిఠాపుర రాజ్మ
హేంద్రాది నగర సమీక్షితమ్ము
తే. రాజరాజ నరేంద్ర వీరప్రతాప
రుద్ర కృష్ణరాయేంద్ర సుభద్రరాజ
పాలితము మాధవాదిసత్పండిత పరి
వృత మిది త్రిలింగదేశము వెలయుచుండు. 97

సీ. అమృతకుండముఁ గప్పు నమరి సేవించిన
పుణ్యాప్రదంబగు పుష్పగిరియు
శిఖరదర్శనమాత్రఁ జేసి పునర్జన్మ
మును బాపు శ్రీశైలభూధరంబు
కలికల్మషము లెల్లఁ గడతేర్చు వేంకటే
శ్వరునివాసము శేషశైలనగము
కృష్ణవేణీతటకీర్తితకనకదు
ర్గాలంకృత మ్మింద్రకీలధరము

తే. ఇట్టినగములఁ బోలు నం దింద్రకీల
మందుఁ బాండవమధ్యముఁ డధివసించి
దివ్యశస్త్రాస్త్రములు వొంద దేవదేవు
గాంచి తపియించి సిద్ధినిఁ గొనియె మున్ను. 98

సీ. భారతమ్మున జగద్వర్ణితుం డగురాజ
రాజనరేంద్రుఁ డాంధ్రమునఁ బుట్టె
వేదభాష్యము చేసి విఖ్యాతి గొన్నవి
ద్యారణ్యమాధవుం డాంధ్రసుతుఁడు
ప్రజలకై బంగరువర్షము గురిసిన
వీరరుద్రుం డాంధ్రభూరమణుఁడు
"విద్యాలభోజుఁ"డన బిరుదుగాంచి, కృష్ణ
దేవరాయం డాంధ్రదేశవిభుఁడు

తే. నన్నయాదులు మఱియు శ్రీనాధముఖులు
నాంధ్రకవు లని గర్వింతు నాంధ్రసుతుఁడ
ఢిల్లిసుల్తాను బట్టి యోడించినట్టి
ఘనుఁడు మేధావి మంత్రియుగంధరుండు. 99

సీ. నారసింహప్పరాణ్మాన వేంద్రుఁ డిందు ధ
ర్మావతారం బనునాఖ్యఁ గాంచె
విజయనగరమందు వెలసినయానంద
గజపతి ఘనుఁ డయి కాంచెఁ బేర్మి

రావు గంగాధరరామరాయఁడు పుట్టి
కొలఁదిభూములు దానముల నొసఁగె
"సీతమాజోగయా"ఖ్యాతులపే రెల్ల
భూమండలంబున మోగెఁ గాదె

తే. వివిధవిద్యలయందుఁ బ్రవీణు లగుచుఁ
దగిరి హరిశాస్త్రివిశ్వనాధప్రముఖులు
వీర లందఱు నాంధ్రులు వీరికీర్తి
యెట్టిదేశములం దేరికేసి లేదు. 100

తే. తర్కమందు జగత్ప్రసిద్ధప్రతిష్ఠ
గాంచి కాశ్యాదిభూముల ఘనత కెక్కి
వచ్చి తెల్గుదేశంబున వాసిఁ గన్న
ప్రాజ్ఞుఁ డాంధ్రుండు శ్రీపాద రామశాస్త్రి. 101

మ. కొనసీమం గల యాంధ్రదేశమున ముంగొండాగ్రహారంబు వి
ప్రనికాయప్రతి సేవితం బట నుపక్రిష్టాన్వవాయంబునన్
ఘనుఁడై భూసురభూషణం బయి జగన్నాథుండు జన్మించె ము
న్నెన రే పండితరాయఁడై ప్రబలుటల్ విఖ్యాతినిం గాంచుటల్. 102

చ. అతఁ డొకఁడాంధ్రపుత్త్రుఁ డనినంతన చాలదె లోకమందు నే
క్షితితలమందు నాంధ్రులకుఁ జెప్పఁగ నొప్పిన కీర్తి యేదికిన్
బ్రతివచియింపఁగా నయినరా దని యాంధ్రుఁడు పర్వమొందుటల్
ప్రతిభయ కాని కాని దని పల్కఁగ వచ్చునె యెట్టివాసికిన్. 103

—♦ ఆంధ్రవిష్ణుని మాహాత్మ్యము ♦—

వ. అట్లు ప్రఖ్యాతిం గాంచినత్రిలింగోప నామకాంధ్రదేశమ్మునందు.

సీ. కృష్ణవేణీతీరకీర్తితం బాంధ్రమ
హావిష్ణుదేవనిత్యావితంబు
శ్రీకాకుళేశ్వర శ్రీవిరాజితము శ్రీ
కాకుళక్షేత్రము లోకవినుత
మాక్షేత్రమునకు మున్నరుదెంచి శ్రీకృష్ణ
దేవరాయఁడు దేవదేవునాజ్ఞ

విష్ణుచిత్తీయాఖ్య వైష్ణవగ్రంథము
విరచించి గోదకై వినుతుఁ డయ్యెఁ
తే. దచ్చరిత్రము పరమాద్భుతమ్ము దాని
సచట సంస్కృతంబున కెల్లవారు
తెలియఁగా నిట్లు పొనర్పఁగా నెంచినాఁడ
నిచ్చమై వినుఁ డయ్య మునీంద్రులార! 105

క. ఆంధ్రమహావిష్ణువు నీ
వంధ్రప్రతిభాని శేషరంజకుఁ డగు చ
య్యాంధ్రాధివసియం దెం దే
వంధ్రము లేనట్టి పెగుచుఁ బ్రఖ్యాతి గొనెన్. 106

సీ. పన్నిట సాఁచించి ప్రత్యూహంబును గీరు
నామము కస్తూరితో మొగమున
నమరించి తో మాలె నంటుసొంటుగ వైచి
మొల్లల మాలిక లల్లి బిలిగఁ
గచ్చంబు లేర్పడుకరణిఁ బీతాంబర
ము మనోహరంబుగా మొలనుఁ గట్టి
యిరుగడ వ్రేలాడ సరిగంచుఁ నుత్తరీ
యము వల్లెవాటుగా నలుత వైచి
తే. మల్లెయత్తరుతోఁ గూర్చి మంచిగంధ
మంగకముల నలంది మే లారతు లిడి
రేపు మాపు నాంధ్రవిష్ణువు నోపి పూజ
లాచరింతురు తైసేసి యర్చకు లట. 107

తే. జాజులు న్విరజాజులు నంపెగలును
మల్లెలును మొల్లలును మేలుమాలికలుగఁ
బ్రభువు గట్టించి భక్తిమై పంపుచుండు
వానిఁ బూజారి స్వామికి వైచి పిదప. 108

శా. నిర్మాల్యం బన నొప్పఁబూసరుల వానిం దీసి భూజానికిన్
శర్మం బేర్పడ నిచ్చుచుండు నెపుడున్ స్వామిప్రసాదంబుతోఁ

గక్ష్మం బెట్టిదా కాని యిట్లు దినములే కాఁ గాఁగి నవహ్యాలిఁకా
నిర్మర్యాదగఁ గేశ మల్లుకొంగ క్రొన్నించెక్ నుహీనామికా. 109

చ. కని యిది యేమి కారణమొ కానఁగ వచ్చునఁ గొప మిదె స్త్రీ
జనము శిరోజ మం చరయఁ జాతె మనం బని ఘోరఘుబుల మహా
త్మ్యునిఁ బిలువంగి బంచి కనుదోయికిఁ గోచరగాఁ జేసి నన్నుఁ గనెక్
ఘనమతి ! యిట్టిదోషి మెటు కల్గెనొ కన్గొనఁ బోలు నీ కటన్. 110

చ. అనవుడు మంత్రి పూజకునియుం దనువానను గల్గినట్టి నా
జనువును బుచ్చి వాని నృపసన్నిధికిం బిలిపించి భూప !
కను మిది స్త్రీ శిరోజ మిది కా వనుదే యెటు వచ్చు దేవదే
వుని గయిసేసి తెచ్చినది పుష్పసరం బిది చూచి చెప్పుమా. 111

క. నవనవగ నెఱుంగుదు నీ
దవుదత్తన మెల్ల లోకు లనుకొనుచుండన్
జెవులార వింటి నే నిటఁ
దవులము కల దంట దేవదాసికి నీకున్. 112

ఉ. చెప్పుము చెప్పకుండు నెడ శిక్ష విధించెదఁ బుష్పమాల నీ
వెప్పుడు స్వామి కీక వెలయింతికి నిచ్చుచు నుంటివం చిటన్
జెప్పఁగ వింటి నే మనుచుఁ జెప్పెదవో యన నాతఁ డాతఁడే
ముప్పు ఘటిల్ల నయ్యె నని పొంపిరిపోయెడు సాధ్వసంబునన్. 113

క. గడగడ వడఁకుచుఁ బెగ్గడ
యడుగులఁ బడి మ్రొక్కి లేచి యత్యార్తమున
ట్లడఁకువఁ జూపుచు నే నె
ప్పుడు తప్పొందారి మొలఁగఁ బోవ నెఱుంగన్. 114

మత్త. దేవదాసికి స్వామిహారముఁ దీసి యీయను మీఁదు నా
పై విరోధముఁ జేసి యెవ్వరొ పల్కి రిట్లు లసత్యమున్
దేవదేవుఁడు సాక్షిగా నిటఁ దెల్పుచుంటి నొకప్పుడే
నేవిధం బగు పాపకార్యము నేని చేసి యెఱుంగఁ బో. 115

క. ఇది నెఱక కాదు కా దని
బదు లాడఁగ నోప నీసభాస్థలమందున్

మదవతుల శిరోజం బను
పదనుఁ జూపట్టుఁ దెలియఁ బలికెద వినుఁడీ. 116

చ. హరికి శిరోజముల్ గల వవన్నియు సంపఁగి రాసి దువ్వి నే
నిరతము కొప్పువెట్టెదను నిత్యము మీ రిడుపుష్పదామముల్
హరుసముఁగోడ నే నతనియర్తిఁ దగుల్చుచునుందు నేఁ డెటో
నెఱి కది తెప్సి యెత్తుపయి నిల్వఁగ నయ్యె నటందు విందురే. 117

శా. తైలస్నిగ్ధము విద్యుదాయతము గంధద్రవ్యసంవాసితం
బై లక్షింపఁగ నయ్యెఁ గేశ మిది కాదాడంగఁ బో నిత్తఱిన్
బోలింపంగ రమామనోహరునకుం బుట్టెన్ శిరోభాగమం
దేలా పాపము లాడ నాదుపయి మీ రీక్షించి శిక్షింపుఁడీ. 118

తే. అనుడు నాశ్చర్యమగ్నాత్ము లగుచు రాజు
మంత్రియును వాఁడు పలికినమాట కప్పు
డచ్చెరువు హర్షమును బొంది యట్లు నీవు
చూపఁ గలవోటు లేకన్న రూపు చెడుదు. 119

చ. అనవుడు నర్చకుం డనియె నార్యవరేణ్యులు మీసమక్షమం
దనృతము లాడి నే బ్రతుకునట్టిఁడ నౌదునె కేశపాశ ము
వ్వనజదళాయతాక్షునకుఁ బర్వనిచో నను నింత లింత లా
తునియలు చేసి కాకులకుఁ దోడన వేయుఁడు పాయ కిత్తఱిన్ 120

క. అని చెప్పి సెల వొసంగుఁడు
మనుజేశ్వరులార! ప్రొద్దు మలఁగెడు నేఁ డా
వనజాక్షుఁ గనుంగొనఁగాఁ
జనుదెం డుదయమున నన్ను సరి చేయుటకై. 121

వ. అని చెప్పి యొప్పించి యప్పురుషుం డప్పుడ దేవళంబునకుం జని విష్ణుదేవుని సమక్షంబునఁ జేతులు జోడించుకొని నిలుపంబడి యి ట్లనియె. 122

— పూజారి యాంధ్రవిష్ణువును స్తుతించుట —

సీ. అన్న! నీ వెవ్వరో యని నేను నినుఁ గొల్వ
నీవు నేనే యని యెంచి కొలుతు

నే జలకము లాడి నిన్ను నాడింతును
గట్టి చే నీకును గట్ట నిడుదు
తొడి పూసి నీకు నేఁ దొడి పూసికొందును
దినఁ బెట్టి నీకు నేఁ దిందు నవల
లచ్చమ్మ నీపక్కఁ నిచ్చఁ బండగఁ జేసి
నీ దాసిపక్కఁ బండెదను నేను

తే. నీకుఁ బెట్టక తిన నేను నీవు చేసి
నట్లు చేయుదు నన్య మింతైనఁ గాని
చేసి యెఱుఁగ నీవాఁడ నీదాసివాఁడ
నీవు నావాఁడ వొరువాఁడ వెపుడు కావు. 123

ఉ. నేఁ డొక పుష్పహార మవనీపతి నీకు నొసంగు నంచు నే
వేడుక చేసి దాసి నను వేఁడగ నీ కిడనుండ దాసి నా
తోఁ డిమదాని నిచ్చితివి రేయిఁ బెనంకువ నుండ నంగు నా
చేడియ కేశ మొండు తెగి చేరె నెఱుంగక నేను దాలిచెన్. 124

ఆ. నీ ప్రసాద మనుచు నెతి మీఁజఁ గొని పోయి
జేని కిచ్చినాఁడ దానిలోన
యాడుదానినెఱిక యది చూచి తేఁ డల్లి
మన్నెగొందు ననియె నన్నుఁ బిలిచి. 125

శా. నే నొం డేమియుఁ జెప్ప లేనిజడుఁడై నీ నెత్తిపై పెంపుగాల్
గాన న్వచ్చెదునంటి నీవె కల వన్ గర్వంబునం దంచి నా
ప్రాణం బిప్పుడు నీ యధీనమని చెప్ప న్వచ్చు నేఁ బోవ నేఁ
డేని నీకు కిసుమంత బువ్వ యిడువాఁ డిం దుండఁ డేఁ డిప్పుడా. 126

వ. అని మూఢభక్తిం బ్రదర్శించుచుం బ్రార్థించినం బ్రసన్నుండై
పన్నగశయనుండు ప్రత్యక్షంబై. 127

శా. కుబ్జా! కుయ్యిడఁ బోకు మేఁ గలను నీకు న్నాకు లోకంబునం
దు జ్ఞానఁగుల్ గలిగించువా ర్గలుఁగఁ బో రుర్వీపతిం దెచ్చె యే
యజ్ఞాఁకల్ గొనఁ బోవ కౌదలను నాదాకేశపాశోన్నతిం
జిట్టున్ బుష్పమాల్ల వారలు సమీక్షింపంగఁ జేయం దగున్. 128

ఆ. రాజు నిన్ను మెచ్చు రాజీవగంధియు
నీవు నాదు సేవ నేమఱక యా
ఘాప్రకారమున ముదం బెదఁ బొదలంగఁ
జేయుచుండ నలయు నోయితండ్రి. 129

వ. అని యంతర్ధానంబు నొందె నంత మఱునాఁ డరుణోదయంబునఁ గాల్యకృత్యంబులం దీర్చుకొని నామాత్యుండును సపరివారుండును నగుభూభుజుండును పౌరజానపదపరివృతుండై దేవాలయంబునకుం జనుదెంచి శ్రీమహావిష్ణునివిగ్రహంబుం బ్రతీక్షించి కేశపాశం బుంట నిరీక్షించి మంత్రిదిక్కు మొగంబై యక్కజంపడుచు నిట్లనియె. 130

మ. ప్రెగడా! దేవునిమ్రోల ముందుఁ గనుఁగో విఖ్యాతమై తోఁచెడిన్
సొగసుం జుట్టుచు నొప్పుకొప్పిదిగొ కన్నుంగోయుకీం బర్వమై
తగ నీక్షించితె యిందు మోసకృతి యేతిన్మాత్రమే నుండున
ట్లుగ నూహింపవుగా? యనంగ నతఁ డెట్టుం బల్కఁ లేకంతటన్. 131

తే. తనదుకడ నున్న పూదండఁ దగులుకొన్న
నెఱకగైకొని దేవుని నెఱికలంపుఁ
జేర్చి సరిచేసి పలుకుచుఁ జేతనొక్క
కేశముం బట్టి యట్టె లాగెను రయమున. 132

ఉ. లాగిన జల్లు మంచచట లావగు ధారను గారె నల్ల యా
భాగవతాపరాధమున బమ్మరి యుండినవాని మేనిపై
రాగము పూర్ణమై ప్రబల రాజుఁ గనుంగొని దాని నివ్వెరన్
లోఁగి వడంకుచుం బిలిచె లోపలనుండినవానిఁ బూజరిన్. 133

తే. తప్పు చేసితి నీపాల నిప్పు డేను
నన్ను నావారినిం బ్రోవ నాదుమనవి
స్వామికైంకర్యమున కింక వలసినంత
ద్రవ్యమిచ్చెద నని మ్రొక్కి తరలి చనియె. 134

తే. నాఁడునుత నెంతయే మహోన్నతి వహించి
యాంధ్రవిష్ణువు లోకమం దతిశయించె
నెందఱో భక్తు లద్దేవు నెపుడుఁ గొలిచి
యైహికాముష్మికసుఖంబు లందుచుండ్రు. 135

తే. పుణ్యతరమైన యాక్షేత్రమున కొకింత
దవ్వులం బ్రాగుదీచిని ధరణిదేవ
సంభృతంబును ధనధాన్యసంయుతంబు
ప్రజలు లక్ష్మీపురాగ్రహారమ్ము కరము. 136

—• అగ్రహారవర్ణనము •—

సీ. ఏదెసఁ జూచిన భూదేవతాగృహ
దర్శనీయము లయి తనరువీథు
లేవీథిఁజూచిన నెడతెగకుండెడు
వేదపాఠంబుల వెలయునిండ్లు
నేయింటఁ జూచిన నెపుడు స్వాహా స్వధా
కారంబులం బొల్చు భూరిశాల
లేశాలఁ జూచిన నిష్టమృష్టాన్నభు
గతిథిజనాకీర్ణ నుతతలంబు
తే. నేతలముఁ జూడ వేదశాస్త్రోద్ధతాళ
పత్రపుస్తక సంభృత పరమ చత్వ
రమ్ములుం గల్గి నేత్రపర్వమ్ము శ్రోత్ర
పర్వమై యగ్రహారమ్మె పరిఢవిల్లె గాంచు. 137

సీ. అయ్యగ్రహారంబు నంటియుండిన వన
మున నొప్పుకీరము లనుదినంబు
'నోమిషేత్వా' యని యుచ్చరించిన మీఁద
'నగ్నిమీళే' యని యచటిశారి
కలు వల్కఁ గోకిలమ్ములు 'నగ్న ఆయాహి'
యని పాడు స్వరము దప్పని విధమున
నంత 'శన్నో దేవి' యని కపోతమ్ములుఁ
బలుకుఁ జతుర్వేదములు క్రమమునఁ
తే. గేకి 'సత్యంవద' యనంగఁ గాకి మూక
లపుడు 'ధర్మంచర' యటంచు నఱచు మృగము
'లప్రమదితవ్య' మని యార్చు నప్రతిహత
సుప్రభావు లావిప్రులనూక్తులఁ బడి. 188

మ. శ్రుతి శాస్త్రాంగ పురాణముల్ చదివి సంశోధించి వేదాంతముల్
ప్రతిపద్యంబు నసత్య మీశ్వరుఁడె పోల్పన్ సత్యమం చెంచియున్
సతతం బాత్మగుణాలకీటగతి సంసారంబు సంధించుచున్
మతిచంద్రుల్ ధరణీసురోత్తములు సమ్మానింపఁగా నుండ్రటన్. 139

వ. అట్టి యగ్రహారంబున. 140

—• కథానాయకుని వంశావతారము •—

శా. ఆలుం బాలును గల్గి శిష్యుల కొకం డామ్నాయ పాఠంబులన్
బోధిం జెప్పుచుఁ బాలయొజ్జ లనఁగాఁ బొల్పొందెఁ దద్వంశజుల్
పాలావజ్ఝలవారు నాఁగ జగతిం బ్రఖ్యాతులై రందఱన్
శీలంబున్ శమమున్ దమంబుఁ గలరై చెల్వొంది యుండ్రందఱున్.

సీ. వేదశాస్త్రంబుల వేఁడు మా కెన లేఁడు
శ్రౌతంబునన్ మాకు సాటి మేమె
శాస్త్ర పురాణాది సాముదాయకమందు
నెదిరించి జీవుఁడున్ బెదురు గుడుచు
లౌక్యవిద్యలు మాకులంబున సం బుట్టె ధ
న్వంతరికి న్మాదె యాదిభిక్షు
సూర్యచంద్రాదుల శుద్ధగమన మెల్ల
దృక్సిద్ధముగ మేమె తెలుపఁ గలము

తే. జీవయాత్ర యేతీరునఁ జేసి నడపి
యాత్మపరమాత్మలకు నెప్పు డైక్య మరసి
ముక్తిభామిని నఱచేత ముట్టి మేము
యవ్యయానంద మొందెద మండ్రు వారు. 142

ఉ. అందఱు వేదశాస్త్ర విదు లందఱు సాహితవహ్ను లైనవా
రందఱు సత్యవాక్ప్రవణు లందఱు నిత్యతపఃక్రియాచణుల్
అందఱు సద్వ్రతప్రథితు లందఱు శిష్యసమేతు లైనవా
రందఱు నాత్తభూతదయు లందఱు బ్రహ్మపదజ్ఞు లారయన్. 143

తే. పాలయొజ్జలవంశము పాలవెల్లి
నాఁగఁ బెంపొందుచుండు భూభాగమందు

నందు లక్ష్మీనృసింహార్యుఁ డనుఁబుధుండు
వెలసియత్యధికుం డయ్యెఁ బొలుపుమిగిలి. 144

ఉ. స్నానము సంధ్యయున్ జపము సజ్జనగోష్ఠియు సత్పురాణముల్
మానక తండు నిత్యము సుమాధవపుష్పసుపూజ లర్థిన
న్మానముఁ జేయుచున్ విబుధమాన్యచరిత్రను గంగమాంబ యన్
మానవతీలలామ నిజమానిని గాఁగొని చేసె సంసృతిన్. 145

తే. ఆడి తప్పనివాఁడు సత్యార్జకుండు
పలికి బొంకనివాఁడును వ్యసనుఁడు
ప్రబలె నతనికి వేంకటరత్నశాస్త్రి
యనెడు కొమరుఁడు దక్షుఁడై హర్ష మెసఁగ. 46

సీ. అలపాలయొజ్జల కులమున మేటియై
ప్రబలిన వేంకటరత్నశాస్త్రి
వేదవేదాంగాది విద్యావరిష్ఠుండు
గుణగరిష్ఠుండును గోవిదుండు
వఱలు నడుపుమిల్లి బ్రహ్మయసుత మహా
లక్ష్మియన్ కన్యక లక్షణవతి
గరితఁ బెండిలియాడి ధరణి గార్హస్థ్యధ
ర్మములను దీర్చుచుఁ గ్రాలుచుండు

తే. రత్న మాతండు మణి యామె రమణ నిర్వు
రొక్కటిగఁ జెప్ప నొప్పుచు నుర్వి శివుఁడు
శక్తియును బోలె నలరారి సర్వజనుల
కప్పు డానందమును గూర్చు నట్టులైరి. 147

సీ. అరుణోదయస్నాన మాచరించి యతండు
సంధ్య వార్చి జపంబు సంతరించి
బ్రహ్మయజ్ఞముఁ జేసి ప్రాహ్ణకృత్యము దీర్చి
గృహకార్యములయందొకింత మెలఁగి
యతిథులకై వేచి యభ్యాగతులఁ గాచి
దేవార్చనాది సద్విధులుదీర్చి

వైశ్వదేవముఁ జేసి వైశ్వానరునిఁ గొల్చి
భోక్తల నర్చించి భుక్తి నొసఁగు

తే. నామె పతికన్న మును లేచి యఘిపుఁ గొలిచి
యింటి పనులెల్ల నెఱవేర్చి యింతలోన
జలకమాడి గౌరీపూజ సలిపి పిదప
షడ్రసోపేతముగ వంట సత నొనర్చు. 148

చ. పొలములు పండి ధాన్యములు పుట్లకొలందిగ వచ్చి గాదెలన్
బొలుపుగ నిండి యుండ నొక పుంతకుఁ బోఁ బని లేక దంపతుల్
కలిగినరీతి నన్నమని కానఁగవచ్చినవారి కెప్పుడున్
సలలితరీతి నాఁడఁగ సల్పుచునుందురు విందు లట్లుగన్. 149

తే. అతిథి పూజయు దేవార్చనాదికమ్ము
సత్పురాణము వ్రతమును సాధుభజన
మాచరించుట కాక వేఱైన కార్య
మరయఁ గా రాదు వారి కేయవసరమున. 150

సీ. ఆ గ్రామములలోన వ్యవహారముల నొప్పు
నతనిమాధ్యస్థ్యము నఖిల జనులు
తమ సంశయమ్ము లాతనికి నివేదించి
యతఁడు చెప్పినయట్టు లఖిలకార్య
ములు నడుపుచునుండ్రి పొలము హద్దులు పాలు
పంపులు ఋణములు వైరములును
రత్న పండితునితీర్మానముపై జనుల్
సరిపెట్టుకొనుచుండ్రి సంతతంబు

తే. అందు ముఖ్యముగా వివాహములయందు
నందెవేసిన చెయియై యనఘమూర్తి
యొకనియిల్లు నిలువఁబెట్టు టురుతరమగు
పుణ్య మనియెడు విశ్వాసమున మెలంగు. 151

తే. కోర్టులకుఁ బోక ధనమునుఁ గొల్లగొట్టు
కొనక యుండ నేతగవైన విని యతండు

న్యాయపక్షముగాఁ దీర్పుఁ జేయ నగుచు
దర్మగుణభూషణుం డని తాల్చెఁ బేరు. 152

వ. ఇట్లు ప్రవర్తించుచున్నయపుడు. 153

మ. ఒకకాలంబున నొక్కవానికి ద్వితీయోద్వాహము౯ా పెం
డ్లికి వారందఱు వచ్చి పీటలపయి౯ లీల౯ వసిం చి కొం
చక పూర్వాంగన నెంచి యేడ్చె నతని౯ జామాతఁగాఁ జేసి కొం
టకు శ్వశ్రూశ్వశురుల్ కలంగ నెద వేడ్కం బాసి గాసిల్లుచు౯. 154

ఉ. పీఁటలమీఁద పెండ్లి యని వేడ్కఁ బొనర్పక పిల్ల యేడ్పు మే
మేటికి నీతఁ డేడ్చెడినొ యిట్టిఁడు మాసుత నాదరించునే
పాటున కయ్యెడుం జుమి వివాహ మిదంచు వచించుచుండ నా
మాటలు రత్నపండితుఁడు మాటికి వించు వచించె నిగ్గతి౯. 155

ఆ. పెండ్లికొడుకు తాను బ్రేమించిన సతీమ
తల్లి జ్ఞప్తికైన దాన నిటులు
కంట నీరు వెట్టెఁ గాని యెం డొకరీతి
గాదు దీనఁ దెలియఁ గలదు ప్రేమ. 156

ఉ. ఈసతి సేకరించుటకె యిచ్చటికిం జనుదెంచె లేనిచో
నాస పొనర్చి వచ్చునె? నయంబున నీమెకుఁ దాలి గట్టి యీ
పై సతిమీఁద నెట్టికృప పర్వఁగఁ జేయునొ మీ కెఱుంగ నౌ
దోసములం దలంపక ప్రతుష్టి నొసంగుఁడు కన్య వీనికి౯. 157

వ. అని చెప్పిన నొప్పి కన్యాదాత సంతసించుచుఁ బిల్ల నిచ్చి పెండ్లి గావించె నిట్లు ప్రజాదరంబు వడసిన వేంకటరత్న పండితుండు మహాలక్ష్మితోడ గార్హస్థ్యధర్మంబు నిర్వర్తించుచుండ వేంకట సుబ్బమాంబ యను నొక్క కన్య యుద్భవించెం గాని మఱియు నెంతకును వంశోద్ధారకుం డగుపుత్త్రుండు పుట్టమిం జేసి. 158

—• తల్లిదండ్రులు పుత్త్రసంతానమునకై పరితపించుట •—

సీ. సప్తసాగరయాత్ర లాప్తమతిం జేసి
యందందు వేల్పుల నభినుతించి

వ్రతములు గావించి యతిథుల నర్చించి
ఉపవాసంబులు నిష్ఠఁ జేసి
సంతానగోపాలు సవిధంబు భజియించి
స్వామిపూజావిధుల్ సంతరించి
దినముఁ బిప్పలవృక్షమునకుఁ బ్రదక్షిణ
ములు మంత్రపూర్వకముగ నొనర్చి
తే. రేపు మాపును వనమూర్తి నోపి కొలిచి
పుత్రకామేష్టులు పొనర్చి పూర్ణదీక్ష
ధరసురుల మ్రొక్కి గ్రహశాంతు లొనరఁ జేసి
వారు నిష్ఠాగరిష్ఠులై వఱలి రపుడు 159
ఉ. కాలమునందు విష్ణు వధికంబు మహత్త్వము గల్గి భక్తులన్
జేకొని ప్రోచుచుండె నని చెప్పఁగ నొప్పుగ నాలకించి వా
రాకడ కేగి సర్వభువనాధిపు మాధవు నర్చచేసియుం
జేకొని తత్ప్రసాదమును జన్మయమూర్ధఁ బరిగ్రహించుచున్. 160
క. ఆ నారాయణు నెపుడున్
బ్రాహ్మాచారమ్ము వడియుఁ బ్రాంజలు లగుచున్
మానసమునయం దాహరి
ధ్యానించుచు నుండి రంత నరజామునకున్. 161
చ. ఇటుపుర కొక్కతె అగుచు నేర్పడ స్వప్నము వచ్చె నప్పడీ
శ్వరుఁ డొకబ్రాహ్మణాకృతిని వచ్చి ఫలంబుల నిచ్చి "మీ కిలన్
వరతనయుండు పుట్టు" నని పల్కి తిరోహితుఁ డయ్యె వారును
గర మనురక్తిఁ దేలుచును గన్నులు విచ్చి భజించి రాహరిన్. 162
వ. ఇట్లు వరంబు లంది వా రాహరి సంకీర్తనంబుఁ జేయుచు ననుజ్ఞ
పడసి నిజనివాసంబునకుం జని సుఖంబున్నకాలంబున నొక్కనాఁడు
ఉషఃకాలంబున. 163

—• మహాయోగి సందర్శనము •—

సీ. శిరములపైనుండి చీలమండలముదుల్
దాఁకఁ గాషాయవస్త్రములు గట్టి

యెడసుకే ల్మీఁదుగాఁ గుడికేలు క్రిందుగా
దండకమండలుల్ దనరఁ బాల్చి
యురములం గరములఁ నెఱివిరాజు నెమ్మోమున
భస్మత్రిపుండ్రముల్ బరఁగఁ దాల్చి
త్రిపుటాదితాళముల్ తెలుపుచుండెడు నాఁగ
నులివ్రు వ్రుట్టంగఁ బావలను దొడిగి
గీ. యనువదించుచు సంతల ననుగతు లగు
శిష్యులకు వేదశిఖలను జెప్పుకొనుచు
శోణనది పొంగివచ్చెదుచొప్పు దోఁప
వచ్చె శిష్యులతో యతివర్యుఁ డొకఁడు. 164
తే. వచ్చి ముంగిట నిలిచి యూర్ధ్వస్వరమున
"భవతి భిక్షాం ప్రదేహి" యన్పలుకు వలికె
నంత లోపలినుండి బ్రాహ్మణియు బ్రాహ్మ
ణుఁడును జనుదెంచి యతివర్యుఁ గడలఁ జూచి. 165
వ. సమీపించి సాష్టాంగనమస్కారంబు గావించి యర్ఘ్యపాద్యంబు లొసంగి తోడితెచ్చి విశ్రమింపం జేసి మహాత్మా నేఁటి మా యింట మీరును మీశిష్యులును భిక్షం గ్రహించి పోఁ బ్రార్థించుచుంటి మనిన యతీశ్వరుండు. 166
ఉ. భిక్ష గ్రహించి పొమ్మనుచుఁ బృథ్విసురవర్యుఁడు పల్కుచుండఁగా
భిక్షుకుఁ డట్లు కా దనుచు వేఱొకచోటికిఁ దోఁచి పోవుటల్
భిక్షుకధర్మముల్ గెలిచి వేయఁగఁ జాలెదఁ గాన మే మిటన్
భిక్ష గ్రహించి పోయెదము నీదగుభక్తికి మెచ్చు వచ్చెడిన్. 167
తరువోజ.
అనుడు నాదంపతు లాయతివర్యు
నడుఁగుఁదమ్ములకు జోహారు పొనర్చి
ఘనతరభక్తిమైఁ గాళులం గడిగి
కనకపీఠంబుపైఁ గడుభక్తి నిల్పి
వనితయుం దాను బుష్పములఁ బూజించి
భక్ష్యభోజ్యాన్నముల్ వడ్డించి యాజ్య

మున సబిభూరము ఘోరించి హస్త
మున నమృతంబని పోసె జలంబు. 168

వ. అంత యతీంద్రుండును శిష్యులునుఁ బ్రాణాహుతిపూర్వకంబుగా మహాప్రసాదభోజనంబు గావించి యుత్తరాపోశనంబు వట్టి లేచి హస్తప్రక్షాళనంబు గావించుకొని సుఖాసీనులై యున్నంత వేంకటరత్నవిప్రోత్తముండు మునినాథుని పాదారవిందంబులకుం బ్రణమిల్లి మోడ్పుఁగేలు ఫాలంబునఁ గీలించి వినయమ్రుండై యిట్లనియె. 169

శా. చాతుర్మాస్యలు వచ్చె రేపె మొదలై సాక్షాత్కరింపన్ మునీం
ద్రా! తీర్థాంఘ్రులు మీర లెచ్చటికిఁ బో స్వాంతంబుఁ గావింతురో
నా తాత్పర్యము నాగృహంబున యీనాల్గైసమాసంబు ల
ల్లాతిథ్యంబుఁ బరిగ్రహించుచు నిలం బ్రార్థింపఁ గా వచ్చితిన్. 170

ఆ. కాన విన్నవింతు మౌనీంద్ర దేవళం
బదిగో కాన వచ్చు నందునుండి
తప మొనర్చుకొంచుఁ దఱుల నాయింటిలో
భిక్షగైకొనంగ వేడుచుంటి. 171

వ. అనిన నమ్మునీంద్రుఁ డట్ల యగుం గాక దీని కింత యేమిటికి! నీవు భక్తుండవు నీయింట భక్తంబు పరమపవిత్రంబు కావున నీ చాతుర్మాస్య లా దేవళంబున నుండి నీయింట భిక్షం బరిగ్రహించుచుం గడపెదం గాక యని తాను శిష్యసహితుండై దేవాలయంబునకుం జని యందు నివసించి చాతుర్మాస్యదీక్షారంభంబు గావించె నా విప్రదంపతులును బ్రతిదినంబును నమ్మహాయోగికిభిక్షావందనంబు గావించి యమునుఁగులకు మనఁగు లొగ్గుచు శిష్యులతోడం దెచ్చి పూజించి భక్ష్యభోజ్యచోష్యలేహ్యంబులతో సంస్కృతాన్నంబు భుజియింపం జేసి దేవళంబునకుం బుచ్చుచుండు రకాలంబునఁ బ్రతిదినంబును సమాగతు లగు పౌరులకును శిష్యులకును సంయమీశ్వరుండు తత్త్వోపదేశంబు చేసి వేదాంతార్థంబు లుపన్యసించుచు శ్రీకృష్ణుండు జిష్ణునకుం జెప్పిన భగవద్గీతాతత్త్వసారం బిట్లని చెప్పం దొడంగె. 172

— భగవద్గీతాతత్త్వసారము —

తే. దేహి కీదేహమున నెట్లు తేజరిల్లు
బాల్య యౌవన కౌమార వార్ధకమ్ము
లట్లు దేహాంతరప్రాప్తి యనుచు నెఱుఁగ
వలయు విద్వాంసు లిట మోహవశులు గారు. 173

క. జనుఁ డెట్లు జీర్ణవస్త్రము
లను విడిచి వినూతనంబులను వస్త్రములఁ
గొనుమాడ్కి జీర్ణ దేహము
లను దేహియు విడిచి యొండులం గొనుచుండున్. 174

తే. మొదట నవ్యక్తమై మధ్యమున నొకింత
వ్యక్తమై తుద మఱియు నవ్యక్త మగుచు
భూతజాతంబు పొలుపొందు భూతలమున
నిట్టివానికిఁ జింతింప నేల? విజయ! 175

ఆ. కర్మ మాచరింపఁ గలదు నీ కధికార
మెపుడు తత్ఫలప్రతీక్ష తగదు
కర్మఫలమునందుఁ గాకు హేతువు నక
ర్మమునయందు సంగమమును దగదు. 176

తే. ఎప్పుడును మనోగతము లౌనెల్లకామ
ములను విడనాడి ప్రత్యగాత్మని నిజాత్మ
నరసి చూచుచుఁ బరితుష్టు డైనవాఁడు
చను స్థితప్రజ్ఞుఁ డనఁగ నోసవ్యసాచి! 177

ఆ. విషయచింతవలన వెలయు సంగము దానఁ
గామ మెసఁగు దానఁ గలుగుఁ గ్రోధ
మందువలన మోహ మగు దాన స్మృతిచల
నంబు దాన బుద్ధినాశ మగును. 178

తే. అఖిలకర్మములున్ జ్ఞానమందు లీన
మగుచు నుండును గాన నియ్యవనియందు

తరువోజ. ఆరాజయోగికి నవనీతలంబు
నందుఁ బెక్కురు శిష్యు లయ్యెద రప్డు
వారికిఁ దత్త్వంబు వర్ణించి తెలివి
వైజ్ఞానికులఁ జేయు వరుసన్మై నందు
ధీరు లై దార్గురు తేఁటుదు రెల్ల
దేశంబులందుఁ బ్రతిష్ఠమై యోగి
భూరిమాహాత్మ్యము పొలుపొందఁ జూపి
పూజ్యుఁడై దివి కేగుఁ బూర్ణత్వ మొంది. 186

సీ. ఉపదేశమాత్రిన యుత్తమోత్తమవిద్య
లెల్ల నేరిచి పండితేందుఁడగును
కవియై ప్రబంధముల్ గావించుఁ బెక్కులు
దస్రులఁ బోలు వైద్యంబునందు
జ్యోతిష మాతనిసామ్మగు నాతఁడా
డిన దాట యగును బాడినది పాట
యగు మహాత్త్వంబున నమరమానుల మించు
వేదాంత మాతని కాదివిద్య

తే. పెక్కుచోట్ల మఠంబులు పీఠములును
నిలుపు నాతనిపేరు భూతలమునందు
శాశ్వతస్థాయి యగు వానిఛాత్రు లెల్ల
మిదులఁ బ్రఖ్యాతిఁ గాంచెద రవనియందు. 187

మ. ఒక నారీమణి శిష్యురా లగుచు నెన్నో విద్యల న్నేర్చి స్త్రీ
ల కుపాధ్యాయియునై మహాయశమునన్ లక్షింపనై పండితా
ళికిఁ గప్పదుమమై మహోన్నత కృతుల్ నిర్మించి నైతేయి నా
సకలార్థంబులఁ బ్రస్తుతింపఁ బడు విశ్వశ్రేయముం గోరుచున్. 188

క. అవధాని శిష్యుఁ డగుచున్
బ్రవిమల ధర్మప్రచార భాసురుఁడై సం
స్తవనీయుఁ డగును గవితం
జవు లొలుకం గృతు లొనర్పఁ జాలి ధరిత్రిన్. 189

ఉ. ఆ దొరసుందరు వైశ్యకులమందు జనించియు నాంగ్లవిద్యయం
దుం దమ బుద్ధియున్ గుమితితోడ మెలంగినకారణంబునన్
హిందుమతాభిమానమున నేర్పడి పేర్పడి ధర్మమూర్తియై
పొందుగఁ బూర్చి విత్తమును భూతలమందు వదాన్యుఁడై తగున్.

మ. మఱియుం గొందఱు శిష్యు లున్నతిని సంపాదించి విద్వాంసులై
సిరియున్ సంపద గల్గి గౌరవపదస్వీకారముం జేసి యు
ర్వర నూత్నస్థులు నాఁగఁ బేర్వడసి విద్వద్రాజసేవారతిన్
బరివర్తించుచుఁ బ్రాజ్ఞులయ్యెదరు సత్ప్రారంభముల్ సేయుచున్.

వ. అని వారికి సెలవిచ్చి యతీశ్వరుండు వారిచే ననిపించుకొని సశిష్యుండై యథేచ్ఛం జనియె ననిన నైమిశారణ్యవాసు లవ్వలి వృత్తాంతంబు సెప్పుమని సూతు నడుగుటయును. 192

— ఆశ్వాసాంతము —

మ. అలమేల్మంగ పదంబు లొత్త నుపకంఠాసీనయై లక్ష్మి యీ
నెలవుం జేయుచు నాలు ముప్పలిడ నా నీలావనుల్ నిల్చి కే
వల వీఁచోపులు వేయ ముగ్ధ యగుచున్ వర్తింప నాంచారు భ
క్తుల నెన్నేలెడు వేంకటేశ్వరుఁ డొసంగున్ లోకకల్యాణమున్. 193

గద్యము

ఇది శ్రీమన్మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ
కవిరాజ కవిసార్వభౌమ ఆంధ్రవ్యాస
అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబునఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ ర స్తు

# అ మృ తా నం ద ము



## ద్వి తీ యా శ్వా స ము

మన్మంగళ దేవత
యే నుంగాభిఖ్యఁ గాంచి యెద నిల్చి కడున్
బ్రేమింప లోక మేలెడు
స్వామీ! మాకృతిగ్రహించి నాయకుని సేస్మున్. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె నట్లు వరం బొసంగి యతీశ్వరుండు చనినయంతటం బ్రాహ్మణదంపతు లానందసాగరనిమగ్నులై పారికాంక్షివాక్యంబులు స్మరించుచు కొనుచు సంసారంబు సాగించుచు సాధుపురుషుల సేవించుచు సత్కర్మంబు లాచరించుచు నుండి రనంతరి కాలంబున వేంకటలక్ష్మి గర్భిణి యయ్యె నయ్యవసరంబున. 2

—• గర్భిణీవర్ణనము •—

క. నెల దప్పెఁ గోర్కు లొప్పెను
బలుకులు నడకలును జాల బడలికఁ జెప్పెన్
బలువేవి ళ్ళొగిఁ గప్పెన్
వెలవెలనై మోము కళలవిప్పం గుప్పెన్. 3

సీ. లో నచ్చ తేజము తా నుంటఁ గలుషంబు
వెలిఁ బుచ్చు టనఁగ దోఁకులు జనించె
బ్రహ్మంబు తనలోనఁ బ్రజ్వరిల్లుట నన్య
మగురుచుల్ నడలు నా సరుచి పొడమె
భూతమయుండు లోఁ బొలుచుఁ గావున దాని
సూచింప నా మట్టి వాచవిఁ గొను
గట్టువిల్దాల్పరి కడుపునం గలిగిన
బరువున నడలందు బడలిక లగు

తే. దేవతాంశ సంభవుం డయ్యు దేవుం డయ్యు
నకలంకల గర్భనరకంబు ననుభవింప
పిలయుం జోయి ట్టి యించుచుం దెలుప నేమొ
పాలతి సుఖి మప్డు పెలివెలం బోవ నయ్యె. 4

తే. ఇట్లు తొమ్మిదిమాసములు లెనక మెనంగు
పగిది నీరోష్ణి యానందవల్లి యొక్క
పుణ్యలగ్నమునన్ ప్రియసమ్మతులు శుభస్థ
లముల నుండం గనెం బుత్త్రు విమలగాత్రు. 5

—॰ కుమారజననము ॰—

తే. దివ్యపురుషావతారంబుం దెలిసి స్వాగ
తము సమర్పించె ననురీతి ధరం బ్రభాత
గీతములలో శకుంతముల్ కేరి పాడె
దివ్యసుమగంధ మెల్లెడ దెసలం గప్పె. 7

తే ప్రాగాశాంగన పూర్ణిమ
యోగంబున సమ్మృతమయుని నోషధినాథుం
బాం గనిన బ్లమ్ములెపయుం
యోగానందమునం గుమారు బ్రమ్మరి కాంచెన్. 6

మ. ఖగ శోభోద్భవ శాలివాహశక మొక్కన్ శ్రీస్వభానబ్దమం
దగుసూర్యాంబునం గృష్ణపక్షదశమిన్ వారోవ్వేందు మందోత్తరన్
ఖగరాజోదయ మైనయేకఘటికాకాలంబునన్ రాజయో
గగతిం బూనుచుం బుట్టె సుతుం డక్కంజాక్షు నంశంబునన్. 8

తే. ధనువు లగ్నము శని వృషమునను మేష
మునను గేతువు కటకమునను గురుకుజు
లును దులన్ రాహు శశి కన్యలోన వృశ్చి
కమున రవిబుధశుక్రులు సమరి రపుడు. 9

ఖగ శోభోద్భవ = 1806 సంవత్సరంబు = కార్తికమాసము, మందోత్తర = మందవాసరోత్తరాషాఢ యందు.

క. తనయుఁడు జన్మించినశుభ
దినమున మేఘములు విరిసె దివి నిర్మలమై
కన వచ్చె వెలిఁగెఁ జుక్కలు
జనసౌఖ్యము గాఁగ వాయు చలనం బయ్యెన్. 10

చ. నెఱి లగనంబునం బొడమి నిద్దపుఁదేజుఁడు వెల్గుచున్నయ
చ్చిఱుతను మంత్రసాని తనచేసురియుం దగ బొడ్డు గోసి పోఁ
దెఱవలు లాల వోసి యొరితిం బొడిలోఁ బొగ వేసి యుయ్యెలం
బఱచిన మెత్తలం దునిచి పాటలు దీటుగఁ బాడి యూఁచుమన్. 11

ఆ. గాలి ధూళి సోకి కందు నెడక యుండఁ
జల్లి బూది వేల్పు వెల్లఁకులును
నూఱి పొగలు వేసి నోములు నోచిరి
పేరఁటాండ్రు భక్తి పేరుకొనఁగ. 12

వ. అంతం దల్లి యగు మహాలక్ష్మియు. 13

సీ. ఒకవేళ నుయ్యాల నునిచి బాలకు నూఁచి
జోలపాటలు పాడి జోకొలుచుండు
నొకమాఱు సంకతో నునిచి పాలను బాలు
నోటిలోఁ బోసి మేల్ నుడువుచుండు
నొకతేప నురమునం దుంచి యడ్డాలుగాఁ
జిఱుత ముద్దాడి లో మురియుచుండు
నొకయప్డు పొత్తిళ్ళ నుంచి కన్నకుమారుఁ
బక్కలోఁ బడి తాఁ బాడుచుండు

తే. నొక్కతఱి మోము మోమున నునిచి నవ్వు
నొక్కపుడు చిచ్చిగొట్టి నవ్వొప్పఁ జేయు
నొక్కతూఱి గిలిగింతల నొక్కిపెట్టు
నాత్మభవు నోము సమయంబునందుఁ దల్లి. 14

వ. అప్పుడు వేంకటరత్నోపాధ్యాయుండు తనయుఁ బుత్రోదయుం బగుట
విని మంగళస్నానంబు గావించి జాతకర్మంబు నిర్వర్తించి భూదే
వుల కనేకదానంబు లొనరించి గ్రామంబునం గల యెల్ల బాలుర
రప్పించి వారికి. 15

చ. ఫలసారములు పంచదారలును బాలును బెరుఁగు బప్పుబెల్లముల్
పలుచని పేనెపాకములు బర్ఫి జిలేబియు లడ్డుకంబులున్
మిలమిలలాడు ఫేణియును ఖోఁగడ వెన్నయు జున్ను లోనుగాఁ
గల పసబంధనంబుల్ ప్రియముగా మడి సేయుచు నిచ్చి వెండియున్.

తే. చిత్రచిత్రములుం బొల్చు చిఱు రుమాళ్ళు
నాటవస్తువులు చక్కనైనబొమ్మ
లలరుగుత్తులు రెండేసి పతిముదమున
మురిసె మేల్నడఁగ నిచ్చె మఱియు మఱియు. 17

— బారసాల —

వ. ఇట్టులు ఆ పురిటిదినంబులు పదియునొక్క దినంబువోలెఁ గడపి పదు
నొకండవ దినంబున బారసాలం గావింపనెంచి బంధుమిత్రాదుల
తోడఁ బురోహిత ప్రముఖుల రాఁ బిలిచి, 18

తే. ప్రస్థమాత్రతండులములు పళ్ళెరమునఁ
బోసి సరిచేసి దానిపై సూదు రేఖ
లక్షణంగ గీచి యుపరంజ కడ్డితోడ
మాఁగ నక్షత్ర నామముల్ వ్రాసి వెనుక. 19

వ. పుట్టినపు ప్రక్క నాగభూషణుం డని వ్యావహారిక నామంబు
వ్రాసి నామత్రయ దేవతల నర్చించి, పాలు నివేదించి, 20

తే. నాగభూషణుం డనియెడు నామధేయ
మది ధరించి చిరంజీవివై మను మని
దేవతార్పితమైన యయ్యావుపాలు
బాలునోట నిడియెఁ దండ్రి బంగరుపున. 21

తే. అరయ సంగాఁగసంగతి నావహిల్లి
హృదయముననుండి నాయాత్మ యే జనించెఁ
బుత్త్రరూపముతోడ నోపుత్త్ర! నూఱు
హాయనంబులు జీవింపుమా ముదమున. 22

వ. అని జనకుండు కరంబున శిశు శిరంబు స్పృశించి. 23

శా. గోభూస్వర్ణ ముఖోరుదానములు పెక్కుల్ పుత్త్రమేల్గోరుచున్
శోభాయుక్తముగాఁ జతుర్విప్రతులు సంశోధించి దీవించు నా

యా భూదేవకులావతంసముల కీయం జాలి సేవించి ని
వ్యాభివ్యక్తుల నొప్పె రత్నవిబుధుం డాపుణ్యజన స్తుత్యుఁడై. 24

వ. మఱియు నాగభూషణునకు మఱికొన్ని నామంబులు సంభవించిన కాల
సంప్రాప్తంబులు వానివృత్తాంతంబుఁ జెప్పెద నాకర్ణింపుఁ డవి
యి ట్లనియె. 25

—• నామనిర్వచనము •—

సీ. హరువంశమునఁ బుట్టు నసి యతి చెప్పుట
నాగభూషణుఁ డని నామ మిడెనొ
కోరాడనాగేశ గురుశిష్యుఁ డగు నని
నాగభూషణుఁ డని నామ మిడెనొ
యలపతంజలి నాగుఁ డతనిఁ బోలెడు నని
నాగభూషణుఁ డని నామ మిడెనొ
వేంకటేశుఁడు నాగవిమలభూషణుఁ డని
నాగభూషణుఁ డని నామ మిడెనొ

తే. నాగులకు భూషణుఁడు శేషనాగుఁ డట్టి
పోలుపు గలవాఁ డనియు నాగభూషణుఁ డని
నామకరణంబు చేసె రత్నద్విజుండు
చెల్లు నాపేరు వాని కేవల్ల నైన. 26

మత్త. నాగభూషణనామ మన్నిట నల్వు మీఱుచు సంతత
యోగిపుంగవుఁ డవ్వలం దనకూర్మి నైనవి యాదిగా
నాగభూషణ కృష్ణభూషణ నామయుగ్మము తోడ్పడ నా
నాగతిం బచరించెఁ గాంచె మాఱుయంగ నసాధ్యమే. 27

సీ. అరయఁ గృష్ణానందుఁ డతని పరమగురు
వగుట నానామము వందె నేమొ
భాగవతము కృష్ణభరిత మం దధికుఁ డన్
పే రందుఁ గాన నాపేరు గాంచెనొ
సబ్బినిధీసు కృష్ణద్విజుండు తనదు
ననుఁ గొటఁ దన్నామ మందె నేమొ

గీతోపదేశముం గృష్ణుం డొనర్చెఁ దా
నట్టిఁడు గానఁ దదాఖ్యఁ గాంచెనో

తే. కృష్ణుఁ డర్జునుఁడు గీత లెఱిఁగి జగము
లెఱుఁగ మాఱిగించి ఫల్గునుఁబు నిలిపె నల్లు
డాతఁ డయ్యెడు నని యేమొ మాధవుఁడు
కృష్ణభూపుఁడు తనుపేరఁ గీర్తి నొందె. 28

తే. నాఁగ కృష్ణపదంబులఁ దీఁగి వెనుక
భూషణం బని మాత్ర సంభాషణముల
నాఁడు సర్వభూషణుఁ డౌట నా హ్వయంబె
యేల ధరియింపవలె నని యెంచి యేమొ. 29

సీ. భూషణుం డతఁడెన్న భూసురభూషణుం
డును గవిభూషణుండును మునీంద్ర
భూషణుండును యోగిభూషణుండును భోగి
భూషణుండును త్యాగిభూషణుండు
జ్ఞానభూషణుఁడును శాస్త్రభూషణుఁడును
దత్త్వభూషణుఁడును ధన్యభూష
ణుండును గుణభూషణుండును భక్తభూ
షణుఁడును కీర్తిభూషణుఁడు సర్వ

తే. భూషణుండు తా నగుట నా పురుషవరుఁడు
కేవలము భూషణాఖ్యమైఁ గీర్తిఁ గాంచి
యఖిల వాగ్భూషణుం డయి యధికుఁ డగుచు
నఖిల భువనభూషణుఁ డయి యతిశయిల్లె. 30

క. క్రమమున యోగాభ్యాసము
సమకూరుట నంపదాంశ సంసిద్ధం బై
యమృతానందాహ్వయమును
నమరె మహాయోగివర్యుఁ డగు నాతనికిన్. 31

వ. అంతఁ గాలక్రమంబున.

—శైశవక్రీడలు—

చ. వెలికిలఁ బండి పొత్తులను విప్పి తెప్పల మూయుకొప్పుడున్
నలుగడఁ జూచుచుం బయలు నవ్వుచు నింపుఁ బ్రపంచమంతయున్
బల మగుగాలితాకునను బల్కరుఁ గూడ దటంచుఁ బీడించుచు మ
బ్బులగమి కెత్తువచ్చెడిని బో యని లోనఁ దలంచుచుండుఁజన్ 33

క. మిను విఱిగి మీఁదఁ బడినను
మనమున నే నరకు గొనెడుమాడ్కిని గా నే
ననునట్టిగుట్టు దెలుపఁగ
ననఁ గాళ్ళుల బయలుఁ దన్ను ననవరతంబున్. 34

తే. మాయ తన్నావరింపఁగాఁ జాయ నెఱిఁగి
చేతులం బట్టి చెండెద నేతఱి నని
యెఱుఁగఁ జెప్పెటకో యన నిట్టు నట్టు
చిన్నిచేతులు గదలించుఁ జిత్రగతుల. 35

శా. ఛాయం బోలిన యీప్రపంచమును సచ్చం జేయఁగా నేలపై
పై యోగంబున దానిసం దెలిసి త్రివ్వం జేసినో నేల ము
న్నే యత్నంబున నింద్రియార్థములకై వీక్షింపఁగా లేక గో
డే యుంతే నని తెల్ప బోఁగెలు లో నెంతే వినోదించుచున్. 36

తే. లోనిచూపున బ్రహ్మముం గానఁ డివురు
యోగి యోయను నాతఁడు యోగనిద్రఁ
బొందు ననఁ గన్నుఁదమ్ములు మూసికొనుచుఁ
గాన వచ్చును శాంతుని కరణి నపుడు. 37

క. నాగేశ్వర తాదాత్మ్యము
తాఁ గలుగం బోవు నవలఁ దద్గతు లభ్యా
సాగతము లనుచుఁ దెలుపఁగ
నాగేంద్రునిపడగ నాఁ గనం దల యెత్తున్. 38

ఆ. చిత్రమందుఁ దోఁచుచిట్ట లేనుంగులు
నరునిఁ గూల్ప లేనికరణిఁ దత్త్వ
వేత్త నీజగంబు వేధింప దని తెల్పఁ
బొరలుఁ గెరలు నతఁడు పొత్తులందు. 39

మ. నవరత్నంబులు రాలునో యనఁగ నానందంబు సంధించుచుం
నవు మోమెత్తి కలస్వరంబులను విన్నాణంబు సంధిల్లఁ గా
నెవరేనిం బలికింప నూఁ యనుచు లో నెన్నంగ మాటాడు సొ
రవురీతిన్ జనకోటి ముద్దులకుఁ బ్రావై బాలుఁ డొప్పెం గడున్. 40

వ. అంతఁ గాలక్రమంబున

సీ. తల యెత్తి చూచుచు లలి నొత్తగిలఁ బడను
గొన్నినాళ్లకుఁ దానె కూరుచుండె
సది యిది చేయూని పదిలంబుగా లేచి
క్రమముగాఁ బడ దను విద్దెములు చేసెఁ
బడుచు లేచుచు వేడ్కఁ బడి తప్పటడుగులు
వైచుచు నేర్చి చివరకు నడిచె
నాఁ యంచు నూఁ యంచు నట్టిట్టు లాడుచు
నాఁటికి నాఁటికి మాటలాడె

తే. బొమ్మలను గూర్చుకొని చాల సమ్మతమునఁ
బొంగి యాడుచు నంతట సంగడీండ్రఁ
గూడి చూచుచుఁ బాడుచుఁ దోడివారి
వేడుకల కయ్యె బుడుతండు వేడ్క నపుడు. 41

వ. ఇట్లున్నప్పుడొక్కనాఁడు కన్నతల్లి యాయానందవల్లి. 42

ఉ. వేకువ నిద్ర లేచియును బిఁగి కుమారుని గేహకృత్యముల్
వీఁకఁ బొనర్చి వచ్చి కడువేడుకఁ దల్పమున నిష్పణ్ణుఁడై
లోకము వంకఁ జూడ కెదలో నెవరో తలపోయుచున్నయ
ట్లై కనవచ్చు బిడ్డను మహాముని యంచుఁ దలంచె నెమ్మదిన్ 43

వ. అట్టితఱుణంబునం దాయమ్మ. 44

క. ఆనందమూర్తి! రావే!
నాన యన' యనుచు వా[illegible]ములలో
దానందాశ్రులు రాలఁగఁ
దా నక్కునఁ జేర్చుకొంచుఁ దగ నాడించెన్. 45

సీ. యోగి సంచారము నొందునప్డు సమాధిఁ
జెడకుండ పట్టుగాఁ జేయు సలము
భయశోకసాహసప్రభరిత మైనప్రపంచ
మున జాగరూకుండై మెసఁగ సలము
నని యెఱింగించుట కనఁగ గాలుసేతులఁ
బాఱాడి పరువడిఁ బఱచు శేవి
మృత్తికయందును మృద్వీకసందును
సమబుద్ధి సేయుచు సతము నెంచు
తే. సక్తమతి గాక పొందుచు రక్తి లేక
పట్టుదల వీడి ప్రకృతుల వలను పడిరయు
నిర్వికారత వర్తించు నిశ్చలగతుఁ
డవ్యయానందుఁ డగుచు బాల్యమునఁ బరఁగు. 46

—॰ బాల్యవర్ణనము ॰—

క. తాత యనుష్ఠానమున౦
బ్రీతిం బొనరించువేళ విజ్ఞుం డనఁగా
నాతం డాతనిచెంత వి
భూతింగొని కూరుచుండి ముదమెదఁ బొదలన్. 47
ఆ. ఆచమించి వెనుక నర్ఘ్యంబు విడిచియు
ముక్కు మూసికొనుచు మొదలు చివర
లేనిగతుల జపము పూని చేయుచునుండుఁ
గర్మఠుండు వోలెఁ గడఁగి యతఁడు. 48
చ. చినచినమట్టియుండలను జేసి యొకానొకపత్త్రరంబునం
దునిచి జలంబు పైఁ జిలికి "యోన్నమ"యం చని పుష్పములుపత్రియుం
బొనరఁగ వైచి యన్నియును ముద్దగఁ జేసి యమించి యవ్వలం
గనఁ డది కన్ను మూసికొను జ్ఞానివిధం బిటు లన్న చాన్నసన్.
శా. నూలుంబోఁగులు గాలుసేతుల కవెన్నో చుట్టుగాఁ జుట్టి య
బ్బాలుం డట్టిటు లాడు నట్టిడనుచున్ బంధంబులైనం గొంతలున్
నోలిన్ వానిని దెంచి వైచి తన కడ్డొక్కింత లేనట్టిట్టే
కాలున్ సంసృతి ముట్టి దంచుఁ దెలియం గావించుచందంబునన్.

ఆ. ఒక్క పెద్దబొమ్మ నొనరించి మట్టిచేఁ
జుట్టుఁ జిన్నబొమ్మ లట్టె చేర్చి
గురువు శిష్యు లనుచుఁ గూర్చుండు వానిలోఁ
దాన గురువు ననెడిమానసమున. 51

శా. గోచీ వెట్టినవాఁడె ధన్యుఁ డనుచున్ గొండొక్కశ్లోకార్థమున్
వాచింపం దన తాత చెంత నగు నాబాలుండు మే ల్మేలహో
గోచీ వెట్టనివాఁడె ధన్యతముఁడై గొండాట కౌ నంచుఁ దా
గోచిం దీసి శిఖాంశముం దెలుపుచున్ గోరాడు నవ్వేళలన్. 52

సీ. మితి మీఱి నాతం డుచితరీతి శైశవ
క్రీడలఁ దేలుచు నాఁడు నాఁడు
శుక్లపక్షామృతాంశునిరీతి దీపింపఁ
దల్లిదండ్రులె కాక యెల్లవారు
కని సంతసించుచుఁ గన్నులఁ గప్పికొం
చును ముద్దుపెట్టుకొంచును జుబుకముఁ
బుడుకుచుఁ జుంచు దువ్వుచు నెత్తుకొంచును
లాలించుచుందు రెవ్వేళఁ గాని

తే. ఫాలతలము విశాలము బాహువులు కడు
పొడుగు కన్నులు పెద్దలు పోల్చి జనులు
ఘనుఁ డితఁడు మహాపురుషలక్షణము లివ్వి
యనుచుఁ బలుకుచు నుందు రాతనిని గాంచి. 53

తే. పాదతలహస్తతలములఁ బరఁగుచుండు
శంఖచక్రాదిరేఖలు జనులు చూచి
యివి మహారాజచిహ్నము లితఁడు ద్విజుఁడు
కావునన్ రాజయోగి కాఁ గలఁ డటండ్రు. 54

—• అద్భుతచర్యలు •—

సీ. అయిదేండ్ల బాలుఁడై యతఁ డుండి యొక్కనాఁ
డరుణోదయం బగునంతలోన
లేచి మంచముపైఁ జలింపక కూర్చుండి
చిన్ముద్ర ధరియించి చెలఁగునపుడు

తల్లిదండ్రులు వచ్చి తనయుని వీక్షించి
విస్మితులై కొంతవేళవఱకు
నుండియుఁ దడ వట్టు లుండ నేరక మెల్ల
మెల్లనఁ దట్టియు మేనిమీఁదఁ

తే. బలుకరించియు నదలించి పలికి చులుక
కేకలం బెట్టి ఖిన్నులై వీఁక విడిచి
నిర్వికారత ధ్రువునట్లు నెగడుసుతునిఁ
గని భయంపడియును హర్షకలితు లైరి. 55

చ. ఒరులను బిల్చి చూపుటకు నోపరు చూపఱు పృషి త్రాఁకునో
వరసుతుఁ డెట్టిపాటునకు వచ్చెడినో యని పంతపించుచుం
వరము లొసంగినట్టి యతివర్యుని నార్యుని సంస్మరించుచుం
గరము విచారసాగరమునం బడి యుండిరి కొంతతోఁపునన్. 56

తే. జనని వేల్పుల మ్రొక్కుచో జనకుఁ డపుడు
మనమునందు సద్యోజాతమంత్రముం జ
పించుచుండె నంతటఁ గొంతవేళ కక్షి
యుగ్మ మల్లనఁ దెఱచె నాత్మోద్భవుండు. 57

వ. అంతలోనం దల్లి బాలకుం బొదివికొని యిట్లనియె. 58

చ. మెలకువ వచ్చెనే పడుకమీఁదన యుండియు నొంపఁజుంగన
ట్లులు కడునిద్రపోయెదు కడుంగడు సొక్కితి వేమి నాయనా!
తెలుపు మనంగ నాతఁ డనుఁ దేరిసచి త్రమ్ము తోడ నమ్మరో
తెలిసియ యుంటి నిద్దురను దేలినవాఁడను గా నొకంతయున్. 59

సీ. వినవమ్మ! చెప్పెదఁ బెనుబాము లెన్నియో
చనుదెంచి ననుఁ జుట్టుకొనియె విడక
వ్రేలాడువానిని నే లాగి వైచియుఁ
గొన్నింటినిం బట్టికొని మొసవితి
దాన నామే నెల్లఁ దాతమేనుం బోలె
బూదితోఁ దెల్లనై పోయె జుట్టు
జడ గట్టికొని పోయె జడనుండి నీళులు
జాలు వాఱఁగఁ జొచ్చె నేల నిండఁ

తే. బాము లరుదెంచి నాతలపాఁగ యయ్యెఁ
గొన్ని కంఠంబునం జుట్టుకొనియెఁ గొన్ని
కంకణము లయ్యె మొలనూళ్ళు గాఁగ నయ్యె
జన్నిదము లయ్యె సంతసోఁ గొన్ని కొన్ని. 60

సీ. వెలియాలపో తొండు వెస వచ్చి నాచుట్టుఁ
దిరిగి తిరిగి యొక్కదరినిఁ బండె
నెవ రెవ్వరో కాని యెంతో శాంతగఁ బాడి
యాడిరి నాచెంత వేడుకమెయి
మఱి శంకు లూఁదుచు మద్దలంబులను వా
యించిరి యులివు మి న్నెల్ల నిండఁ
జప్పుళ్ళకుం జంకి సారంగపోత మొ
క్కఁడు వచ్చి నాయొడి నడఁగి యుండె

తే. మీర లీచెంత నే యుండి భూరిశబ్ద
మెల్ల వినియుంటి రేమొ నే నెల్ల వినుచుఁ
గనుచు సంతోషమునఁ జేసి కన్నుమూసి
యున్నవాఁడను నిద్రింప నోజనిత్రి ! 61

ఆ. అనినఁ దల్లి యనియెఁ దనయ ! నీవు భయంబు
పడఁగ లేదు గదవె వానిఁ జూచి
యనుచుఁ దల్లి నరసి యతఁడు బ్రహ్మానంద
మున నెసంగ భయముఁ బొందు టెట్లు ? 62

సీ. ఎ ద్దేది ? లేడి యే ? దేవి పాములు ? నన్ను
మీ రేటికిం దెచ్చినా రిచటికి
నాఁగ నాశ్చర్య మానందముం బొందుచుఁ
దల్లి ముద్దాడి యాత్తనయు నెత్తు
కొని మంచికల గంటి తనయ ! నీపై మహా
దేవునకుం గలభావ మెల్లఁ
దేట తెల్లం బయ్యె నేటికి శంకింప
నీకు శుభం బగు నోకుమార !

గీ. యనుచు బాలకు నెత్తి కొం చామె మెచ్చె
యంగరక్షలు చేసె నెయ్యావియు చేసె
నపుడు తండ్రియు నాత్మజు నరసి లోన
మిగుల నానందమును జేసి మెలఁగె నంత. ౬౩

వ. సూర్యోదయం బగునంత నతండు కాలకృత్యంబులు నిర్వర్తించి శుభశకునంబు లగుచుండ నిల్లు విడిచి నాగేశ్వరోపాధ్యాయుని కడకుం జని కుమారునివృత్తాంతం బంతయు నెఱింగించి వినాయక సాంప్రవునిం బోలినవాఁడు నాకొమరుండు కుపాధ్యాయులైన మహాత్ముల సాంగపరిచయంబు గావింపుఁ డని ప్రార్థించుచున్నవాఁడ నని చెప్పి మెప్పించి యొక్కశుభముహూర్తంబున నక్షరయుగ్మం బా కుమారునకు నొదవఁ గొనిపోయి యుపనయనంబు గావించిన నతం డతని నంత గైకొని పంచాక్షరి నుపదేశించె నతండును నత్యాదరమ్ము గైకొని జేసి విద్యాభ్యాసంబు గావించుచుండె నప్పుడు. ౬౪

## —॰ గురు లీలలు ॰—

సీ. అచట విద్యలలోన నాటపాటలలోన
దేహబలంబులో ధిషణలోన
నందఱికన్న నత్యధికుఁ డై తా నసా
ధారణధోరణిఁ దనరు చుండె
నాశిష్యులం దమృతానందుఁ డుడుగణం
బునఁ జంద్రుఁ డట్టులు పొసఁగ నపుడు
పిడు గని యేనుఁగు పిల్ల యనియు సింహ
మని యెల్లచట్టులు నతనిఁ బిలుతు
ఆ. రాట లాడి యలసి యటఁ జెట్లక్రిందనే
డలను విశ్రమించి కొలఁకులందు
నీది చల్లులాట లెసఁగించి పొద్దు వ్రా
లిన బయళ్లఁ జెలులఁ గొనుచు మెలఁగు. ౬౫

తరలము. ఇసుకతిన్నెల రిచ్చఁ దీరిచి యెండతేనియు బాలకుల్
వెసవెసం జనుదెంచి వెంబడి విశ్రమించిన వేళలన్

బస గిఱ్ఱియతండు తత్త్వముఁ బల్కు పాటలు పాడుచున్
బొసఁగఁ జేయు వినోదపుఁబల్ గడుఁబ్రొద్దుప్రొద్దును ముద్దుగన్. 66

చ. జనకుఁడు దేవతాస్తుతు లజస్రముఁ జెప్పుచు నొప్పువేళలన్
దనఁ బురాణముల్ వినిచి తత్కథ లెల్లను జెప్పుచుండఁ గా
విని యతఁ డన్నియున్ మదిని వీగని యట్లు గ్రహించి జ్ఞప్తిమై
జనులకుఁ జెప్పు నంతనుఁ దనజ్ఞానము మేటి యటంచు మెచ్చఁగన్. 67

మ. బడి నాతఁడు వ్రాయఁగాఁ జదువఁగా స్వాభావికజ్ఞానపుం
బడి నేర్వం గలఁడై ప్రవీణుఁ డనుచుం బ్రజ్ఞాన్వితుం డంచుఁ బే
ర్పడి గ్రామస్థులతోడ నాటకములం బాల్గొంచుఁ గ్రీడించుచున్
బుధులం దయ్యను చేర్చుఁ జిత్రమున లెప్పున్ వ్రాయుఁ జిత్రింబుగన్.

క. అతనికి రామాయణ భా
రతభాగవతాదికథలు ప్రజ్ఞాబలసం
గతి జ్ఞప్తిం గలవై సం
తతమును శ్రోతలకుఁ బుణ్యదాయకము లగున్. 69

క. ఒకమాఱు విన్న నేదే
నిఁక దానిన్ మఱచి పోవు టెఱుఁగం డాతం
డః లంకబుద్ధిగరిమన్
సకలజగజ్జనులు మెచ్చుసరణిం దనరున్. 70

సీ. తనతోడిబాలుర దనియఁ జేతులు సూచి
భాగ్యాతిశయములు పలుకుచుండు
బడిలోనఁ బోయినవస్తువుల్ తెప్పించు
మంత్రింతు నని బీతు మరఁగఁ జేసి
తల నొప్పి దగ్గును గలుగ వైద్యము సేయు
మిరియాలు తులసియు మెదపి యిచ్చి
మందుకట్నము గాఁగ నెందును బలపముల్
గోళీకాయలు పండ్లుఁ గొన్ని కొన్ని
తే. గొల్లలకు వైద్య మొనరించి కొంత పెరుగు
మీఁగడయుఁ బాలు వెన్నయు మెసవు చుండు

నితరబాలురకోఁ గూడి చతురుఁడతఁడు
పాఠశాలఁ బఠించు నిష్టమ్మునందు. 71

ఉ. పిల్లలతోడఁ గూడుకొని నేర్పున లోకిక తై ర్థగాన బఠిం
జెల్లెడుపాఠముల్ చదవి చెప్పినచొప్పునఁ జేసి క్రీడిసెన్
గొల్లలు గోవు లుండుకిడుపుం జని యొక్కెడఁ గాసుచుంచి తాఁ
బిల్లనగ్రోవి నూఁదుచును శ్రీ మిసె నూచుచుఁ జండు నెల్లగన్. 72

చ. కనుఁగవ మోడ్చి యొక్కెగడ గాలములలో నెనిమో లలంచుచున్
గనుఁగొన జ్ఞానయజ్ఞ నొసర్చితి ఋత్విజులార! మిము భో
జన మిడ నూటి సంచుఁ దనసాదదనుంచిన బ్రహ్మచారులన్
దనసఖు లందఱిం బిలిచి తా నిమచుండు సతెంపు గూర్చికన్. 73

ఆ. తనదుతండ్రి సగి ధనము గ్రహించి స్నేటు
కాగితములుఁ బుస్తకములు కొనియు
లేనిబాలకులకుఁ దా నిడ జక్కటి
కమున దానరూపకమున నతఁడు 74

— ఓనమాలమహత్త్వము —

మ. బడిలోఁ బంతులి వోనమా లనుచుఁ జెప్పం బాలుఁ డొక్కఁ డీ
బడి యేలోకఫల మే మనం గలుగునో వాక్రుచ్చుఁ డీ నాఁగ నా
తఁడు భాషింపమి భూషణం బతని చెంతం జేరఁగాఁ బిల్చి నీ
నుడువం జాలుము రమ్మ నా వెరక నిన్నుగా చేర్తు నంచున్ దయన్.

వ. అప్పు డప్పురంబునం జరుగు తిరునాళ్లకుం గొనిపోయి నిను నీ
కేమి వినవచ్చుచున్నదో చెప్పు మనిన బాలకుం డదుసర్వశబ్దసమ్మేళనం
బున నోంకారంబు విన వచ్చుచున్న దనుటయు భూషణం బా. 76

మ. కనుమా మిత్రమ : సర్వలోకములు నోంకారాంగంబనం జేసు నం
దును దానిఁ మునుమును చెప్పుదురు పంతుల్ సర్వశాస్త్రజ్ఞుల్
దనరుం దాన నటన్న కారణమున దాత్పర్యమం జేసి నీ
మనమందుం గలసంశయం బుతొలఁగం బాతెఁ గదా బాలకా. 77

క. మఱియుఁ బంచాక్షరి యది
పరమేశ్వరు నిచ్చు దానఁ బరఁగు దురితముల్
దొలఁగెడిని దత్త్వభావము
పరికింప నశక్య మెట్టిపండితునకు నేఁ. 78

తే. అనుచు బాలురతోఁ గూడ నవలి కరిగి
కొక్కు నుప్పల్లు గోణిబిళ్ల కూఁతవేఁటు
లాదిగా నగునాటలు నాడుచుండు
నాగభూషణుఁ డప్పు డానంద మొందఁగ. 84

శా. పట్టీల్ దీరిచి రెండుపాయ లగుచుం బా రొక్కండ అం పంచు నా
పట్టీలం దొగి నిల్చి కాచికొనుచోఁ బైవార లేతారకిం
బట్టన్ గా కవి యెల్ల వాఁటి గెలుపుం బాలించు లోకన్న నో
గిట్టే శత్రులబాఱిఁ జిక్కకొనమి న్వీక్షింపసా వాంఛమున్. 85

క. గోణిబిళ్ల గొట్టు మీఁదికి
ఖణిలు ఖణి ల్లనుచు లేచి కడువడిఁ జలిచన్
గణక మఱొక్కఁడు దానిం
గణుతింపఁగఁ బట్ట నరుగు గతు లిట్లు యుగున్. 86

మ. ఒకచో నెల్లరుఁ గూరుచుండ గరిమం బూహించుచున్ భాసురుం
డకలంకాత్ముఁడు దేశికుం డగుచు శిష్యశ్రేయు లి
సకలంబుం జెడు నీశ్వరుం డొకఁడె నిశ్చా చెల్వుఁ బై నిర్భయా
సుకముం గష్టము గూడ నొక్కఁ డగుచుం జూపట్టు నం చెంచుచుండి. 87

క. కలలోఁ గన్న పదార్థము
వలె సర్వము మనకుఁ గాన వచ్చు నశించున్
దెలిసిన వానికి దుఃఖము
తలపోయఁగ లే దటంచుఁ దలపుఁడు మీరల్. 88

వ. అని యనేకవిధంబులఁ దోడిబాలురకు బోధించుచు బోధనాపర కాలంబుల మఱియుం బంతులు చెడుగుడులు కొనక్కులు కోఁతి కొమ్మచ్చులు లోనగు నాటలాడుచుఁ బాటలు పాడుచు నం దం దుఁ బ్రావీణ్యముఁ గలవాఁడై వారిలో నగ్రగణ్యుం డయ్యె మఱియు దండపట్టు కఱ్ఱసాము కత్తిసాము మొదలగు మల్లవిద్యలయందును విల్లమ్ములు ధరించి లక్ష్యమ్ము నేయుటయందును నేగఘ్నం గుఱి చేయుటయందును నిపుణుండై యుండె ని ట్లున్న వానిచుండుదుమను దనముం గని విని యుపాధ్యాయు లేమియు నన కూరకుండి రిట్లు

భూషణుండు విద్యాభ్యాస మొనర్చుచు నెల్లవారలకు నానందం బాపాదించుచుండె నని మఱియును. 89

## — విద్యాభ్యాసము —

మ. బున నాలుగేండ్లు మొదలం బాఁ దండ్రియొద్దం బ్రియ
మ్మెస్స శిష్యుం గ్రహియించె దండ్రియు నుపాధ్యాయుండు విద్యాలయ
మ్ము గూడూరను పల్లెపల్లి మొదలై యొల్లెందు గ్రామంబులన్
ఘనుఁడై పేరు గడించెఁ గౌశలమునన్ గాంభీర్యధైర్యంబులన్. 90

గీ. తండ్రియొద్దను గూర్చుండి తనయుఁ డపుడు
జ్యోతిషగ్రంథములలోని రీతులెల్ల
నాలకించి జ్యోతిష్కుఁడై నారువుమీఁదె
నాగభూషణుఁ డానాఁడె నయము గూడ. 91

వ. మఱియు నతండు మూఁడేండ్లు బందరులోని హిందూపాఠశాల యందును నోబిలుకళాశాలయందును విద్యార్థుల కెల్ల శిరోభూషణమై విద్యాభ్యాసం బొనర్చుచు నాగేశ్వరసమారాధనమ్ము గావించుచుండ నతం డతనిఁ గరుణావలోకన సందర్శన సంభాషణ స్పర్శనాదులం దనుపుచు శిష్యునకుఁ దత్త్వోపదేశంబు చేయుచుండె శిష్యుండును గురునాథుని సంకేతంబు లెల్లఁ దెల్లంబుగా గ్రహించుచుండె నిట్లు కృష్ణభూషణుఁడు కృష్ణలీలలం దేలుచుఁ బ్రాథమిక విద్యాభ్యాసంబు విలాసంబునం జేసి కావించుచుండె నప్పుడు. 92

మత్త. తోడిబాలురఁ గూడి వేడుకతోడ దేశికునింటికిన్
నాఁడు నాఁడును బోయి వచ్చెడునాఁ డొకప్పుడు దారిలోఁ
గూడి భాష్యము చెప్పుచుండఁగ గొప్పపండితుఁ డొక్కరుం
డాడకుం జని నిల్చియుండె సహాయయుక్తిఁ డతం డటన్. 93

వ. అప్పుడు భాష్యశ్రోత్రియ లాబాలకుల నిట మీ కేమి పని పొం డని పోఁ దోలిన భూషణుండు పోవక యట నాసక్తి నున్న నెఱింగి బోధకుం డతనిం గూరుచుండఁ జెప్పిన నతం డట నొక్కచో విశ్రమించె నంతలోన. 94

సీ. ఆనూత్రముల కాది యగు "నథాతో బ్రహ్మ
జిజ్ఞాస" యనుదానిఁ బ్రజ్ఞమీఱఁ
జర్చించుచును గురుస్వామి సాధనచతు
ష్టయ మది కుదిరినపయి నటంచు
నాడిన శ్రోత్ర లయ్యాది కుదురుట యెట్లు
కుదిరినపయి నేటి కది యటంచు
ననుటయు విని యమృతానందుఁ డేఁ జెప్ప
వచ్చునా నాబుద్ధి వచ్చినట్లు
తే. అనుచు నిర్వాణపడి యెల్ల రరయుచుండ
నొజ్జ లితఁ డేమి చెప్పెడినో వినుండు
వాణి వీనిముఖమున నేపగిది నగునో
వినఁ దగు నటంచు నాతనిఁ గని వచించె. 95

తే. బాలకా! బాలునుండి సుభాషితమ్ము
వినఁగఁ దగు నని శాస్త్రముల్ వినుచుఁ గాన
నీముఖమునుండి వాణి యే మేమి యనునొ
విందుము వచింపు మనుటయు విని యతండు. 96

తే. అథ యనం బప్పు తిన్నపై నది నసనకుఁ
జప్పగా నుండినంతట ను ప్పరయుట
బ్రహ్మజిజ్ఞాస యని నాదుస్వాంతమందుఁ
దెలియ వచ్చెను నన గురువలరి మఱియు. 97

తే. వత్స! నీహృదయము నా కవగత మయ్యె
నెల్లరకుఁ దేటతెల్లఁ గా నెఱుఁగఁ జెప్పు
మనుఁడు నతఁడు ప్రపంచము ననుభవించి
వెనుక నందు సారము లేద యని గ్రహించి. 98

వ. జనుండు బ్రహ్మజ్ఞానం బలవఱచుకొనం గోరుచుండం బనునర్థం బనిన సద్గురుప్రభృతు లెల్లరుఁ బరమానందభరితులై యితండు జగద్గురు వయ్యెడు నని ప్రశంసించి యతనికిఁ గదళీఖర్జూరనారికేళఫలాదు లొసంగి యంపివుచ్చి భావ్యకాలక్షేపంబు గావించువారై.

క. పప్పుప్పులతో గ్రంథం
బప్పుడు సాగించునట్టి రై గృహములకున్
ముప్పిడి గొన సమ్మోదము
చెప్పుకొనుచుఁ బోయి రిచ్చఁ జేయుచుఁ బాలుర్. 100

వ. భూషణస్వామియు సహాధ్యాయసహితుండై పాఠశాలకుం జని విద్యాభ్యాసంబు సేయుచు గురుసన్నిధిం జేరి సేవించుచుఁ దల్లిదండ్రుల నరసి గారవించుచు నింటియొద్దఁ దోఁబుట్టువులు చేసికొను బొమ్మలపెండ్లిండ్లకుం దోడుపడుచుఁ గంటఁ బడిన యెల్ల గ్రంథంబులు చదువుచుండె నంత గర్భాష్టమాబ్దంబున వేంకటరత్నపండితుఁడు. 101

—• ఉపనయన సంస్కారాదులు •—

మ. ద్విజునిం జేయఁగ నెంచి పుత్త్రుని జగద్విఖ్యాతవిద్యామహ
త్వజితాంగీరసునిం బురోహితునిఁ బిల్వం బంచి వాచించి త
త్సుజనోత్కృష్టమలగ్నమందు నిజబంధువ్రాతమున్ గూడి రా
నజినాషాఢము లిచ్చి పుత్త్రునకుఁ జేయం గల్గె వ ద్గత్తతిన్. 102

క. ఉపనీతుఁ డైన బాలుం
డుపమింపఁగ రుద్రరూప మొందెను నని తె
ల్పు పగిదినిఁ బంచశిఖలన్
సుపరిష్కృతిఁ జేసి రవుడు సురుచిరగతులన్. 103

ఆ. ముంజరశనఁ జుట్టి మొలకుఁ బచ్చనిగోచి
పెట్టి లేడితోలు గట్టి బ్రహ్మ
సూత్రి మఱుత వైచి శుభవేళ బ్రహ్మోప
దేశ మాచరించె దేశికుండు. 104

తే. అజినము ధరించి యాషాఢ మంది మున్న
జననికడ కేగి ప్రవరముఁ జదివి వెనుక
"భవతి భిక్షాం ప్రదేహి" యన్ పలుకు పలికి
మాతృభిక్షను గైకొనె మాణవకుఁడు. 105

వ. ఇట్లు యథావిధివిధానంబున నుపనయనసంస్కారం బైన పదంపడి

కృష్ణ భూమణుండు ప్రత్యహంబును సంధ్య వార్చుచు సూర్యు
నుపాసించుచు నగ్నికార్యంబు దీర్చుచుఁ బ్రవర్తించు చుండె
నక్కాలంబున. 106

—॰ దేశకాల పరిస్థితులు ॰—

సీ. ప్రాగర్ధగోళ ప్రపంచ మంతయు నూత్న
మగు వికారంబుల నందుచుండఁ
బ్రబలసధర్మము లెల్లఁ బరిహాసపాత్రము
లై పోయెఁ గ్రొత్తవే యేపు సూపె
శ్రోత్రియు లగువారిసూను లందఱు స్వీయ
ములగువిద్యలు వీడి పొలుపు లేక
యింగ్లీషుబడులందు నిచ్చఁ బ్రవేశించి
ఏ.బీ.సి.డీ.ల గ్రహించుకొనుచు
తే. మిషనరీ బోధనముల మిసిమి నెడఁద
విడిచి నిజమతలక్ష్యము పెరమతమున
బుద్ధి నెలకొల్పి భ్రష్టులై పోవుచుండి
రెం.యె.బీ.యె పరీక్షల కిష్టపడుచు. 107

సీ. బాలికల్ బాలకుల్ పాఠశాలలయందుఁ
గలసి చదువుచుండ్రు కానివిద్యఁ
గైస్త్రవుల్ స్వమత మక్కడఁ జెప్పుచుండ్రు వ
ర్ణాశ్రమాచారము లడుగునఁ బడి
బ్రహ్మసమాజముల్ ప్రార్థనాసంఘముల్
సంఘసంస్కారముల్ జగతిఁ బ్రబలె
విధవావివాహముల్ విస్తరిల్లెం గులాం
తరవివాహములును జరుగుచుండె
తే. మఱియు నెన్నోసమాజముల్ మహిని వెలసె
నార్యమతధర్మము లవెల్ల నడఁగఁ జొచ్చె
భాష యంతయు మఱియొక్కపక్కి నమ్యో
న్యాత్మసాహిత్య మవనియందుం దలిర్చె. 108

మత్త. వేదశాస్త్రము లన్నవారల వెక్కిరించుటె కాదు త
ద్వేదపారగు లన్నఁ జేయని తిట్టి కొట్టి బహిష్కృతిం
గాదు నాశ మొనర్చుచుందురు కార్యశీలురు దన్ననో
వాదులాడి తృణంబుగాఁ గని పట్టి శ్రోత్రియు రట్టి చేన్. 109

ఉ. బాపఁడు పుట్టు నా కపుడు బాలకు లెల్లరు స్వీయధర్మముల్
దోఁపిడిఁ జేసి హూణకలితోఁ దులఁదూఁగుచు నన్యధర్మచ
ర్యాపరులై ఋషిప్రవరనామములుం దమ నామరాత్ములై
పాపము పుణ్యమం చనక వర్తిలుచుందురు దుష్టవర్తనన్. 110

ఉ. జందెము తీసివేయుటకు జంకనివారలు దండ్రిశ్రాద్ధమే
మం దొకజన్మ గట్టునకు సర్చ్వయే మని దూఱువారు నీ
యందఱు నొక్కదేవునకు నై రొకరుండుగ రాక యుండు నా
మందమతుల్ వచింతు రని మాలల పంచను వారలై రటన్. 111

చ. మగఁడు మృతింప మాంగళికసూత్రము గట్టుకొనంగ రా
మగఁ డనుమానుఁడైన విడి మార్గమునన్ గొనుచుండు రుత్తమం
బగు తమవంశధర్మ మెడయంగ రజస్వల లైన వెన్కనే
మగువలు పెండ్లియాడుటలు మానని సయ్యెడు శాసనంబులున్ 112

తే. ఉత్తమబ్రాహ్మణుం డయ్యు నూడిగమ్ము
నాచరింప వేదము సన్న సుకృతొసఁగఁ
గన్నియల నమ్మి శుల్కముఁ గైకొనంగ
నుండు వరశుల్కమును వృద్ధి నొందుచుండు. 113

మ. కలవారై కులధర్మకార్యములు దెసఁ గైకొక మార్పెండ్లికిం
గులటాసంగతికిన్ గువాదములకుం గ్రూరస్వభావాళికిం
గులధర్మచ్యుతికిన్ గుసీదగతికిం గోట్లిత్తు రస్పృశ్యులం
గలయం బోయినవారి గౌరవములుం గాంచింత్రు కాలోద్ధతిన్ 114

సీ. కలిమహిమం గ్రమక్రమముగాఁ బెద్దల
యందు వేదంబులయందు శాస్త్ర
ములయందు మఱి వేలుపులయం దవిశ్వాస
మవిధేయతయు హెచ్చె భువిజనులకు

స్వార్థపరత లోన నభివృద్ధి నొందెను
దల్లిదండ్రులయందుఁ దగ్గె భక్తి
గురువుల ధిక్కరింతురు శిష్యు లధిపతి
నలఁతి గాఁ జూచెను నవనిజనుఁడు

ఆ. మగనిమాట వినదు మగువ చీఁకటితప్పు
పరిగణింపఁ బోదు పాపభయము
మాటవరుస కైనఁ బాటింపఁ బో రెరుఁ
బుణ్య మన్న నవ్వి పోవుచుండ్రు 115

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ ద్విజులను
వీడిన నితరుల వీడ కుండు
వేరికి వేదాధికారము లే దని
దుర్వాదములు ధరఁ దోఁచుచుండు
మ్లేచ్ఛవిద్యాప్రీతి మెయి నెల్లరు స్వధర్మ
దూరులై పోయిరి దూరుల కయి
జన్నిదంబులు దాల్చి సద్బ్రాహ్మణులము మే
మని శూద్రు లుద్రిక్తు లగుచునుండ్రు

తే. విద్య లన్నియుఁ గృత్రిమవిధుల నొందె
వేదశాస్త్రార్థముల నమ్మి విజ్ఞు లయిన
నడుప కుండిరి సత్క్రియల్ నమ్మి చేయు
రెవ్వరును గాని కలికాల మిట్టు లగుట. 116

వ. ఇట్లుండ నక్కాలంబున నాగభూషణుండు పాఠశాలం జేరి చదువుచు నుండె నని మన మెఱుంగుదు మట్టిచో నతం డాపాఠశాలం దోడి బాలురం గూడి ప్రాచీనంబు లగు చదువులు నాటలు పాటలు నభ్యసించుచు సెలవు దినమ్ములందు నాగేశ్వరుని సన్నిధి కేగుచుండు నా నాగేశ్వరుండును. 117

—•నాగేశ్వరగురు పరిభావము•—

సీ. లోకులనడవళ్లలో మెలంగం బోఁడు
పరుల కాతనిజాడ బయలుపడదు

రాజపీఠములకు రచ్చలకుఁ సభా
స్థలముల కెప్పుడుఁ జనఁగఁ బోఁడు
తండ్రి చేసెడియుపాధ్యాయపదవి తన్ను
సంక్రమించుటఁ గళాశాల కరుగఁ
బిల్లలలోఁ దాను బిల్లవానివలెను
బెద్దలలోఁ దాను బెద్దవలెను
తే. మెలఁగుచుండుఁ జమత్కారకలితముగను
మాట లాడుచు నుండు నేనాఁటఁ గాని
తనప్రభావముఁ బరమార్థతత్త్వ మెపుడు
బయలుపడనీఁడు వేరికి బ్రహ్మవేత్త. 118

శా. ఉద్యోగోచితవేషముం గొని యతం డొప్పారుచున్ బాఠశా
లోద్యన్మానికి రాగిచెంబుగరమం దొప్పంగ రా బాలకుల్
హృద్యచ్చిత్తముతో గురుప్రవర ! మీ కీరాగిచెం బేటికో
విద్యాదానము సేయునో యనఁగ నా విద్వద్వరేణ్యుం డనున్. 119

క. ఈయుద్యోగము శాశ్వత
మా యెప్పుడు వోవు నపుడ యట నీనీళ్ళం
బోయుచు దాముం దలఁచిన
నేయిన్నియొ దోఁ జకు నిందు నిడుకొన వచ్చున్. 120

వ. అని చెప్పి యవ్వారి నవ్వించుచుండు మఱియును. 121

సీ. నాగేశగురునకు నాగభూషణుఁ డొక్క
రుఁడె శిష్యుఁడును గింకరుఁడు సఖుండు
వారివృత్తాంతము వారికే తెలియు ని
తరులకుఁ దెలియ దింతయును గాని
యొకనాఁడు గురుఁడు శిష్యులకు భారవ్యాదు
లును భాష్యములు సెప్పుకొనుచు నుండ
నన్నిచోటుల క్షమ్రుతానందుఁ డరిగి య
య్యాపాఠముల్ విను నట్టిఁ డయ్యొ

తే. నెల్లపాతములును విను నీతఁ డెన్న
రనుచు నొక్కరుం డడిగిన విని గురుండు
పలుక నుండినలోపలఁ బలికెఁ గృష్ణ
భూషణుఁడు వానిదిక్కున మోము నెట్టి 122

క. గురువరునినోట వచ్చిన
వరవాక్యము లెల్ల నమృతపరికల్పితముల్
పరికింప నటఁడౌ శిష్యుఁ డని
గురుభక్తిం జేసి వినఁగఁ గోరుదు రెల్లన్. 123

సీ. భాగవతము గురువరుఁడు చెప్పుచు నుండు
నన్నిచోటులను గాంచి యొత్తి మంత్రి
మంత్రార్థము తెలుంగుమాటల బోధించుచు న
శ్రోత లానందించురీతిఁ బలుకుఁ
బఠనమాత్రమె కాదు భాగవతము విని
మననము చేయుచు ననుభవింపఁ
దగినది యనుచుండు నటులె నాగభూషణుం
డరుదెంచె గురువరుం డాసి యాని

తే. శ్రోత్రలం గాంచి యిట్లను నేతదర్థ
మంతయును నాగభూషణ స్వాక్షితార్థ
మని వచించుచు నెల్లరు నరయుచుండ
నతని నెంతయు నగ్గురుఁ డాదరించె 124

—• గురువు శిష్యు నగ్గించుట •—

సీ. నాగేశ్వరుం డొక్కనాఁ డిట బ్రహ్మసూ
త్రప్రవచన మొనర్పంగ నటుచుఁ
జనుదెంచి నాగభూషణుఁ డొక్కపలు కాడి
వెడలిపోవుటయు నక్కడ నెసంగు
వారలు భాష్యప్రవచన మగుచునుండ
నేగె మీశిష్యుఁ డీ దేమి యనుచు
గురుఁ డను నతని కీగొడవ యేమిటి కొక్క
పరి నెట్టిగ్రంథము నరసె నేని

తే. ఆత్మవిజ్ఞానమున కది యనువు పడఁగ
నుంట యనురీతి సరిచేసి కొంటకె యగుఁ
గాని యాశేఁడు తెలిసికో నైన దింత
యే  లే దని చెప్పెదు నేను మీకు. 125

ఉ. ఉర్వి మహానుభావులును యోగులు నాఁబడువారు మర్త్యులై
గర్వులు గాక సంస్కృతినిఁ గల్గినవారును బోలెఁ గాననై
సర్వసమత్వముం గలిగి సంతతము న్నడయాడు చుండ్రి త
న్నిర్వహణం బెఱింగికొన నేరరు ప్రాకృతు లెవ్వ రేనియున్. 126

సీ. ప్రాజ్ఞు లప్రాజ్ఞులపగిది నైదాల్పులై
ప్రాకృతులం బోలి పల్కుచుండ్రి
పదుగురిచేఁ బేరు వడసినమాత్ర నం
తర్కజ్ఞుల్ కా రని తలఁప వలయుఁ
బులులు సింగంబులు వలె గుహాలందు నే
కాంతవాసము చేయుదాంతులందు
వీర్యవంతులు గాఁగ వెలయుదు రద్వైత
మును బ్రతిష్ఠించినఘనుఁడు లోక

తే. గురుఁడు శంకరాచార్యుఁడు గోఁచిపాఁత
రాయుఁడై ఘనకార్యముల్ సేయఁ గలిగె
నాజగద్గురునకు గురు వైనయతియు
శక్తిసామర్థ్యములు గలస్వామి కాఁడె. 127

తే. పెద్ద లగునారు తమతమపేర్మి పెంపు
నకుఁ దగుప్రయోజనంబు లొనర్చ పొంటె
నవతరించి ప్రవర్తింతు రపల నివల
నితరులం బోలి సభ లెక్క నేగ రెపుడు. 128

తే. అధికసత్త్వజ్ఞనసర్వ్య లగుచు బ్రహ్మ
విద్యఁ గాపాడు చేకాంతవిధులయందుఁ
దత్త్వవేత్తలలో నమృతస్వరూపుఁ
డైనభూషణుఁ డగ్రగణ్యతను గాంచు. 129

తే. ఘనులు వారు స్వయంవ్యక్తిఁ గలుగుకతన
స్థలము కులమును బంధులన్ దలఁపఁ బోక
సత్త్వసంపన్నులై గూఢసంచరణము
సలుపుచుందురు భక్తిమై జ్ఞానులగుచు. 130

తే. తెలిసి సేవించుకేరికోఁ దెలియ వచ్చి
తత్త్వ మెఱిఁగించి బ్రహ్మవిద్యాప్రసంగ
సంప్రదాయము నిలుపంగ సంచరించు
వారిలోపల భూషణస్వామి యొకఁడు. 131

వ. ఇట్లు చెప్పి స్వప్రియశిష్యు నెంతయు నగ్గించె నంత. 132

—• దుష్టదుర్బోధము •—

సీ. గురుశిష్యు లిట్టుండగం గొంత ప్రాణత్రా
యులు సహింపంగ లేక యొకని వెనుక
నొకరుండు గా గురునొద్దకుం జనుదెంచి
యవియు నివియుఁ జెప్పి యంతలోన
నాల్క యాడినయట్లు నా భూషణునిపై
కొండెముల్ చెప్పను గురుఁడు వాని
బెడచెవి నిడుచుండె వెడఁగులు కొందఱు
గురుపత్నికడ కేగి క్రూరులగుచు
తే. గురుఁ డమాయకుఁ డోతల్లి! కొంచెమేని
యెద నరయఁ డోరు మామాట లేవగింత్రు
కృష్ణభూషణు మన్నింత్రు కేవల మతఁ
డజముఖవ్యాఘ్రమే మందు మక్కటకట. 133

ఆ. వినయ మభినయించు విజ్ఞాని యట్టులు
పలుకుచుండు గురులపరిసరమున
విశ్వసింప రాదు వీని నోజననయిత్రి!
పాపశంక లేనిపశువు వాఁడు. 134

చ. నిరతము మాకుఁ గ్రూరుఁడయి నెంజిలి గూర్చుచు నుండు దయో
గురునిఁ బ్రయోగమూలమునఁ గూల్పఁగ నెంచియుఁ దత్ప్రయత్నముల్

పరిపరిరీతులఁ దలఁపువాఁ డగుచుండెను మచ్చ్యుఁ దక్రమి
వ్వరు నొకకాలిగోఁచిమునిఁ దాఁ గొనివచ్చెనఁ కేమి చెప్పఁగన్.

మ. అని యెన్నో పచరించి చెప్పిన దృఢస్వాంతంబు లేనట్టి దై
వనటం బొందియుఁ గుంది డించి విధునిన్ భావించి దుఃఖించుచున్
గనుదోయిన్ నాలిబెచ్చునీరు లురులన్ గంపించుచున్ దైన్య మా
ననమందుం దోలుకాడఁ దొట్రువడుచున్ వాక్రుచ్చె బిట్టోర్చుచున్.

మ. ననుకుం బ్రాణపదంబుగా మెలఁగు చన్మద్వాత్సల్యముల్ వించు మి
మ్మును నన్నుం దనదైవతమ్ములుగ సమ్మోదమ్మునం జూచుచుం
జనుశిష్యుం డగునాగభూషణుఁడు దుష్టత్వంబునం బొల్చునం
చును మిమ్మున్ వధియించు నంచు వినవచ్చెన్ నాథ ప్రాణేశ్వరా.

క. ఏనాఁటి కెట్లు వచ్చునొ
యీనాఁడే వాని విడువ వ్యాసంగము సేయం
గా నొప్పు ననుచు వేఁడెద
మానసమునఁ గలుగుభీతి మఱిమఱిఁ గలఁపన్. 138

వ. అనిన నాగేశ్వరుండు ప్రాణేశ్వరిం గాంచి కాంతా! నాకంతకన్నఁ
గావలసినభాగ్య మేమి యుండెడి నాకర్ణింపుము. 139

శా. కాశిం జచ్చినఁ బుణ్య మబ్బెడిని బో కాకున్న వోఁ బుత్రిన
భ్యాశంబున్ వచియింతు విత్తమును గా నాతండు పుత్త్రప్రతీ
కాశుం డాతనిచేతఁ జచ్చుటలు లోకఖ్యాత పుణ్యంబు నా
కో శాస్త్రంబునఁ జేసి ఘట్టిసుకృతం బబ్బం గదా ధన్యుఁడన్. 140

క. అని యెన్నోవిధముల నా
యన వినిపింపఁగ నామె స్వాంతమునందున్
వనటం దక్కియు శాంతిం
గాని శిష్యునిఁ బ్రేముడించెఁ గొంచని మదిలోన్. 141

— కోరాడ రామచంద్రశాస్త్రిగారు. —

సీ. గురుశిష్యు లిట్లు మక్కువ మీఱ నన్యోన్య
విశ్వాసమున నుండి విజ్ఞులకును
సుఖదాయకులు నవిజ్ఞులకును నసుఖదా
యకు లయి సమయములందుఁ బొందు

పడి సమావేశసంభాషణంబులు సల్పు
కొనుచుందురి వారల కొసరియుండు
వాత్సల్య మన్నదో వర్ణనాతీతము
తండ్రియుం బిడ్డ నాఁ బెనఁగి యర్థి

తే. వినుఁడు నాగేశ్వరగురుండు జనకుఁడైన
రామచంద్రశాస్త్రివరేణ్యుఁ డీమహీ సగు
పురుషరూపసరస్వతి బుధనుతుండు
సర్వశాస్త్రవిద్వర్యుఁడు సాధుమూర్తి. 142

శా. విద్వాంసుం డగు రామచంద్రవిబుధోర్వీదేవశాస్త్రీంద్రుఁ డీ
హృద్వీథిన్ మెలఁగున్ నిఘంటువు ల వెన్నో పుట్టె నయ్యన్నియున్
విద్వాంసుం డను పేరు నటం చెవఁడు గాని సల్పె నెవ్వనిన్
య్యద్వైతాత్మునిచెంత వాకొన సనాథ్యంబు నమ్మహాభాగునిన్. 143

తే. అతఁడు నోబిల్ కళాశాలయందుఁ బండి
తాగ్రగణ్యుఁడై సంస్కృతమందు సూటి
కెక్కువగ గ్రంథములు రచియించి మించె
నమ్మహామహు వర్ణింప నలవి యగునె. 144

తే. ఘనుఁడు శ్రీపాదుకాంత దీక్షాపరుండు
ప్రథిత మల్లాది వంశపావనుఁడు విబుధ
రాజవందితుఁ డచ్యుతరామశాస్త్రి
వరుఁడు గురుఁడు నాగేశ్వరపండితునకు. 145

క. అతనికి గురువై విద్వ
న్నుతుఁడై కవిరాజరాజి నూత్నవరాలం
కృతియై భూసురమణియై
క్షితి నెన్నం బడియె శిష్టకృష్ణుం డరయన్. 146

సీ. శాస్త్రషట్కమునందు సాటి లేనిమహాప్ర
తిభ షణ్ముఖుం డని తెలియ నయ్యె
నుభయభాషాకవిత్వోచితపద్ధతి
నొకటఁ దేరినదాసు నొంచి మించె

వేణువీణాగాన విద్యావిశేషము
నందుఁ దుంబురునకు సయ్యో నవతు
పరిజ్ఞాపరిభావసంపత్తిమైఁ దిరిదివేశ
గురునకు నుద్దియై గరిమఁ గాంచె

తే. అతఁడు నానైకవినుతవిద్యావిశేష
భూషితుఁడు సర్వకామదాముఖ్యకావ్య
రత్ననిర్మాణనిపుణతాప్రథితవిమల
కీర్తి పరమూర్తి శ్రీశిష్టుకృష్ణమూర్తి. 147

ఆ. అతఁడు గురువు గాఁగ నభ్యసించెఁ విద్య
రామచంద్రశాస్త్రి భూమి నట్టి
గురుసుసంపదాశ్రయపరికీర్తితుఁడు గుణ
భూషణుండు కృష్ణభూషణుండు. 148

—• వి ద్యా ప రీ క్ష లు •—

చ. ఇతఁడు ప్రవేశనామక పరీక్షఁ గృతార్థతఁ గాంచి పూర్వసం
చితముననో యనం బ్రకృతచిహ్నితశాస్త్రములందు న్యాయశా
స్త్రరతులఁ దా బి.యే.లకును జాలినజ్ఞానము గల్గి ఫ్రెంచి గ్రీ
కతులితరీతులం దెలిసి నట్టిఁడయై విలసిల్లె నల్లఁన్. 149

తే. గురుకటాక్ష ముపాసనాభరముకలిమి
సర్వతంత్రస్వతంత్రుఁడై సంస్కృతమునఁ
బండిత సదస్సులం దతిప్రజ్ఞ నైను
పన్యసించుచు విజయంబు వడసె నతఁడు. 150

తే. నాలుగవఫారమది మొదల్ నాగభూష
ణునకు నాగేశ్వరునితోడ ఘనతర మగు
పరిచితి లభింప శుశ్రూష పరఁగఁ జేసి
భాష్యపాఠము గావించి ప్రజ్ఞ మించె. 151

చ. అరయఁగ భాష్యపాఠము సమాంతృతి పీడిసఁ గాని తేటగా
తెలుఁగఁగ రా దటంచు గురు చెప్పెడో చెప్పినదాన భూషణుం
డరమర లేక బోలె గొన నై యట మాధుకరంబు సేయుచున్
గురునిలు సేర వచ్చినఁ గనుంగొని యాతఁడు వాని కిట్లనున్. 152

శ్రీరస్తు.

# అమృతానందము



## తృతీయాశ్వాసము

మీఱు విజయవాటీ
భూమిన్ వేంచేసి కృష్ణభూషణయోగి
స్వామిం గూడి తలిర్తువు
ప్రేమన్ మంగాసనాథ! వేంకటనాథా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు విద్వాంసుం
డైనకృష్ణభూషణుండు 2

సీ. పదునెన్మిదేండ్లప్రాయంబునం జిల్లా
మునసబుకోర్టునం బొనరునట్లు
పని చేసి కొన్నాళ్ళు పదపడి డిప్యూటి
కలెక్టర్ శ్రీనివాసులసమక్ష
మందు ఘనోద్యోగి యై యుండి తనపని
దినదిన మింతలోఁ దీర్చివైచి
కడమ కాలం బెల్లఁ బడసి విశ్రాంతిని
జదువును సద్గ్రంథసముదయంబు

తే. ఎట్టియధికారి నేనియు నింతమాత్ర
సరకుగొన కుండుఁ దనచిత్తసరణి కింత
వికృతి దోఁచినఁ దనపని విడిచివేయ
సిద్ధముగ నుండు నతఁడు రాజీ నొసంగి. 3

వ. ఆ సమయంబున. 4

—వివాహప్రయత్నము—

సీ. మేలిమి జాలువా మిసిమిమేన్గలవాఁడు
పదునెన్మిదేండ్ల వయసువాఁడు

సకల శాస్త్రజ్ఞాన సదనముల హృదయుండు
యాయజూకాన్వయ శ్రీయుతుండు
ముక్కారునుం బండు భూములు గలవాఁడు
తల్లిదండ్రులపోషుఁ డగుచువాఁడు
నున్నతోద్యోగి యై యుచ్చస్థితిం గన్న
వాఁడు సద్గుణముల వలలువాఁడు

తే. పదుగురుగలాఁడు పసి పాడి పంటలు గల
వాఁడు కృష్ణభూషణనామధరుఁడు పరఁగు
యౌచితోత్తమసమయ సమున్నతుండు
బందరుపురాధివాసి సద్బ్రాహ్మణుండు. 5

ఉ. కన్నెలఁ గన్నతండ్రు లొకకాలమునాఁటికిఁ గృష్ణభూషణా
ఖ్యున్నతి నాలకించి తమపుత్రికలం గయిసేసి వానికి
న్నెన్నొ ప్రయత్నముల్ సలిపి యొందఁడనో యట కంపి పుచ్చియున్
సన్నుతరీతులన్ మను వెసంగఁగఁ జేసి కొనం దలంచుమన్. 6

చ. ధనములు ధాన్యముల్ మణులు గాంచనఖండములున్ విభూషలున్
ఘనతరవస్తుసంతతులు కానుకలు వెట్టి మదీయకన్యకన్
గొనకొని తెచ్చి యిత్తు మిదిగో భవదాత్మజు నాలుఁ గాఁ గొనన్
మన మొనరింపు మండ్రి గరిమంబున దానికి రత్నపండితున్. 7

వ. అట్టిపట్టున రత్నపండితుండు వారిం గాంచి. 8

మ. అరయంగా వరశుల్కముల్ మఱియుఁ గన్యాశుల్కముల్ దోషసం
భరితంబుల్ ధనవాంఛఁ గన్యకల నమ్మం గల్గెడిన్ దోష మా
వరులం దట్టిది లేదటంచు ధనికుల్ వర్ణింత్రు వా పండియున్
వరులం జూపి ధనంబుఁ గై కొనుట పాపం బెంచనం బోదొకో.

ఆ. తాను నిస్వుఁ డౌటఁ దనసంసృతిం దీర్పఁ
జాలమిని మఱొండుజాడ లేక
కన్నతండ్రి కూఁతు నెన్ని యమ్మం దాన
నలఁతి యగును దోష మరసి కొనఁగ 10

మ. కలవాఁడై కుల ముద్ధరించుకొనుచున్ గద్యాణముల్ గల్గి కో
టులు మేటుల్ ధనముం గుశీదమునకున్ డొల్లించుచు న్మేటులై

కులకన్యం గొనుఁ డన్నఁ గట్నమనుచున్ గొండాడి కైకొంచు సొ
మ్ములు పాపాంబుధిఁ గూలిపోదు రకటా పోలింపఁ బో రింతయున్.

వ. అని వరశుల్కంబు నిరసించి యుత్తమకులకన్యారత్నంబు నరసి
తెచ్చి కుమారునకుం బెండ్లి సేయం దలంచి యున్నంత. 12

క. ఆకాలంబున దవితా
లూకాకుం జెంది సకలలోకసుతం బై
వాకొన నగుచోడవరా
ఖ్యాకం బగుగ్రామ మచటఁ గల రొజ్జలవార్. 13

క. వారలలోనన్ లక్ష్మీ
నారాయణశాస్త్రి మిగుల నయవిద్వరుఁడై
పేరందె నతనికిన్ సీ
తారామమ కూఁతు రగుచు ధర జన్మించెన్. 14

క. తలిదండ్రులకున్ బ్రజలకుఁ
గళ లొలు నల్లారుముద్దు గా నలరెడు నా
యెలనాఁగ శుక్లపక్షపు
నెల నా నభివృద్ధి గాంచె నెఱి నానాఁటన్. 15

తే. కొడుకు లనుచును మఱిఁ దమకూఁతు లనుచు
జాళువాబొమ్మలకుఁ బెండ్లి సలిపి తోడి
చెలులు వియ్యపురాం డ్రని చెలిమిఁ బిలుచు
కొనుచు నెప్పుడు గుజ్జనఁగూళ్లఁ బెట్టు. 16

తే. గుజ్జు గుడుం గుంచములు చిళ్లకుందనగిరి
కాళ్లగజ్జెలు చిపచిప్పగోళ్ళు వాన
లప్పు చెఱుచెక్క వెన్నెలకుప్పలు మొద
లైనమేలాట లాడెడు నపుడు బాల. 17

క. ఈరీతిని బాల్యంబునఁ
గోరిక లిగు రొత్త మనుజకోటికి ముద్దా
కూరిమికూఁతుం గళల వి
శారదఁ జేయించెఁ దండ్రి శాస్త్రజ్ఞులచేన్. 18

చ. గరితలు చుట్టువాఱుకొనఁ గాఁ గొని కేలఁ బురాణ మొసఁగు నీ
శ్వరుని గణేశునిం బలుకుచానను వేఁడి యనంతరంబు భూ
సురముఖవర్ణధర్మములు సూర్యముఖామరసర్గముల్ జగ
త్సరణియు సజ్జనాళిచరితంబుఁ బఠించి వచించు నెప్పుడున్. 19

తే. జానుగుల శ్రీల్ పిఱుందుల డా నడుమున
ఫా నుదుటఁ గ్రిర పొక్కిటిలోనఁ బొట్టు
ఘ్రాణమున నొత్తు కేల దీర్ఘములు దోఁచ
రమణి బుధు లెంతు రక్షరబ్రహ్మ మనుచు. 20

వ. ఇట్లు పిల్లవారికి నల్లారుముద్దుగా నెసంగు నాసీతారామమ్మ దయా సత్యనిరతయు గురుజనభక్తిభరితయు నై యతిథుల నాదరించుచు దిక్కుమాలినవారి కొక్కలాగున వసతిఁ గల్పించి పోషించుచు నీప్రపంచంబునకుఁ బరమేశ్వరుం డొక్కరుండె దైవంబనియు రక్షకుం డనియుఁ దలంచుచు సకలజనసంస్తవనీయచరిత్రయై ప్రవర్తిల్లుచుండె నా సమయంబున. 21

క. ఆలక్ష్మీనారాయణుఁ
డాలోఁ దనకన్య కెందు ననువగువరునిం
బోలించి తెచ్చి పెండిలి
యేలీలం జేయువాఁడ నే నని తలఁచెన్. 22

వ. అప్పు డొక్కనాఁడు తనసహధర్మచారిణిం బిలిచి యిట్లనియె. 23

మ. కమలాక్షీ! మనకన్నతల్లి యగుచుం గన్పట్టుసీతాంబికన్
గ్రమమొప్పంగ వివాహయోగ్యము వయఃకాలంబు దాపించె నీ
క్షమ నెందే ననురూపుఁడై నవరునిన్ గన్పట్టి తెచ్చి పెం
డ్లి మహావైభవముం బొనర్చుటకు నాడెందంబు వాంఛించెడిన్ 24

క. అనురూపవరాన్వేషణ
మనువొందఁగఁ జేయవలయు నాత్మజ కన్నిం
టను దగినవరుని వెదకియుఁ
గని విని నే నెఱుఁగ నైతిఁ గంజదళాక్షీ! 25

వ. అన నాసాధ్వీమణి యి ట్లనియె. 26

మ. ఒడిలోనం దనపిల్లc బెట్టుకొని తా నూరెల్ల గాలింపcగా
వెడలం బోయినయట్లు వో వరుని నన్వేషింపఁగాఁ బోవుటల్
గడెమారంబున నుండె లక్ష్మిపుర మార్గామంబునన్ రత్నవి
ప్రుఁడు వర్తించెడుఁ దత్సుతుం డలరుటల్ పోలింపవే వల్లభా! 27
చ. చదివినవాఁడు వేదములు శాస్త్రములున్ మఱి లౌకికంబునన్
జదురు గలాఁడు పోడిమియుఁ జక్కదనంబును సౌకుమార్యమున్
సదమలబుద్ధియున్ వయసు సంపదయున్ గలవాఁడు సద్గుణా
స్పదుఁడు విభూషణుం డనఁగ వచ్చెడువాఁ డని వింటి వల్లభా. 28
క. ఆకొండిన్యుఁడు మనసుత
కాకారమునందు వయసునందు గుణమునన్
వాకొనఁగఁ దగినవరుఁ డని
నాకున్ బొడకట్టెడిన్ మనంబునయందున్. 29
ఆ. పోయి మీరు రత్నభూసురునకుఁ జెప్ప
నతఁడు కాదనండు సుతునకు మన
సుతఁ బరిగ్రహించుఁ జుమి నాఁగ నారాయ
ణాహ్వయుండు నౌ నటంచు నెంచి. 30
వ. శుభముహూర్తంబున బంధుమిత్రపరివారపరివృతుండై లక్ష్మీపురం
బునకుం జని రత్నపండితుం గాంచి తన్నెఱింగించి. 31
క. నాకన్నెమిన్న ఘనుఁ డగు
నీకొడుకున కింతి గాఁగ నే నిడి పుణ్య
శ్లోకుఁడ నగుటకుఁ గోరుచు
నీకడ కరుదెంచినాఁడ నెఱిఁ బ్రార్థింపన్. 32
తే. శ్రీమహావిష్ణువుగ నెంచి చిత్తమందు
నీసుతున కిడ వచ్చితి నీకడకు న
నుం గటాక్షించి నాకన్యనుం గ్రహించి
నాకులము ధన్యముఁగఁ జేయు నాదుమనవి. 33

—॰ ప్రథమవివాహము ॰—

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై యతం డో మ్మని సమ్మతించినంత
లక్ష్మీనారాయణుండు పరమానందభరితాంతరంగుండై వారికిఁ

దమ్ముల మ్రొక్కినంగి ముహూర్తంబు పంచకరహితంబు గావించి వివాహమహోత్సవంబునకుఁ దరలి రాఁ జెప్పి నిజపరివారపరివృతుండై నిజగ్రామంబునకుఁ జని సదయోచిత సంభారంబులెల్ల సంతరించి యనంతరంబ. 34

సీ. తనయింటనే కాక తనవారియిండ్లయం
దగ్రహారమునందు నంద నందు
జలువచప్పరములు సరిపడఁ గావించి
పచ్చనితోరణా ల్పరఁగఁ జేసి
పెండ్లివారును బంధుబృందముల్ విడియింప
భుజియింప శాలలు పొందుపఱచి
వచ్చినవారిసపర్యలు గావింప
పరిజనులను దెచ్చి పజ్జ నునిచి
తే. ఆపురం బెల్లఁ గై సేసి యన్నికడల
ననఘుఁడు పురోహితుఁడు తన్ను ననుసరింపఁ
నాంది దేవతాహ్వానము నడపె వరుస
రాక కై వేచి యుండె నా బ్రాహ్మణుండు. 35

వ. అంత నక్కడ వేంకటరత్నపండితుండును బంధుమిత్రానుకూలం బాదుకొని కుమారునకు స్నాతకవ్రతంబు నిర్వర్తించి పరిశాంతంబున. 36

సీ. పదియాఱువన్నె మేల్పసిడినిగ్గులు దేఱు
తనువెల్లఁ బసుపుపూఁతలఁ దలిర్పఁ
గన్నుదోయిఁ గాటుక కనువారి కన్నుల
కందమై చందమై విందొనర్ప
నెఱిమీఁఱు బుగ్గపై నిగనిగ మనుచుక్క
బొట్టిందులోనికం దట్టు మెఱయఁ
బచ్చగోఁచియు మౌంజి పాలాశదండముఁ
గుశపవిత్రంబును గొమరు మిగుల
తే. పావలం దొడ్గి గొడుగు పై వైచికొనుచుఁ
గరమునఁ గమండలువు దాల్చి కరము పేర్మిఁ

గాశియాతో యటంచును గదలి పోయె
భూషణస్వామి వెంబ విప్రులు నడువఁగ. 37

వ. అట్లు గానారంబు నిర్వర్తించి నానావిధమంగళతూర్యంబులు నలుగడం బోరుకలుగ వరుండు మాతాపితృగురు బంధు మిత్ర పరిభృతులతోడం బల్లకి నెక్కి పయనంబై కన్యాదాతృనగరిహారంబునకుం జనినంత నతండు పెండ్లివారి కెదురుకోలు చేసి కర్పూర తాంబూలాంబరాభరణాదు లల్లునకు నల్లవారికి నిచ్చి వారి వెంటం బెట్టుకొని యేగఁ బెండ్లిం జేయుచు మంటపమునం బంగీకరించినంతఁ బురంధ్రీరత్నంబులు పెండ్లికొడుకునకు నీరాజనంబు లిడి సేసలు చల్లి నల్ల నల్లన నడచుచు శ్వశురగృహాంగణంబుకడఁ బల్లకిడిగి గృహప్రవేశంబు చేయుటయు. 38

సీ. పరిణయోచితవస్తు పరికరంబులతోడ
నిండినకళ్యాణమండపమున
హితులుపురోహితు లిష్టబాంధవులును
గవులును గాయకుల్ గలసియుండఁ
దార్యత్రికంబు ప్రస్తావింపఁ బడుచుండ
నితరవాద్యంబులు హెచ్చి మ్రోయు
వేదఘోషము శ్రుతిపేయంబుగా విప్ర
బృందము గావింపఁ బెండ్లిపీట

తే. లందు సహభార్యుఁడై దాత యధివసించి
వరునిఁదోతెచ్చి యటమధుపర్క మొసఁగి
పాలు పెరుగును గుడము ను వరుస మంత్ర
పూతముగఁ జేసి మెసవించి పూజచేసి. 39

శా. గౌరీపూజ యొనర్చి వేలుపుల వేడ్కం గొల్చి యున్నట్టి క
న్యారత్నంబును దెచ్చి యిచ్చె వరపాదాబ్జంబులం గడ్గియుం
ధారాపూర్వము గాఁగ దాన మిడె తద్ధస్తంబునం గన్నె చే
యారూఢంబుగఁ బెట్టెఁ దూర్యములు మ్రోయన్ వేదమంత్రంబులన్

క. తెరచీర యెత్త నైదువ
లిరువురు మోములను జూచి రింపుగఁ దలబ్రాల్

శిరముల నిడుకొని రంతట
వరుఁ డామెకుఁ దాళిబొట్టు వగ్గొప్పఁ గట్టెన్. 41

ఉ. చూపులు సేయువేళ నొకచోద్యముఁ గాంచిరి యొప్పు నప్పు కొం
జూపులదొంగ లొండొరుల శోభలు చూచుచు గొప్పగ నప్పుడో
జారి పయి వచ్చి నెమ్మదులు పట్టువడెన్ ధరఁ గంటెన్న వంచుచుఁబోఁ
బాప మెదుర్కొనె స్నరు నవశ్యము నా మన మెక్కుడు కదా. 42

క. సతిపతు లప్పుడు తగనా
హుతులన్ వేల్చి రహుణార్చిహుతభుజుక్కఖసుం
దతులిత పలాశశాఖా
తతులన్ దధి లాజలన్ ఘృతంబున నంతన్. 43

క. వరుఁడు నవోఢాపాదము
కరమునఁ గీలించి సన్నెకలు ద్రొక్కించెన్
విరహార్తి నాకతంబున
నరయఁగ నోఁ దప్పు నైపు మని తెలుపఁగ నాన్. 44

ఆ. మంగళంపుదివ్వె లంగన లిడునంత
మంగళార్థ మంచు మగువ మగఁడు
నదె కనుం డటంచు నాద్య్యలు సూపఁ జూ
చిరి యరుంధతిని రుచిరగతముల. 45

వ. ఇట్లు విధిదృష్ట విధానంబున వివాహంబు నిర్వర్తిల్లినయనంతరంబ యెల్లబంధువుల సత్కరించి వారివారియిండ్ల కంపిపుచ్చి కన్యాదాత కూఁతున కెన్నియో నీతు లుపదేశించి యల్లునిం గాంచి యిట్లనియె. 46

చ. ఇది కడుముద్దరాలు నడి కింతయు నోర్వదు తల్లిదండ్రిచా
టుది గడిదేర దెల్లరఁ జటుక్కన నేరనిమాటలాడు నె
యదనున నెట్లు లుండ దగు నయ్యది యేమి యెఱుంగ దక్కటా
పదరెడు నత్తమామలకు భర్తకు నెట్టులు సేవ సేయునో. 47

శా. కంటిం బెంచితిఁ బెద్దఁ జేసితిని నీ కైఁ బెట్టితిన్ దండ్రినై
కంటే యింకిట మాదిగాదు సుమి యిక్కన్యావతంసంబు నీ

వెంటన్ వచ్చెదు నీవె భర్తవయి నీవే తల్లివై తండ్రివై
కంటిన్ జెప్పనఁ దప్పు సైచి కరుణం గాపాడి రక్షింపవే. 48

వ. అని యెన్నో చెప్పి యప్పనంబు గావించి మించినవేశ్యం జాంబూనదాంబరాభరణాదులు కట్నంబు వెట్టి. 49

మ. అతఁ డారీతినిఁ గూఁతు భూషణునకున్ బ్రాణేశి గా నిచ్చి పెం
డ్లి తగం జేసియు సంప నాతఁ డతివం దేవేరిగా నొంది సం
తతమున్ సర్వగృహస్థధర్మములు పొందం జాలె లీలన్ జగ
న్నుతిపాత్రం బగుదంపతిత్వ మది యెందుం జెప్ప నొప్పెన్ గదున్.

— సీతారామాభూషణుల దాంపత్యము —

శా. సీతారాములు వోలెఁ జిన్నపుడె సౌశీల్యంబునం బొల్చునా
సీతారామమ కృష్ణభూషణుఁడు వాసిం జెంది వాగర్థవి
ఖ్యాతిం గాంచి చరించుచున్ గృహమునం గల్యాణముల్ గాంచుచున్
బ్రీతిం బొందుచు నంస్మృతిన్ జలిపి రుర్విన్ సర్వసంపద్గతిన్. 51

చ. ఉదయమునంద లేచి సమయోచితకృత్యము లెల్లఁ దీర్చి స
మ్ముదమున స్నానమున్ జపము పూజయునుం బొనరించి వంటకం
బది యగునంత నింటికి సమాగతమౌ నతిథిప్రకాండమున్
సదమలభక్తిఁ గొల్చి విఘసంబు భుజింతురు వార లెప్పుడున్. 52

వ. ఇట్లున్న సమయంబున వేంకటరత్నపండితుండు కాలధర్మంబు నొందుటయుఁ గుమారుండు తండ్రి కౌర్ధ్వదైహికంబు నిర్వర్తించి నానావిధదానంబు లొనరించె నంత. 53

తే. బధిర పఙ్గ్వంధ భిక్షుక ప్రభృతి జనుల
కిష్టమృష్టాన్నమును బెట్టి యెల్లనాఁడు
భక్తజనులను సేవించి భక్తిభరితు
లగుచు నిలుదీర్చుచుండి రయ్యాలుమగలు. 54

వ. ఇట్లు కొంతకాలంబు నడచినంత నొక్కసాయంసమయంబున సీతారామాంబిక గృహకృత్యంబు లెల్ల నిర్వహించి యొక్కచోఁ గూరుచుండి పూవులం గట్టి దండలు గావించుచుండె నప్పు డటకుఁ

కృష్ణభూషణుండు వచ్చి మించుఁబోఁడిం గాంచి మందహాసంబు
గావించుచు ని ట్లనియె. 55

మ. ఒకపుష్పంబుపయిన్ మఱొక్క యుగళం బుండంగ సంధించి మా
లిక నిర్మించుచు నుంటి వేమి ? విభుఁ డీలీలన్ గ్రహింపంగఁ జా
లక పోవున్ హసియింత సేన్ మనమె యుక్తాంగంటే ! భవన్నేత్రముల్
మొకమ్ముం జెప్పక చెప్పుచున్నయవి నీమోమోటలిం కేటికిన్. 56

చ. అనవుడుఁ గాంత యట్లు యగునట్టిదయేని బహూక్తి మేటికో
యన ననుఁ జూచుకోరిక యనంత మటంచును జెల్వ నేరుపం
చున వచియింప నాథునకుఁ జూపెను దండ లతాంగి నవ్వుచున్
గని యతఁ డే స్పృశించితన గ్లాని వహించెడు నిద్ది వింటివే. 57

ఉ. చందనిలో మరందమును సాపడఁ జూచెడుచక్రవాక మా
విందునఁ గారవించెదవొ ప్రేయసి! నావుడు సూరభీ! నా
చంద మపేక్ష చేయ దని జక్కవతత్వము నే నెఱుంగుదున్
దొందర లేదు జక్కవకు దొడ్డతపం బొనరించుఁ గావునన్. 58

చ. అనఁటులపై పదంబునను నల్పపదార్థము వెట్టి దానిపై
ఘన మగుబర్వ గట్టి వయిఁ గంబువు నిల్పి తదగ్రి మొక్కి విం
డ్లును శరముల్ ధరించి తెఁ తెఁ గొను లోకము చంద్రమామ మే
లని సకలప్రపంచమును బ్రాంజలియై తనవంకఁ జూడఁగన్. 59

ఆ. అనుచు విభుఁడు వల్లి సతివ యాననుఁ జంద
మామ యెట్టిదైన నేమి భూష
ణమున కొప్పు భూషణము యైనపుడె దాని
చెల్వ మనుచు నేను జెప్పుచుంటి. 60

వ. అని నర్మగర్భంబుగాఁ బలుకుచు. 61

క. తలలో నాలుక వోలెన్
మెలగుచుఁ బతిసేవ సేయు మెలఁతుక నామెన్
దెలిసి పరీక్షించుటకై
పలుకుం బతి యవుడు నవుడుఁ బరిహాసగతుల్. 62

— • భూషణుఁడు భార్యం బరీక్షించుట • —

క. సకి యొక్కనాఁడు పూఁదో
టకు నీళులు వోయుచుండుటల్ గని యటకున్
వికటముగ నాడుచుం జనె
నకలంకుఁడు నాగభూషణాఖ్యుండు దగన్. ౬౩

తే. పోయినంతన సతిఁ గాంచి పువ్వుబోఁడి!
యేను సన్యాసినై పోవ నెంచుచుంటి
నీవు నీదారినిం బోవ నెంచు మనినఁ
బిండె నట వైచి యిట్లని వెలఁది పలికె. 64

ఆ. ప్రాణనాథ! నాకు నన్యమార్గము లేదు
నేను సన్న్యసించి నీదువెంట
వత్తు నన్నుఁ గూడ వదలక కొనిపొమ్ము
నీవు పోవునట్టినెలవులకును. 65

తే. పువ్వునకుఁ దావి చందనమునకు శైత్య
మగ్నికిని వేఁడి లేకుండ నగునె యుండ
నట్లు సతి వీడి పతి యుండ నయితి యగునె
ప్రాణవల్లభ! నీ విట్లు పలుక నగునె. 66

సీ. ఇంటియాతనికి ననేకాపదలు వాపి
యలరించునట్టి దిల్లాలు సూవె
పతి కనంగదశాపఁతతి దాఁక నీక ని
రతసౌఖ్య మిడునది సతియ సూవె
మగనికి నీరేడు జగములందు న్నిద్ద
మగుయశం బిడునది మగువ సూవె
ప్రాణనాథునకుఁ గైవల్యసంప్రాప్తికి
సదనమై యిడు ప్రాణసతియ సూవె

తే. పనుల దాసి కరణములఁ బరమమంత్రి
భోజ్యములఁ దల్లి రతి రంభ భూమి క్షమను
రూపునను లక్ష్మియై యొప్పి ప్రాపునై గృ
హస్థు నేలెడు నదిగేస్తురాలు సూవె 67

ఆ. అట్టిగేస్తురాలి నధిపుఁ డెల్లప్పుడు
విడక మేసి నీడవిధము దోఁపఁ
గలసి మెలసి యుండవలయును గా కొండు
విధము లైన దోషపథము గాదె. 68

మ. అనినన్ సంతస మంది భూపణుఁ డొక్క స్థకాంతికో నిట్లనున్
వనితా! నే నిదె పోయి వచ్చెదను నావ్యాపారముం జూచుకొం
చును నే వెండియు వచ్చుదాక నిచటన్ జూపట్టుచున్ నిల్వు మం
చని పో నాతఁడు చెప్పిన ట్లచట నయ్యబ్జాక్షి నిల్చెం దగన్. 69

తే. అమఁగు గపలింప కారీతి నచట నుండె
వచ్చి మరునాఁడు భూపణస్వామి చూచి
వనిత నినుఁ బోలు సాధ్వీ లీ వసుధ లేరు
ప్రాణనాయిక వీ వని యతఁడు మెచ్చె. 70

చ. ఎరవుగ నొక్కహార మతఁ డెవ్వరిదో గొని తెచ్చి మచ్చికం
టిరో యిది వీధిలో నొకకుటీకపు చెంత లభించె దీని నీ
యరుతను వేసికొ మ్మనిన నాఁడుమ యొద్దులసొమ్ము దీనికై
దురపిలుచుండు ప్రవారు కయిదో నయినన్ స్పృశియింప దీనినిన్.71

తే. మనకు వల దిద్ది వీధిలో మాను దారికె
ననుచుఁ బ్రకటించి యెవ్వరి దగునొ వారి
కిచ్చి వేయుట తగు నని యేఁ దలంతు
భూపణము నాకుఁ గల దొండుభూష లేల. 72

వ. అనుడు నామె నిర్లిప్తత కతఁడు మెచ్చుచు. 73

శా. నాకుం గండ మొకండు వచ్చు ననుచు న్వ్రాక్రుచ్చి జ్యోస్యుం డొకఁ
డీకాలంబున నొక్క నాబదులుగా నేచేదొ భక్షించి యీ
లోకంబున్ విడిరేని నాబ్రదుకుటల్ చూపట్టు లేకున్నచో
నాకాయం బిది పాత మయ్యెడి నెలంతా! దీని కే మందువో?

మ. అన నారీమణి యిట్లు వల్కె నకటా! ప్రాణేశ్వరా! ప్రాజ్ఞులై
చనుమీవంటిరు చాకయుండినను మేల్ సంధిల్లు భూతాళికిన్
బనికిం బాటకు గాని నా బ్రదుకుటల్ వ్యర్థంబ, నేఁ బోయెదన్
నను నీకై పని గొమ్ము నే నిపుడ ప్రాణంబుల్ వడిన్ వీడెదన్. 75

తే. అనుచు నట నున్న ఖడ్గంబు నందె దూసి
కుత్తుకం దెగ నేసికో నెత్తుటయును
వలదు వల దంచు భూషణస్వామి దాని
వడిగ నేసెను గయినుండి పుడమిఁ బడఁగ. 76

క. మానము వోయినఁ బ్రాణము
ప్రాణముఁ బోయినను మాన మది నిల్చెదు నో
మానిని నీ కేది ప్రియం
బో నొడువు మనంగఁ బతికి సగ్గలి యనియెన్. 77

శా. ప్రాణం బేగిన వచ్చు నెండియుఁ బునర్జన్మంబు సిద్ధించుటన్
మానం బేగిన రాదు నెండియును జన్మాలెత్తి యత్నించినన్
గానన్ బ్రాణము నీఁగి మాన మవనిన్ గాపాడు కోటన్ మను
ష్యానీకంబున నొప్పు నంచు మది నేయుం జాలి నే నుండెదన్. 78

వ. మఱియుని ట్లెన్నియోవిధంబులం బరీక్షలం గావించి యతం డామె యుత్తమ శీలంబునకు లోన సంతసించుచుండె నామెయును. 79

తే. ధవుఁడుగీచిన గీటును దాఁట కుండు
నట్టి తెఱఁగున వర్తించు నాయమ పతి
తోడ నైదేండ్లు కాపుర మోడకుండ
నొనరిచెం బదపడి దైవయోగమునను. 80

## సతీవియోగము

సంసారంబున మిత్తివాతఁ బడఁగా నాసింధ్రు యోగింద్రు లా[illegible]ఁ దా లోపల నెంచె నో యనఁగ నక్కంజాక్షికిన్ లోకసంతతికిన్ దుఃఖముగా విషూచి పొడమెం దా నెంతయో బాధనొందుతఱిన్ బ్రాణవిభుండు చెంత నయి యెంతో బోధముం జేయఁగన్.

ఉ. భాగవతాదులై తగుప్రబంధములం గలతత్త్వమంతయున్
బాగుగ నామెకుం దెలియఁ బల్కుచు నుండఁగ నింద తెందఱో
భాగవతుల్ సమీపమున బ్రహ్మముఁ దెల్పుచునుండ నామె దు
ర్యోగమునన్ మృతించెఁ జన హాజనసముల్ బుతు ఖాజభూములన్.

తే. కొట్టకొనకైన శ్వాస పూనట్టి వఱకు
స్మృతి విడువకామె యీశ్వరుఁ జిత్తమందు
నిడుకొని స్మరించుచుండుట్ల నెల్ల వారి
కెఱుఁగ నయ్యె మహాశ్చర్య మిది యనంగ.

క. ప్రాణజ్యోతి తదాస్య
స్థానంబున నుండి పైకిఁ జనునప్డు విభుఁ
డా నాగభూషణుం డది
గానంగాఁ జాలె యోగి గావున శక్తిన్. ౭౯

చ. మిడుఁగురుపుర్వు వోలె మిఱుమిట్లుపొనర్చుచుఁ గన్నదోయికిన్
వడివడిలేచి మీఁదికెటు వ్రేలకతిన్నఁగఁ బోయి పోయి య
ప్పుడుమెయి నుండుజ్యోతియది పోల్పఁగరాక నలాహ కాభ్రమున్
గడుకొనిదాటి పాటిలి వికర్తనుబింబముఁ జొచ్చెమెచ్చఁగన్. ౮౦

వ. అనంతరం బా నాగభూషణుం డామె కౌర్ధ్వదైహికంబు నిర్వర్తించి:
వెనుకఁ గొంతకాల మరిగినంత. ౮౧

ఆ. తనకళత్రి మట్లు తరలిపోయినదాన
నాగభూషణుండు నాగశాస్త్రి
సరస కేగి తనకు సన్న్యాసముం గొన
నిచ్చ గల దటంచు నెఱుఁగఁ జెప్పె. ౮౨

— సన్న్యాస విచారము —

ఉ. చెప్పిన సద్గురుం డిపుడు చెల్లదు నీ కది సన్న్యసించి పై
నెప్పుడు నేదియుం దెలియ నేర్పడి యుండగఁ రాదు సర్వముం
జొప్పడి పండితుం డయిన చో నది చెల్లెడు దానికాలముం
జెప్పెద నిప్డు వేగిరము చేయుట పోల దటంచుఁ జెప్పుడున్. ౮౩

శా. సన్న్యాసం బన జుట్టు జందెమును భూషల్ దీసి కౌపీనమున్
ధన్యాత్మప్రతిపత్తిఁ దాల్చు టని నీతాత్పర్య మై యుండుఁ బా
మ్మన్యాయ్యం బది సర్వసంగముల నీహామాత్రిగాఁ ద్రెంచి దే
హాన్యాసం బొనరించుటే యగును సన్న్యాసంబు సామాన్యమే. ౮౪

సీ. బోడులై మేనెల్ల బూదిపూఁతలు పూసి
కొనకుట్టుబోగులు కూడఁ దీసి
కాషాయవస్త్రముల్ గట్టి గోఁచులు పెట్టి
యోగదండంబుల నొడిసి పట్టి
చంకలఁ బులితోలులంకెలు దగిలించి
తుంబిచెంబులు చేతఁ దూఁగఁ బట్టి
కకపాల లాతాముసకు వ్రేలఁగాఁ గట్టి
పావకోళ్ళఁ గాళ్ళ పట్టి మెట్టి
తే. జ్ఞానపత్రిమటంచు గంజాయిఁ ద్రావి
చాటు చాయినఁ గల్లు మాంసమును మెక్కి
మాయ బూటకములు పన్ని మహిఁ దిరుగు
నట్టివారు మహాత్ములయట్టివారె. 90

ఆ. సన్యసించినట్టి జనునకు నిష్కృతి
లేదు గృహికి నున్నమాదిరిగ న
తండు చెట్టుచివరనుండి కూలినవాని
సరణిఁ ద్రెళ్లు తప్పు సలిపె నేని. 91

మ. నను సేవించినవాని నెల్లపుడు నేన్ రక్షింతు నం చాఖ్య నొం
దిన గాయత్రిఁ ద్యజించి బోడియగుచున్ జేఁ గఱ్ఱయున్ గుండయున్
గొనుసన్యాసియంతన జ్ఞానియై పరగతిన్ గొం డెక్కునం చెంచుటల్
మనకుం జెల్లదు శాస్త్రవాసనల మేల్ ప్రాపించుటే చెల్లెడిన్. 92

తే. విను తురీయాశ్రమం బది వెనుక నొందఁ
దగినయది వార్ధకం బగుతఱిని నీవు
కొండికవు నీకుఁ దగ దిప్డు కొంతకాల
మరుగ నరుగంగఁ జూత మయ్యవసరంబు. 93

క. మూఁడు ఋణంబులతోడన్
గూడినవాఁడై జనుండు క్షోణి జనించున్
జూడవు నీవది మది నే
జూడన్ జన నుంటొ యెఱుఁగఁ జాల నాకింతేన్. 94

వ. అని మఱియు నెన్నియో విధంబులఁ జెప్పి యప్పటి కొప్పించిన
నతండు గురున కెదురాడం జాల కూరకుండె నిట్లున్న యవస
రంబున. 95

— కలకత్తా ప్రయాణము —

సీ. ఒకనాఁడు చలపల్లియొడయఁడా భూషణ
స్వామినిఁ బిలిపించి సాఁగిలిపడి
యరఁటిపం డొలిచి చేతను బెట్టిన ట్లీరు
వేదాంతబోధముల్ విస్తరింతు
రని వింటి మఱియు నయ్యర్థముల్ దెలియఁగ
నట నటకుం బోవు నవసరముల
కగు నర్థములకు మీ కక్కఱ యని వేయి
రూప్యమ్ము లర్పించి ప్రోత్సహించె
తే. ఆధనంబున భూషణుం డాకలకత
కరిగి వైద్యమునం దున్నతాఖ్య గుప
రీక్షలం దాఱితేఱి పరిష్కుఁ డగుచు
నచట వేదాంతసభలఁ బ్రఖ్యాతినొందె. 96

— వైద్యము - జ్యోతిషము —

ఉ. వైద్యము జ్యోతిషంబు నట వర్తిలు పండితలోకమందుఁ దా
హృద్యము గాఁగ నాంగ్లమున నేర్పడఁగా వివరించి చెప్పుచున్
వైద్యశిఖామణీబిరుద వర్ణితుఁడై తనజ్యోతిషాదులన్
విద్యలఁ బేరు గాంచెఁ బృథివీసురవర్యుఁ డతండు దండియై. 97
తే. అప్పురంబున జ్యోతిషమందు వైద్య
మందును బ్రసంగములు వచ్చి నప్పు డెల్ల
నాయనదె మీఁదిచేయియై యతిశయిల్ల
నపుడె దేవాంశభవుఁ డని యాఖ్యవచ్చె. 98
సీ. జాతకచక్రంబు సరిచూచి యేఁ గాని
హస్తరేఖలు చూచి యైనఁ గాని
జనుని భూతభవిష్య సంగతుల్ తగవర్త
మానముల్ కరతలామలకములుగఁ

జెప్పి తార్క్షణముం జేయుచుండు నతండు
దైవమో యనియెంచ తేవ మీఱ
నవుగాములం గాల మర్ధని మేపాదు
లేర్పడ బోధించు నెసక మెసఁగ

గీ. వైద్య మన్నను వానిదే ప్రతిభ యనఁగఁ
జెప్ప నొప్పుచు నెంతటిగొప్పజాడ్య
మైనఁ జే ముట్టినంత మహౌషధమున
వలెను వారింపఁ జాలె నప్పరమయోగి. 99

సీ. స్వామివైద్యము గాంచి జను లచ్చెరువుపడు
చుండిరి యొక్కనాఁ డొక్కరోగి
కీళ్ళనొప్పులఁజేసి గిలగిలలాడుచుఁ
గదల మెదల లేక కస్తిపడుచుఁ
పేరు వడిన వైద్యు లేరును దద్రో
మును మాన్పఁగా లేక పోయి రపుడు
భూషణస్వామి కాభూరిరోగ మెఱుంగఁ
జేసి ప్రార్థించినఁ జిత్తగించి

తే. ఆతఁ డొకగదిలోన నెత్తయిన మంచ
మొకఁడు వేయించి దిగువగా నున్నబల్ల
పైని రోగిని బెట్టి యెవ్వా రెఱుంగ
కుండఁ ద్రాఁచుల రెంటి నం దుండఁ జేసి. 100

ఉ. ఏరిని లోనికిం జనఁగ నీయక తా వెలివచ్చి తల్పునన్
ద్వారము మూసి గొండ్లె మిడి దారి లభింపక యుండఁ జేయఁ గాఁ
గోరలు లేని త్రాఁచు లవి గొబ్బున లేచియు బుస్స గొట్టుచున్
జేరఁగ వచ్చె రోగియును జేయున దెద్దియు లేక భీతునన్. 101

చ. కఱచెడు వచ్చి పాము లని కల్గినభీతున గుండె కొట్టుకో
బిఱబిఱ లేచి నిల్వఁ బడి వేగమ చెంగట నున్నమంచమున్
దఱియఁగ నేగి దానిపయిఁ దా నయి కేకలు వేసెఁ గెవ్వునన్
సార మది నాల్గుమూలలకుఁ జొచ్చె భయంకరరీతి పర్వఁగన్ 102

ఆ. అంతఁ దలుపు దెఱచె నా స్వామి పాములు
పాఱిపోయె రోగి తాఁకులాడ
శక్తి గలిగికొనియె స్వామి తైలములతో
వ్యాధి కుదురునట్టు లాచరించె. 103

తరువోజ. నెలలు తొమ్మిది గాఁగ నెలఁత యొక్కరిత
నెంజిలి నొప్పు లందెను బ్రసవింపఁ
జలము గాకుండఁగాఁ దలరాక శిశువ
దము వచ్చి యడ్డుకో డాక్టరుల్ మఱియుఁ
గలమంత్రసానులు గత్యంతర మఱి
ఘనశస్త్ర మయ్యది గాక వేఱొండు.
తెలియంగ నని కోయఁ దివురుచు నుండఁ
దెలిసిభూషణుఁ డిట్లు తెలిపె వారలకు. 104

క. శిశుహత్య సేయ నొప్పదు
పశుకృత్యం బద్ది నాదుపలుకు వినుం డా
శిశుపాదాగ్రమునందున్
గృశానుకీలం దగుల్పుఁ డించుక యనుచున్. 105

తే. తెలిపినన్ వార లట్టులు సలిపి రంత
శిశువు వేఁడి సహింపమి జెఱచెఱఁ దన
కాలు వెనుకకు లాగుకోఁ గలిగె నవల
సుఖము గాఁ బ్రసవించె నాసుదతిమిన్న. 106

మ. ఎట నెంతెంకలకేఁ గుదుర్చుటకుఁ దెన్నింతేని కాకున్న సం
కటముల్ భూషణమూర్తి కన్దెఱచుచుఁ దోఁగా మాటల న్మంత్రులం
బటుమేధానిధియై కుదుర్చుట జగద్వ్యాప్తంబ యై యశ్శ్రీ
స్ఫుటతేజోంశభవుం డితం డనఁ దగెన్ బ్రోత్ప్రీతిపాత్రుం డయై.

మ. క్షయరోగంబును రాజయక్ష్మ యనుచున్ సర్వామయేట్టంచుఁ జె
ప్పి యసాధ్యం బిది దీని మాన్పుటకు నేవిఖ్యాత వైద్యుండు లే
మి యథార్థం బని శాస్త్రముల్ దెలుపుఁ దన్మిథ్యాత్వముం జెప్ప నో
పి యతం డింతటిలోఁ దదామయమువా విజ్ఞత్వముం జూపెడిన్

సీ. అయ్యోగి పుంగవుం డౌషధంబులచేతఁ
గాక మంత్రజపాదికములచేత
భాస్కరోపాసనాబలముచేతఁ బురాణ
పఠనశ్రవణసక్తభక్తిచేత
నుపవాసములచేత నుచితము లైనప్రా
ణాయామవిధులచే నధికము లగు
వ్యాధులనే కాక ప్రారబ్ధకర్మముల్
గ్రహబాధలును నవగ్రహము లెల్ల
తే. బ్రహ్మరక్షస్సులును లోనిబాధ లెల్లఁ
దొలఁగిపోఁ జేయఁ జాలి భూతలజనులను
గాచి రక్షింప వెలసినకమలజన్ముఁ
డనుచు నెల్లరుఁ బొగడంగ నతిశయిల్లె. 109

తరువోజ. పరమగురుం డయి పరఁగుమల్లాది
వరవంశ్యుఁ డై జగత్ప్రఖ్యాతిఁ గనిన
సురుచిరమూర్తి యచ్యుతరామశాస్త్రి
శుశ్రూషఁ జేసి యాచొప్పున శక్తి
సరసభూషణునకు సంప్రాప్త మయ్యె
జగతి నాగేశ్వరశాస్త్రి యయ్యోగిఁ
బరిపరివిధములఁ బ్రీఖతించి శిష్య
వరునిఁ గా సేసెను వాత్సల్యమునను 110

సీ. కలికాతపురి నున్నకాలంబునం దొక్క
పెద్దడాక్టరు బిడ్డ కొద్దిక మెయిఁ
గృష్ణభూషణుఁడు శారీరశాస్త్రము చెప్ప
నట్టిడై తత్త్వశాస్త్రార్థ మెల్లఁ
జెప్పె నప్పుడు తండ్రి చెల్మిఁ గూఁతుం గాంచి
తనశాస్త్ర మెఱిఁగింపఁ దనయ తండ్రి!
భూషణస్వామి చెప్పునది మీ రిప్పుడు
చెప్పునదియు వేఱు స్థితిని వయ్యె
తే. అనుచు డాక్టరు భూషణుం డతిసమర్థుఁ
డతఁడు తత్త్వము శారీరమందుఁ గూర్చి

తెలిపెఁ బరుసవేది గలాఁడు చేసి నైన
బంగరుగఁ జేయుఁ జాలిన పగిదిఁ దోఁప. 111

వ. అని చెప్పి యొప్పించె ననంతరంబ. 112

ఆ. అమెరికాకుఁ బోవ నధికారిసమ్మతి
నంది గలిగి యమ్.డి యనుపరీక్ష
నాటి తేజ భూషణాఖ్యంబు సుప్తాదు
లతని పేరు విన్న నడఁగి పోవు. 113

క. ఆయుర్వేదమునం దా
యాయాశాస్త్రముల నధికుఁ డగుటయె కాకా
శ్రీయుతుఁడు పాకకళలన్
వాయుతనూజునకు నెత్తు వచ్చుఁ దలంపన్. 114

వ. ఇట్లు నాగభూషణుండు నానాశాస్త్రంబులం బ్రవీణుండై ప్రసిద్ధిం గాంచె నని చెప్పిన నైమిశారణ్యవాసులు సూతుం గాంచి కలికాతానగరంబునకుం జని వైద్యవిద్యాభ్యాసము గావించి నాగభూషణుండు వెండియు మాతృదేశంబునకు వచ్చి యెట్లు ప్రవర్తించెనో తదనంతరవృత్తాంతంబుఁ జెప్పు మని సూతు నడుగాలయు. 115

— ఆశ్వాసాంతము —

మ. కనకాంబా పరిపాల్యమానవిలసత్కల్పోక్తకాలత్రియా
ర్చనలన్ బ్రీతుఁడవై త్రిలింగ కనకాంచత్క్షేత్రమం దుండి భ
క్తనికాయంబును బ్రోచుచున్ వరము లీఁ గన్పట్టు దేవుండ వై
చను నిన్నెంచి భజించెదన్ ద్విజగదీశా! వేంకటేశప్రభూ. 116

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబునఁ
దృతీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

# అమృతానందము

## చతుర్థాశ్వాసము



ముచ్చుందమాదికుల
గ్రామణి యగురెడ్డినామకపరిభువు శుభ
శ్రీ మించి నిన్నుఁ గొలుచుట
నామాహాత్మ్యనిఁ గాచి ప్రోవుమా దేవవిభూ! 1

వ. అవధరింపు ముక్కుసకేశంకు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు నాగభూషణుండు కలికాతానగరంబున వైద్యజ్యోతిషాదివిద్యలం బారీణ్యంబు వడసి. 2

మ. వసు నాకాజ వసుంధరాంచితసమా వైద్యాగ్రగణ్యుండు నాఁ
గ సమాఖ్యం దేనంగఘటన్ విడిచి బంగాళీజనాకార్ణతన్
వెస లక్ష్మీప్రపుఁడై చేరి తాతయెడకున్ విచ్చేసి మీయింట నా
కొసఁగం జాలుదె నేఁడు భోజనము నా సూహింప కాతం డెదన్. 3

శా. సందేహించి యితండు కొడుఁ కనుచున్ శంకించి మాయింట నీ
కుం దత్పాత్రిస్థి నొసంగఁ బోవదను పల్కుం జేయు నాభూషణుం
డందే యుండిన పిన్నతాతఁ గని యే నుండయ్య నీ యిల్లు లే
దంగే నా నటఁ దుర్గతిం బలికి పా ప్మం జాడ నాతం డనున్. 4

ఉ. ఆఁకలి గొంటి నిన్నమొదలన్న మెఱుంగ నొకింత యన్నమున్
నాకు నొసంగఁ గాఁ దలఁచి నాదగు ప్రాణము నిల్వరింపరే
మీకు లభింపఁ బుణ్య మని మిమ్ము నను గోరితి విప్రు లంచు మీ
రేకడవాఁడో పీఁ డనుచు నిచ్చఁ బొనర్పరు నాకుఁ బెట్టఁగన్. 5

ఆ. ఎవ్వఁడో యటంచు నెంచుచుంటిరి కాని
యాత్మబంధు వీతఁ డనుచు నెంచ
రైతి రెవ్వఁ డైన నాత్మకు బంధువే
యనెడుబుద్ధి లేమి నక్కటకట. 6

క. జ్ఞానము కలిగెనయేనిం
గానఁగఁ జండాలుఁ డైనఁ గాని గురు వటం
చానాఁడు శంకరుం డనె
నానుడువు లెఱుంగనట్టి రైతిరి కట్టా. 7

వ. అని వారు సంభాషించుచున్నప్పు డొక్కవృద్ధబ్రాహ్మణి వచ్చి భూషణమూర్తిం బరీక్షించి యి ట్లనియె. 8

శా. నీవా భూషణమూర్తి ! గాడు డనుచు న్నీ తాత లీరీతిగాఁ
దోవ ల్దప్పి వచించి రేగకుము సంతుష్టుండవై నాగృహం
బీవేళ న్సుపవిత్ర మైనది గ నీ వీక్షించి భుక్తిం గొనన్
రావే ! చుట్టమువంకదాన ననుచుం బ్రార్థింతు నెంతేనియున్. 9

వ. అని పలుకు చున్నంత బ్రహ్మవధాని వానిచెంతకుం జనుదెంచి యి ట్లనియె. 10

శా. "దౌహిత్రః కుపత స్తిలా"యనుచు శాస్త్రమ్ముల్ ప్రబోధించు మా
దౌహిత్రుం డవు మాకుఁ బుణ్యగతులన్ దాపింపఁగాఁ జేయఁవా
డై హర్షొందెద విట్లు మానలనఁ ద ప్పైనన్ క్షమింపంగ లో
నూహం జేయుదె కాక కోపి వయి పో నూహింతువే మస్కడా. 11

తే. ద్రావిడులు గౌడులకుఁ బెట్టఁ దగదు భుక్తి
వారికిని వీరికిని లేవు పంక్తిభోజ
నములు గావున నీదువేషమున నిట్లు
మోసపోతిమి రమ్మయ్య భుక్తిఁ గొనఁగ. 12

తే. అట్లు పలుకుచునున్న బ్రహ్మవధాని
సరకుగొన కల్లభూషణస్వామియు బదు
లాడఁ బూనక జరఠగేహమున కేగి
తృప్తిగ భుజించి చనె నొండుదెస కతండు 13

వ. అని చెప్పి కథకుం డిప్పట్లఁ గృష్ణునియు మునిపత్నులయు వృత్తాంతంబు పొడకట్టుచున్నదని యి ట్లనియె. 14

మ. మును గృష్ణుండు మునీంద్రుల న్వనమునన్ బోధించుచు న్నాకు భో
జనముం బెట్టుఁ డనంగ వారు యదువంశప్రోద్భవుం డీతఁ డీ

మను కర్పింపక వీని కన్న మిడుటల్ మన్యేశ్వర్థధర్మంబు గా
దని మోహంబునఁ జేసి పెట్ట మిటఁ బో వయ్యా యటం చాడుడున్.

వ. కృష్ణుం డనునయించుచు వారికి ట్లనియె. 16

క. ఇంపుగ "ధర్మస్య త్వరితం
తం పాత్రం" బని వచించు ధర్మస్మృతు లే
వం పరిపాటిం గొని మీ
రంపుఁడు నా కింత పెట్టి యతివరులారా. 17

తే. అగును దేహికి విప్రశూద్రాదిభేద
భావ మాత్మకు లే దని బ్రహ్మవేత్త
లీ రెఱుంగనియది కా దొకింత నాకుఁ
బెట్టినం గర్మలోపము పుట్టఁ బోదు. 18

శా. అన్నార్తుం డగునాకుఁ బెట్టితిర యే నన్నం బొకిం తైన ని
ష్పన్నాల్గుంబడి లోకముల్ తనియు నట్లే యై ఫలం బిచ్చు నే
నున్నా నాఁకట లే దనం దలఁపకుం డోహానిచంద్రిల్ మదిన్
నన్నుం గొల్లఁ డటంచు నెంచకుఁడు విజ్ఞానంబు గా నెంచుఁడీ. 19

తరళము. అనుఁడు మానులు దేవతార్చన యైనపిమ్మటఁ గాని మా
మునులయిండ్ల భుజింప నొండ్లకు భుక్తి లభ్యము కాదు పొ
మ్మనక పెక్కులు మానమత్తమునందుఁ గొండొకచోటికిన్
వనచరేశ్వర ! పొమ్ము పెట్టము పట్టెడన్నము నేనియున్. 20

వ. అనిన నతం డొండుపలుకక దరహాసితవదనుం డై మరలి వనంబునకుఁ
జని గోగణంబుకడ గోపాలపరివృతుం డై విశ్రమించి యుండె నా
సమయంబున. 21

మ. మునిపత్నుల్ తమభర్తలన్ మొఱఁగి రేపుల్ పూజ గాకుండ వం
డినశాల్యన్నముఁ బళ్ళెరంబులఁ దగన్ నిండించి హస్తంబులం
గొని గోపాలవరేణ్యుఁ డున్న యెడకున్ గోవిందసంకీర్తనం
బును గావించుచు వచ్చి రిచ్చ మెయి వేల్పుంబూవుఁబోండ్లో యనన్.

ఉ. వచ్చి ప్రదక్షిణంబుల నవారిగఁ జేయుచు దేవదేవ! నీ
వెచ్చటివాఁడవో యెఱుఁగ కిట్లపరాధము చేసినారు మా

చ. అగయుగ నాగభూషణనుహాత్ముఁడు తా నిలఁ జే ర్గలాఁడ యై
చరిత్రమునుండియుం బురాణశాస్త్రమునుండియు నర్థశాస్త్రపుం
గుయుక్తులనుండి జ్యోతిషముకారుప్తిలనుండియు వైద్యశాస్త్రపుం
గరిమము నుండి తత్త్వము ప్రకాశిల బోధ మొనర్చె నేర్పుటన్. 30

ఉ. శంకరుఁ డెప్పుడో పొడమి సర్వజగంబునఁ దత్త్వసార మా
తంకము లేక చల్లి చనెఁ దద్గతు లన్నియుఁ బ్రాఁతవడ్డ వం
చంకితమాట భూషణసమాహ్వయుఁడుం గొని శంకరుండె యి
ల్లింకిలి లేక భూతలమునందు జనించె నటంచు ప్రెంచియున్. 31

—: తత్త్వప్రదర్శనము :—

ఆ. అదియు నిదియు నంచు నన్నేల యొకగడ్డి
పఱక యుల్లిగడ్డ పట్టి వాని
నుండి తత్త్వసార మొలఁక బోధించు వా
గ్వ్యాభవుండు నాగభూషణుండు. 32

వ. ఏతదర్థంబెల్లఁ బల్లంబు నాఁ సుప్రసిద్ధఘటితం బైన జీవయాత్రయు
నమృతసారంబు నానందసాగరంబు హంసవిజయంబు నమృతలహరి
మున్నగు గ్రంథంబులు బోధించుచున్నయవి తత్ప్రకారం బెట్టి
దనిన. 33

సీ. రవికిరణంబునన్ రంగు లేమున్నట్లు
ప్రణవమునన్ శబ్దపటల మట్లు
తెలియ బ్రహ్మమునన్ సకలంబు లుండెడు
నని ప్రకృతిం దత్త్వమును వచించు
వైద్యశాల జగంబు వైదుండు శ్రీహరి
రోగంబు పోయి యారోగ్య మొందు
టరయ జీవత్వము దొరఁగి బ్రహ్మత్వము
నమకుటు టసి వైద్యశాస్త్ర మనుచు
తే. అనుచు సర్వశాస్త్రంబుల ననుభవించి
తత్త్వ మలరారు నని చెప్పఁ దత్త్వవేత్త
భూషణస్వామి తన్మూర్తి భూరిమహిమఁ
దత్త్వవేత్త యొఱుంగు నీధరణియందు. 34

—॰ ఆత్మకూర్వాదుల సత్కారము ॰—

మంజరి. అలనాగభూషణుఁ డానబ్ధిపీసు
కృష్ణరాయఁడు గూడి స్వేచ్ఛ బందరున
వర్తించుచుండియు వసు నాక ధాత్రీ
భూ సంఖ్య నగు నేటఁ బోలీసునం ది
నస్పెక్టరై కృష్ణనాముఁడు నెల్లు
రికి నేగ వానితోఁ గృష్ణభూషణుఁడు
చని యటఁ గొన్ని మాసములుండి యవల
నాత్మకూ ర్సోమశిలాదుల కేగి
యచట భక్తులకుఁ దత్త్వార్థబోధనము
సలుపుచుం దత్త్వప్రియులు మెచ్చ నపుడు
మండలదీక్షలు మౌనవ్రతములు
సతతతపంబులు జపములు మిగుల
సాగించుచును మిత్రసంగతి నుండె
నపు డాత్మకూరిలో నానందమూర్తి
కట బ్రహ్మరథమున నారతు లిచ్చి
యేగుఁబెండ్లి యొనర్చి యెల్లరు ప్రజలు
వేలకు వే లయి వెంబడిఁ జనిరి. 35

వ. అంత నయ్యమృతానందస్వామి కొందఱుమిత్రులపరిచయంబు గలిగి
కొని వారి కెల్లప్పుడు బోధామృతంబు వర్షించుచు నతులకు నుతు
లకుం బాత్రుం బయ్యె ననంతరంబ పదియుం దొమ్మిది నూర్ల
తొమ్మి దవహూణవత్సరంబున శివరామకృష్ణప్రభృతులతోఁ గృష్ణా
పుష్కరకాలంబున విజయవాటికకుం జనె నదియునుు. 36

—॰ విజయవాటిక ॰—

తే. కృష్ణవేణీనది నొరసి యింతలోన
నింద్రకీలాద్రి పొలుపొందు సాంద్రమహిమ
మందు ము న్నర్జునుఁడు తపం బాచరించి
శివుని నర్థించి యిష్టార్థసిద్ధి వడసె. 37

వ. ఆవృత్తాంతంబు సంగ్రహంబుగఁ జెప్పెద నాకర్ణింపుఁ డని మఱి యును. 38

ద్విపదము. మున్నర్జునుఁడు ధర్మపుత్త్రుపం పంపు
సన్నగంబునఁ దపియించి మహాస్త్ర
ములు వొందఁ జనుదెంచి భూర్జితపంబు
సలిపె నీశ్వరుఁ జిత్తజలజమం దుంచి. 39

వ. అట్లర్జునుండు మునివేషంబు ధరించి తపంబు గావించుచున్నయవ సరంబున. 40

మ. కలపం బద్దిననీలికోక తలపాగా పీలిపూదావళం
బులు సింగంబులచుంచు దండకడియంబుల్ లేడిత్రేదోలు కా
సెలు విం డ్లమ్ములు కత్తు లీటె లలరుం జేకట్లు పెన్నెమ్మికుం
చెలు గం దాల్చి కిరాతరాజగుచుఁ బొల్చెన్ శంకరుం డత్తఱిన్ 41

సీ. నీలిపేలికలు పట్టీలుగా వేసి కు
ట్టినబొంత మొలచుట్టుఁ దనరఁ జుట్టి
మోచేతులను దాసఁ బొలుపగు నద్దాల
రవపని గలడొల్ల రైకఁ దొడిగి
నులివెట్టి నెమిలికన్నులనెఱుల్ సవరాలు
మెడలపైఁ బడఁ జాఱుముడిని వైచి
కాళ్లఁ జేతుల గల్లు గల్లు మంచును మ్రోయు
సిత్తడినగ లెన్నియేనిఁ బెట్టి
తే. పూసపేరులు మెడనిండఁ బొందుపఱచి
గవ్వపుత్త్రాడు నిలువెల్లఁ గలయఁ జుట్టి
నీలమైఁ గేల నొకకంచె గ్రాలఁ బట్టి
చలిమలకుమారి యెఱుకలసాని యయ్యె. 42

వ. ఇట్లుపార్వతీపరమేశ్వరులు కిరాతవేషంబులుధరించి వేటలాడు నెపంబునం దిరుగుచుం దిరుగుచు నరునికడ కరుదెంచి నీవెవ్వఁడ వీవనంబు మాయధీనము నీవు నాయేసినపంది నేసితి విది మృగయావిరుద్ధం బని గద్దరించుచు హరుం డతనిపై వాడికోలలు గాడ నేయుట యుం గని కప్పడియును. 43

చ. బెదరక శత్రుపర్వతవిభేదనదక్షము లక్షయమ్ము లై
పొదలెడు వజ్రిబాణము లపూర్వవిధంబునఁ బెంచుఁ జేని వై
చిదుకఁగ నేసి యార్వ నవి చిఱికినిం గొన కింతల ంతం
డుదరముఁ జేర మ్రింగెను మహోదధి నీ ర్బడబాగ్ని చాడ్పునన్. 44

వ. అర్జునుం డాశ్చర్యమగ్నాంతరంగుఁడై. 45

శా. మాయామానుషరూపధారి యగునీ మాన్యప్రభావోజ్జ్వలుం
డాఖండుండ్రుండో యుపేంద్రుఁడో తలఁప నాయజ్ఞానముం బాప నన్
డాయన్ వచ్చినభూతనాయకుఁడో కాఁడా యస్యుఁ డెవ్వాఁడు నా
స్త్రాయచ్ఛాత్రశరాహతిం బడక నిశ్చించల్యుఁడై యుండెడిన్. 46

వ. అని తలంచి యమ్మాయా కిరాతుం డంబరాంబరుండని నిశ్చయించి
వాని పాదపద్మమ్ముల బడినం బ్రీతుండై భూతనాథుండును. 47

సీ. మేలైనమగజాలడాలు డీలింపఁ జాల్
మేనితో సామేనసానితోడ
వెన్నెల వెదఁ జల్లు క్రొన్నెల సిక నల్లు
పువ్వుతో మవ్వంపునవ్వుతోడ
నల్లనఁ దల నల్లకల్లోల మాతెల్ల
వాఁకతో హత్తితోల్ కోకతోడఁ
బెనుపల్కు లొల్లనినెన రొల్కుచల్లని
చూపుతో దొర లేనిరూపుతోడ

తే. నిటలతటమున నంజలిపుటము లూను
హరిపితామహశక్రాదిసురలతోడ
నెమ్మి సేవించు ప్రమథగణమ్ము తోడ
నెదుట సాక్షాత్కరించె సుమేశ్వరుండు. 48

వ. ఇట్లు సాక్షాత్కరించిన విరూపాక్షుని సహస్రాక్షనందనుం డనేక
విధంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై వానికిఁ బాశుపతాది
దివ్యాస్త్రంబులు ప్రసాదించె నది మొద లప్పర్వతంబు ప్రసిద్ధిం
గాంచె నని మఱియును. 49

ఆ. ఇంద్రకీలపర్వతేశాన్యమున నొక్క
జ్యోతిఫలకమందు భూతనాథుఁ
డత్తమిల్లినట్టియడియాల మిప్పుడును
దృశ్య మగుచుఁ బ్రజల తెవులు లుడుపు. 50

ఉ. మూకుఁడు పార్థబాణహతి మోహవశంబునఁ బర్వతాగ్రమం
దాకడ గిఱ్ఱుగిఱ్ఱు మని యట్టిటు చుట్టినభాగమందుఁ జ
క్రాకృతి నేటికిన్ గుడుసు లారయ వచ్చెడుఁ బ్రేక్షకాళికిన్
బ్రాకొని యున్నపాపములు పాఱఁగఁ దోలెడునట్టివై ధరన్. 51

ఆ. కనకదుర్గకెడమ గా నింతలో నొక్క
భూబిలంబు గలదు పోదు రేని
కాశివిశ్వనాథు కడ కేగుదురు దాని
వలన ముక్తి పడయ వచ్చు జగతి. 52

చ. కనకము కొండ నల్గడలఁ గల్గును రాసులు రాసులై యటన్
గన నగు దానిగుర్తికయి కంజభవాదులప్రార్థనంబునన్
ఘనుఁ డగుచంద్రశేఖరుఁడు కావలిఁ బెట్టెను దుర్గ నందునన్
కనకసమాహ్వయంబునఁ బ్రకాశిలుచుండెను దుర్గ యగ్గిరిన్ 53

తే. వజ్రపంపున మాతలి పార్థునికయి
దేవతారథమును దెచ్చి దింపినకడఁ
జక్రచిహ్నంబు లగ్గిరి సానువులను
జూడ నొప్పెడు నిప్పుడుఁ జోద్యముగను. 54

చ. అటఁ గలకాననం బది తదాది క్రమక్రమపద్ధతి న్నశిం
చుటయుఁ దపస్వి యా విజయుశోభననామమునం బురోత్తమం
బిట నొనరింపఁ గాఁ బడియె నందు వసింతురు నాఁటనుండి ప్ర
స్ఫుటవిభవాభిశోభితులు పూరుషు లాత్మకుటుంబయుక్తులై. 55

సీ. పదియు నెన్మిది పీఠపదములఁ జేర్గన్న
కనకదుర్గాదేవి తనరు నెచట
మల్లేశ్వరునితోడ సల్లపించుచుఁ గన్య
కాపరమేశ్వరి క్రాలు నెచట

వేంకటేశ్వరుఁ డెమ్మె వేంచేసి భక్తుల
నోమ విద్యాపీఠ మందు నెచట
నాల్గుజాతులవారు నలువొందుచుఁ బహు
ళోన్నతులం దేలుచుందు రెచటఁ

తే. బచ్చువిల్లునితల్లి యెప్పట్టునందు
విడిచి పెట్టక నివసింప వేడ్క సేయు
చుండు నెచ్చట నచ్చోట, నొప్పు చుండు
వివిధ గుణములపేటి శ్రీవిజయవాటి. 56

చ. ద్విజుఁ డొకరుండు రెడ్డి యనుపేరఁ బ్రసిద్ధికి నెక్కి యక్కడన్
సుజనులు మేలు మే లనుచు స్తోత్రము సేయఁ ద్రిలింగపీఠమున్
వృజినము లేక కొల్చి యట వేదము శాస్త్రము లోనివిద్యలన్
ద్విజులకుఁ జెప్పఁ గా నిలుపు దివ్యకలాలయ మొక్కఁ డవ్వలన్.

మ. ఇచటం బేవల కన్నదానమునకున్ హిందూమతవ్యాప్తికిన్
సుచరిత్రస్థితికిన్ మహోన్నతకలాశోభావ్యాప్తికిన్ వేదశా
స్త్రచయప్రాప్తికి వైద్యవిద్యకు ననల్పఖ్యాతికిం గావ్యకృ
ద్రచనాశక్తికి లక్ష లిచ్చు నొకమేధాశాలి యీ పిమ్మటన్. 58

మ. ప్రతి వర్షంబును దేశికోత్తముని నారాధించువాఁడై జయం
తి తగం జేయుచుఁ బండితప్రవరులం దెప్పించి పూజించి తా
శతసాహస్రబహూకృతుల్ సలుపుచున్ సర్వాంధ్రదేశంబునన్
స్తుతిపాత్రుం డగు ఱేఁడు నాఁ బడుచు నెంతో వైభవం బేర్పడన్.

వ. ఇట్లు ప్రసిద్ధిం గాంచిన విజయవాటికాపురంబునఁ బ్రత్యహంబును గృష్ణభూషణుండు కృష్ణాస్నానంబు గావించుచు దేవుల సేవించుచు భక్తులకుఁ దత్త్వోదేశంబు సేయుచుఁ గొన్నినాళ్లుండి. 60

— మంగళగిరి —

ఉ. మంగళనారసింహుఁడు సుమంబులుఁ బండ్లును బిండివంటలున్
బంగరుదక్షిణల్ గొనఁగ భావము సేయఁడు పానకంబు లు
ప్పొంగుచుఁ ద్రావు నప్పరమపూరుషదర్శన మాచరించినన్
మంగళముల్ లభించు నని మాన్యులు పల్కుచునుందు రిమ్మహిన్.

మ. ఇది యేమో పరమాద్భుతంబు విన నయ్యెన్ భక్తుఁ డొం డెంత గా
మది సంకల్పము చేసి పానకము సంపాదించి తద్వక్త్రమం
దు దిగంబోయుదురో మృగేంద్రముఖుఁ డందున్ సాముభాగంబె త్రా
వఁ దలంచున్ బెరసాము భక్తులు గొనన్ స్వాంతంబు గావించుటన్.

ఆ. చిన్న చెంబెఁడు పానక మన్నృసింహు
నోటఁ బోసిన సగము మాటలోనె
గళము నిండి పైఁ గన వచ్చుఁ దెలియ నిట్లె
బిందె డైనను సగపాలు సందె యుండు. 63

వ. అనిన విని భూషణుం డొక్కనాఁడు బెజవాడనుండి మంగళగిరికిం
జని పానకాలరాయని సేవించి వచ్చె నంతరంబ. 64

— • వేదాద్రి • —

శా. కృష్ణాతీరమునందు వేదగిరి నాఁ గీర్తింపనై పెంపునన్
విష్ణుక్షేత్ర మొకండు గల్గు నచటన్ వెల్గున్ నృసింహుండు వ
రిష్ఠుం డై నిరతంబు భూమిజనులున్ దివ్యర్షులున్ దివ్యులున్
జిష్ణుండున్ విధియున్ శివుండు నతనిన్ సేవింతు రిష్టంబుగన్. 65

వ. అది పంచనారసింహక్షేత్ర మని విని విభూషణస్వామి యటకుం
జని యున్న సమయంబున నచట నున్నధర్మకర్త భూషణుం గాంచి.

చ. నలువచతుర్ముఖంబులను నాలుగువేదము లేకరాశి యై
పొలిచి సమస్తసృష్టికిని మూలము లై త్రిజగన్నుతంబు లై
వెలసెను వాని బ్రహ్మ తన వీట నెసంగఁగఁ జేసి తద్గతం
బులగుసుధర్మముల్ నెఱపి ముజ్జగమున్ దనరించె నెంచఁగన్. 67

వ. అట్టి వేదంబు లొకప్పుడు నారసింహరూపంబున నారాయణుండు
హిరణ్యకశిపుని సంహరించినప్పు డి ట్లనిస్తుతించె. 68

చ. నలకలకన్న నల్కఁగఁ గనంబడి పెద్దలకన్నఁ బెద్ద యై
నెల వొకచోటు నాక మఱి నింగియు నేలయు నిండఁ బొంగియున్.
దులువల కెల్ల లేఁ డనఁగఁ దోఁచెడు దేవర దాసు మేమ యై
వెలిగెడుజోతినిం దలఁచి వేయితెఱంగులఁ గొల్తు మాత్మలోన్. 69

ఉ. అంతటిలోన నిండితివి దంతయు నిండెను నీదులోన నీ
యంతయు నీవ చేసితివి దంతయు నీవలనం దలిర్చు నీ
వింతకు నింతవై మఱియు నేర్పడ నంతకు నంతనై యశం
బెంతయు నంది పొందు నిను నేము నుతింపఁగ నేర మచ్యుతా. 70

వ. అని ప్రస్తుతించి దేవా! మాకు దేవారుల వలన నపాయంబు సంభవించుచున్నది మాపై నీ వధిష్ఠించి మమ్ము రక్షింపు మనిన నారసింహుం డట్ల యగుం గాక మీరు కృష్ణవేణికడ నగంబై యుండుఁడు నేను లక్ష్మీనరసింహ యోగానందనరసింహ జ్వాలానరసింహ సాలగ్రామనరసింహ గరుడనరసింహు లనం బొలిచి వచ్చి మీపయి వసించెద నది పంచనారసింహక్షేత్రం బనం బరఁగి భుక్తి ముక్తి ప్రదం బగు నని చెప్పి తిరోహితుం డయ్యె నప్పుడు. 71

సీ. అఖిలోపయుక్తశిక్షాది షడంగముల్
సముదీర్ణదివ్యపాదములు గాఁగ
మోక్షప్రదజ్ఞాన మూలోపనిషదర్థ
గణము లుదారశృంగములు గాఁగ
జగదభిప్రస్తుత సదమలార్థావబో
ధకమహాస్మృతులు ప్రస్థములు గాఁగ
నమధిగతాధికాచారోపయోగకృ
ద్బ్రాహ్మణంబులు ప్రస్తరములు గాఁగ

తే. సకలధర్మంబులును నికుంజములు గాఁగ
గురుతరారణ్యకములు భృగువులు గాఁగ
వివిధగుణరసంబులు సుధాతువులు గాఁగ
వేద మంతయుఁ బేరి యుర్వీధ్ర మయ్యె. 72

మ. ఘనవాతాహత కీచకోత్థితమహాక్వాణంబు నల్దిక్కులన్
వనమం దుప్పతిలంగ నప్పుడు మహామ్నాయాద్రి యుచ్చస్స్వరం
బున నెల్లప్పుడు సామగానము గుణస్ఫూర్తిం బ్రసంగించు నో
యన నొప్పెన్ జగతీతలంబున మహాహ్లాదంబు సంధించుచున్. 73

సీ. తృణగుల్మలత లయి దీపించె శాస్త్రముల్
రాజించె శాఖలై పురాణములును
గ్రాలె నోషధు లయి గ్రహతారకాదులు
మణు లై ఋషీంద్రులు గణుతిఁ గనిరి
మృగసమూహము లయి మెఱసిరి సురలు కీ
చకములై కిన్నరచయ మెసంగె
శుకశారికాదు లై చొత్తిల్లి రచ్చలల్
పౌరులై పొసలె స్వర్గపురవసతులు.
తే. దివికి భువికిని జాలి దేదీప్యమాన
మై జగత్త్రియగేయమై తేజరిల్లు
వేదగిరి మీఁద నృహరి యావిర్భవించు
నతని సేవింత మనుచు మహాశయమున. 74

తే. అచటిజా లెల్ల దేవత లచటిచెట్లు
చేమ లెల్లను గల్పక భూమిరుహము
లచటిచెంచు లెల్లను సిద్ధయుతులు నచటి
భూమి యంతయు స్వర్గంపుభూమి యగును. 75

వ. ఇట్లు వేదాద్రి నారసింహాగమనంబు ప్రతీక్షించుచున్నంత. 76

సీ. కంకణఝణఝణత్కారంబు లెసఁగ న
చ్చర లిరుచక్కిఁ జామరము లేయఁ
గింకిణీధణధణాంకృతు లొప్ప రంభాద్య
నిమిషకామినులు నృత్యములు సేయ
నమరగంధర్వ విద్యాధర కిన్నర
ప్రముఖులు జయజయారవము లొసఁగఁ
గమనీయతరఘంటికా క్వణక్వణముల
దశదిశల్ గడుఁ బ్రతిధ్వనుల నీన
తే. లలితమాల్యాది దివ్యభూషలు ధరించి
భవవిధీంద్రాది దేవతల్ బలిసి కొలువఁ
గమల తనమ్రోలఁ గ్రాల నగ్గరుడి నెక్కి
నృహరి వేంచేసెఁ బేర్మి నన్నిగమగిరికి. 77

వ. ఇట్లు నృసింహక్షేత్రం బగు నవ్వేదశైలంబున నాలక్ష్మీశ్వరుశాసనంబునం జేసి గౌరీశ్వరుఁడు మకరేశ్వర విశ్వేశ్వర రామలింగేశ్వర సిద్ధేశ్వర దక్షిణామూర్తీశ్వర నామంబులం బంచలింగరూపంబున క్షేత్రపాలుండై యుండె నని చెప్పి మఱియును. 78

మ. వరసంతానముఁ గోరి వంధ్యనియమ ప్రారంభశుంభన్మతిన్
నరసింహున్ భజియించుచున్ నలుపదుల్ నా శ్యార్ద్రవస్త్రంబుతో
నరుదారన్ గుడికిం బ్రదక్షిణము లయ్యద్రిం బొనర్పంగ వ
త్సరకాలంబునఁ బుత్రుఁ గాంచి నిజవాంఛ ల్దీర మే లందెడిన్. 79

సీ. కనులఁ గాంచనివాఁడు చని నృసింహునిపాద
జల మాని శుభదృష్టి గలిగి మెలఁగుఁ
గుష్ఠరోగము వాఁడు నిష్ఠమై నరహరి
నిర్మాల్యమును గొని నెఱి నెసంగు
రాజయక్ష్మ గలాఁడు రమణ నాహార్యాభి
షేకజలం బాని జోక నొప్పుఁ
జిత్తవిభ్రమముఁ గాంచినవాఁడు నిగమాద్రి
హరిసన్నిధి మెలంగి గరిమఁ గాంచు

తే. భూతములు పిశాచమ్ములు ప్రేతములును
సోఁకె నే జనుఁ డయ్యద్రిఁ జూచి నంత
మాత్ర దవ్వుల పాఱు నాక్షేత్రమహిమ
తలము గా దెన్న వేనోళ్ళచిలువ కైన. 80

వ. అని చెప్పినం గృష్ణభూషణుం డత్యంతసంతోషిత స్వాంతుండై కృష్ణవేణిన్ స్నానంబుఁ గావించి నృహరి సేవించి యట నుండి వెండియు విజయవాటికిం జనుదెంచి యనంతరంబ. 81.

## —• శ్రీశైలము •—

శా. శ్రీశైలం బనుక్షేత్రరాజము శుభశ్రీదానపాత్రం బొకం
డాశైలాగ్రము నూచినంతటన మోక్షావాప్తి యౌ నంచు నా
నాశాస్త్రంబులు వేదముల్ దెలుపు జన్మంబెత్తి తా నుంటకున్
శ్రీశైలేశునిదర్శనంబె ఫలమై చెప్పం దగున్ దేహికిన్. 82

క. అని భూమణుండు మదిలో
ననుకొని యొక్క-శివరాత్రి నాఁగునాఁటి కటకా
జన వలయము నను-చుఁ గొందఱు
చనుచుండఁగ వారిం గూడఁ జనియె నతంతుక. 83

వ. విజయవాటికకడ ధూమశకటం బెక్కి- గుండ్లకమ్మ కంభము లోని ప్రదేశంబులు దాఁటి త్రిపురాంతకము ప్రాంతంబున దిగి పాదచారి యై యనేకపర్వతంబులు వనంబులు గడవ నీది మార్గంబునఁ దెలుఁగు రాయనిచెఱు వనువనంబున సాయంసమయం బగుటం జేసి తైర్థిక లారేయి యట నుండి పో నిశ్చయించి నగంబులక్రింద నెగడులు వైచుకొని నివసించి రప్పుడు నాగభూషణుం డొక్క-నెగడి నాశ్రయించి విశ్రమించె నంతలోన. 84

మ. చిటుకుం బొట్క-ని శబ్దముల్ గలుఁగఁగా నీ తెంతయున్ గ్రక్కు-చుక్
వటవృక్షంబులనుండి నేల హిమ మావ్యాప్తంబుగా రాలి యం
తట నగ్గిం బడి చుంయి చుంయి మను-చుం జల్లార్చి దానిన్ మహో
త్కటమై వెల్లునరూప మొంది పఱచెం ద త్తత్ప్రదేశంబులన్. 85

తే. ప్రజలు నెగడులు దరికొల్పి ప్రజ్వలింపఁ
జేయుచు హిమార్ద్రవస్త్రముల్ చేతఁ బిండు
కొనుచుఁ బడి యార్చుచుం గప్పుకొనుచు నెట్లొ
కాళరాత్రిగతిన్ రాత్రి గడపి రంత. 86

వ. మఱునాఁ డెల్లరం గూడి నాగభూషణుండు పయనంబై నడచి నడచి యిరువదియేను మలకలు గలచుక్క-లమెట్ట నెట్టకేలకున్ దాఁటి శిఖరేశ్వరం బనుదివ్యస్థలంబునకుంజని యట శ్రీశైల శిఖరంబు దర్శించు నపుడు భూషణుండు తనవారిం గాంచి యిట నొక పురాణగాథ కలదు వినుం డని యి ట్లనియె. 87

తే. ఒకమహా శివరాత్రికి నుర్విఁ గలుగు
జనులు-పెక్కు-రు శ్రీశైలమునకు రాఁగ
మల్లికార్జునునిం గని మెల్ల మెల్లఁ
బలికె భ్రమరాంబ చిఱునవ్వు మొలక లెత్త. 88

తే. శిఖర దర్శనమాత్రి నీ క్షేత్రమందు
ముక్తి లభియించు నని శాస్త్రములు వచించు
సత్యమే నది తప మేల? జపము లేల?
సత్క్రియ లవేల? యిది యొండె చాలి యుండ. 89

వ. అనిన నతం డీశాస్త్రంబు దృఢవిశ్వాసంబు గలవారిపట్లం గాని పెర వారిపట్లం గా దీతైర్థికుల కందఱకు ముక్తి లభింపనేర దీయర్థంబు మీకుఁ దార్కాణ గావించెద నని చేయఁ నగున దెల్లం జెప్పి నంత వా రొక్కవృద్ధ బ్రాహ్మణ దంపతులై శిఖరేశ్వర ప్రాంత కాంతార మార్గంబున. 90

సీ. ఒంటూర్పున న్నేల నంటఁగఁ బడి వృద్ధు
చావంగ నున్నట్టిసమయమందుఁ
గడఁ గూరుచుండి కన్గవ నీరు వెట్టుచు
సతి పరిచర్యలు సలుపుకొనుచుఁ
దల్లులారా! లెండు తండ్రులారా! రండు
నాపతిప్రాణము లోపి నిలుపుఁ
డిన్నినీ ళ్ళాస్యమున న్నెఱిఁ బోయుఁడు
మీకుఁ బున్నెము వచ్చు నాకతమున
తే. ననుచు నెల్లరఁ జెయి వీచి యార్చి యేడ్చి
పిలిచి పిలిచి నీ ర్వోయంగఁ దలఁచి కడకు
వచ్చు జనులను గనుఁగొని వగచి వగచి
పలుకు నీరీతి నందఱవలను దిరిగి. 91

ఉ. నాపతి పుణ్యమూర్తి యొకనాఁటికి నేనియుఁ దా దురాత్ముఁడై
పాపపువర్తనిం జొఱఁగఁ బొఱఁడు చేరఁడు దుష్టసంఘమున్
గోపము సేయఁ బోకుఁ డొకకొంచెము నేనియు నీభవంబునన్
బాపము సేయ కుంటి మని భావము గల్గిన నీళ్ళు వోయుఁడీ. 92

ఆ. పాపినీళ్ళు నోటఁ బడినంతనే ప్రాణ
మూడి పోవుఁ బతికి నోద్విజన్ము
లార! వృషలవర్ణులార! రండు మదీయ
పతికి జీవన మిడి ఫలముఁ గొనుఁడు. 93

వ. అనుచు మాటి మాటికిని వచ్చుచుం బోవుచుండువారలఁ బలుకుచున్నంత నెపు డేపాపము చేసితిమో మన కేమిటి కని యెవ్వరును వచ్చి యిన్నినీళ్ళు పోసిన పుణ్యంబునం బోవరై రట్టియెడ నొక్కవారాంగన వడివడి వచ్చి నీరు వోయనుండె నది గని వృద్ధబ్రాహ్మణి తొంటి యట్ల పలికిన వేశ్య యి ట్లనియె. 94

తే. తల్లి నేఁ బాపము లవెన్నొ తొల్లి చేసి
యున్నదానను శ్రీపర్వతోన్నతోన్న
తాగ్రశిఖర మిప్పుడు కంటి నస్మదీయ
పాపములు వోయె మోక్షంబుఁ బడయ నుంటి. 95

వ. అని సందేహింపక వృద్ధబ్రాహ్మణునినోటఁ దీర్థంబు వోసెఁ బోసినంత నతండు మల్లికార్జునుండై సతి సందేహంబు వాపి వేశ్యాంగనకు మోక్షంబు ప్రసాదించె నని పురాణంబునం గల దని చెప్పి చెప్పుచుండ శ్రీశైలంబునకుం జని ధూళిదర్శనంబుఁ గావించి పాతాళగంగకుం జనె నదియును. 96

సీ. పడమటికొండల పరిసరంబున నైన
సహ్యాద్రిపైఁ బుట్టి జన్మతలమునఁ
బ్రహ్మముఖంబును బెట్టి ప్రవహించి పుష్పగి
ర్యాదులు దాఁటి యాంధ్రావనిఁ బడి
జోగుళాంబాపార్శ్వభాగంబునం దుండి
సంగమేశ్వర దేవుసంగతిఁ గొని
కొంతలో నొకకొండగుహఁ బడి పాతాళ
గంగ నాఁ బే రంది పొంగి పొరలి

తే. శ్రీగిరీంద్రముప్రక్కకుఁ జేరి చంద్ర
గుప్తపత్తన వరణంబుగుప్తి కగుచుఁ
జుట్టి పాఱెడునీయేఱు చూడఁ జూడఁ
గృష్ణవేణి యటంచుఁ గీర్తింపవచ్చు. 97

వ. అని ప్రశంసించుచు లింగాలఘాటునకుం జని స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి మరలి వచ్చునప్పు డమ్మార్గంబున. 98

తే. నారసింహబిలం బొకతీరపర్వ
తమునఁ జూపట్టు భూషణోత్తముఁడు దాని
మహిమ నెఱిఁగినవాఁ డొక్క మఱవ కపుడు
దానిలోఁ జొచ్చి యొక్కింత తడవు నిలిచి. 99

వ. తోడివారిం గాంచి యి ట్లనియె. 100

తరువోజ. వినుఁ డిది నరసింహబిలమిందు నృహరి
వెలుఁగొందుచుండు నీబిలమున నుండి
కన రెండుపాయలు గా సూక్ష్మమార్గ
కలితమై చన నైతి గాకుండు నవలఁ
గన వచ్చు సువిశాలగహ్వరి వెల్గు
గాలియు నారంగకదళీవనములు
మును లందు నాశ్రమములు గట్టికొని త
పోనిష్ఠ నుందు రేబామె లెఱుఁగక. 101

శా. ఆలో నొక్కనృసింహదేవళము తత్ప్రాంతంబునం జెర్వునున్
బోలం దోఁచుఁ దజ్జలం బమృతమై పోఁ వోలు రోగాళి త
ల్లీలల్ గాంచినవాఁడు స్వర్గసుఖముల్ చీ యంచు భాషించు రే
లీలో నుండిన వానికిన్ వినఁగ నౌ నెంతేని శంఖధ్వనుల్. 102

ఆ. శ్రీగిరీంద్రమందు సిద్ధులు ద్రవరూప
మైనపరుసవేది యనెడునౌష
ధమును సంతరించి దాచి యుంచి రటంచు
కింవదంతి గలదు క్షితితలమున. 103

మ. తెలియన్ వచ్చు మహత్త్వ మత్తలమునం దేల్పామునుం జెచ్చియున్
బులియున్ సింగ మెలుంగు లోనిమృగముల్ ముట్టంగఁ బోవేరిన్
గలకండన్ ధరఁ బెట్టి యుంచినను దాకన్ రావు చీమల్ సివం
గులు కుక్కల్ గనరా వొకప్పుడును శ్రీగోత్రింబునం జెప్పఁగన్.

వ. అని చెప్పి యట నుండిపోవుచు బాలధార పంచధారయను రెండుజల
ధారలం గాంచి తత్ప్రభావం బభివర్ణించుచుం జని మల్లికార్జును
నారాధించి యిట్లని ప్రార్థించె. 195

కల్పవల్లి. జయ సోమ! నమో జయ రుద్ర! నమో
జయజయ పశుపతి! దేవ నమో
జయ శాంభ! నమో జయ శంకర నమో
జయ జయ ఖలసమితిహర ! నమః
జయ భీమ! నమో జయ శర్వ! నమో
జయ జయ శివతరశీల! నమో
జయదేవ! నమో జయ భర్గ! నమో
జయ జయ మునివరపాల! నమః. 106

వ. అని ప్రార్థించి ప్రసన్నుం గావించుకొని పదంపడి భ్రమరాంబికాల
యంబునకుం జని ప్రణామంబు గావించి. 107

శ్లో. జగజ్జాలం యస్యా స్సకల మకలంకై స్సకరుణైః
కటాక్షైరాపాతై ర్భవతి నద తీతి స్థితిచయః
తత స్సా సర్వేశీ ప్రథితవిభవా! వైభవకరీ
మహాశక్తిః పాయా ద్భ్రమరవరనామ్నా భగవతీ. 108

వ. అని వినుతించి తదనుగ్రహంబు వడసి యట నటం గలయశేషవిశే
షంబులం దిలకించి మిత్రులకుం దెలియం జెప్పుచుం గొన్నినాళ్లుండి
యట నుండి కదలి మఱియు విజయవాటికకుం జని. 109

—॰ భద్రశైలము ॰—

మ. పదియుం దొమ్మిది నూర్లపైం బదియు నౌవర్షంబునన్ భద్రశై
లదిదృక్షం దనమిత్రబృందములు గొల్వం బోయి చైత్రంబునన్
మొదటన్ వచ్చుజయంతి రామవిభు సమ్మోదంబునం గొల్చి య
ప్పదమందుం బదినాళు లుండె నతం డప్పద్మాక్షునిం గొల్చుచున్.

క. ఒకధర్మశాల భూమణం
డొకనంకం గూరుచుండి యొకనాం డొకరుం
డొకండగువానిం దలంచుచు
నకలంకమతిం దలిర్చు నానమయమునన్. 111

తే. సప్తకచ్ఛములం దీర్చి జాను మీఱు
పట్టువస్త్రముం దాల్చి పైం బట్టుకోక

వల్లెవాటుగ వైచి మో మెల్ల నిండ
గీరునామము ధరియించి క్షితిసురుండు. 112

శా. చేతం బుస్తక మొండు పట్టుకొని లక్ష్మీవల్లభుం బాడుచున్
చేతోమోద మెసంగఁ జెంగటికి రాఁ జే మోడ్చి కృష్ణుండు మీ
కేతత్పత్తనవాసు లోటు కరమం దీగ్రంథ మేయర్థముం
బ్రీతిం గూర్చుచుఁ జెప్పఁ జెప్పెడు దయాన్వీతాత్ములై వైష్ణవుల్.

ఆ. అనిన నాతఁ డనియె ననఘ ! నే నీచటఁ బొ
రాణికుండ నిద్ది రాణ లెనఁగు
భద్రశైలరామభద్రచరిత్రము
సంగ్రహించి నేను సలిపినదియు. 114

వ అని చెప్పిన నాగభూషణుండు వానిం గూరుచుండం జెప్పి. 115

తే. కవు లాకో మీరు మీరూపుఁ గనుఁగొనంగఁ
బురుషరూపముఁ గొన్న వాక్తరుణి యనుచుఁ
బోలఁ దోచెడు దయచేసి పురుషమూర్తి
మీకవిత్వము విను కోర్కి మేర మీఱె. 116

వ. అనుటయు నతం డొంగాత మని యట నొక్క చో నొక్కకుశాస
నంబున నాసీనుం డయి యిట్లని పఠింపం దొడంగె. 117

—• భద్రాచలరామచరిత్రము •—

ఉ. భువి మునుఁ బుత్రకాంక్ష మెయిఁ బొల్తుకతోడ సుమేరుశైల మే
పవశమునఁ బర్ణముల్ జలము ప్రాశన మొందక వాన కెండ క
య్యెవమునకుం జలింప కొక యేఁబదినూఱులయేండ్లు పద్మసం
భవునిగుఱించి పెందపము భక్తి నొనర్చె దృఢవ్రతంబునన్. 118

వ. అప్పు డొక్కనాఁ డతనిసమక్షమున. 119

క. కమలజుఁడు ప్రొల్చి యిష్ట
క్రమమున రామార్చనాభిరతు సుకృతమతిన్
గొమరు నిడి చనియెఁ గాల
క్రమమున వానికి జనించె గ్రావము కొడుకై. 120

వ. అక్కుమారుండును రామభద్రపదాంకితుండు గావున భద్రుం డనునామంబు వడసి దినదిన ప్రవర్ధమానుండై. 121

ఉ. రాముఁడె బ్రహ్మవిష్ణువులు రాముఁడె రాజకలాకలాపుఁడున్
రాముఁడె సర్వదేవతలు రాముఁడె సర్వమహీధరంబులున్
రాముఁడె సర్వభూతములు రాముఁడె సర్వనదీనదంబులున్
రాముఁడె సర్వతోయధులు రాముఁడె సర్వ మటంచు నెంచుచున్.

వ. దండకారణ్యంబున శ్రీరామ ధ్యానైక తత్పరుండై పరమతపం బానరించుచుండె నిట్లనేక దివ్యవర్షంబులు కడచనిన వెనుకటి త్రేతాయుగంబున రామచంద్రుండు సజాయానుజుండై వనంబులఁ గ్రిమ్మరుచు వచ్చి యచ్చిలుకొండ నధివసించి భద్ర! నీనిర్నిద్రతపః ప్రభావంబునకు మెచ్చితి వరం బిచ్చెద వేఁడుకొమ్మనుటయు. 123

సీ. నీలంపుఁదాలడాల్ డీలింపఁ జాలుమై
కాలమేఘంబు నాఁ గరము దనర
లీల దాపలిచక్కిఁ జాలుపేరిటికత్తె
క్రొక్కారు మెఱుఁగు నాఁ గొమరు మిగుల
పేరురంబునఁ జారుపేరునఁ గౌస్తుభ
మింద్రధనుస్సు నా నెసక మెసఁగఁ
గడ ధనుశ్శంఖ చక్రములను గంటలు
చాతకరుతమునాఁ బ్రీతిఁ గొలువఁ

తే. బరమ కరుణారసము భక్తవరుల కొసఁగు
వాని వెలుపల విల్లమ్ము లాని తమ్ముఁ
డున్నవాని సుర్మనఁ బల్కుచున్నవాని
రామభద్రుని భద్రుండు రమణఁ గనియె. 124

క. కని భయము భక్తి విస్మయ
మును వినయము వైళ ముల్లమునఁ బెనఁ గొన మే
దిని సాఁగిలఁబడి సాష్టాం
గనమస్కృతి చేసి యిట్లు కడకఁ నుతించెన్. 125

సీ. ఎవ్వానిపదరజం బింతసోఁకినమాత్రఁ
బాషాణ మది యొక్కపడఁతి యయ్యె
నెవ్వానికడకేల నెత్తఁ జూచినమాత్రఁ
ధూర్జటివిల్ తునాతునియ లయ్యె
నెవ్వాఁడు చేసేత నింత ముట్టినమాత్రఁ
బరశురామునిగర్వభంగ మయ్యె
నెవ్వానికందోయి యెఱ్ఱఁ బాఱినమాత్ర
రావణుం డిటఁ ద్రెళ్లి చావ నయ్యె
తే. అట్టిశ్రీరామచంద్రుఁ డహార్యధైర్య
సాంద్రుఁ డతివైభవజితామరేంద్రుఁ డమల
కీర్తిచంద్రుండు వైకుంఠమూర్తి గాక
మర్త్యమాత్రుఁడు గాఁ డని మదిఁ దలంతు. 126
సీ. పార్వతీదేవి మున్ బ్రఖ్యాతిఁ గాంచుట
తారకమనుమహత్త్వమునఁ గాదె
వల్మీకభవుఁ డొప్పి వాచంయముం డౌట
తారకమనుమహత్త్వమునఁ గాదె
హనుమంతుఁ డెప్డుఁ జావనివరం బందుట
తారకమనుమహత్త్వమునఁ గాదె
గుణభూషణుఁడు విభీషణుఁడు పేర్మిని గొంట
తారకమనుమహత్త్వమునఁ గాదె
తే. వారణాసీపురిం ద్రెళ్లువార లెల్లఁ
గాక లోకంబులం గలలోకు లెల్ల
ముక్తిసీమంతినీమణీరక్తు లగుచుఁ
దగుట తారకమనుమహత్త్వమునఁ గాదె. 127
పంచచామరము. మరా మరా మరా యటంచు మాన కెల్లవేళలన్
బరాత్పరున్ బరాపవాద భంజను న్నిరంజనున్
నిరంతరంబు స్వాంతమందు నిల్పి పొల్పు మీఱఁ గా
నిరామయుండు నై జపించి నిత్యుఁ డయ్యె వ్యాధుఁడున్. 128

డకము:—శ్రీజానకీ హృత్సరోజార్యమా! హాటకాహార్యధైర్యా!
త్రిలోకోత్తరానూనదివ్యప్రభావా! విభావ స్వనూచాన
గోత్రోద్భవా! భావనాతీతభావా! భవద్వైభవం బెన్న నింద్రాభ
వాబ్జోద్భవాదుల్ మదిం జాల రన్నం దలంపంగ నే బాలుఁడన్
లోలచిత్తుండ మత్తుండ మాయామనుష్యాదినారాయణా! నారద
వ్యాస వాల్మీకి గర్గాది వాచంయమి స్తోత్రపాత్రా! పవి
త్రాత్మ! నీవే కదా మీనకై దార్కొన్న గ్రాహంబు శిక్షించి
దంతీంద్రు రక్షించి తీవేకదా! యేకదా చోరుఁడై నీరధిం
జేరునా సోమకున్ గానుకం జేపవై యేఁపు వే మాపి పెన్మిన్కు
లత్త్రాత కర్పించి తీవే కదా! కాకఁ దాఁబేలవై లీలమై వెల్లిలో
మున్గగ కొట్టి బిట్టాది దేవాళి కెంతే సుధాప్రాశనం బిచ్చి
తీవే కదా! సోకుఁ బా సేలఁ జుట్టంగఁ గోలంబవై పుట్టి బి
ట్టాతనిం గిట్టి లోకంబు రక్షించి తీవే కదా! జోక దాకొల్పి
శ్రీ నారసింహాంబవై రంహమౌ దైత్య సంహారముం జేసి
యాత్మార్భకప్రహ్లాదుఁ బ్రహ్లాదునిం బ్రోచి తీవే కదా!
నాకదా! గుజ్జుకుజ్జుండవై యుబ్బలి న్వేఁడి ముల్లోకముల్ గొంటి
వీవే కదా లోకదాహంబు మాపంగ రాముండవై సారెకున్
రాజలోకంబు శోధించి శోధించి ఖండించి తీవే కదా! యేక
దారానుకూలవ్రతా! దేవ! శ్రీరామనామంబునన్ లోకవిద్రా
వణున్ రావణున్ గూల్పఁగా నుద్భవం బంది నా పాలిభాగ్యం
బవై చెంగటం బొల్చి నన్నేల నున్నట్టి నీ వావికుంఠాధివాసుండ
వౌ వాసుదేవుండవౌ దేవదేవుండ వో దేవ! నీకే నమస్కార
మర్పింతుఁ గారుణ్యపూర్ణుండవై కాచి రక్షింపవే నన్ను నీదాసు
నిన్ రామచంద్రా! కృపాపూర్ణచంద్రా! నమస్తే నమస్తే నమః. 129

అని వేఁడి భద్రుఁ డిట్లను
నను నేలఁ దలంచి తేని నారాయణ! నీ
వనుజునితో ధరణిజతో
ననిశము నా శిరమునందు నాఁగఁగ వలయున్. 130

వ. అని భక్తుండు భక్తితాత్పర్యమ్మున వేఁడిన నట్ల యగుం గావుత మని రామభద్రుండు భద్రశైలంబున సజానుజుండై యుండి భక్తులకు భుక్తిముక్తిప్రదుం డయ్యె ననంతరకాలంబున. 131

—• పోకల దమ్మక్క కథ •—

తే. భద్రగిరి కెంతదవ్వున భద్రిరెడ్డి
పాలె మన గ్రామ మగు నందుఁ బరమభక్త
రాలు పోకలదమ్మక్క యనెడుశూద్రి
కలదు నిప్పచ్చరంబునఁ గప్పఁ బడుచు. 132

ఉ ఆయమ యొక్కనాఁడు తనయాంశనపుత్త్రునితోడఁ గొండకుఁ
బోయి వనప్రదేశమునఁ బుల్లల నేరుచుఁ బిల్లవాఁ డెటో
పోయిన వానినిఁ వెదకి పొంద్దగుచుంతఁ గాన కార్తనై
నోయి కుమార! యెం దరిగితో యిట రాఁ గదె యంచు బిల్చుచుఁ.

ఆ. ఓయి కన్నతండ్రి! యోకుమారక! రావె
యెందుఁ బోయి తనుచు నిందు నందుఁ
బిలుచు చున్నయపుడు పలికె "నో" యని రామ
చంద్రుఁ డక్కుమారుచందమునను. 134

చ. పలికినచోటికిఁ వడిగఁ బోఁటి కుమారుని జాడఁ గాన క
త్తలమున నిందనీలముల దగ్గరచుట్టము నోలెఁ దేజరిఁ
వెలిగెడు మేనితోఁ దనరి వేఁడుక లోడిక లెత్తఁ దమ్మ్ముఁడున్
వెలఁదియుఁ గొల్వ నున్నరఘువీరునిఁ గన్గొనె వింత నొందుచుఁ. ౧౩౫

వ. తనమనంబున. 136

ఆ. ఇన్నినాళ్లనుండి యీవనగంబున కేను
వచ్చుచుంటిఁ గాని వాసి మీఱ
నిట్టివిగ్రహంబు నెన్నఁడుఁ జూచి నే
నెఱుఁగ వింత యయ్యె నిపుడు నాకు. 137

ఆ. రామచంద్రుఁ డింపఁ గ్రాలు చుండెడి నంచు
వింటి నాతఁ డేమొ వెలఁది సీత
యేమొ కడల నున్నయితఁడు లక్ష్మణుఁ డేమొ
యవలఁ దెలిసికొందు ననుచు నామె. 138

వ. కుమారుండు తప్పిపో జనకతంబున వ్యగ్రహృదయయై కొడుకా! యని పిలుచుచు మరలి పోవునంత. 139

శా. ఓహో! నే నిట నుండ న న్నరయు కీ వొండొక్క-చోఁ జూడఁ గా
నూహింం తేటికి రమ్ము వచ్చిం జరిగి నాయున్కిం గనం జాలు దే
దేహాయాసము కాక మళ్లు మనినన్ దిక్కుల్ విలోకించి సం
దేహం బందుచు శబ్ద మైనకడకున్ విచ్చేసెఁ బుత్రభ్రమన్. 140

ఆ. అచటఁ దొంటివిగ్రహమ్ముల కనఁ బడెఁ
గాని కొడుకు జాడ గానఁ బడమి
దద్దరిల్లుచున్న దమ్మక్క-కడఁ బొల్చి
రామచంద్రుఁ డనియె రమ్యభణితి. 141

వ. నేను రామచంద్రుండ నిన్ననుగ్రహింప నీతనయుండువోలె "నోహో" యని పలికితి నదే నీతనయుండు వచ్చు నన్ను నీ విటఁ గొల్వుము నీకోర్కి-లీడేరు నని తొంటియట్లయ్యె దమ్మక్కయు నివ్వెఱంపడుచు నతండు పరమేశ్వరుం డని నిశ్చయించి పూజించి తాళఫలంబు నివేదించి కొడుకుం దోడుకొని పల్లెకుం జని యట గ్రామణి యగు భద్రిరెడ్డి కావృత్తాంతంబు సెప్పిన భక్తుండగు నతం డట నొక దేవళమ్ము గట్టించె దమ్మక్కయుఁ బ్రతిదినంబునుం జని రాముం బూజించి తాళఫలంబు నైవేద్యంబు చేయుచుండు నిట్లు కొన్నిదినంబులు జరిగినప్పు డాదమ్మక్క- తనచిన్నికూఁతుం బిలిచి రాముం బూజించుచుండు మని చెప్పి తాను గుమారునితో నితరగ్రామమునకుం జనియె నాబాలికామణియు నానాఁడు తనయింట నున్నసిద్ధాన్నంబుఁ గొని పోయి స్వామిదర్శనంబు చేసి యన్నంబు నివేదించి తిను మని ప్రార్థించినను రాముం డాయన్నం బారగింప రాఁడయ్యె నయ్యెడ నాబిడ్డయు. 142

నాతల్లి కొట్టు నన్నున్
నాతండ్రీ! రామచంద్ర! నాయిడునన్నం
బీతీఱునఁ గొనకుంటివి
నాతప్పే మైనఁ గలిగినం దెలుపఁ గదే. 143

హించి తిరోహితుం డయ్యె ననంతరకాలంబునఁ గబీరుముఖ్యులెంద
ఱో రామమంత్రప్రభావంబున ముక్తిం గాంచి రక్కాలంబున 150

—. తానీషా వృత్తాంతము :—

శా. తానీషా యనుమ్లేచ్ఛవల్లభుఁడు హైద్రాబాదునందుండి యాం
ధ్రానంతక్షితి నేలుచో నియమయి యక్కన్న మాదన్న లా
ఘనిం గైకొని మంత్రులై మిగులఁ గీర్తిం గాంచి రవ్వారికిన్
మేనల్లుం డగుగోపనార్యుఁ డొకఁ డుండెన్ భద్రశైలంబునన్ 151

తే. వేద గిరి బాణ భూ సంఖ్య వెలయుశకము
నందనాబ్దమునం జైత్రమందు మొదటి
నవమి నాదివారమున నా నయవిదుండు
భద్రగిరిఁ జోఁ బనస్థుఁడై ప్రతిభఁ గలిమె 152

మ. తహసీల్దారుఁడై యుండి రాజధనమున్ దా నెన్నియో లక్షల
న్వాహామహుఁ రాముని సేవకై వ్యయము సేయం జాలి యున్నప్పు డ
వ్వసుహీనాథుం డది యంతయుం దెలిసి యమ్మాదన్న మేనల్లు నా
గ్రహ మెచ్చం గొని బందెఁ బెట్టె ధనముం గాంక్షించి శిక్షించుచున్.

ఆ. రామదాసు హైదరాబాదులో బందె
ఖాన లోన నున్నకాలమందు
భక్తిఁ దత్సచివుని బాపువాఁడై రామ
భద్రుఁ డపుడు భటునిపగిది నగుచు. 154

ఉ. తమ్ముఁడు దాను నర్థసముదాయముఁ గొంచు గడీని దాఁటి లో
నెమ్మి శయించి యుండిన తనీషమహీపతి లేపి రామదా
సిమ్మని నీకు నర్థ మిడె నే మిటుఁ దెచ్చితి మీవు దీని గై
కొమ్మని యర్థమెల్ల నటఁ గుప్పలు వోసిరి లెక్క చెప్పుచున్ 155

క. ఈఁ గలయర్థం బంతయు
నీగతి నిడ దాని యవననృపతల్లజుఁడుం
దాఁ గొని రశీ దొసంగెను
మాఱుగంటం గనుచు భటుల మాపటివేళన్. 156

వ. రామలక్ష్మణు లాశ్రిత గాని రామబాణము దున్నచోటం బడ నైచి పోయి గంత నది యంతయుఁ దెలిసి మహనాఁ డరుణోద యంబున రామదాసు బంధవిముక్తుండై భద్రాచలంబునకుం జని రామభక్తుండై మా క్రింగ గాంచె మఱిరాము ననేకమహాత్మ్యంబు శ్రీ భద్రశైలరామభద్రుని యెడలం జూపట్టు నని చెప్పు మ నంతర్ధా నంబు నొందె నమృతానందుం డానందకంటకపులకితహృదయారవిం దుండై యక్కంతు రామచంద్రుం డనియుఁ ద న్ననుగ్రహింప నట్లు దర్శనం బిచ్చెననియు నిశ్చయించి ప్రార్థించి ప్రార్థించి తదేకధ్యాన తత్పరుండై కనుమోడ్చి నంతలో నప్పొరాణికుండు కలం బొలిచి నేను రామచంద్రుండ నీవు నాభక్తుండవు నీ వీపు లోకంబున మోక్షమునీవు నీయధ్యాత్మతత్త్వంపు సారంబున భక్తుల నుద్ధరింపు మని చెప్పితిరోహితుఁ డయ్యె భూషణుండును గన్నుదెఱచి నలు గడలం బరికించి తాను కృతార్థుండ నైతి నని సంతసించుచు. 157

సీ. దేవళంబున కేగి దేవదేవుని పాద
పద్మంబులకు భక్తిఁ బ్రణుతిఁ జేసి
శంఖచక్రములు హస్తముల వ్యత్యస్త మై
యుంట కత్యాశ్చర్య మొంది మదిని
వామకరంబున వామ దేవుశివలింగ
చిహ్నము గమనించి చిత్రమొంది
పోకలదమ్మక్కపుత్రి కీతఁడు పొల్చి
యన్నముఁ దినిన చో టాకళించి

తే. భద్రి సంప్రార్థనంబున వడి నదిని దివి
నుండి యుఱికిన చోఁ జూడ నొప్పుపాదు
చిహ్నములు చూచి ప్రణమిల్లి శేషభూష
ణుండు పరవశుఁడై భక్తి నుండె నపుడు. 158

వ. ఇట్లు నాగభూషణుండు భద్రాచలంబున రామభద్రువి సేవించుచుఁ గొన్నినాళ్ళుండి దక్షిణదేశయాత్రాచణశీలుండై కదలి కతిపయ ప్రయాణంబులఁ జెన్నపురంబునకుఁ జనియె నదియును. 159

—) చెన్నపురీవర్ణనము (—

ఉ. చెన్నఁడు పల్లెకేఁ బొగడుచుఁ జెప్పఁగ నొప్పెడు నుష్ట్ర ప్రాంతఁ గా
నున్నప్రదేశమందు మును పోర్చుగఁడు పల్లియ యుండఁ నందుపై
నున్నతభాగ్యభోగ్యముల నొప్పెడునట్లు పురంబు గట్టి రా
చెన్ననివేర నయ్యది ప్రసిద్ధికి నెక్కెను రాజధానియై. 160

సీ. లాకలేజీలు కళాశాలలుఁ బ్రవర
సాంస్.శాఖాపాఠశాల లందు
హైకోర్టును గవర్నరాఫీసును బోర్డు
మెడికలాఫీసులు మేల్ నగరులు
తగుచిత్రవస్తుప్రదర్శనశాలలు
రైలుస్టేషనులు యంత్రాలయములు
నవనవోద్యానవనములు కేళిసౌధ
ములు పురమునందెసఁగులును మఱియు

తే. కేశకూళులు వివిధదేశాలవాసులు
దివ్యభవనములును తెంప్లదేవిడీలు
గంటకంబముల్ పూలచెంగటను గలిగి
చెన్నపత్తన మొప్పెడు క్షితితలమున. 161

ఆ. ఉదధిలోనఁ గొన్ని యోజనంబుల దూర
మందు నున్ననావికాగ్రణులకుఁ
గాంచఁ గల్గునట్లు గాఁ దీర్ఘ దీపపు
టింటిలోనియంత్రి మెల్లఁ బొద్దు. 162

ఉ. ఎత్తగు కట్టడంబున నొకించుక గాని గతిన్ ముదంబు లో
హాత్తఁగఁ జేయుచున్ బురి మహార్ణవభూపదమందు మున్నరో
లత్తఱి గత్తలానిపయి నారయ వచ్చెడుఁ జిత్రరూపుఁడై
యుత్తమజీవముల్ గలుగునో యనునట్టులు పోలఁ దోచుచున్.

ఉ. కానిమరాఖ్యలై బ్రిరరి గన్గొన నొప్పెడు నప్పురంబునన్
దానివిలాస మింతని యథార్థము చెప్ప నశక్య మేరికిన్
మానికృతప్రబంధములు మానవనిర్మితముల్ మహాకృతుల్
కానఁగ వచ్చు నచ్చటను గౌతుకముం బొనరించునట్టివై. 164

తే. హిందుదేశమునం గలయెల్లగ్రంథ
రాజములు దెచ్చి యచ్చోఁ దేజ మెసఁగ
సంగ్రహించిరి ప్రాగ్నాది సత్పురుషులు
హైందవుల ప్రాణములు నిల్పు నం దటంచు. 165

ఉ. శిల్పము లెన్నియో యచటఁ జిత్రవిచిత్రము గాఁగ నిల్పి రా
కల్పనముం గనుంగొనఁగఁ గంజజుకల్పన మంచుఁ దోఁచు సం
కల్పము లేనివానికిని గల్గెడుఁ దచ్చరితల్ వినంగ నా
నల్పము గానికోర్కి యని హైందవజాతికిఁ బ్రాణపంబులే. 166

తే. ముసల ముద్గర కరవాల ముఖ్యము లగు
నాయుధమ్ములు వి ల్లమ్ము లాది యుద్ధ
సాధనమ్ములు గ్రంథకోశమ్ములందె
కాక యాలైబ్రరీయందుఁ గాన నగును. 167

తే. ప్రజలతోటె సివంగులు భల్లుకములు
పులులు క్రోఁతులు సింగముల్ మొదలగుమృగ
ములును నానావిధంబు లై వెలయుపక్షు
లును జనులమదులఁ గలంచుచును దలిర్పు. 168

ఉ. అందగుపక్షిసంఘమునయం దొకపక్షి విచిత్రవర్ణముల్
పొందుపడంగ లోకమును మోహమునం బడవేయుఁ జాలి మే
లందముఁ జందముం గలిగి యబ్జజుసృష్టికి నావి లెక్క యై
కందొవవిం దొనర్చెడిని గన్గొనినంతన యెంతొ వింతగా. 169

ఆ. దానిరూపు దానిమేనిరంగులు దాని
సోయగంబు దెలుపఁ జొప్పడనిద
రే లోకప్పు డద్ది యాలపించున్ రాగ
మనుచు నెఱుఁగ వచ్చు నాగమముల. 170

క. ఆపురికిఁ దూర్పుదిక్కున
నేపారెడునీరుపామి యెంతయు సంతో
షాపాదకమై వివిధ
వ్యాపారాపారధనసమర్పణచణ మై 171

—॰ సేతుదర్శనము ॰—

సీ. అలయుకరాపారమంబు నచ్యుతుండు శయించు
నది నిషంగము త్రిపురాసురారి
కమరులకుం బెట్టె నన్నము కడుపార
నఖిలాపగలకు గమ్యస్థలంబు
బడబానలమునకుఁ బానీయశాలిక
సిరికిఁ బుట్టినయిల్లు సురవిభునకు
గజ ధేను మణ్యశ్వ ఘనవస్త్రములు గల్గఁ
జేసినవరదాతృశేఖరుండు
తే. వేలుపులవంటయిల్లు కుంభినికి మరాంజి
రత్నముల కాకరంబు చంద్రమునితండ్రి
భీమలింగమునుం గన్నసామి సగర
నృపతనయమోక్షభూమి యన్నీరవాధి. 172

చ. పెనఁగ జగంబు లెల్లుమగపిడ్డను బొడ్డునఁ గన్నదొడ్డవే
ల్పున కిడి లిబ్బిఁ బ్రబ్బుతనముద్దులకన్నియఁ బెండ్లిచేసి పెం
పసవడఁ గొంతుతోడఁ దనయల్లుని నిల్లటముంచుకొంటి నే
నని కడుసంతసంబునఁ గదా యది మిన్నులు ముట్టు నెట్టనన్. 173

వ. అని యభివర్ణించుచు సేతుదర్శనంబుఁ గావించి నమస్కరించుచు.

చ. జలముల జాలు తేలునటు సల్పి బలంబుగ సేతునిర్మితిన్
నలుఁ డను వానరుండు సును నల్పుగఁ జేసెను భూరిభావనిన్
గటగిన నేర్పు పెంపునను గా దని రేని యొకానొకండు నే
నలువుగ నుండినట్లు పనఁ జాలితమే పరఖండమండలిన్. 175

తే. సకలకళలును భారతశాస్త్రతలములఁ
గలిగినట్లు వినంబడు గ్రంథములును
గాని యొండొక్కకళయు నేఖండమందుఁ
గలిగి యుండినజాడలు కనము వినము. 176

వ. అని ప్రశంసించుచుం దిరువళ్ళిక్కేణికిం జని యప్పురుషోత్తముండు
పార్థసారథిప్రభృతిదేవతలం బరికించి సేవించి పురంబునం గల

యశేషవిశేషంబు లరసి యటనుండి చెంగల్పట్టు పక్షితీర్థము
మహాబలిపురము కాంచీపురి చిదంబరము తిరువణ్ణామలై తిరుత్తని
తిరువళ్ళూరు లోనగు పురంబు లరయుచుం బోయి మధురాపురంబున
మీనాక్షి నీక్షించి రామేశ్వరంబునకుం జనియె నదియును. 177

—॰ రా మే శ్వ ర ము ॰—

శా. మున్నా రాముఁడు రావణాసురుని సంహారంబునం దున్న పా
పౌన్నత్యంబును బాపుకో నల వియూనాత్ముం బ్రతిష్ఠింపఁ గా
హ్వాన్నాళీకముసం దలంచి యవిమాక్తేశానలింగంబు దె
మ్మన్నం బోయిన హన్మ మూర్తమున కిం తాలస్యముం జేయుటన్.

తే. అభవులింగము దెచ్చుకునంతలోన
మూరుతము దాటిసించుట నారసాక్షుఁ
డిసుక లింగము గాఁ జేసి యిటఁ బ్రతిష్ఠ
చేసి పూజించె నది మహాక్షేత్ర మయ్యె. 179

వ. నాగభూషణుం డా రామలింగేశ్వరు నారాధనంబు గావించి యట
నుండి కుంభఘోణంబు చిదంబరంబు లోనగుపుణ్యస్థలంబులు సేవించి
శ్రీరంగంబునకుఁ జని యచ్చట. 180

—॰ శ్రీ రం గ ము ॰—

స్రగ్ధర:-
సప్తప్రాకార మధ్యస్థము నజముఖముఖ్ సాధుసంసేవ్య మస్తో
ద్గుప్తం బార్యేంద్రపూజాగుణకలితము ప్రాగ్గోళభూభాగగమ్యం
బాప్తేశానప్రియం బార్యనుతము దశకంఠానుజానీత మంచ
ద్దీప్తిస్థానంబు పొల్చున్ దివిజవరదమై దేవళం బున్నతం బై. 181

తే. అద్ది పూసెజ్జ యిక్ష్వాకునాలయమున
నుండు నది విభీషణునకు నొసఁగె రాముఁ
డపుడు లంకకుఁ గొనిపోవు చాతఁ డచటఁ
బెట్ట రంగఁడు రాఁ డయ్యెఁ బెకలి కొనిన. 182

వ. చేయునది లేక విభీషణుండు సెజ్జతోడ రంగని విడనాడుకొని
చనియె నని స్థలపురాణంబు విని మనవిభీషణుండు రంగనాయకుల
కభివందనాదికం బాచరించి జంబుకేశ్వరంబునకుం జని. 183

—॥ జంబుకేశ్వరము ॥—

శా. ఏకాలమ్మును జంబువృక్షమొకపం డిచ్చు న్నివేదింప నా
ళ్లోకైకేడ్యుఁడు జంబుకేశ్వరుఁడు లోలో దానికిన్ మెచ్చి తా
నాఁకొన్నట్లు గ్రహించు నేఁటివఱకు న్నియాచారపత్యద్భుతం
బై కానంబడు సంచు వించు మిగులన్ హర్షించుచున్ మ్రొక్కుచున్.

వ. స్వామిపూజనంబు గావించి కదలి కతిపయప్రయాణంబుల శ్రీకా
ళహస్తీశ్వరమ్మునకుం జనియె నదియును. 185

—॥ శ్రీకాళహస్తీశ్వరము ॥—

మ. వనమునం దొక్క మహాశలింగము స్వయంవ్యక్తంబయై యుండ శ్రీ
యన సాలీఁడది చూచి తంతువులచే నమ్మూర్తిపై నిల్లు గ
ట్టెను బా మొం డరుదెంచి పై ఫణముఁ బట్టెన్ హస్తి నీ రెచ్చి ము
క్కున నాలింగముమీఁదఁ జల్లె గుడి వోఁ గోర్కెం బ్రదర్శించుచున్.

తే. ప్రత్యహం బిట్లు పూర్వోక్తఫక్కి జరుగు
చుండ నొకగొల్లఁ డీక్షించి కొం డొకిన్ని
మేకపాలను గొనితెచ్చి లోకవిభుని
కడ నివేదించి త్రావు మం చడుగుటయును. 187

వ. వానిభక్తికిం బరితుష్టుండై పరమశివుండు బాలుండై వచ్చి పాలు
గ్రోలుచుండు నది క్రమంబున లోకం బెఱింగి యట నొక దేవళంబు
గట్టి దేవదేవునకు శ్రీకాళహస్తీశ్వరనామంబు వెట్టి పూజించి
రనంతరంబ. 188

ఉ. కన్నప నాఁగ వ్యాధుఁ డొకకాలమునం దల దేవదేవునిం
గన్నులఁగాంచి లోన నధికం బగుభక్తి భజించి నిచ్చలున్
వన్నెలు వాసనల్ గలుగువన్యసుమంబులు పండ్లు దెచ్చి తా
నెన్నియొ రీతులం గొలిచె నెప్పుడును న్నిడ కుండునట్టిదై. 189

వ. ఇట్లధికనిష్ఠాగరిష్ఠుండై మహాభక్తుం జేసి యీశ్వరసాక్షా
త్కారంబు గావించుకొనిన తిన్నప్ప యొక్కనాఁ డాశంకరుని
కన్నులవెంబడి నీరు గారుటం జూచి చింతించుచుఁ గొన్నిమందులు
తెచ్చి వేసియు ఫలంబు గానక దుఃఖించుచు నిట్లనియె. 190

ఉ. కన్నులు గల్గి నేను కడుఁగౌతుకమొందుచు నుండ నీ వటుల్
కన్నుల నీరు గారఁ గడుగాసియు నొందుచునుంటి తండ్రి! నీ
బన్నముఁ జూచి నే నెడఁద బమ్మరిపోవుచుంటి నే మందు తెచ్చియో
యున్నవి తెచ్చి వేసితి నదేమనయు ఫలించుటలేక పోయెఁ బో. 191

క. నీ విట్లు కంటిబాధన్
దేవరు పడుచుండఁ గంటఁ దిలకించుచు నే
నీవరుస మనఁగఁ జాలను
దేవా! నాకన్ను నీ కిదే కొను మిప్డున్. 192

వ. అని తన దక్షిణనేత్రంబు నిం దీసి శ్రీకాళహస్తీశ్వరుని నేత్రంబునం బెట్టి రెండవనేత్రంబు దీయుచుండ నక్కాదేవుని రెండవనేత్రం బుండు తావు కానుపింప దని యాటఁ దన చెప్పుకాలడియాలంబుగం బెట్టి కన్నుం బెకలించుకొనుచున్న సమయంబున మహాదేవుండు ప్రత్యక్షంబై వారించి వాని కన్ను వానికిచ్చుటయు కాక మోక్షంబునుం బ్రసాదించె. నట్టిమహాదేవలింగంబున నిప్పటికిని శ్రీకాళంబులును గజదంతంబులును గన్నికన్నును గానంబడుచుండు నని విని మనంబున సంతసించుచు నాగభూషణుండు దేవతాదర్శనంబు గావించి షోడశోపచారంబులం బూజించి యట నుండి కంచికిం జని వరదరాజస్వామి నారాధించి పయనం బై సోమశిలాదిపుణ్యస్థలంబులు చూచి తత్తత్ప్రదేశంబుల వేదాంతగోష్ఠులు సంస్కృతాంధ్రాంగ్లభాషలం బచరించి పేరు గాంచి మరిలి మచిలీపురంబునకు వచ్చి కొన్నినాళ్లుండె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వల నాగభూషణయోగి యెట్లు ప్రవర్తించెం జెప్పు మని సూతు నడుగుటయును. 193

—• ఆశ్వాసాంతము •—

ఉ. భూషణసచ్చరిత్రమిది భూషణ మంచు రచించి నీకు నే
భాషణముం బొనర్చితి భవత్పదమం దిడి నాఁడ నాకు నీ
వేషము భాషయుం దలియవిన్నను వింతయు లేదకైన నా
భూషణమూర్తికీర్తి యని శ్రీవరం దలంపుము నన్ను నాకృతిన్.

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబునం
జతుర్థాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

# అమృతానందము



## పంచమాశ్వాసము

కాంచనపలికనకాం
బాకలితవిశాలసౌధ వ్యూహసమర్ధా
లోకైకవినుతప్రాజల
నేకాలము నొందు వేంకటేశ్వర! దేవా! 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు భూషణస్వామి మచిలీపురంబునకు వచ్చి యున్నయప్పు డొక్కనాఁ డొక్కపుడు వృద్ధబ్రాహ్మణుండు వచ్చి మనభూషణస్వామిని దర్శించి తన్నెఱింగించుకొనిన నతం డతనిం గాంచి మీపుర వృత్తాంతము విన నభిలషింతు నెఱింగింపు మనిన నతం డతని కిట్లనియె. 2

—• మంథెనవృత్తాంతము •—

మ. కనుఁగొ నుత్తరపశ్చిమంబునను మాగ్రామంబు గోదావరీ
ఘనతీరంబునఁ గాకతీయనృపలోకగ్రామణీందార్పితం
బును భవ్యం బగునగ్రహార మగుచుం బొల్పొందు నం దెందఱో
ఘనపాఠుల్ గల రెల్లధర్మము లటం గ్రాలుం జగం బెన్నఁగన్. 3

తే. అట సనాతనధర్మమునందు నిలిచి
స్త్రీలు పురుషులు వర్తింతు రార్యులు నధ్వ
రములు పెక్కులు నేటేటఁ బ్రకృతిధర్మ
కర్మములఁ బో నెఱుంగ రాగ్రామజనులు. 4

సీ. చెఱఁగు మేల్ముసుఁగుగా శిరముపై వ్రేలాడ
చిక్కనై మొఱవైనచీరఁ గట్టి
పసుపు పూసినమోముపైఁ బెద్దరూప్యముఁ
బోలిన కుంకుమబొట్టుఁ బెట్టి

గానుగఁజోటకిం గట్టు వేసినయట్లు
మెలికయొడ్డాణంబు మొలకుఁ జుట్టి
యద్దాలఁ గుట్టినమొద్దుబొజితిడోల్ల
రవిక మోచేతులఁ దవ్వులఁ నొడిగి

తే. వాడవాడల నుండినచేడె లెల్ల
సందెవేళల నుంగిళ్ళయందుఁ జేరి
పదుగురుం గుప్పకరి గొని పలుకు చుండ్రి
మంథనపురంబునం గలమగువ లెల్ల. 5

క. వేదము లచ్చట నుండెను
భూదేవకుమారు లెల్ల పొద్దులు మూలం
బాది ఘనాంతము గాఁ జదు
వేదినమును జదువుచుందు రింటింట నధిక. 6

ఉ. గౌతమమౌని త్ర్యంబకనగంబుననుండియు గంగతోడ నా
ప్రాంతపదంబుఁ జేరుకొనఁ బోవునయప్పుడు దారి కడ్డుగా
నైన తలిలింప రానిపృథులాద్రి యొకం డట దోఁచె దాని నే
రీతిని నేఁ బెకల్చి చనరేఁచెను గాని తరంబు గామి నై 7

తే. గంగ యుప్పొంగి తత్ప్రాంతగహ్వరీత
లం బదెల్ల నడంగ మౌని సంబరమునఁ
జేయునది లేక యట నొక్క శివుని లింగ
మును బ్రతిష్ఠించి యిట్లని వినుతిఁ జేసి 8

సీ. జయ గిరీశ! సురేశ! జయ జగతీనాథ!
జయ నుతత్రిదివేశ! జయ పరేశ!
జయ జగద్భరణేశ! జయ కృత్తభవపేశ!
జయ జితభవనాశ! జయ శివేశ!
జయ సర్వవిశ్వేశ! జయ గౌరవరవేశ!
జయ గుప్తలోకేశ! జయ వ్యాదీశ!
జయ కలితరమేశ! జయ కృతఖలనాశ!
జయ గతవీకాశ! జయ నదీశ!

తే జయ సకలభూతవినివేశ! జయ సతీశ!
జయ మనోజ్ఞగగనకేశ! జయ ఋషీశ!
జయ జగద్ధతహృత్క్లేశ! జయ మహేశ!
జయ రతీశతనువినాశ! జయ మహేశ! 9

తోదకము. అపరాధసహస్రసహస్రకరా
నపి భక్తజనా న్నవ దంఘ్రినత
ప్రవరా నవ సీదృశ మీశ్వర పం
కృపయా పరిపాలయ కృష్ణనుత! 10

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు గౌతమసారికాంక్షి సమక్షంబునం బ్రత్యక్షంబై వత్సా వగవకుము నే నిదె వరం బిచ్చెద నింతలో నీగోదావరికిన్ భూరిభూధరంబునం బగుల్చుకొని పోవం జాలినవ జ్రమయశక్తి నొసంగితినీప్రతిష్ఠితం బగునామూర్తిం దర్శించినవారు సకలార్థసిద్ధులం బడయుదు రని తిరోహితుండయ్యె నంతలో నుప్పొంగి గంగ భూధరంబులం బెల్లగించుకొని ప్రవహించె నని మఱియు నాగౌతమప్రతిష్ఠితం బగు మహాదేవుని కర్ధక్రోశదూరంబునం బర్వతంబు ప్రక్కనున్న గౌతమీకాసారంబున. 11

మత్తకోకిల: బల్లు లంతలు నేన్గు లంతలు పట్టఁ బగ్గము లేనియ
ట్లల్ల నల్ల మొసళ్ళు మడ్గునయందు మునుగుచుఁ దేలుచుక్
నల్ల పచ్చని మెర్పుఁ దెల్పును నాల్గురంగులు గ్రాలఁగా
నల్లమంథన యేటిమడ్గునయందు నారయ వచ్చెదుక్. 12

తే. ఆమొసళ్ళను జూడఁగా నతిభయంబు
నతిముదంబును మదులకు నంట వచ్చు
నట్టిదృశ్యము ధరఁ బొడఁగట్ట దెచట
నన్నిగాహము లొక్కచో నగుట లరిది. 13

ఉ అచ్చటికొండఱాలపయి నల్లరఘూద్వహుజన్మ మాదిగా
నచ్చట నచ్చటం గలుగు నద్భుతముల్ కపిరాజు హన్మతో
వచ్చుట వాలిఁ జంపుటయు వారధి గట్టుట లంక రావణున్
వచ్చుట సీతతోఁ జనుట రాజ్యము నొందుట తోఁచుఁజిత్రముల్.

శా. ఏనాఁడో కలి కాదికాలమున సంకేశిల్పి రాఁ జేసిన
ద్దానన్ బొమ్మలు కన్నువారి నవియై దర్శింపఁగా నుండె న
ట్లైనన్ జానకి రాము నుంగరములో హస్తాబ్జమున బట్టియున్
డా సీతం జెడుచిత్ర మెంతకరుణం బాఁకించునో కంటికిన్. 15

తే. నైక రామునివనవాసకాలమందుఁ
దనకుఁ లోఁగల దుఃఖము కనుఁగొనఁగ
జాలుకొనునశ్రువులు దెప్పె జగతి కీర్తి
సత్యకదనము వాల్మీకి సలిపె నోటు. 16

వ. అని మఱియుం గలవిశేషంబు లెఱింగించినం గృష్ణభూషణుం
డత్యంతసంతోషితస్వాంతుండై బ్రాహ్మణు నంపివుచ్చి మంథెనపురీ
దర్శన లాలసుండై. 17

—• మంథెనపుర ప్రయాణము •—

సీ. అవల నొక్క దినంబునందు మహాశయుల్
సఖులు తో రాఁగ నైజామునందు
వఱలుమంథెనపురవరమునకుం జని
గౌతమిలో నాడి గౌతమేశ్వ
రాలయంబునయందు నధివసించియు మిట్ట
మధ్యాహ్నమైనసమయమునందుఁ
బురి కేఁగి యట మాధుకరము సేసి భుజించి
గుడిలోనఁ గూర్చుండి కోర్కి మీఱ

తే. నుచితవేదాంతచర్చల యోగసాధ
నములఁ గాలము గడపుచు సముఖమునకు
వచ్చి పోయెడువారికి వరదుఁ డగుచు
నమృతుఁ డెఱిఁగించుచుండె వేదాంత మెల్ల. 18

తే. అచట వేగురుఘనపాఠు లలరుచుండ్రి
వారు దినదినమును వచ్చి వరదుపలనఁ
దత్త్వమార్గ మెఱింగి విద్వాంసు లగుచు
భూషణుని మెచ్చి రుచితసంభాషణముల. 19

క. లోకేనారాయణుఁ డను
లోకోత్తరుఁ డధికభక్తి లోఁ గొని స్తుతులన్
వాకొనుచు వచ్చి భూషణు
నాకాలమునందు నింటి కాహ్వానించెన్. 20

ఉ. వారలు వానితోఁ జని వానిగృహంబున నెండువారముల్
కోరికమై వసించి కడకుం జనుదెంచిన పండితాళితో
వారక వాదముల్ సలిపి పైపెంపుగా నయి యెల్లవారికిం
దీరిచి చిత్తముల్ దెలియ దిట్టవిభూషణుఁ డొప్పెఁ జూసురే. 21

చ. ఒకతపసీలుదారుఁ డపు డుత్సుకుఁడై చనుదెంచి భూషణాం
తికమున విగ్రహార్చనవిధిన్ వివరించుచునుండ బ్రహ్మమున్
బ్రకృతియు మాయ యెట్టి దని ప్రశ్న మొనర్ప నతండు బ్రహ్మజా
తికి నగువాని కేరుపడఁ దెల్పె సమీకరణంబుఁ జూపుచున్. 22

సీ. మఱియు నీశ్వరుఁ డెన్న మాయ కాధారము
మాయ శక్తి యనంగ మనలుచుండు
శక్తి యాధార మీజగమునకుం గార
ణమ్మ నయ్యది యెట్లనంగ వినుఁడు
వస్త్ర మొక్కండు చూడఁ బడు దాని కాధార
వస్తు వుండు నటంచు వచ్చుఁ దెలివి
యది యిట్టి దని చెప్ప నైతిఁ గల్గద యది
యీశ్వరుం డని మన మెఱుఁగ వచ్చు
తే. వస్తు వాధారముగ నున్నవస్త్ర మటులు
మాయ యగు గవచాదులై మాఱి నట్లు
వస్త్ర మట్టి దగు జగ మీశ్వరుని కలిమిఁ
గలిగి సృష్టిస్థితిలయాది సలుపు మాయ. 23

వ. మఱియును. 24

తే. ఇను మయస్కాంతసంబంధ మొసఁగ నేని
యినుపముక్క నాకర్షించు ఘనబలమునఁ
గన నినుము సృష్టి యగు నయస్కాంత మీశుఁ
డల్లసంబంధశక్తి మాయ యన నొప్పు. 25

తే. ఈశ్వరుఁడు రాజు శక్తిదేవి యెన్న మంత్రి
మాయ ప్రజ లీశ్వరుం డాత్మ మనమె శక్తి
మాయ సంకల్పము లటంచు మఱియు మఱియుఁ
జెప్పి యొప్పించె భూషణుఁ డప్పు డచట. 26

మహాస్రగ్ధర:—
అలలోకేగారి నారాయణుఁ డశితరభక్త్యంచితుం డైప్రభావో
జ్జ్వలతేజున్ నాగభూషున్ బరమగురువుగా భావముంజేసి పుష్పం
బులఁ బత్రిం జేసి పూజన్ బొనరిచి పదముల్ ముట్టి సేవించి దేవుం
బలె నెంతేఁ గొల్చి వేదప్రవచనముల సంప్రార్థనం బాచరించెన్. 27

వ. ఇట్లు మంథానపురిం గల యశేషవిశేషంబు లరసి యటనుండి ధర్మపురికిం జని గౌతమినాఁడి భోగేశ్వరుని దర్శించి యున్నయప్పుడత్తీరంబున. 28

— ధర్మపురి —

సీ. కురులు సున్నగ దువ్వి కొప్పు జాఁపలికి రాఁ
బెట్టి తురిమిఁ పూలు పట్టెడుగను
గుచ్చెళ్లు మీఁగాళ్ల హెచ్చి జాఱఁగ బిళ్ల
గోచి వ్రేలఁగఁ జీర త్రోచి కట్టి
పసుపు పూసినమోముపయి నెలవంక నాఁ
బాలుపొందఁ గుంకుమ బొట్టుఁ బెట్టి
కాటుకపిట్టలకరణిఁ గాలఁగఁ దీర్చి
కనుదోయి నిద్దంపుఁ గాటుక నిడి

తే. పండ్లుసుం బత్రి పూల్ గలపళ్ళెరముల
హస్తయుగ్మమునం గొని యతివ లరుగు
దెంచి పౌరాణికుల నాశ్రయించి యచట
బహువిధపురాణముల విందు ప్రత్యహంబు. 29

వ. అట్టియెడ మనభోగిభూషణుండు భోగేశ్వరాలయపరిసరంబునఁ బౌరాణికుండు స్థలపురాణమ్ము చదువుచుండ నట విశ్రమించి యుండె నప్పుడు పౌరాణికుండు. 30

తే. ఇచట నాగేశ్వరాభిధానేశ్వరుండు
సర్వశాపాపహరుఁ డయి వర్తిలుచును
నట్టినాగతీర్థకథాకీర్తిమార్గ మెల్ల
నెఱుఁగఁ జెప్పెద వినుఁ డని యిట్టు లనియె. 31

ఉ. శ్రీనగజాధినాథగృహసీమ కృతాగమ ధూపధూమ సం
ధానవివర్ధితాబ్దసముదాయ వినిస్సృతివాఃప్రపూర నే
కానిశకోమలోపవన కాంతపురంబు వరంబు నై ప్రతి
ష్ఠానపురంబు భాసిలు రసాతలపట్టణము మనోహరాకృతిన్. 32

క. ఆనగరిపుఁ డత్యున్నతి
నానగరిపుఁ డట్టు దనరు నాయోధనమం
దానఁగ రిపుఁ డత్యధికభ
యానఁ గరిపుఁ డాఁగ సింగ మట్టులు వెలుఁగున్. 33

ఆ. అతఁడు నడికిఁ గాల మైనప్డు సతిఁ బెండ్లి
యాడి యామెవలన నఖిలసుఖము
లనుభవించి కాంచె నవలఁ గర్మవిపాక
మునను నాగరాజుఁ బుత్త్రికునిగ. 34

తే. పుట్టుతోఁ బెట్టు బుస్సలఁ గొట్టి కొట్టి
నాల్కలల్లార్చుచును బెద్దసాలిభాతి
మనఁగ మిడిగుడ్లు మెఱయుచు నడరుపాము
కొడుకుఁ గని కన్నవా రెంతొ కుతిలఁ గుడిచి. 35

వ. రాజదంపతు లనేకవిధంబులఁ బరితపించియు నేమియుం జేయం
జాలక కొడుకు నొక్కపెట్టియం బెట్టి పెంచుచుండి రంత నతండు
దినదిన ప్రవర్ధమానుం డై. 36

చ. ప్రణుతతపోవిశేషము పురాకృత మెట్టిదొ కాని చిల్వయై
మనుజవిచేష్టితంబులును మాటలు తేటగ నేర్చి నెయ్యురున్
జనకులఁ జుట్టలం దెలిసి నాఁటికి నాఁడు వివేకచిత్తుఁడై
తనరె రహఃప్రదేశమున దైవగురూత్తమభక్తి సంధిలన్. 37

వ. రాజేంద్రుండును గుమారు ననుమతంబున జాతకర్మాదులు నుప

నమానంబు గావించి పెండ్లి సేయ నెంచి హితుండగు పురోహితుం బిలిచి కాశీరాజపుత్త్రిక నాకుమారునకుం బత్నిగా నడిగి త్రైకి వివాహంబు చేసికొను నిశ్చయించిన నతండట్ల గావించి భోగవతిం జోడి తెచ్చె నంత. 38

సీ. మగజాలిచకచకల్ దెగడు గోడలసౌరు
గలలోని మేడలో నలరువాఁడు
నిగనిగలాడు పందిరి పట్టెమంచముఁ
దూఁగుటుయ్యాలలపై నూఁగువాఁడు
గమగమ నలరారు చొక్కపుఁగుంకుమ జవ్వాజి
గందంపుఁ జలువలఁ గదలువాఁడు
నవరత్నకీలిత నవకంకణాది భూ
షణభూషితాంగుఁడై చనుచువాఁడు

తే. అతఁడు నాగేశ్వరాహ్వయుఁ డధికవిభవ
కలితపరిణయుఁ డొకనాఁడు కన్నతల్లి
దండ్రులకు జేరి మత్సహధర్మిణి సతిఁ
గనులఁ బెట్టరి దేమి నా కనుచు బలికె. 39

వ. అనిన వగచియు నొక్క ధాత్రికం బిలిచి నీవు భోగవతి కడకుం బోయి నీయింటియాతండు నీనులకంటియాతం డని తెలిపి రమ్మ నిన నది విజయరాజనందనకడకుంజని యెఱింగించిన నామెయు. 40

ఆ. భోగవతికి నాకు భాగ్యభేదం బగు
భోగితోడఁ గూడి రాగభోగ
పూగమందు టెన్న బాగగువిధి గాని
మెట్టు లగును నాగయాన. 41

వ. అని దానితో సత్కడకుం జనుదెంచిన నామె యామెం దోడు కొని కొడుకుకడకుం జని యితండే సీప్రాణవిభుం డని పలుకుటయు.

మ. కడఁకం జేతులు దోయిలించుకొని యక్కంజాతపత్త్రాక్షి య
ప్పుడు నాగేశసదేశదేశమునకుం బూర్ణానుమోదాత్మయై
వడిగాఁ బోయి సుగంధబంధురసుమస్వర్ణాసనాసీను న
ప్పుడుచుం బ్రాయపుఁబ్రాణనాథుఁ బలికెం బాదంబులన్ వ్రాలుచున్.

నట్లు గాక స్వర్గఫలంబు నాసఁ జేసి
కర్మ మొనరించు వానికి గతులు మెండు. 57

తే. ఈశు నెఱిఁగిన జగమెల్ల నెఱిఁగికొనుచు
జగ మెఱింగిన నీశు నెఱిఁగికొనంచు
వేదవేత్తయై తా నొక్క వేద్య మెఱిఁగ
యెఱుఁగఁ డీశ్వరు వేదము లెఱుఁగ లేవు. 58

ఆ. ఆత్మవేత్త దీని నరయుంగఁ జాలెడు
జ్ఞానయోగమునను దాన నాతఁ
డమృతుఁ డగుచు నమృత మగు బ్రహ్మమును బొందు
ననుచు నెఱుఁగవలయు నమలమతిని. 59

వ. అని సనత్సుజాతమతానుసారంబుగా బ్రహ్మసాక్షాత్కారంబుఁ గావించుచు నుపన్యసించె ని ట్లుత్తమోపన్యాసంబు లొసంగుచు నటఁ గొన్ని నా ళ్లుండి యొక్కనాఁడు మిత్రులతోఁ బురోపకంఠంబున విహరించుచు నొక్కచో నొక్క బంగారుపూజం గాంచి గ్రహించి యిది యెవ్వనిపాణెం బని యడిగిన వెంట నున్నపురవాసి విప్రుం డి ట్లనియె. 60

—॰ ప్రతాపరుద్రచరిత్రము ॰—

చ. ఇచటఁ బ్రతాపరుద్రుఁ డనునేలిక రాజ్యము సేయుచుండ దు
ష్ప్రచలము గల్గి భూమిపయి వర్షము లేమిఁ గరువు రాఁ బ్రజా
నిచయము వేఁగుచున్న తఱి నెంజిలి వాపఁగ నెంచి భూవిభుం
డచలమతిన్ శివుం గొలువ నై కురిసెన్ ధర స్వర్ణవర్షమున్. 61

ఆ. వానచినుకు లెల్ల బంగారుపూజ లై
యిట్లు భూమిఁ బడిన నేరుకొనిరి
ప్రజలు నేఁటివఱకుఁ బడయుంగ వచ్చు నీ
కటకమందు నెల్లకడలయందు. 62

క. ధననిక్షేపము లయ్యా
రను ధరణిం ద్రొవ్వినట్టిర యయిన లోలో
పునఁ గాన వచ్చు నందం
దును బురి బంగార మనుచుఁ దోఁచుఁ బ్రజలకున్. 63

మ. యవనేశుం డలవీరరుద్రునట హైదరాబాదునం బందె లో
దవులం బెట్టినయప్డు రాజుపయి విద్యానాథవిద్వత్కవి
ప్రవరుం డొక్కకృతిన్ రచించి యెడఁ గా రారాజు మీసంబుపై
నవుకేశంబును దీసి వాని కిది లక్షార్థంబు కొమ్మం చిడెన్. 64

ఆ. కైసరుండు దానిఁ గైకొని మోర్గంటి
కరుగుదెంచి నెఱకఁ బురమునందు
నమ్మఁ జూప నొక్కయర్యుండు లక్షరూ
ప్యములనిచ్చి కొనియె నధికభక్తి. 65

వ. అనినభూషణుం డీమోరుగంటిచరిత్రః బెఱింగిన నెఱింగింపు మనిన
నతండు వెండియు. 66

—• వరంగల్లు హనుమకొండ •—

సీ. ఏడుప్రాకారము లింపొందు నేవీట
నేడుకోటలు నాఁగ నెన్నఁ బడుచు
మట్టికోటకు నిప్డు మట్టివాడ యనంగ
నామధేయం బయి నలువుమీఱు
నాకోటలకు మధ్యమందు శ్రీకాకతి
దేవి ప్రత్యక్షమై తేజరిల్లుఁ
దత్ప్రాంతమున మున్ను ధరణీపురందరు
నగరు దీపించెడు నగణితగతి

తే. నందు శ్రీవీరరుద్రమహామహీంద్రుఁ
డలరె శర్వాణిదేవితో ననుఁగుమంత్రి
యె యుగంధరుఁ డెల్లరాజ్యము వహించి
కంటికెన్ రెప్ప పోలెను గాఁచుచుండ. 67

తే. అప్పురిం బెద్దకల్లొక్కఁ డొప్పుచుంట
నోరుగల్లుపురం బని పేరు గాంచె
నదియె యేకశిలానగరాహ్వయమునఁ
బొడిమిం గనె నాఁడును నేఁడు గూడ. 68

క. దానికి శాఖానగరం
బై నెగడెన్ హనుమకొండ యనుపేరఁ బురం

బానగమునందుఁ బద్మా
క్షీనామమునన్ మహేశి చెన్నలరారున్. 69

సీ. భాసిల్లు నేపీటిపశ్చిమాంబునయందు
భానుసముద్ర మన్వరతశాక
మలరొందు నేపురి నాగ్నేయమునయందు
సిద్ధేశ్వరస్వామి సిద్ధభూమి
నెగడొందు నేపురి నిరృతి భాగంబున
యందాదిశక్తి పద్మాక్షిదేవి
యింపొందు నేయూరి యీశాన్యమునయందు
వేలకంబాల దేవాలయంబు
తే. అట్టిలోకైక వినుత దివ్యప్రభావి
రాజితంబు మహోన్నతరాజసౌధ
సముదయ సమంచితం బాంధ్రజనపదంబు
పరఁగు హనుమద్గిరీశ్వరపురవరంబు. 70

శా. ఆపద్మాక్షిపురోపకంఠమునయం దాతాళదఘ్నాతిలో
కాపఃపూరిత మున్నతోన్నతశిలావ్యాకీర్ణ మర్ణోధిక
ల్పోపాదానము హంససారసబకవ్యూహాంచితం బుష్కిప
త్స్వాపం బుత్తమసేవితంబు గన నై పద్మాకరం బొప్పెడున్. 71

తే. హనుమకొండపురంబునయందు వేయి
కాళ్ళమండపరాజము గ్రాలుచుండు
నందు దేవాలయంబున నలరుఁ జిత్ర
ము లవి జీవము గల్గిన ట్లొలయుచుండు. 72

తే. ఒక్కమండపాధోభాగగోపలమున
గోపబాలకునియు నెల్లగోపికలయు
చిత్రము లవి రాసక్రీడఁ జెప్పుచుండు
బ్రహ్మలంతల కైన నబ్రంబు దోఁప. 73

క. పెనుతాతఁ బరస్థలములు
కనఁబడఁ గాఁ దొలచి యొక్కకరమంతటిలోఁ

దశరున్ సూజగువసికా
జనవిగ్రహములు సమస్తజగముల కసుదై. 74

వ. రాజేంద్రుని చరిత్రంబునుం జెప్పెద నాలకింపుం డని మఱియును.

మ. రుద్రమదేవి రాజ్యము నరుల్ వెఱ గందఁగ నేలుచుండఁగా
భద్రము లెల్ల వారలకుఁ బల్కఁగ వచ్చెడు నట్టిచో ఖలుల్
రౌద్రము మూర్తమైనయటు రాజ చతుర్విధసైన్యయుక్తులై
మాద్రికి మీఱి ఘోరగతి మాద్రరమై చనుదెంచి యోర్వఁగక.76

క. కటకపురాజులు వారలు
కటకముపై లగ్గవెట్టి కడుశౌర్యమునన్
దిటవడి ఘోరరణంబునఁ
గటకటపడ సంహరింపఁ గలిగిరి ప్రజలన్. 77

వ. ఇట్లొక్కదినంబులో నోరుగల్లుపురం బంతయుఁ బీనుంగుపెంటలు
గావించి యొక్కచో గర్భవతి యగురాజపత్ని మొమ్మడమ్మం బట్టి
శత్రుశేషశంకం జేసి చంప నున్నసమయంబున 78

ఆ. మాధవుండు రాజమాన్యపురోహితుం
డరుగుదెంచి వడిగ నామెఁ గదిసి
నాదుబిడ్డ! నిన్ను నేదిక్కునం గన
కిట్లు వెదకుచుంటి నిందు నందు. 79

సీ. అని యామె కేల్వట్టుకొని శాత్రవునిచేయి
విదళింపఁ బోయినవేళ నాతఁ
డీమె శాత్రవపత్ని యే శత్రుశేషము
లేకుండఁ జేసికో నీకేఁ దునుమ
నెంచి పట్టితి నిట్టు లీ వేరు వారింతు
వో వో మ్మనువులు గోల్పోక మున్న
వేదబాపఁడ వీవు రాదు నీపైఁ గిన్క
తొలఁగు మీయమ కడ్డు గలుగఁ బోకు

తే. మనుఁడు మాధవశర్మ యోయయ్యలార!
సత్యమును జెప్పుచుంటి నేత్మ్మనురుండ

యిద్ది నాకన్నకన్నియయే యసత్య
మింతయును లేదు నమ్ముఁడీ యితనిసుతులు. 80

ఉ. రాజగృహంబునందు గతరాత్రి వ్రతం బొనరఁ జాచరింపఁగా
రాజపురోహితుండ నగుబ్రాహ్మణుఁ డొటను దానముల్ గొనం
గాఁ జనుదెంచి నాఁడ నిటు కన్నకుమారికఁ దోడుఁ గొంచు నో
రాజబిడౌజ! విప్రసుతపాణిని లీయ ననుగ్రహింపవే. 81

తరువోజ. అనిన వారెది సత్యా మగు నేని దీని
యన్నమ్ముఁ దినుటకు నయితివ యేని
మనమున నీమాట మన్నించి మేము
మగువ నీమె న్వీడ పడి యొనరింతు
మనుడు మాధవశర్మ యా నని యామె
హాస్తగతం బగునన్నంబుఁ దినియెఁ
గని వారు క్షత్రియకాంత గా దనుచుఁ
గరుణామై విడిచి రక్కంజాయతాక్షి. 82

వ. అంత మాధవశర్మ ముమ్మడఁబం దోడఁ బెట్టుకొని పోయి హానుమకొండ పురంబునం గల తనగృహంబునం దిడుకొని పత్నికిం జెప్పి కుమారీభావంబుఁ జేసి కాచి రక్షించుచుండె శాత్రవు లది యంతయు నిశ్చలం బని విశ్వసించి నిజగృహంబులకుం జని రనంతరంబ. 83

ఆ. ముమ్మడమ్మరాణి యమ్మాధవబ్రహ్మ
ణునిగృహమ్మునందుఁ దనయ వోలె
నుండి వారిఁ దల్లియును దండ్రి యనుచును
గడవ నీదెఁ గొంతకాల మపుడు. 84

ఆ. మాధవోపదేశ మంత్రజపంబును
దేవతార్చనమును దినదినమ్ము
నలుపుకొనుచు నియమకలితయై యున్నచో
నెలలు తొమ్మిదియును నిండె సతికి. 85

తే. గ్రహము లై దుచ్చగతులను గ్రాలుచుండఁ
బుణ్యలగ్నమునం దల్లపువ్వుఁబోఁడి

గనియెఁ బుత్త్రుని సుకుమారగాత్రుఁ బూర్ణి
మ నలప్రాగ్దిశాంగన చంద్రుఁ గనినయట్లు. 86

వ. మాధవశర్మ జాతకర్మాదులు క్షత్రియోచితక్రమంబునం జలిపి ప్రతాపరుద్రుం డని పేరుపెట్టి కాలక్రమంబున నుపనీతుం జేసె నంతఁ గుమారుండును దినదినప్రవర్ధమానుండై. 87

శా. పద్మాక్షీసవిధప్రదేశమునఁ జెప్పం జొప్పడున్ సత్కలా
సద్మం బందుఁ బ్రతాపరుద్రుఁ డధికేచ్ఛన్ వేదశాస్త్రాదులున్
ఛద్మం బింతయు లేనిచక్కని ధనుశ్శాస్త్రంబును న్నేర్చుచున్
బద్మాక్షిన్ భజియించువాఁ డగుచు నొప్పారెం గుమారాద్యుతిన్.

మ. ఒకనాఁ డాటలసందడి న్మఱచి యెందో పుస్తకంబుల్ గృహాం
తికముం జేరినయంత సంజపడె రాత్రిన్ బ్రాఁతపాఠంబు లొ
క్కొకఁ డామాధవశర్మకున్ వినుపఁగా నొప్పం గరంబందుఁ బు
స్తకముల్ లే విధి విన్నఁ దాత మిగులన్ దండించు నన్ భీతునన్.

తరల. కఱచుపామును గుట్టుతేలును గట్టుభూతముఁ బ్రేతమున్
బరిగణింపక చిమ్మచీఁకటిఁ బాఠశాలకు నొక్కరుం
డరిగి యెందును బుస్తకంబుల నందఁ జాలక జాలిమైఁ
బఱచి దేవళమందుఁ బెట్టినపట్టు జ్ఞప్తికి వచ్చుటన్. 90

తే. దేవిపాదములం గని తీసికొనఁగ
నెంచులో నవి వక్షము నెక్కి నట్లు
కాన వచ్చుట యును వానిఁ గైకొనంగ
వీరరుద్రుండు జతనించె వెఱవ కపుడు. 91

మ. తొడపైఁ గాలిడి రెట్ట పట్టుకొని మీఁదుల్ సూచులోఁ బొత్తముల్
మెడపైఁ గానఁగ రా నతండు తనకా ల్దేవీకుచాగ్రంబుపై
నిడి చే యెత్తి కొనంగఁ బోవ నవి యెంతే మీఁదుగా నయ్యె న
ప్పుడు పై కెక్కఁగ లేనివాఁ డయి కడుం బొల్పేది నేలం బడెన్.

వ. కొంతవడికి లబ్ధసంజ్ఞుండై తాళప్రమాణమ్ముగ నున్న పద్మాక్షి నీక్షించి భయకంపితాంగుండై ప్రార్థించుచు ని ట్లనియె. 93

ఉ. పిల్లలఁ గన్నతల్లి వోకపీసము గాని కృపారసంబు నీ
యుల్లమునందు లే దనుచు నూహ మొనర్చెదఁ దాత బీతునన్
బిల్లఁడు వీఁడు వచ్చె నిటు వీనిని వీనికి నిచ్చి పుచ్చుటల్
చెల్లు నటంచుఁ దోఁప దయచెప్పెడి దే మిఁక నేదుచెయ్దముల్.

క. తాతకు లోఁబడి యుండెన్
భూతలపతి కొడుక యయినఁ బొల్ల తెఱఁగునన్
జేతన్ ఖడ్గము గలిగిన
సీతటిఁ చా నేమి సేయు నెఱుఁగవు తల్లీ! 95

ద్విపదము. బతిమాలి బొమాలి పాడియు వేఁడి
శితికంఠరాణి నాచేతిపొత్తములు
సుతుఁడ నేనని నన్నుఁ జూచి యిమ్మంటి
మితిమీఱటి యాకుఁటి మి న్నెక్కి యుంటి. 96

క. ఇదె నీఅమ్మనఁ గుర్దెదఁ
బదయుగముం బట్టినేలఁ బడ నేసెద నే
నదవదలు చేసి యే నా
చదివెడి పొత్తములు గొంచుఁ జనియెద నంబా! 97

వ. అని బాలభావంబునఁ జేయెత్తి దేవిన్ మొత్తనున్నంతలో విజ్ఞానం
బొదవఁ జే మోడ్చి. 98

మ. అపరాధం బొనరించినాఁడను గుమారాకారముం దాల్చి ని
న్నపరోధింపఁగ నెంచితిం బ్రకృతి వం చూహింపఁగా లేక నీ
కృపకుం బాత్రిమ నైతి రాసుతుఁడ నే నేరీతి వర్తింతు నో
నృపతిత్వం బఱి యిట్టులుంటి గరుణన్ వీక్షించి రక్షింపవే. 99

వ. అని ప్రార్థించినం బ్రసన్నయై పద్మాక్షి ప్రత్యక్షంబై రాసుతు
నక్కునం జేర్చి వత్సా! వగవకుము నీ కింక మంచికాలంబు రా
నున్నది నీవు నాభక్తుండవు నీకు నే నెప్పుడుం దోడు నీడనై యుం
డెద నీతాత నీకై పరితపించుచున్నవాఁడు పొత్తములం గొని
పొమ్మని తిరోహిత యయ్యె నయ్యెడ వీరరుద్రుండును దాత
రొదరింబునకు భయంపడుచు నిజగృహంబునకుం జనుదెంచి తాత

కుం దల్లికిం దనవృత్తాంతం బంతయు నెఱింగించిన వారు నితాంత సంతోషసాగర నిమగ్నమానమానసులై రనంతరంబ మాధవశర్మ మనుమనిం గాంచి యి ట్లనియె. 100

ఉ. శాత్రవులన్ జయించుటకుఁ జాలినవీరులఁ బద్మనాయక
క్షేత్రియులన్ జమూపతులఁ జేసి దురం బొనరించుపొంటె నీ
ధాత్రి నసేసులన్ భటులఁ బావల మా నటు సంతరించితిన్
శాత్రవముఁ జూపి నీవు రిపుసంచయము న్విదళింప నెంచుమా. 101

వ. అని యనంతరం బట్మాధవశర్మ పద్మనాయకపళంబులం గూర్చు కొని ప్రతాపరుద్రపురస్సరంబుగా నోరుగల్లు ముట్టడించి శాత్రవుల సంహరించి రుద్రమదేవి మనుమనిం బట్టభద్రుం గావించి తనదాయాదిన్ యుగంధరుఁ డనువాని సతని తమ్ముండగు జనార్దనని మంత్రులు గా నియమించి బస్తరుకాకతీయ సంతతికిం జేరిన శర్వాణిం దెచ్చి పెండ్లిగావించి తాను గృతకృత్యుం డయ్యె రాజేంద్రుండును మంత్రిసామంతపరివారసహితుం డై పూజ్యసామ్రాజ్యం బేలుచు సుఖంబుండె నంతఁ గొంత కాలంబునకు. 102

సీ. ప్రబలుఁడై ఢిల్లీపురంబున సుల్తాను
దిగ్విజయముఁ జేయఁ దివిరి యోరు
గంటిపురీశుతోఁ గయ్యంబు గావించి
యోడించి రాజేంద్రు నోడిసి పట్టి
కొనిపోయి ఢిల్లీపురిని బందెగాఁ బెట్టె
నాకాలమున రాజ్ఞియై నరేంద్ర
రమణి శర్వాణి యోర్గలురాజ్య మేలెను
మంత్రియుగంధరు మంత్రమునను
తే. అంతట యుగంధరుండు జనార్దనునకు
రాజ్య మప్పన గావించి రమణ మెఱయఁ
బిచ్చివాని తెఱంగున బికిర మెత్తి
కొనుచు ఢిల్లీపురంబునకున్ గమించి. 103

వ. మఱియు నతఁ డప్పురంబున వెట్టి నభినయించుచుఁ గొట్టుకొని యేడ్చుచు నవ్వుచు నేలం బడి పొరలుచు గంతు లేయుచు రంతు

సేయుచు "ఢిల్లీసుల్తాన్ పట్టుక పోతాన్" అని గ్రామ్యోక్తులం గేకలు వేయుచు నెదురం బడినవారి నెల్లం గొట్టం బోవుచుం దనతోం గోతివెంటం బోలె వేవ్వురు వెంటంబడం బట్టణంబునం బడి పఱచుచు నఱచుచు నక్కాహాకోన్మత్తుండు. 104

సీ. బిడ్డ! రా! రా! యని బెడ్డ చేతం బూని
గొణుంగుచు ముద్దాడుం గొంతసేపు
నా బనారసుచాందినీబాబుగా! యని
గుడ్డచింపులు చుట్టుం గొంతసేపు
బువ్వం బెట్టెదను బాబూ! యేడ్వకుర! యంచుం
గుండ చేకొని యాడుం గొంతసేపు
నాతండ్రి! యాడుకో నాతలపై నని
కొట్టుకొనుం గట్టుం గొంతసేపు
తే. గుడుగు డంచును బాడును గొంతసేపు
కొట్టుం గొట్టంచు నేడ్చును గొంతసేపు
కూడి మాడంచు నవ్వును గొంతసేపు
కడు వెడంగు వోలె నున్నయుగంధరుండు. 105

వ. ఇవ్విగిది సంచరించుచు. 106

క. నే నోరుగల్లుదొరం జుం
డీ నేర్పునం జేసి చెప్పి ఢిల్లీసుల్తాన్
నానగరికిం గొని పోయెద
సేనావారముల నెల్లం జించి రయమునన్. 107

వ. అని ప్రతిచత్వరంబునొద్దను బ్రతివీథియందును బ్రతిగృహంబు కడను బలికి పలికినట్లు సలిపి ప్రతాపరుద్రునిచెఱ వాయం జేసి సుల్తానువలన ననేక యోగ్యతాపత్రింబులు సన్నదులుం గొని రాజేంద్రు నలరించి రాజ్యానుసంధానంబు గావించె. 108

క. అని యోరుగల్లు చరితము
విని యమృతానందయోగి విస్మయపడుచున్
జని పద్మాక్షికడకు బహు
దినములు జపియించి పొందె దేవీకరుణన్. 109

వ. ఇట్లు పద్మాక్షుఁ బ్రత్యక్షంబు గావించుకొని తదనుమతంబు వడసి యంత. 110

—: మణికొండబిలము :—

ఆ. హనుమకొండ పశ్చిమాశను మణికొండ
కలదు దానిలోయ ఘనబిలంబు
దర్శనీయ మగుచు ధరణిజనుల మనం
బులఁ గలంచునట్టిపోలుపు గలిగి. 111

మ. ఘనుఁ డాభూషణమూర్తి తద్గుహను లోకుల్ సెప్పఁగా వించు దా
నిని జూడన్ మది నెంచి విజ్ఞజనుల న్వెన్వెంటఁ దోకొంచుఁ దాఁ
జని యచ్చోటికి దివ్యసాయమునఁ బెల్చం జొచ్చి లో సాహసం
బున లోలోనికిఁ బోయె నుత్సుకతతో భూగర్భగోళంబునన్. 112

మ. ఒకఫర్లాంగు ప్రయాణమున్ సలుప నెంతో సాధ్వసం బేర్పడెన్
సకలాంగంబులునుం జెమర్చునవియై సాళ్వారెఁ బై నింత ద
వ్వాకచందంబునఁ గొంత డేకి చనసై యుండెన్ బిలాధ్వంబు జం
కక కష్టంబున కోర్చి యోగి నడచెం గల్యాణ మర్థించుచున్. 113

తే. అంతట విశాలభూమియుఁ గొంతవెలుఁగు
గాలియును గల్గె నచ్చెంతఁ గానఁ బడియె
విమలకమలాకరము దానివెనుకప్రక్క
రామదేవాలయము నభిరామ మగుచు. 114

తే. భూషణుఁడు గాంచి కాసారమున మునింగి
కమలములు గోసి రామలక్ష్మణులు సీత
కలుగుచోటుసకుం జని కొలిచి భక్తిఁ
గన్నుఁగవ మూసికొని యిట్లు సన్నుతించె. 115

తే. దేవదేవ! మహాదేవసేవితాత్మ!
నిన్ను దర్శింపఁ గంటి నీకన్నదోయి
నెంచ నాపాపములు పటాపంచ లయ్యె
ధన్యతమము నాజన్మము మాన్యచరిత. 116

ఉ. ఏయతిచంద్రుఁ డిందు నిను నేర్పడ నిల్పి భజించి ముక్తుఁడై
పోయెనొ యేమునీంద్రుపయిఁ బూర్ణకృపారస మొల్కి తీవొ నే

నీయెడఁ గొల్వఁ గంటి నిను నెంతటి పుణ్యము తొంటి పుట్టువన్
బాయక చేసియుంటినో శుభం బగుకెంచెను నాకు నింకిటన్. 117

వ. అని ధ్యాననిశ్చల మనస్కుండై కన్ను మూసికొని యున్న సమయంబున శ్రీరాముఁడు స్వప్నసందర్శనం బొసంగి భూషణుని శిరంబు కరంబున నిమురుచు ని ట్లనియె. 118

మ. అమృతానందుఁ డనంగ మౌని యొకరుం డాతండు కౌండిన్య గో
త్రమునం బుట్టినవాఁడు నాగుహాకు గారం జేర్పడ న్వచ్చి నన్
సుమసందోహమునన్ యజించి యిచటన్ శుద్ధామృతేశానలిం
గము స్థాపించి భజించెఁ జూడు మిదె నాకైచాయ నొక్కింతలోన్.

ఆ. అతఁడ నీవ యగుచు నవతరించితివి నీ
కమృతనాథుఁ డనఁగ నాఖ్యయు నగు
జ్ఞానమూర్తి వగుచుఁ జాలవిఖ్యాతిమైఁ
బ్రబలఁ గలవు శిష్యవరులతోడ. 120

వ. అని తిరోహితుం డయ్యె నమృతానందుండును నిజప్రతిష్ఠితామృత లింగంబున కభిషేకంబు గావించి పూజించి దేవదేవునకుం జెప్పి వచ్చినమార్గంబునన గుహాముఖంబునకు మరలి వచ్చి యచ్చటఁ దనకై వేచియున్న భక్తులం గూడి దినదినప్రయాణంబుల నట కింత పశ్చిమదిశ నున్న జీడికుంటరాముం దర్శింప నేగె నాకర్ణింపుఁడు.

— జీడికంటిమహత్త్వము —

ఆ. పావుకోశ మెత్తు పదిపావుకోశముల్
చుట్టుకొలత గలిగి సురుచిర మయి
బూర్లెమూకు డిలను బోర్లగించినయట్లు
పెద్దనల్లబండ వెలయు నచట. 122

ఉ. ఏకశిలాకృతిం గలిగి యేర్పడియుండినదాని నెత్తిపై
నేకడ లేనివింత యని యెల్లరు మెచ్చెడుబుచ్చిగుంట యై
వాకొన నొప్పు నున్న నయి వట్రువయై యొకమూరెడంతయై
ప్రాకటధాతృసృష్టిచతురత్వముఁ జాటఁగఁ జాలి యున్నతిన్. 123

క. ఆగుంట నక్కాలంకుల
పీఁగక స్రవియించి జలము వింతగ నిండున్
యోగము లేకుండినజనుఁ
డేగతి జతనించియుఁ గనఁ డింతజలంబున్, 124

ఉ. దాని కొకింతచెంతగను దాశరథీశ్వరునాలయం బగున్
జ్ఞానవినిశ్చితం బగుచు సంతత మందుఁ రఘూద్వహుండు ని
త్యానుగతానుజుం డయి ధరాత్మజసేవల నాదరించుచున్
మానులు గొల్వఁగా నగుచు త్వన్మతల మేలుచుఁ గ్రాలు నచ్చోటన్.

వ. ఆస్థలచరిత్రం బత్యంతపవిత్రం బాలకింపుఁ డని మఱియును. 126

మ. ముచికుందాపగ పొంగి మున్నొకతఱిన్ భూభాగమున్ ముంచుడున్
సుచరిత్రుం డగుభూసురుం డొకఁడు తత్తోయస్థలిన్ సంస్కృతిన్
బచరింపం గలఁడై వసించి దినమున్ సాగించువాఁ డప్పు డా
ప్రచురం బైనప్రవాహమందు సకుటుంబం బాతఁ డార్తిం బడెన్.

సీ. అ శ్లేటఁ బడి వడి నవ్వెల్లువం గొట్టు
కొని పోవుద్విజునకు వనజనాభుఁ
డనుకొడుకును దుర్గ యనుకూఁతురుం గల
రందఱు నాప్రవాహమురయమున
నెన్నియో దేశము లేగినంతటఁ గొడు
కొక్కదేశంబున నొడ్డుఁ జేరెఁ
గొండొకదేశ మా కూఁతురు చనిసంతఁ
బసిపిల్లలన్ వారిఁ బట్టి జనులు
తే. పెంచి రంతట వారలు పెఱిగి పెద్ద
వార లైనంతఁ బెంచినవారు వారి
కరసి పరిణయ మొనరించునట్టి రగుచుఁ
దగిన దాంపత్య మొనఁ గూర్పఁ దలచి రపుడు. 128

వ. అన్యోన్యాన్వేషణంబున వారి కిర్వురకు దాంపత్యంబు సిద్ధించి యుండుటం జేసి నిశ్చయించుకొని వారు వారికిం బెండ్లి గావించి పునస్సంధానంబునుం జేసి రంతఁ గొంతకాల మ్మతిక్రమించిన పదంపడి. 129

సీ. లోకప్రవాదము ప్రకటంబుగ నయి
వా రొక్కతల్లి గర్భమునయందుఁ
బుట్టినవా రని ముచికుందనదిలోనఁ
బడినవా రనియు నవ్వారి నందు
నం దొకఁడు నొకండు నావఱ్ఱునందుండి
తీసి పెంపకమును జేసి రనియు
నెఱుఁగమి వారికి నిట్టు పెండిలి యయ్యె
నని తెల్ల మయ్యె నయ్యనినియందుఁ
తే. జెల్లె లన్నయు విని దానిఁ జింత మునిఁగి
ప్రాణములు వాపుకొన నెంచునవసరమున
నొక్కధర్మజ్ఞుఁ డరుదెంచి పొక్కుటింగి
యెల్లరున్ విన వారికి నిట్టు లనియె. 130

తే. కలుగు నజ్ఞానకృత మయికానవచ్చు
నట్టిదీనికి నిష్కృతి యది వినుండు
మీరు సోదరభావ మీమీఁదఁ బూని
తీర్థయాత్రలు సేవింపఁ దిరుగ వలయు. 131

వ. మఱియు మీవస్త్రంబులు భల్లాతకీరసంబున నీలంబు గావించుకొని తీర్థాటనంబు గావింపుఁ డేతీర్థంబున మీచేలంబులు ధవళంబు లగుట కానవచ్చు నప్పుడ మీపాపంబు వోయిన దని నిశ్చయించు కొనుం డనిన వా రమ్మునిచెప్పిన చొప్పునం జేసి దేశాటనంబు చేయం జొచ్చి యెల్లతీర్థంబులు సేవించి రెండునుం దమపాపంబు వోవమికి వాపోవుచు నారామతీర్థంబునకు వచ్చి బండపైఁ గలకుండంబునకుం జని యెండి యున్నదానిలోఁ జేతులు వెట్టి సీతారాములం దలంచు చుండి రంతలోన. 132

ఉ. అల్లనఁ గుండ మంతయును నప్పులతోడన నిండె వారు ను
త్ఫుల్లమనోంబు జాతులరు పొంగుచుఁ దజ్జల మెల్ల మేనిపైఁ
జల్లుకొనంగ నై కలుషసంగతి నుండెడుజీడి బట్టలన్
మెల్లన నీట ముంప నవి మిక్కిలి తెల్లఁబడెన్ రయంబుగన్. 133

వ. అప్పుడు వారు తమకిల్బిషంబు వోయిన దని సంతసించుచు శ్రీరామ

దర్శనంబు గావించి సేవించుచు నం దుండి కొంత కాలంబునకుఁ బరంధామంబు నొంది రది మొదల లారాముండు జేడికంటి రాముండు నాఁబడె నని భూషణుం డటఁ జని కుండంబు దర్శించినమాత్రి జలంబుల నిండియున్నం గని సంతసించుచు జలంబుల మార్జనంబు గావించుకొని శ్రీరామ దర్శనంబునఁ గృతార్థుండై సపరివారంబుగఁ బయనంబై యథోచితప్రయాణంబుల బందరు పురంబునకుం జని బంధుమిత్రాదులం గూడి వేడుకలం దేలుచుండె. 134

క. అని చెప్పిననైమిశవన
మునివర్యులు సూతు నరసి భూషణుఁడు ముదం
బున బందరుపురమునకుం
జనె సుఖముగ నంటి వవలిచరితము చెపుమా. 135

వ. అని సూతు నడుగుటయు. 136

—•ఆ శ్వా సాం త ము•—

మత్త. ఏడుకొండలమధ్యమందు మృగేంద్రముల్ భజియింపఁగా
నీడబోవక వ్యాధబృందము లెప్డుఁ దోడును నీడయై
కూడియుండ వరణ్యమేలుటకుం బ్రియంపడ కెంతయే
వేడుకం గనకాలయంబున వీడకుంటి జగత్ప్రభూ! 137

క. వీడక భక్తుల నేలఁగ
వేడుక పడి విజయవాటి వేంచేసిన నిన్
వేఁడి భజింతుము కరుణన్
గూడినచిత్తమున మమ్ముఁ గొనియేలు మజా! 138

గ ద్య ము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీ పా ద కృ ష్ణ మూ ర్తి శా స్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబునఁ
బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

# అమృతానందము



## షష్ఠాశ్వాసము

కనకదుర్గ కనుఁజూడ
వైకరుణా జగము లేల నై విజయపురిన్
వాకోఁగ నగుచుఁ గనకాం
బాకలితార్చనల నొప్పువైకుంఠపతీ. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు నానాతీర్థంబులు సేవించి నాగభూషణుండు బందరుపురంబున బంధుమిత్రాదులతో సుఖం బుండి. 2

### —చిలకలపూడ్యాశ్రమము—

సీ. పిదప నతం డొక్క విజనప్రదేశము
నం దాశ్రమం బొండు పొందుపరచు
కొని తృతీయం బయి తనరునాశ్రమ మంచుఁ
గొని యుండ నెంచి కృష్ణునకుఁ జెప్పి
శంకరరావుతోఁ సంభాషణము సల్పి
శర్వాజ భూ సంఖ్య జరుగునేటఁ
గృష్ణాష్టమిని మిత్రబృందముతోఁ జిలు
కలపూడికిం జని కలయఁ దిరిగి
తే. బందరుపురంబునకుఁ జెంతఁ బరఁగునచట
స్థలము నిర్దేశ మొనరించి తాన మాడి
యాప్తులం గూడి యుపవాస మాచరించి
యచట నిర్మించె నాకుటి ల్లర్చఁ జేసి.

---

శర్వాజభూసంఖ్య=1911

చ. పులగము వండి వేల్పులకు మున్ను నివేదన మాచరించి య
వ్వాల నది యెల్లరుం దినిరి వారలతో ఫణిభూషణుండు మి
క్కిలి ముద మందుచుఁ వివిధగీతములం బ్రియ మొప్పఁ బాడుచున్
దెలుపుచు సత్పురాణములు దీర్చెను వారల నేర్చి యుండుటన్. 4

క. నాఁ డుండి సఖులు చని మఱు
నాఁ డట్టులు వచ్చి భూషణస్వామి నటం
గూడి చనుచుండి రెంతయు
వేడుక మెయిఁ గొన్నినాళ్ళు వెళ్ళిన వెనుకన్. 5

తే. ఆకుటి ల్లది యట్లుండ నచటఁ గొన్ని
పాకలును వానిచుట్టు నావరణములును
భక్తు లొనరించి రంత నాప్రాంతభూమి
తెలియ నానందకందమై వెలయ నయ్యె. 6

క. దెయ్యాలతోటలో నటు
లయ్యాశ్రమపదము సలుప నయ్యె జగమునం
దయ్యది దివ్యక్షేత్రం
బయ్యమృతానందయోగి యడుఁ గిడుకతనన్. 7

సీ. అయ్యెడం గలిగిన దెయ్యాలు దయ్యము
లై కోర్కులం దీర్చునట్టి వయ్యె
నచ్చోట మొలచిన గచ్చుడొంక లవెల్ల
మునికుటీరంబులై తనర నయ్యె
నప్పుడంబునఁ గలయుప్పుపట్టు లవెల్ల
పున్నెపుం బండించుపొలము లయ్యె
నన్నేలఁ బీనుగుల కున్న సమాధులు
మునివరుల్ జపియించుభూము లయ్యెఁ
తే. బుట్టలవి యెల్ల దేవుళ్ళపట్టు లయ్యె
గండశిల లెల్ల శివునిలింగంబు లయ్యె
గోతు లన్నియు నమృతంపునూతు లయ్యె
నాగభూషణయోగితపోగరిమను. 8

తే. మున్ను భూషణమూర్తి కాపురము గాఁగ
నుండి తప మొనరించెను సుస్థిరుండు
విఠ్ఠలస్వామి సుడిఁ గట్టి విష్ణు నిలిపి
కొలుతు రిప్పుడు భక్తు లకుంఠభక్తి. 9

తే. కీరపంజరి యనుపేర క్షేత్ర మచటఁ
బరఁగెఁ దత్పూర్వదిశఁ జంద్రభాగ యనఁగఁ
బుణ్యజలపూరితం బయి పొలుపు మిగులు
ఘనసరోవర మొక్కఁడు గాంచ నగుచు. 10

## ఆశ్రమవర్ణనము

ఉ. సైకతభూములం దచటఁ జల్లనిగాలి ప్రవాహరూపముం
గైకొని కేతకీకుసుమ కాంతనులం బడి వచ్చి యచ్చటం
బాకల నుండువారె పయిఁ బొలుచు వారికి ఘ్రాణపర్వమై
వాకొన నయ్యె యామునవిభాస్వర సైకతభూతలంబు నాఁ. 11

చ. చిలుకలు గోరువంకలును జల్లులు వోవఁ జెవుల్ ధ్వనించుచోఁ
బలుమఱు ఝాంకృతుల్ శ్రవణ పర్వముగాఁ బొసరించి ధేనువుల్
దళమయి యింటిమోమగుచు దాపునుండి గమించుచో ద్రుమం
బులపయి నెండ గాయుతఱిఁ బోల్పఁగ నా నది నందపల్లెనాన్ 12

శా. వ్రేపల్లెం గలగోపగోపికలు శ్రీకృష్ణుం జగజ్జిష్ణునిన్
రేపున్ మాపును భక్తితత్పరత నేరీతిం బ్రపూజింతురో
యాపల్లెం గలభక్తు లెల్లరును గృష్ణానందునిన్ సర్వలో
కాపద్బాంధవునిన్ భజింతు రమలస్వాంతంబుతో నెప్పుడున్. 13

ఉ. పల్లియ నున్నకాలమునఁ బర్వతనారదముఖ్యమౌను లు
త్ఫుల్ల మనోంబుజాతు లయి పోయి యదూద్వహు సేవఁ జేసి న
ల్లెల్లరు భక్తులున్ ఘనులు పృథ్విసుపర్వులు చిల్కపూడికిం
దెల్లము గాఁగ వచ్చి వినుతించి భజింతురు కృష్ణభూషణున్. 14

ఉ. సబ్బినివీసు కృష్ణుఁడు నిజంబు పదంబును వీడి కొన్నినా
ళ్ళబ్బుధవర్యుతో మెలఁగ నచ్చటికిం జనుదెంచె భార్యతో

గొబ్బున వచ్చె లక్ష్మమయుఁ గొదుఃను జూడఁగ వచ్చెఁదమ్ముఁడై
ప్రబ్బినసత్యనాముఁడును భ్రాంతిపయుం గల పేర్మి పెంపునన్. 15

ఉ. అప్పుడు స్వామి వత్సరసమంచితకాలము దీక్షఁ బూని తా
నెప్పుడొ యిన్ని పాల్గుడిచి యేకవుఃఖంబుగ యోగనిష్ఠనుఁ
జొప్పడఁ బెందపం బెడఁద శుద్ధవిరాగము పెనఁగొనఁగ నై
చెప్పఁగ నొప్పె దేవమునిచెన్నున మిన్నగఁ దేజరిల్లుచున్. 16

క. నవరాత్రింబుల క్షీరము
లవి మాని జలంబు లాని యాదినములలో
నవిరళపూజావిధులన్
సవనము గావించె నతఁడు సన్నుతమతియై. 17

తే. అతనితమ్ముఁడు సత్యనారాయణునకు
మేనయల్లునకున్ వద్ద లానిలయము
లంద జరిగె వేంకటసుబ్బమాంబ యనెడు
ననుజ గంగాధరుఁడు బావ యట నిలిచిరి. 18

తే. అపుడు మేనయల్లుండు దర్భాన్వవాయుఁ
డైన వేంకట కృష్ణమూర్త్యాఖ్యు ననుజు
సత్యనాము నాగేశ్వరశాస్త్రియొద్దఁ
జదువఁ బెట్టెను కృష్ణభూషణుఁడు ప్రీతి. 19

తే. వారు పదునాలుగేండ్లలోపలన కావ్య
ములును భాష్యాంతముగ శాబ్దమును బఠించి
రందు మేధావి సత్యనారాయణుండు
విబుధు లెన్నఁగ శాస్త్రియై వినుతిఁ గాంచె. 20

వ. ఆకాలంబున. 21

తే. పాలు దాగిన శిశువులు జ్వరమువలనఁ
బెద్దలును బాధపడుచు నా పృథ్వీసురుని
కడకుఁ జనుదెంచి యాయోగికరమునుండి
తీర్థముం గొని స్వస్థతఁ దేరుచుండు. 22

సీ. గ్రహబాధితుల్ రోగు లహరహ జ్వరితులు
శాంతివిహీను లాస్థానమునకు
దినదినమున్ దేశదేశంబు లందుండి
చనుదెంచి కాపురంబును బొనర్చి
శ్రీవారి సేవించి స్వీకరించుచుఁ దీర్థ
మటఁ గొని నా ళ్ళుండి యరుగుచుందు
రంద ఱారోగ్యము నొందిరే పోవ్రదు
రేరును రోగులై పోరు మరలి.

తే. యిట్టు లానందమూర్తి యీపృథ్వియందు
బహువిధంబుల రోగముల్ ప్రబల వచ్చి
నట్టివారల రోగము లట్టె మాన్పు
నట్టిదైవ వర్ణ దీక్ష పరమావ్రిఁ జేసె. 23

వ. అప్పుడు నెల్లూరినుండి మహంకాళి శ్రీనివాసు లాదిగాఁ గల భక్తులు కొందఱు సకుటుంబముగావచ్చి స్వామిని సేవించుచుండి రనంతరంబ.

ఉ. బందరుఁజేరి మానియ్యాలు భక్తుఁడు నా నడిరేక్కి యెవ్వరే
నిం దనుఁబల్కరించినను నిల్లక "సందు" మటంచుఁ బల్కువాఁ
డందలిరంగదాసుఁడు ప్రియంబున భూషణమూర్తితోడ రే
యిం దగ మాట లాడెడి మ తెవ్వరు లేనివివిక్త మబ్బినన్. 25

తే. పారిభాషికపదములు నాడ కతఁడు
భక్తిమాత్రి మెఱింగిన వారలకును
దత్త్వబోధముఁ బొనరించుచారి కృష్ణ
భూషణుఁడు వోలెఁ దెలిసిన పురుషుఁ డరిది. 26

తే. అమల శాస్త్రమునుండి లోకానుభవము
నుండి మే లుదాహరణము లొలికి చులక
బోధమును జేసి సంశయమును వెలార్చి
జ్ఞానులుగఁ జేయు నెల్లర ఘనుఁ డతండు. 27

తే తనకు వ్యతిరేకులై యుండుజనులు గూడ
దివ్యబోధామృతంబునఁ దృప్తు లగుచు

భూషణస్వామి హాసునై మొక్కి పోవు
చుండు తన్మహిమం బెన్న నోప రెవరు. 28

ఉత్సాహము. కోడవలూరినుండి రెడ్డికొమరుఁ డొకఁడు శిష్యుఁడై
కొలిచి వారెఁ గొలుచు మందుఁ గొంత దిన్న మంపుచున్
గడు ముదంబుతోడఁ గృష్ణుఁ గాఁ దలంచి భూషణున్
విడక వానిబోధములను వినుచు నుండు నెయ్యెడన్. 29

సీ. అలపిలుకలపాడి యాశ్రమంబున భక్త
వరదుఁడై భూషణస్వామి యుండి
యామునయతిస్తుల కాపథాదులకు జి
జ్ఞాసువులకును సుజ్ఞానబోధ
మొనరించుచుఁ బదేను లొగిఁ గడపం జేసె
నాలోన నాగేశ్వరార్యుండు
నతికీడ నంను దానము చేసె నట గురు
వులు శిష్యులును బాంధవులును హితులు

తే. వచ్చి యటఁ బర్ణశాలలు వైచికొని సు
ఖముగఁ గాలముఁ బుచ్చునాసమయమందు
భూషణస్వామి యాశ్రమభూమి యెల్ల
గురుకులాశ్రమభూమి నాఁ గొమరు మిగిలె. 30

తే. పత్రపుష్పఫలంబులఁ బ్రబలువృక్ష
లతలతో నాశ్రమపదంబు లలిఁ దలిర్పఁ
గేతకీసుగంధము లెపర్ణకీలితగృహ
ములను స్తంభములై కడు ముదముఁ గూర్చు. 31

సీ. వేదశాస్త్రశ్రౌతవిద్యావిశేషముల్
భాష్యపాఠాదులు ప్రార్థనములు
వివిధపురాణముల్ వేదాంతగోష్ఠులు
భాగవతాదిప్రబంధములును
సంగీతసాహిత్య సాంగప్రసంగతుల్
సుకవిత్వతత్త్వముల్ సూక్తితతులు

చిత్రపఠితిత్రపలల్ శిల్పముల్ ప్రకృతిశా
స్త్రజ్ఞానయోగముల్ సామములును
తే. జపతపంబులు దేవతార్చనలు స్నాన
సంధ్యలును హోమములు నజస్రమును నాశ్ర
మమున సర్వత్ర వర్తిలు నమరవరులు
విడువ కటు నుండ నెంత్రని యెడఁ దలంతు. 32

—ః తిరుపతిలో వేదాంతోపన్యాసము ః—

వ. అట్టి పరమపవిత్రాశ్రమంబునఁ గృష్ణభూషణుండు నిష్ఠాగరిష్ఠుండై నియమవ్రతంబున నున్నయప్పుడు తిరుపతి పురవాస్తవ్యులు తత్త్వజిజ్ఞాసువులు కొంద ఱనఘమూర్తులు భూషణస్వామిని దమపురంబునకు వచ్చి తమపై జ్ఞానామృతంబు వర్షించి పోఁ బ్రార్థించుటం జేసి యతఁడు కొందఱుమిత్రులం గూడి వేంకటాచలంబునకుం బోయె నప్పు డప్పురంబువారు. 33

తే. ఇతఁడు వశ్యవిద్యాచార్యుఁ డితనిఁ బోలు
తత్త్వవేత్తలు లేమి తథ్యం బటంచు
నతని మోటారుపై నిల్పి యఖిలజనులు
నేగుఁబెండ్లి పొనర్చి రాయేగినపుడు. 34

వ. ఇట్లతివైభవంబునఁ బురంబున నేగుఁబెండ్లిం జేయుచు నతనిం దెచ్చి యొక్క దివ్యభవనంబునన్ దింపి రంత నతం డట విశ్రమించి బహుజనసమాకీర్ణం బగు సభామధ్యంబున నిట్లుపన్యాసకుండై. 35

ఆ. ధర్మమార్గమందుఁ దవిలి లోకమునందు
సర్వసంగములను సంత్యజించి
యోగియై తపించుచుండునాతఁడె ముక్తుఁ
డెల్లవారి కన్న నెన్న ఘనుఁడు. 36

ఉ. కాయ మమేధ్యసంయుతము కర్మసమేతము నశ్వరంబునై
పోయెడు దుఃఖముల్ సుఖము పోల్ప ననిత్యము లందు దుఃఖమే
పాయనిదై సమృద్ధ మగు స్వల్పమునందును స్వల్పమై సుఖం
బేయెడనో కనంబడెను నిట్టిది జన్మము నా నెఱుంగుఁడీ. 37

సీ. తలఁప మానవజీవితమునకు విశ్వ
జీవైక్యమే లక్ష్యమై వెలయును
దాని నానంద మండలమును సిద్ధించు
స్వస్వధర్మమె దానిసాధనంబు
సద్విద్య మానవ సంస్కారమునకు స్వ
రూపసాక్షాత్కృతి కోసమె యుండు
స్వాంతశక్తిని ననుభవమునకుం దెచ్చు
కొని ప్రకృతిజయించుకొనుట కెన్నఁ
తే. దప మొనర్పంగఁ జెల్లెడుఁ బ్రవృత్తిపంబు
శాంతమునఁ జేసి కొనుట కాశ్రమము లుండ
వలయు నెల్లెడఁ దొల్లింటి వలెను మనకు
దాన్నికై యతనించుట తగునుగాదె. 38
తే. జనులు చతురాశ్రమంబుల సంప్రదాయ
సరణి వర్తించుచు స్వధర్మసమితిఁ దీర్చు
చుండఁ దగు నార్యధర్మ మిట్లొప్పుచుండ
జ్ఞాతకుఁ దపోవనంబులే స్థానము లగు. 39

— తపోవనవర్ణనము —

చ. అడవులు వంపఁ గొండగుహలందు నదీనదతీరభూములన్
జలధిసమీపభాగముల నన్యము లాశ్రమముల్ పొసఁగ్చి య
క్కడఁ దప మాచరించుటలు గల్గును దొల్లిటి భారతావనిన్
గను మదియెం బొనర్చు నవి కన్గొన సంతత కన్నుపంపు వై. 40

సీ. కపురింపు టనఁటులు గన్నేరుగున్నలు
గుజ్జులేమావులు గొజ్జఁగులును
గేదఁగుల్ తగునాగకేసరములు పోకలు
జాజులు విరజాజి సంపఁగులును
దానిమ్మ నిమ్మలు దాసనమ్మలు సుర
పొన్నలు పొన్నలు పొగడగున్నలు
మల్లెలు మొల్లలు మరువముల్ దమనముల్
పారిజాతమ్ములు గోరఁటలును

తే. మఱియునం గలచక్కని మార్గమున లలర
నందనంబును బురుడించుచందమునను
వనులు గల్పించి మునివరుల్ వాస ముండు
రాకు టిండ్లను నిర్మించి యనుదినంబు. 41

తే. మునులు రుద్రాభిషేకంబు ప్రాను దాఁక
నంచ లటఁ దమ్మికొలఁకులయందు డిగప్ర
తబాను లీశ్వరుఁ బూజించు కాంక్షఁ దుమ్మె
దలు పొదల వండుఁ బూవుగుత్తులను బ్రీతి. 42

సీ. బాలెంతపులులు చన్బాలిచ్చి పెంచుఁ జె
రిఁ లేడిపిల్లలఁ గనికరమున
నాఁకొన్నసింగము లవి మదించినయేని
కలు నొక్కగొంతెంగా నలరు చుండు
నెలుకపిల్లలతోడఁ జెలరేఁగి బావురుఁ
బిల్లులు చెలఁగాడుఁ బ్రీతి గూడ
నెమిలిపిట్టలతెక్కగమి నాట లాడెడుఁ
గుంభీనసంబులు గుతుక మలరఁ

తే. గోతులును గొండగొఱియలు గూడి యాడుఁ
బులుఁగుగూండుల డేగలు మెలఁగుచుండు
నరుల నరికట్టి తపియించునట్టి పరమ
మునులమాహాత్మ్యమునఁ దపోవనములందు. 43

చ. దిగు డెగు డై కనంబడక తిన్నని దైనప్రదేశమం దిలన్
సాగ నగుపారుటాకులను సొన్నపునిగ్గుల నగ్గలించు న
ట్లుగఁ బయికప్పు చొప్పడఁగ లోఁగిళులో యని తోఁచు నట్లుగాఁ
దగు నిరుచక్కివీథుల నుదంచితలీలల కై కుటీరముల్. 44

ఉ. చెట్టులక్రింది వేదికలఁ జిన్నికుటీరములం దజస్రముక్
జట్టులు చేరి వేదములు శాస్త్రములుం బఠియించుచుండ మేల్
నట్టువ మాడుచు న్నెమిలి నాదు పొనర్చుచునుండ లేడిపిం
డట్టె కనంగ రాఁగ మది కాశ్రితభాగము లింపు నింపవే. 45

చ. చిలుకలు కూయుచోఁ గెలనఁ జెట్టులనుండి సుగంధ వెల్లెడన్
గలయఁగఁ బర్వుచో నదులఁ గంజములన్ గదలించి తెమ్మెరల్
నలుగడ మందమందముగ లాస్య మొనర్చుచునుండ నాశ్రమం
బులు కడు రామణీయకతఁ బొంపిరివోవుచు హాయి గొల్పవే. 46

తే. వానిని జూచి యానందపరవశుఁ డయి
జనుఁడు సర్వము మఱచి యాస్థలుబు విడిచి
కాల్గదలుప లేఁడు మఱొండు కడకు నేగ
నాకభూములకన్న నయ్యవియ హెచ్చు. 47

వ. అని యభివర్ణించుచు మఱియును. 48

సీ. నాలుగాశ్రమముల నలువొందువారు జి
జ్ఞాసువులై యందు వాస ముండి
స్వాధికారమునకు ననువగుజ్ఞానము
గలిగించుకొనుచుండ్రు తెలియు నిప్పు
డట్టిధర్మము గాన నయుతి గాకుండె న
య్యది గాన నిట నొకయాశ్రమంబు
నిర్మింప నెంచితి నేఁ బండితుల నిల్పి
చదువుఁ జెప్పించుట మొదటికార్య

తే. మద్ది దేవాలయముగ గ్రంథాలయముగఁ
దంత్రమంత్రాలయముగ భక్తజనభజన
మందిరముగఁ గాలక్షేపమందిరముగ
నన్నసత్రముగా నుండ నభిలషింతు. 49

ఉ. తొల్లి మహామహీశ్వరులు తోరపుభక్తి నిజాధికారితన్
దెల్లము గాఁగ నిట్టిగతి దివ్యతపోవనులాశ్రమంబులున్
సల్లలితప్రకారముల సల్పి మహోద్యమ మెల్లకాలముం
జెల్లెడు నట్లు చేయుదురు చెప్పఁగ నేమిటి కట్టిచెయ్వులన్. 50

వ. అట్టిధర్మము నేఁడు మఱియు నుజ్జీవింపఁ జేయుట కెంచుచుంటి మీ
రెల్లరుం దానికిఁ దోడ్పడ వలయు నని యుపన్యసించి కార్యనిర్వ
హణదక్షుండై యటఁ గొన్నినాళ్ళుండి వారికిం జెప్పి నిజాశ్రమం
బునకు నిర్గమించె. 51

—— సుబ్బావధాని సమావేశము ——

ఆ. అప్పుడు విజయనగరమందు వైదికుండు సు
బ్బావధాని భూసురాగ్ర్యవిభుఁడు
విని మనంబునందుఁ బెన్నిధిఁ గనుఁగొన్న
పేదపోలె మిగుల మోద మొందె. 52

వ. ఆసుబ్బావధాని. 53

ఉ. వైదికసంఘమందుఁ బ్రభసంబును బొందెను వేదశాస్త్రముల్
ప్రోదిగ నేర్చె పూరాణకలలో నొకయింత పరిశ్రమంబునన్
మోదము గాంచఁ గల్గెను సముత్సుకుఁడై తనుశాస్త్రమెల్ల సం
పాదన మాచరించి సలుపం గలఁ డయ్యెను సర్వవైద్యమున్. 54

ఉ. ముద్దులు మూటగట్టనయి ముచ్చట లెచ్చఁగ సత్కవిత్వముల్
పద్దు జగత్ప్రసిద్ధ మయి పర్వఁగఁ బెక్కు ప్రబంధరాజముల్
పెద్దలు మేలు మే లనఁ దిరిలింగసుస్తుతిఁ జేయఁ గల్గి మే
లద్దిర నాఁగ సంస్కృత మహాకవి యయ్యె నవధాని దక్షుఁడై. 55

ఆ. పుచ్చు చచ్చు లెక్క పొడి పొడి మాటలు
జల్లి బొల్లికవిత లల్ల నుఱికి
శతవధాను లనుచుఁ జప్పపే ర్గొం డ్రిట్టి
మాదిరివాఁడు గాడు మానవధాని. 56

చ. తను కవనంబు నేర్చిన మొదల్ రచియించినగద్యపద్యముల్
గని పఠియించునట్టు లోకసంతసముతోఁ బఠియించు జ్ఞప్తిమై
మును వినియున్నసామెతలు మూఁడగు భాషలలోఁ బ్రమోదముం
దనర వచింపఁ జాలు నవధాని యనంగ సతండె చెప్పఁగన్. 57

చ. సభల నుపన్యసించుతఱి సభ్యజనుల్ బళి యంచు మెచ్చఁగా
సభయుఁ డతండు సర్వవిషయంబు లనర్గళరీతిఁ జెప్పనై
విభవము గల్గఁ జేయఁ గలవిజ్ఞుఁడు సుబ్బవధాని సామెతల్
ప్రభవము నొందునట్టు విన వచ్చెను కోటు లుపన్యసించుచోన్. 58

క. సమయోదాహరణము లా
సుముఖుఁడు సుబ్బావధాని సురుచిరవరవ

తెలియ నొకటి యుచ్చైను గలదు గాదె
తగవు "దర్శ నా దేవ నాథవ" యటంచు. 66

ఆ. పిలికివాఁడ యైన పార్థుఁడు శ్రీకృష్ణుని
వలన గీత విని పయిని గాదె
వీరుఁ డగుచు నరులఁ బిలుకు మాలిచె నవ
ధాని యట్టిరీతిఁ దనర నయ్యె. 67

ఆ. పాంచరాత్రదీక్షఁ బడసి తత్త్వముత్రసఁ
బూర్ణుఁ డగుచుఁ దొంటివాల్కి గాక
మాఱిపోయి యతఁడు సజ్జి జ్ఞానవీరుఁడై
గెలిచె లోకశాత్రవుల నమున్న. 68

— భూషణస్వామి మహిమలు —

సీ. మూఁడు రాత్రియును బరీషమును విడువక కొన్ని
కొన్నినాళ్లు సమాధిఁ గూరుచుంటఁ
బెక్కుమంది భుజింప నెక్కువౌ నాహార
మొక్కఁడే భూరించు మెక్కుటయును
దన చేతితోఁ బెట్టి జనుల కెంతేఁ దిండి
వెక్కసముగఁ దిని పించుటయును
నొకొక్కనాఁటికి నొక్కఁ డెక్కువ గాఁగ
మిరియములఁ దిని దీక్ష మెలఁగుటయును

తే. జాతకాదులు చూడక జాతకఫల
ములను జెప్పుట పదుగురు కలిగియున్న
చోటఁ దా నుండి యేరికిం జూడఁ బడక
యుంట మొదలెన్నొ తెలియు నొఁ గంట వింట. 69

వ. మఱియుం గొన్ని మహిమలు చెప్పెద నాకర్ణింపుఁడు. 70

మ. ఒకనాఁ డెద్దులబండి నెక్కికొని శిష్యుం డైన చుండూరితో
నొకచో నుండి గురుండు కోశమితిలో నున్నట్టిరై లెక్క నొ
త్తునకుఁడై వచ్చెడులోన రైలు చనుటల్ చూపట్టఁ దా ధే యనన్
శకటంబుం గొని పోయె నెడ్లచటికిన్ గన్గిటు నయ్యింతలోన్. 71

తే. అకఁడు చిలుకలపూఁడిలో హితులలోడఁ
గలసి సంభాషణము సేయుకాలమందు
నొక్క గడెసేపు కానరా కుండి పిదపఁ
దొంటియట్టులఁ గన వచ్చెఁ గంటి కటన. 72

ఉ. అచ్చెరు వంది భక్తులు మహాత్మ! యిటం బొలుపొందు చుండియుఁ
ముచ్చట లాడుచుండియును బోయిన పోక లెఱుంగ రాక మీ
రెచ్చటి కేగి వచ్చితి రి దేమి విచిత్రము చెప్పఁ డన్న నా
సచ్చరితప్రభావుఁడును సంయమిచంద్రుఁడు భూషణుం డనుఁ. 73

తే. మీర లిట నాత్మతత్త్వము నారయంగ
నుండఁ గలికాతయం దొక్కయుగ్మలి నను
నాత్మపరమాత్మతత్త్వము నారయుమతిఁ
దలఁచె నాదర్శనముఁ గోరి తత్పరతను. 74

ఆ. పరమభక్తురాలు బహువర్షములు నన్ను
భక్తిమై భజించు పరమసాధ్వి
యామెప్రార్థనంబు నంగీకరించి నే
నరిగి వచ్చినాఁడ నటకు నిపుడ. 75

తే. అనిన నం దుండువా రొక్కొండ తొ ననియును
గా దనియును గొందఱుఁ బల్కఁ గలిగి తంత్రి
నిచ్చి ప్రత్యుత్తరము నంది యెఱిఁగికొనిరి
భూషణునిమహత్త్వమున కద్భుతముపడుచు. 76

ఉ. పేటలలోనివస్తువులు వేరివి నేసియుఁ బోయె నే యున్
మాటికి వచ్చి భూషణుసమక్షమునం దడుగంగ నాతఁడున్
గాటుక వ్రాసి కన్గవకుఁ గన్గొనుఁ డన్నను వారు చూచి య
చ్చోటను వస్తురూపమును జొప్పడఁ జెప్పుచునుందు రెప్పుడున్. 77

తే. కేడియో సాధనం బది వేడుకమెయి
నెల్లచోటులశబ్దము లెట్లు చెప్పు
నట్లు భూషణమూర్తికి నఖిలదిశల
శబ్దములు వినిపించును శ్రవణశక్తి. 78

ఆ. సూర్యరశ్మి గలుగు చోటులం దెల్లఁ
దనదు మంత్రశక్తి దనరి కార్య
గతులు చక్కఁ బెట్టఁ గల దని చెప్పి త
ర్కాణ మాచరించు ఘనుఁ డతండు. 79

తే. తేలుఁ బాము జెఱ్ఱియుఁ
బాలావర్యులకులార్ణవహిమాంశుని జే
లాలించి నంత మాయమై
బై బలా గతి పోవు మంత్రించి చదువ వచ్చున్. 80

మ. మధురాపత్తనమం దోకిల్ పరశురామ ప్రీతి యాచించ నం
దు ధరాభాగమునందు మంచపు పయిన్ మూర్ఛెంద బాలుండు దు
ర్విధి నిద్రించుచునుండ లోని శవమున్ వేంచేయ లేనప్పు డ
బ్బుధవర్యుం డంగమించి తెచ్చె బుధతన్ బోధించి వైశ్వానరున్.

ఆ. తనకుఁ గాల లేదు దగయును రా లేదు
కాని బిడ్డ కాలు గాలె దగయు
వచ్చె నతఁడు జలము వాసిపైఁ బ్రోక్షించు
నంత స్వస్థుఁ డయ్యె నక్కుమారుఁడు. 82

మ. జలకం బాడఁగ నేగి యేటికి నటన్ సంకల్ప పూర్వంబుగా
జలమందున్ డిగి యీఁదులాడుచును వెల్చెన్ మున్గుచున్ దేలుచున్
బలి నొక్క ప్రతం డందు మున్గి దిగువన్ డా నొక్కజాముండి య
వ్వలఁ బై వచ్చుట తెల్లరుం గని కడున్ వర్ణించి రయ్యోగినిన్. 83

తే. సైకతమునందు బలెను భూషణమునందుఁ
డాపగా జలముల మీఁద నట్టు నిట్టుఁ
బిల్లి మొగ్గలు వేయుచు వెల్లకిలఁ బడి
బోరగిలఁ బడి కట్టెనాఁ బోవు వచ్చు. 84

ఉ. విప్రవినోది యొక్కరుఁడు వేడుక లోడిక లెత్తి గుత్తిలో
విప్రిలచెంగటం దనదు వింతవినోదము లెన్నొ చూపుచో
నప్రతిమప్రభావుఁ డతఁ డందఱుఁ జూడఁగఁ బండుమీఁదికిన్
క్షిప్రము గాఁగ వైచి భువికిం బడకుండఁగ నిల్పె దానినిన్. 85

తే. త్రైలికులతోడ గొడకోనదారి నడుచు
నపుడు తెక్కలికాండ్రను గై వధింపఁ
గత్తు లెత్తుచు నెత్తిన నెత్తినట్లె
యుండ స్తంభింపఁ జేసె నయ్యుర్విసురుఁడు. 86

సీ. ఎవ్వఁ డే వేదము నే శాస్త్రముఁ బఠింపఁ
దాఁ బఠించుఁ దత్త్వదర్శి యగుచుఁ
బ్రకృతిశాస్త్రంబులఁ బండితుం డరుదెర
వానికం దెలియునివానిఁ దెలుపుఁ
దా మెట్రిక్లేషను దాఁకఁ బఠించియు
యం. ఏ లకం జెప్పు నదికపార
మల్లధిన్వంతరియట్లు వైద్యులకు నే
నుపదేశగురు వయి యుండ నోపుఁ

తే. గవితయును జిత్రకళయును గానము మొద
లెల్ల కళలును భూషణుం డెఱుఁగు నతని
సర్వతంత్రస్వతంత్రుఁడు సాధుమూర్తి
శాంతుఁడును దాంతుఁ డని చెప్పఁ జనును గాదె. 87

వ. ఇట్లు మహాప్రభావంబునఁ బ్రసిద్ధిం గాంచి భూషణస్వామి చిలుకల
పూడియాశ్రమంబున నుండి యొక్కనాఁడు మిత్రబృందమధ్య
గతుండై తత్త్వవిచారంబు సేయుచు. 88

— తత్త్వవిచారము. —

సీ. భాగవతగ్రంధవర్ణితం బగువిరా
ట్పురుషస్వరూపముం బోలునట్లు
మానవదేహ మమర్పఁగాఁబడెఁ బర
బ్రహ్మచైతన్యము పరఁగ జీవ
రూపమునన్ దేహరూపితం బగుచుండు
బ్రహ్మమునకును జీవమున కెప్పు
డైక్యానుసంధాన మది ప్రాప్య మగుచు వే
దాంతముల్ సెప్పెడు ననవరతము

తే. బ్రహ్మ చైతన్య మది శరీరముల వాయు
రూపమున ఘ్రాణమున సరూపమున ము
ఖమున శబ్దరూపమున శ్రోత్రమున జ్యోతి
రూపమున నేత్రమున నుండు నేర్పు మీఱి. 89

తే. మృతశరీరమునం దట్టి వితము పోవ
నగుటఁ జైతన్య మని దేహమందు నున్న
దగును నిజజీవతత్త్వము దెలిసి మున్న
బ్రహ్మసాయుజ్యమున కింత ప్రసితి వడయు. 90

శా. సాయుజ్యం బది పొందు జాడఁ దెలుపన్ శాస్త్రంబు లెన్నే నగున్
ప్రాయః ప్రకృతి సాంఖ్యయోగములు తత్ప్రాపింతెంబుఁ జేకూర్చెడిన్
జేయుం జేయుఁగఁ గాని తత్పరిచయశ్రీగంధసామగ్రిమై
నా యోగంబు లభించుటన్ దెలియఁ గష్టాసాధ్యమం చెంచెదన్. 91

ఆ. అభ్యసమునఁ గాని యపరోక్షవిజ్ఞాన
మది లభించు టరిది యగుమఁ గాని
గుర్వనుగ్రహంబు గొనినవానికి నది
కరతలామలకము కనుఁగొనంగ. 92

మ. గురుమాహాత్మ్యము నొందఁ గల్గి మఱియున్ గుర్వంఘ్రిపద్మార్చనా
పరుఁడై భక్తి భజించు శిష్యుఁడె శుభస్వాంతంబునం జేసి యీ
శ్వరమాహాత్మ్యము నొంది పొందుపడు మర్మ వర్జించి దేహభ్రమల్
పరికింపంగ నొకింతలోపలన దేవత్వమ్ము ప్రాపించెడిన్. 93

ఉ. వాతము పిత్తముం గఫము వర్ధిలునప్పుడు సన్నిపాతమై
భీతిదమై మహామయము పెచ్చినయప్పుడు వైద్యుఁడుం బలెన్
ఖ్యాతములై వికారములు గల్గిన సత్త్వరజస్తమంబులన్
భూతము లట్లు రాఁ గలఁత పుట్టెడు నప్డు గురుండె వైద్యుఁడౌ. 94

తే. తత్త్వభేదానుగుణముగాఁ దగుచికిత్స
వైద్యుఁ డొనరించునట్లు లుపాసనాది
దీక్షలం జేసి శిష్యుని దేశికుండు
సంతరింపఁగఁ జేయుఁ నీసంసృతి నొగి. 95

తే. దేశకాల పరిస్థితుల్ దెలియఁ గలిగి
మఱి మే నిష్ఠ రాజకీయోద్యమముఁ
జేయఁ గలయట్టి ది తయుఁ జేకురంగఁ
జే..గల..ది లే దని చెప్పుచుంటి. 102

చ. మఱియును బ్రాహ్మణుం డయి సమర్థుఁ డు బాసు స్వధర్మనిష్ఠుఁడై
..రుల మాశ్రయించి తనకుం గలచింత ల నెల్లఁ దీఱఁ గా
సురుచిర..త్త్వ..ం దెలిసి శుద్ధమనస్కుఁడై సత్పథంబునన్
జరఁగుచు నిశ్చలాత్మ మగుపట్టున నుండె సమంజసం బగుఁ. 103

ఆ. స త్త్వవంతుఁ డగుచుఁ జనెనుసాతఁడు పా్రి
రబ్ధ..ము..సు ..కరతిఁ దగిలి..
యేఁ గులా..ట మెట్టుండు స ట్లుంట
..లు ననుగు రెల్ల బుధులు దవిలి. 104

చ. ఒరుల సముద్ధరించుటకు నుల్లము సేసెడువాఁడు మున్ను దా
గురుపలసన్ సముద్ధతిఁ గొంచెము నేనియుఁ బొంది యుండ నా
నెఱుఁగక చేయు నొప్పు డెని యేని పరంబును గోరునట్టి వాఁ
డొగులను జూడకుండ నొకఁ డుడ వరం బన నొప్పు నెప్పుడున్. 105

క. ఏకాంతస్థలమునయుం
డేకాలము నుండువారె యెంచఁగ సర్వ
శ్రీకలితు లద్రిగుహాలం
దే కాపుర ముండుమునులదే సత్త్వ మగున్. 106

తే. గుహల సింహంబు ల ట్లుండ శిహాంహంబు
సంఘములు గట్టి లేచిండాడ్పున సయి
పురుషు లత్యల్పసత్త్వులై పొలుపు దక్కి
పోవుదు రటంచుఁ దెలియుము భావమందు. 107

— వేంకటరెడ్డి గుహ దర్శనము చేయుట —

తే. అట్లు గురువు చెప్పినపయి నవ్విధాని
రాజకీయోద్యమమునఁ బరాఙ్ముఖుఁ డయి
దాన విరమించి తనమిత్త్రుఁ డైన రెడ్డిఁ
గలసికొని పోయి గురునకుఁ దెలుపుటయును. 108

బేరిమఁ గూటయొకండు గోత్రములవారిఁ వైష్ణవులం బ్రోమటన్
భూమిని వారుమహేంద్రతుల్యులగుచుంబాల్పొందు మంద్రెప్పుడున్.

ఉ. భూతలరాజరాజు లయి పొల్పెసలారెడువారిలోన వి
ఖ్యాతము సుందరాఖ్య నలరారెడు గోత్రిపతెంస మందు ల
క్ష్మీశ్రితనయుల్ మహోన్నతులు చెప్పఁగ నొప్పిరి చుండు రిన్నప్రి
ఖ్యాతి నెసంగుగ్రామముసఁ గాపుర ముండుట నట్టిపేరిటన్. 116

మ. ఘను లాచుండురివారిలో నధికుఁడై కంజాక్షభక్తుండు నై
తనరెన్ వేంకటరెడ్డినాముఁడు మహోత్సాహుండు యక్షేశతు
ల్యనిధీశుం డఖిలార్థికల్పకము విద్యాశాలియై దానముల్
దనరం జేయుచుఁ గాంచె నుత్తముని సీతారాముని బుత్త్రినిన్ 117

శా. సీతారామయ గల్గివంశభవుఁడై చెన్నొందు వేంకాంబికన్
బ్రీతిం బెండిలియాడి నల్వురఁ గనెన్ విఖ్యాతులం బుత్త్రులన్
శ్రీతోఁ బుట్టినవారిలోఁ జివరనై చెల్వంబునం జెప్పనై
భూతిం బొల్చెను నాగభూషణుఁ డిలోద్భాతామరాగంబునై. 118

మత్తకోకిల. నాగభూషణుఁ డెల్లకాలము నాగభూషణభక్తుఁడై
యోగముం గొని లక్ష్మినప్పమ నుత్తమం గొని పత్నిఁ గా
నేగతిం గనినం గుబేరున కెత్తు వచ్చు ధనాఢ్యుఁడై
గోగణంబుఁ గలాఁడ యై వెలుఁగొందె నెంతు వదాన్యుఁడై. 119

కం. పూర్వం దావి తెలుఁగున
నావిడంపతులు లోక మభినందింపన్
శ్రీవిజయవాటికాపురి
దేవియు దేవరయుఁ బోలె దీపించి రొగిన్. 120

తే. అవలఁ గాంతయ సీతరామయ్య రెడ్డి
యప్పరావును రంగయ్య యనెడిసుతుల
లక్ష్మిదుర్గాంబ యనుసుతన్ లక్ష్మినాథు
భక్తి నాతఁడు గనె ధర్మపత్నివలన. 121

ఉ. వారలలోఁ దృతీయుఁ డయి భాసిలు వేంకటరెడ్డి మేటియై
తేటి పరీక్షలందు సుకృతిత్వము గాంచి యనంతరంబునన్

సారమతిం గవిత్వమును సల్పఁగఁ జాలిన సంస్కృతాంధ్రభాషల్
నేరిచి ప్రాజ్ఞుఁ డయ్యె రనిశం భజియించెఁ గాంగంబునన్. 122

ఉ. పాండవు లేవు రండు నడివాఁ డగునప్పుడు చెప్పుచేతిబింక
దండికి నెక్కెనో తెలియ నాగవిభూషణుపుత్త్రి లేవురా
దండజవాహభక్తి భరితాత్మకుఁడు వేంకటరెడ్డి నాముఁ డు
ద్దండయశోవిశాలుఁ డయి తా నలరారుచు నింపు వేసటన్. 123

మత్తకోకిల. నాగభూషణపుత్రుఁడై మఱినాగభూషణభ్రాతృఁడై
నాగభూషణుఁ డైన వేంకటనాథు సేవఁ బొనర్చుచున్
నాగభూషణవాగ్విశేషమునం దలిర్చును నాగభూ
షాగమాభ్యసనాత్తచిత్తుఁ డయారె రెడ్డివిభుం డిలన్. 124

చ. కలికలుషంబులన్ మలుపఁ గల్గును వేంకటశబ్ద ముద్రయే
తొలుతను బూని రెడ్డి యనఁ దోఁచెను తేఁ డనువాని సర్వులన్
గలుగఁగ బూని నామమున ఖ్యాతి నహించునటంచు పాపముం
దొలఁగఁగ జేయుచుం బ్రభుత దోఁప నొసఁగ్చను [illegible]వ్యవస్థతుల్.

ఉ. దాతలలో దధీచిఘనతం గొనియాడుదు రెల్లవారు త
త్ఖ్యాతి యెఱుంగుదుర్ విబుధు లంతటివా రొక యెమ్ము లీయఁ దాఁ
బాతరలాడె నిచ్చుటకు వైశ్యకులాభరణం బితం డసు తా
న్నేతటి నెవ్వఁ డే మడిగె నే నిడు లే దనఁ జెప్పఁ బట్టునన్. 126

వ. అనినఁ గృష్ణభూషణుం డగుం గావుత మని సూత్రభాష్యముం దీసి ప్రథమసూత్రముం జదివి భాష్యశాంతి చేసినంత వేదాంతము కుదురదు వేదాంతి యైన వెనుక నిది నిజానుభవ సమీక్షణంబునకుం జాలి యుండు. 127

ఉ. కావున గ్రంథజాలములు కట్టుఁడు నెట్టన నేతదర్థముల్
భావమునందుఁ బెట్టుకొని పల్కఱు చింత బొనర్చుచుండుఁ డం
చావరమూర్తి తత్త్వమురహస్యము నంతయు నెంతొ వింతగా
నావల నేనునాళ్లు దెలియ న్వచియించెఁ దదేకదీక్షగాన్. 128

వ. ఇట్లు తత్త్వం బుపదేశించి. 129

సీ. గురుశిష్యకర్త్ర మిక్కరణి గాంచెను గురు
తాఁ గాత్ర్యయ ... బొందఁ దగినవాఁడు
లక్షలో నొక్కండు లక్షింపఁ బడఁ గాన
నొక గురునకుఁ బెక్కు రుంట తగదు
ఛాత్రులు శంకరాచార్యునకు న్నలువు
రుత్తములఁ ప్రియశిష్యు లుండి రధిక
సంఖ్యాకు లున్నచో సంబంధ పుష్టిప
డెడి నట్టి దగును సని చెప్పుచుంటి

తే. అనుచు బోధించి యవధాని యనుజులం బలె
నరఘు వేంకటరెడ్డిని నాత్మజన్ము
నట్లు గ్రహియించి సద్భక్తస్వాంతుఁ డతఁడు
చేసె మంత్రోపదేశ మాశిష్యునకును. 130

వ. ఇట్లు వారికి గురుశిష్యసంబంధ మేర్పడిన పదంపడి నీ రప్పుడప్పుడు బెజవాడ నుండి చిలుకలపూడికిం జని గురుని దర్శించి వచ్చుచుండు రిట్లు కొన్నిమాసంబులు కడచినంత నవధాని యాయుర్వేద మహామండలికిం గార్యదర్శిగా నుండఁ జెన్నపురంబునకుం జని తిరువల్లిక్కేణినగరంబున నివసించి వైద్యవృత్తిం బ్రవర్తిల్లు చుండె నక్కాలంబున. 131

## — చెన్నపురీనివాసము —

ఉ. వేంకటరెడ్డి చెన్నపురి విశ్రుతమై తగి పచ్చయప్పనా
మాంకితమై తనర్చుదుకళాలయమందు బి. యే. పఠించుచున్
వేంకటశైలనాథు కృప విన్ననువొప్పఁగ నుండి నెమ్మదిన్
సంకటముల్ హరింపఁ గలసద్గురుసన్నిధి నొంద నెంచుచున్. 132

తరువోజ. అవధానితోఁ జెప్పి ప్రార్థించి యటుపు
నగ్గురువర్యు నాహ్వానమ్ముం జేసి
యవధానియింటిలో సతిభక్తి నుసిచి
యనుదినంబును శిష్యు లంపఱు గురునిఁ

దవునట్లు పూజించి తత్త్వోపదేశ
తత్పరులై గురుహస్తములసన్నిధిని
బరివిమలబోధముల్ పలుకంగ వినుచు
బహుతరానందసంభరితులై మఱియు. 133

సీ. గణితశాస్త్రమునందె కాక పదార్థవి
జ్ఞానశాస్త్రమునందు సంశయములు
గురునకు నెఱిఁగించి కొని తత్సమాధాన
మును దీసి కొనుచుండియును నొకప్పు
డా శాస్త్రములఁ గొన్ని యనుప్రశ్నలను డీయ
నవి కళాశాలలో నడిగి యచట
వాని యుత్తరములు వడయఁ జాలక గురు
ముఖమున విని తాను బోయి తెలుపఁ

తే. బాఠశాల నుపాధ్యాయవరులు ముగ్ధు
లగుచు నగ్గురు నగ్గించి రపుడు రెక్కి
నిజగురుప్రజ్ఞ కెంతయు నెమ్మనమున
సంతసించుచు సేవించు సంతతంబు. 134

ఉ. మండలదీక్షగా నచట మంత్రివిముండగు కృష్ణభూషణుం
డుండి తపంబు సేయుటకు నుద్యము సేసి వధానితోడ లో
నం దెడుకోర్కి తెల్పి గృహ మొక్కటి నేను దపింప వేఱుగా
నుండెడునట్లు చేయు మని యొప్పుగఁ జెప్పియు నప్డు వెండియున్.

క. నే నరుణోదయమున నే
స్నానము గావించి యందు జప మొనరింతున్
నా నెలవున కెవ్వరు నే
రా నొప్పదు భుక్తి విడుతు రాత్రులఁ బవలున్. 136

వ. అనిన నతం డట్ల యగుం గావుత యని సముచిత గృహంబు సేక
రించె నందు భూషణస్వామి నిరశనవ్రతంబున జపించుచు మండల
దీక్షం గావించుచుండె నక్కాలంబున. 137

-• అవదానికనకాంబను దర్శించుట •—

తే. పొల్లపూడికి నవధాని పోయి యుచటఁ
గనకమాంబను సభలోనఁ గాంచ నయ్యె
వారి కన్యోన్యపరిచయభాగ్య మొదవు
వెనుకఁ గవితాప్రసంగముల్ వెలయ నయ్యె. 138

తే. కనకమాంబిక ఘనుఁడగు కాంచనపలి
వంశమణి రంగరాయుని వరసుత యగు
నొకక మొనఁగి నూటల్పులనల్ పరీక్ష కెలమిఁ
జదువుచుండె మేధ్రాసున పరమమతి. 139

ఉ. కాంచనపల్లివంశమునఁ గాంచనమై తగుచుం గమూర్తిక్
గాంచనగంధి చంగమకు గావెలికూఁతుర నద్గుణంబులక్
గాంచనమే యనంగఁ గనకమ్మ యనంగను బేరుఁ గాంచి వి
ద్యాంచితమూర్తియై పవివినప్రాత్మమశీబ చరించి చెప్పెడుక్. 140

మత్త. వింటిఁ గంటిఁ గవిత్వముల్ కలఁ వేక్కె మీఱు రచించువా
ల్లంటులక్ భువి వార లెవ్వరు గాని యీకనకాంబ కే
వెంట నేనియు సాటి రా రని వేవిధంబులఁ జెప్పఁగా
నుంటి నాడుమజీవయాత్ర మహోన్నతిం గని యుండుటక్. 141

తే. పెక్కుగ్రంథములను వ్రాసి పేర్మి గాంచి
సతతపరమార్థచింతమే సద్ర్వతంబు
గాఁగ నిష్ఠాగరిష్ఠయై కాంతిఁ గాంచు
వినుతసద్గుణనిరుంబ కనకమాంబ. 142

శా. ప్రత్యూషంబున లేచి స్నానమును దేవబ్రాహ్మణారాధన
ప్రత్యాహార విహారముల్ సలుపుచుక్ వ్యక్తిత్వము గాంచ నై
నిత్యైశ్వర్యముఁ గోర్న మేటి యయునన్ నిర్లిప్తయై జీవునిన్
సత్యాన్వేషణ సేయుమార్గమున నన్ వర్ణింతు బ్రహ్మంబు నాన్. 

చ. కనకము యిఁటిపేరఁ గనకమ్మ తనర్చునిజాహ్వాయంబునన్
గనకము చిత్తశుద్ధిఁ గనకమ్మ గుణంబున నాఁగ నొప్పు మా
కనకమ సత్కవీశులకుఁ గల్పకభూజము నా మహోన్నతిన్
వనజదళాక్ష తాత్త్వికత్వపన్ మనుఁ గావుత నూఱువర్షముల్. 144

మోక్షసామ్రాజ్యముఁ బొందఁ జెంచితి నన్నుఁ
నీకు నవ్వల నది వాకొన నగు

తే. నిపుడు నేనేమి సేయుదు నెల్లశాస్త్ర
లకును దత్త్వోపదేశము లరయఁ బొసఁగ,
యుద్ధంపుము వారి గురూత్తముండయి
యనుచు వాక్యోపవాక్యము లరయ నయ్యె. 151

క. దీక్షాంతమ్మున నగ్గురుఁ
డక్షీణవిభాసితాకారుండై
లక్షింప నయ్యె నీశ్వర
సాక్షాత్కారమ్ము తనకు సమకూఁకతనన్ 152

తే. పిదప మిత్రులతోఁ శిష్యవితతితోడ
నిష్టగోష్ఠులఁ దేలు చనేకసదుప
యోగపరమార్థసంగతు లుచితరీతిఁ
జెప్పుచుం గాలముం బుచ్చెఁ జెన్నపురిని. 153

మ. కనకాంబామణి యగ్రిగణ్యాగఁ బరీక్షం దేరి శ్రేణిసమా
ఖ్యను బెంపొందుకలేజిలోన నసతుల్ గల్గంగ యఫ్. ఏ. పరీ
క్ష నెక్కెం దేఱఁ బఠించుచుణ్ సెలవుఁ గాంచం గల్గిన న్డైలఁ బ
ల్తనమం దుండెనయక్కయింటికిని మోహంబేర్పడణ్ వచ్చెడిణ్..54

తే. వచ్చి తనయక్కయింటికి వరుసనున్న
దంటునుబ్బావధానిని దాను గాంచి
ఏవుచుండు నిట్లుండినప్పుడు గురూత్త
మునిచరిత్రము విని మోద మునుపడును. 155

—◆ ఉద్యోగితో సంభాషణము ◆—

తే. స్వామి చిలుకలపూడియాశ్రమమునందు
నున్నయపు డుద్యోగి యొకఁ డొకప్డు
స్వామిసంగతిఁ గనుఁగొన వలయు ననుచు
వచ్చుచుంటి నటంచును వార్తఁ దెలిపి. 156

ఉ. ఆశ్రమభూమికిం బయనమై చనుదెంచెను స్వామి యప్పుడ
య్యాశ్రమమందు దర్భలఁ బ్రియంబునఁ గోయుచుఁ గాన నయ్యె న

యస్యాత్రితుఁ డాతనిం గని సంయంబుగఁ బల్కె-మనోజ్ఞ భూషణా
ఖ్యాతశ్రీవణీయు లీవ లోకో తానఁగ వచ్చితి మిమ్ము నమ్మితిన్. 157

ద్విపదము ఉద్యోగిమాటకు నుత్తరం బిడక
విద్యాధికుఁ డతండు విచ్చి యందొవల
వేద్యంబుగాఁ దల విసరె నాలోన
వద్యాశయుఁడు పదన్యవసితుఁ డపుడు. 158

మ. నను చేశాస్త్రమునందు మీకు నభిమానంబో విన గౌతుకం
బగు వా కిందవ భూషణం డతనిపై హాస్యంబు గల్పించి యే
తగులం బుం దభిమాన మొప్ప దని శాస్త్రంబుల్ ప్రఘోషించుచుం
డగఁ బ్రశ్నంబిబు లేల? నాకు నభిమానం బేటికో పూనఁగన్.

తే. అనిన న్యాయాధికారి యి ట్లనియె మఱియు
జీవనోపాధి మీ కెట్లు మీవఱకుఁబడి
యేటి కేమాత్ర ముండెను నెంత మిగులు
నెంత తగులు నన ల్స్వామి యి ట్లులసమె. 160

శా. సామాన్యద్విజు లైనవారి కిల నెంచన్ జీవనోపాధ యే
దేమాత్రం బయి యుండఁగాఁ దగునొ నా కేమంత నామాత్రమై
యామోదం బెసఁగించు దానఁ జగ నేం డ్లానాఁటి కానాఁడు నె
చ్చై మే ల్గూర్చుచుఁ దద్విచార ముపయోగాభావ మొప్పట్టునన్.

ఆ. అవిచారణంబు భావింపఁగఁ బ్రయోజ
న మ్మెఱింగి కొనఁగ నాకు మీకు
నింత యేని లబ్ధి నిడఁ బోవ దాప్రశ్న
మాచరింప యోగ్యమనఁగఁ దగదు. 162

తే. భూసురుని యోగ్యతాగతి పొదలుచుండు
రాఁబడినిఁ బట్టి నారాదు బ్రాహ్మణుండు
కూర్చు కళ్యాస్తనికవృత్తిఁ గూడి యుండ
వలయు నని పెద్ద లం డ్రిది తెలియ వలయు. 163

ఉ. వైదికమార్గమం దెటులొ వర్తనముం బొనరించుచుంటి నా
పైఁ దెలియంగ నర్థపరిపాటిఁ బొనర్పరు వేరు గాని న

స్వాదనుఁ డంతకుండు హరి యారయుచుండును సర్వరక్షకుం
డీదెస మీకు నేమిటికొ యింతశ్రమంపడ నయ్యె నయ్యరో! 164

తే. తనువు ప్రారబ్ధమున కీసి తనరు మంచు
"నాతమూ రన్ప్రం పరియచ్ఛతి" యనెడునార్య
వచనమును మీరు వినినట్టు స్వాంతమునకుఁ
దోఁప వచ్చుట లేదన నాపురుషుఁడు. 165

క. న్యాయాధికారికడ మీ
రీయోజం జెప్పఁ గలిగియే యుందురె నా
నాయదియుఁ జూడుఁ డప్పుడే
నేయోజం జెప్పఁ గలనొ యెఱుఁగఁగ వచ్చున్. 166

వ. అనిన నుద్యోగి యయ్యోగిపుంగవుని ధైర్యస్థైర్యంబుల కచ్చెరుపడి మెచ్చుచు యుక్తిశాస్త్రంబులం జెప్పి యొప్పింపం జాలు నతని కోపం జాలక క్షమింపుఁడు పోయివచ్చెద న. వెడలిపోవుచుండ భూషణుం డించుక వాని ననుసరించిన నతండును 167

తే. మీకు నీశ్రమ మేటికి నేము వచ్చి
నప్పు డెటు వచ్చితిమి పోవునప్పు డట్లె
పోదు మనఁగ నజ్ఞానము పొసఁగు దెలియ
కద్ది తెలిసి పోఁగొట్టఁగా నని యెఱుఁగరొ. 168

వ. అట్లుత్తరంబు చెప్పి సాగనంపె నిట్లు కొంతకాలంబు గడచినంత నొక్కనాఁడు 169

చ. వెలఁగిన వేడ్కతోడ గురుశేఖరుఁ డొక్కదినంబునందు మి
క్కిలిదయ నేగుదెంచి పరికించి నిధానిగృహంబునందు మేల్
తెలుఁగు ప్రబంధముల్ కడు ముదిన్ ముదమందుచు గ్రంథకర్త్రియై
యలరుచునుండు శ్రీకనకమాంబ నెఱింగె వధాని చెప్పఁగన్ 170

—• కనకాంబ ప్రశంస •—

మ. ఒకస్త్రీరత్నము గ్రంథరత్నముల నెంతో వింతగాఁ గూర్పఁ జా
లి కవీంద్రాళికి మెప్పు గూర్పఁ గలదై లీలం బ్రవర్తిల్లు నో

ఓ కవీ! మామకచిత్త మిత్తఱి మందస్మితంబ యయ్యెం దదీ
యకవిత్వంబున దత్త్వమున్ గుణము విద్యాబుద్ధులుం దెల్పవే.171

వ. ఏన నభిలషితము నెనిన నతం డతని కభినందనం బాచరించి
యిట్లనియె. 172

చ. ఎఱిగిన లే దటంచు నుడి మాయమవ క్రిమ సింప యెన్నఁడున్
వెడలదు చేతనైన గతి వేఱికి గాని పొఁగ్చ సాయ మె
వ్వారు కురితంబుల బలుఁక బూనమి బాయల కేని కీడు వ
చ్చెడు న సైప దుల్ల నఁ జెప్ప దసత్య మొక ప జేసియున్.173

క. తనబాధకన్నఁ బరులకుఁ
గ వచ్చెడుబాధ యొకింత కనఁ దనియించున్
వినుటకు నీ లేనివారలఁ
గనఁ గ కా బరుచు జాలి నెడు పడుఁ గలుగున్. 174

తే. క ప్పు చేసితి రక్షింపు తల్లి! యనుచు
నాశ్రయించిన వారిపై నక్కటికము
గలిగి కనకాంబ నేరము కాచి పుచ్చు
దానఁ దనకింత నష్టి రా నైనఁ గాని. 175

చ. కొడుకులఁ బోలె నింట నిడికొంచుఁ గళార్థుల నోటి యొద్దదే
నిడుచును వారియల్లరి సహించుచు విద్యలు నేర్పపద్ధతుల్
నడుపుచు సత్ప్రవర్తనములో మెలఁగం బొనరించి ప్రోచు నె
ప్పుడుఁ గనకాంబ శాంతగుణభూషణభూషితభాగ్యసంపదన్. 176

చ. కవితిలకంబు నాఁ బడెడుఁ గాంచనపల్లికొలంబుమానికం
బవ్రుకనకాంబ సత్కృతుల నల్లఁగఁ జాలినదంట గావునన్
కవిరాజచంద్రు లనఁగా నెగడొందెడు పండితేంద్రులన్
బ్రీతులభక్తితోఁ గొలుచు వారికవిత్వము నాదరించుచున్. 177

క. గురుభక్తి గలిగి యీశ్వర
వరభక్తిం గలిగి మెలఁగు పండితురాలై
సిరి గలిగి యున్న గర్వము
పరికింపఁగ నామె వెంటఁ బడ దేనాఁడున్. 178

క. గ్రామ్యకవిత్వం బన్నన్
సమ్యఙ్మతి సేయ దామె సద్గ్రంథికమున్
రమ్యగతిఁ గూర్చుఁ గృతులన్
సామ్యము లేనట్టి యాత్రిసాగించుమతిన్. 179

ఉ. కాంచనపల్లివంశమునఁ గాంచనమై కనకాభిధానమున్
గాంచినభాగ్యసత్ప్రవర గౌరి యనం దగుఁ గాకయున్న వో
నెంచఁగ నీశ్వరీత్వ మది యేటికిఁ గల్గెడు నామె మాటయే
మించిన వేదమంత్ర మని మిక్కిలివారును మెచ్చికొం చేలొకో.

తే. కలవు రాజ్ఞీగుణంబు లాకనకమాంబ
కెపుడు నీచగుణంబుల నెఱిఁగికొనదు
మానవంతురాల్ సుగ్యాకలో నెఱింగి
సత్ప్రవర్తనమున నొప్పు సంతతంబు. 181

వ. అని యవధాని యభివర్ణించి చెప్పుటయు భూషణస్వామి యట్టి విద్యావతియు వివేకవతియు నగు నాయమం దిలకింప నిచ్చఁ జేసి యవధానితోడం జెప్పిన నతం డప్పుడ పోయి కళాశాల నున్నట్టి కనకాంబం గాంచి గురునభిమతం బెఱింగించిన నామె సెలవుగొని యప్పుడ కదలి వచ్చి గురుస్వామిదర్శనంబు చేసి పాదాభివందనం బాచరించి జీవితాదర్శము సత్యస్వరూపము నున్నగు విషయముల నెఱింగికొనుచు గురుదేవునకు మొగం బై. 182

తే. బుద్ధిజాడ్యముఁ బోఁ గొట్టుఁ బ్రోచు సత్య
వాక్కు మానోన్నతిం గూర్చుఁ బాప మడఁచుఁ
జిత్తము వినిర్మలంబుగాఁ జేయుఁ గీర్తి
దెసలఁ బెంచు సత్సంగతి తెలియ జగతి. 183

వ. సాధుసజ్జనదర్శనంబున నేను ధన్యురాల నయితిని మీయట్టిసద్గురు సన్నిధిఁ దత్త్వజ్ఞానంబు వడసి శ్రేయసం బొంద వాంఛింతు మదీయసందేహదవానలంబు ఘనులు భవాదృశు లగుయోగి పుంగవుల కృపారసంబునఁ జల్లారెడుం గావున నన్ను శిష్యురాలిగం బరిగ్రహింపఁ బ్రార్థించుచుంటి ననిన నమ్మహాత్ముండు ప్రసన్నుం

డన్నగా రన్నను సాక్షాత్పరబ్రహ్మ
మనుచు భావించె ననులగుణుఁడు

తే. బుద్ధి గీష్పతి కెన వచ్చి పొదలువాఁడు
సత్యనారాయణాఖ్యుడు సత్ప్రసంగుఁ
డట్లు జ్వరపీడితుం డయి యంటిలోనె
భూతలంబును నెడబాసి పోయె దివికి. 6

తే. తల్లి లోనగుబంధువుల్ తల్లడిల్లి
రప్పు డనిన నాశ్చర్య మే మక్క టకట!
జ్ఞానసిద్ధు లైన నాగేశశాస్త్రినాగ
భూషణుఁడు వ్రాకృతులఁ బోలెఁ బాగిలి రసఁగ. 7

క. తమ్ముఁడు చచ్చినకోలెన్
నెమ్మనమున సన్న్యసింప నె కడు జత్తనం
బమ్మకు మిక్కిలి యొక్కఁగ
నమ్మాన్యుఁడు నాగభూషణాఖ్యుఁ డొనర్చెన్. 8

తే. అమ్మహాదుఃఖ సాగరమందు మునిఁగి
తల్లి యామహాలక్ష్మి నితాంతవేద
నాతిసంతప్తచిత్తయై యనియె నొక్క
సమయమందు నాగేశ్వరశాస్త్రితోడ. 9

—• తల్లి నాగేశ్వరునితో మొఱ్ఱ వెట్టుట •—

మ. కొడుకా సత్యుఁడు నిత్యసత్యనియమాకుంఠవ్రతాచారని
ష్ఠుఁడు మీకుం బ్రియశిష్యుఁ డీల్గె నయొ యీశోకంబు చల్లార నే
ర్పడుమార్గంబు లభింపఁ బో దరిది యోబ్రహ్మజ్ఞ! మాభూషణా
ఖ్యుఁడు ద్వావింశతివర్షమంద గతభార్యుం డయ్యె నే మందుఁబో. 10

మ. కులము న్నిల్వుము పెండ్లి చేసికొని మాకుం గూర్పు మానంద మో
విలసచ్చిత్త! యటంచు నేను ననుఁ బోల్ విఖ్యాతబంధుల్ సదా
తెలియం జెప్పిన నొప్ప కన్వయగతుల్ దీపింపఁ జేయుంగ నిం
పలరుం దమ్ముఁడు వానికిం బరిణయం బా నా ననం జేసెదన్. 11

క. నే సన్న్యసింతుఁ బెండ్లికి
నాసింపను బట్టువలుప స్వర్గము కా ది
ట్లాసౌఖ్య మెఱిఁగికొంటిని
వేసరితిని జాలు నింక వినుపుఁడు దానిన్. 12

వ. అని ప్రత్యాఖ్యానంబు చేసె నని మఱియు. 13

క. పుట్టినసుతు లిదఱిలో
నట్టేటం బుట్టి ముంచి నారెండవవాఁ
డట్టె చనె నిట్టిచో నీ
పట్టికి బోధించి చెప్ప వా రెవ రకటా! 14

చ. గురువులు మీరు మానుషులకున్ బదులాడఁడు భూషణయ్య మా
కఱపినయట్లు చేసెడిది గాని మఱొండుపథంబునం జనం
డెఱుఁగుదుఁ బుణ్యమూర్తు లగు నీ రిటులే నలశిష్యుఁ డెల్ప్ని మా
వరకులముద్ధరించుటకుఁ బొల్పఁడు దం చిటు చెప్ప వచ్చితిన్. 15

—॰ నాగేశ్వరుఁడు భూషణుని బోధించుట ॰—

వ. అనిన నతం డొఁ గా త మని యామె నంపిపుచ్చి నాగభూషణుం
బిలిచి యవధానిప్రభృతులు వినుచుండ నీవు ద్వితీయోద్వాహంబు
గావించుకొనుట యిప్పు డత్యవసరమై యున్నది కావున నట్లుగా వింపు
మని బోధించిన నాగభూషణుండు గురునిఁ గాంచి. 16

సీ. సంసృతిసుఖ మెట్టిదందమో చవి చూచి
మది నెఱింగితి నొక్కమాఱు మున్ను
మఱియు నాసౌఖ్యమున్ మది సేయ కాది క
ళత్రము చనిన కాలమునయందుఁ
దుర్వ్యాశ్రమంబు నొందుటకు మనోనిశ్చ
యము చేసి గురుల కయ్యర్థ మెల్ల
నెఱిఁగించి కొంటి న ప్డీరు తత్సాధన
ములు సంతరింపుము తొలుత నంటి

తే. లేను దన్మార్గగతు లెల్ల నెఱిఁగి కొంటి
మీకటాక్షమునం జేసి మీద నాకు

గృహిగ నుండుట కాస్థ లే దెట్లు లేని
సన్న్యసించుటకే మది సలుపుచుంటి. 17

వ. అట్లు గురుశిష్యులు సంభాషించుచున్నంత సుబ్బావధాని భూషణ
స్వామిదిక్కు మొగంబై యిట్లనియె. 18

ఉ. మీరు గృహస్థులై నపుడె మేము భవత్సముఖంబుఁ గొంటకున్
మీరును మాగృహంబుల కమేయకృపం జనుదెంచుచుంటకున్
గారణ మయ్యెడిన్ యతి కొకానొకయింట నొకన్ని ... రములన్
చేరి వసింప నొప్ప దని చెప్పుదు రార్యులు శాస్త్రపద్ధతిన్. 19

క. గారమైకరాత్రివిధినై
నీమహి సంచార మైన నే మెట్లు మిమ్ముం
బ్రేమించి కొలువఁ గలమో
మీమహితోక్తులు వినంగ మే మగు టెట్లో. 20

ఆ. కన్నతల్లియాజ్ఞ గామిఁ దురీయాశ్ర
మంబు సేకరించుమాట లేదు
గాదె తల్లికోర్కి కల దెట్లు గా నట్లు
సేత లొప్పు ననుచుఁ జెప్పుచుంటి. 21

వ. అని వినయంబున వినుచుండ నాగేశ్వరుండు వెండియు. 22

శా. సన్న్యాసం బది స్వీకరించుటకు నీస్వాంతంబ యేఁ గా దనన్
సన్న్యాసిప్రవరుండు లోకగతితో సంబంధముం ద్రెంచి తా
నన్యం బేమియుఁ గోర కుండుటయె ముఖ్యంబంచు నీ వట్టిదై
మాన్యత్వంబును గొంటివే మనకు సంబంధంబు వో నయ్యెడిన్. 23

వ. ఇట్లు నాతోఁచినచందంబునఁ జెప్పితి నింక నీచిత్తం బయినయట్లు
చేయు మనిన నతం డంతరంగంబున నింత చింతించి గురునింగాంచి
నమస్కరించి వినయ వినమితగాత్రుండై. 24

ఆ. గురువు బ్రహ్మ గురువు హరి గురువు హరుండు
గురువు బ్రహ్మ మరయ గురునికంటెఁ
బరమతపము కాని పరతత్త్వమే కాని
లేదు లేదు గురువె నాదుదిక్కు. 25

శా. చైతన్యుండును శాశ్వతుండును సదా శాంతుండు దాంతుండు వ్యో
మాతీతుండు నిరంజనుండును బ్రసన్నాత్మస్వరూపుండు ని
ర్ధ్యాతవ్యాకృతి యోగివంద్యుఁడు సుఖం డస్మద్భవోగ్రామయో
దుఃఖార్తిపరిహారోక్తవైద్యుఁ డనుచున్ భూషించి భాషించెదన్.

చ. ఎవనికటాక్షపాతమున నే నిటువంటిఁడనై చరింతునో
యెవనితపఃప్రభావమున నిట్లు వచింపఁగ శక్తిఁ గంటినో
భవనుతుఁ డగ్గురూత్తముని పల్కులె వేదములంచు నెంచుచుం
దవిలి భజింతు నాతనిపదద్వయముం భయభక్తియుక్తులన్. 27

ఆ. ఘనుఁడు నాగురుండు గాన స్వాధ్యధర్మము
వదల కుండె నేను వానికన్న
ఘనుఁడ ననెడుపేరు గలుగఁ దురీయాశ్ర
మంబు సేకరించుమ మొనర్ప. 28

తే. ధరణిఁ గాషాయదండమాత్రమున భజింపఁ
దగును యతి గాన నాగురువర్ణనంబు
మాను కొన నొప్పు నప్డు కాదేని గురుని
మ్రొక్కులం గొన నొప్పెడు నక్క టకట ! 29

ఉ. జేగురుగుడ్డఁ జూపుచు నశేషవిశేషవిలాసభాసురుం
డై గరిమం దలిర్చు గురునంతటివాని నమస్కృతుల్ గొనం
గాఁ గడగట్టి పాపమును గైకొనఁ బో నని బాససేయుదున్
శ్రీగురు పాదపద్మములు చేరి నమస్కృతు లాచరించుచున్. 30

వ. అని గురుపాదంబు ముట్టి మఱియు ని ట్లనియె. 31

సీ. మీకటాక్షముననే నాకు వాకులు వచ్చె
సకలశాస్త్రరహస్య సరణి దెలిసె
మీదయం జేసియే వేదవేదాంతాది
పరమధర్మంబులు పాటియయ్యె
మీయనుకంపనే నాయుందుఁ గొండొక్క
విజ్ఞానబీజము వేయఁ బడియె
మీకృపారసమున నే కలికాలధ
ర్మముల కష్టాలఁ బడి మసలు చుంటి

తే. మీహితోక్తులనే నేను మీఁదిదారి
తెట్టు లెట్టు లుండునో వానిగుట్టులెల్లఁ
దెలిసికొంటిని మిము మ్రొక్కఁ గలిగి నేఁడు
మ్రొక్కు లందుచు నుంటిని భూతలమున 32

వ. మఱియు మీయనుగ్రహంబునంజేసి యుమామహేశ్వరుల నానా విధతంత్రరహస్యంబులును యోగరహస్యంబులును దెలిసికొనఁ గలిగి యింతవాఁడనై ప్రవర్తించుచుంటి నిట్టి నేను మీపాదారవిందసేవకుం డారదూరుండనై పోనఁ జేయుసన్న్యాసంబు స్వీకరింపం దలంప నిఁక మీయాజ్ఞానుసారంబుగం బ్రవర్తింతు ననిన నాగేశ్వరగురుండు సంతసించుచు ని ట్లనియె. 33

మ. వరదీక్షాపరుఁ డైతి సర్వవిషయవ్యాపార మీ నెగ్గుటం
బరిపూర్ణుం డవు నీవునఃప్రతిభ నాస్వాంతం బెఱుంగు న్మహే
శ్వరభక్తుండవు సన్న్యసింతు నని యున్ బల్కంగ నాఁ బోమ్మనం
తరమః దారయు వచ్చునంటి నది వ్యర్థఁ బందు నీ కిత్తఱిన్. 34

మ. గురువాక్యంబు పరిత్యజించుట నగున్ ఘోరాఘ మోవత్స నీ
వరవంశంబుపరిస్థితిం గనుము నీవా రెట్టి రో చిత్తమం
దరయం గమ్ము భవజ్జనిత్రి యనువాక్యం బెట్టిదో విన్మనం
తరమం దుత్తర మార్గ మొద్ది యగు సద్దానం బ్రవర్తింపుమా. 35

తే. అనిన నాతఁడు మాతల్లి యనినయట్లు
గురువు బోధించినటు బంధుగులు వచించి
నట్లు నేఁ జేయ నెంచితి నార్యవర్య
మెలఁగెద గృహస్థు నై తొంటివలెను మఱియు. 36

—ద్వితీయ వివాహము.—

వ. అంతఁ గొన్ని మాసంబులు కడచినపదంపడి విజయనగరపు సమీపమున నున్న గరికవలసాగ్రహారంబున నుండురాళ్లపల్లిసన్న్యాసయ్యగారి ద్వితీయ పుత్త్రికను సుప్రసన్నమను సింహాచలక్షేత్రంబునఁ బెండ్లియాడి చిలుకలపూడి క్షేత్రంబున నుత్సవాదికంబు ప్రవర్తిల్లం జేసి యిట్లు వివాహం బయినవెనుకం జిలుకలపూడియందుఁ గొంత

కాల ముండి సంతతంబును శిష్యజనపరివృతుండై పరిగ్రహంబును సంకల్ప వర్జనంబునం గామక్రోధాదులును నర్థానర్థదర్శనంబున లోభంబును నద్వైతానుసంధానంబున భయంబును నాత్మానాత్మ వివేకంబున శోకమోహంబులు సాత్వికసేవనంబున దంభంబును మానంబున యోగాంతరాయంబును శరీరవాంఛారాహిత్యంబున హింసయు సమాధిబలంబున దైవికవ్యథయును బ్రాణాయామాది కంబున నస్మద్వ్యథయు సాత్వికాహారంబున నిద్రయు సత్త్వంబున రజస్తమంబులును జయింప వలయు నని యుపదేశంబు సేయుచుండు నిట్లు కొన్నిమాసంబులు గడచిననపడంపడి. 37

—॰ నా గే శ్వ ర శా స్త్రి వ్రి ణ చి కి త్స ॰—

సీ. గురువు నాగేశ్వరకోవిదునకు మేన
గొప్పమేహవ్రణ ముప్పతిల్లె
నది శస్త్రమునఁగాని యౌషధంబునఁజేసి
బాగుపడమినెన్ని నాగభూష
ణుఁడు చెన్నపురి కప్డు తోడికొని చనుదెంచి
తనశిష్యుఁ డగునవధానియింట
నెలకొల్పి మత్తుమందులు గాసి మొద్దుపా
రెడుమందులే గాని యిడఁగరాదు

తే. నిశ్చలసమాధి నుండెద నేను మీరు
వ్రణము ఛేదింపుఁ డని గురువరుఁడు పలుక
నిర్వైరంపడి మదిలోన నేర్పెనంగ
శస్త్రవైద్యులు పలికి రాశాస్త్రమణిని. 38

మ. త్తకోకిల. మత్తుమందులు వేయకుండఁగ మాదృశుల్ వ్రణవైద్యమున్
జిత్తగించి పొనర్పఁ జాలరు చెప్పి నట్టుల రాక పుం
డ త్తరిన్ విషమించినట్లయి హావడిన్ గలిగించినన్
గ్రొత్తబాధ మ ఱొక్కఁ డప్పుడు కొన్నయట్లగు నెన్నఁగన్. 39

ఉ. తాఁకు డెఱింగి యున్నపుడు తావకదేహముమీఁద శస్త్రమున్
దాఁకఁగఁ జేసినన్ మిగులఁ దబ్బిబు లాడుచు దద్దరిల్లినన్

మా కేటు సేయఁ బోలెడుఁ బ్రియాఁడము వచ్చెడు సట్టులైనచో
నాకరణిం జరించుటకు నాత్మ పొసర్పఁగఁ జాల దిత్తఱిన్. 40

క. కరుణించి క్లోరోఫారము
పరివర్తింపంగ మాకుఁ బలుకిడుఁడు భయం
బరయంగ రా దొకింతయు
సరుదుగ వ్రణవైద్య మొసఁగు నట శస్త్రమునన్. 41

ఆ. అనిన శాస్త్రి యనియె సస్మఁబాదులు మత్తు
మందు కొనక యున్న మానసమును
గట్టిపెట్టఁగలరు కడుధ్యానమునఁ జేసి
శస్త్రవైద్య మీరు సలుప వచ్చు. 42

వ. అని పలికినంత శస్త్రవైద్యులు కత్తులు కత్తెరలు లోనుగాఁ గల యాయుధంబు లుడికించి తెచ్చి శాస్త్రివర్యు నొకబల్లపైఁ బండు కొనం జేసి చలింప కుండుఁ డని పలికి వ్రణంబునకు శస్త్రవైద్యము చేసి కట్టుకట్టి విశ్రమించి యున్న యపుడు. 43

చ. గురుఁడు సమాధి నుండి యొకకొంతతడిలోపల శస్త్రవైద్యమున్ జరుపక మీరలిట్లిచట జాగు పొసర్చుచు నుంటి రేమి నాఁ గర మరు దంది వారు గురుఁ గన్గొని శస్త్రము తాఁకి నట్లు మా కరయఁగ రాదొ తత్క్రియ సమాప్తమ యయ్యె వ్రణంబు సూడుఁడీ.

వ. అని వైద్యులు నాగేశ్వరసమాధినిశ్చలత కెంతయు సంతసించుచు.

ఉ. మీరు మహానుభావులరు మీ దగునిట్టిసమాధినిశ్చలో
దారత కెంతయుం మది ముదం బగు చుండెడి మీకు వైద్యమే
మారసి చేసి ధన్యతము లైతిమి శాస్త్రివరేణ్య మాపయిం
గూరిమిచేసి యాశిషము గోరుచు నుంటి మొసంగవే కృపన్. 46

వ. అని పలికి గురుదత్తధనం బపేక్షింపక సెలవు గొని చని రంత సుబ్బావధాని గురున కెఱింగించి తాను వరంగల్లుపట్టణంబునకుం జని యాయుర్వేదపాఠశాలం బెట్టి ప్రవర్తించుచున్నంత నొక్క నాఁడు భూషణస్వామి. 47

మ. అలతిరుపత్యభిధానపత్తనము ముఖ్యస్థానమే నందు ని
చ్చలు విద్యాకలితపరీణాళికల నిచ్చం జేయుచు నిల్వఁ గాఁ
దలఁపుం జేయుచు నుంటి నీదుమన మేతత్క్రీతప ర్తించునేఁ
గలవిద్యార్థులతోడ నీవు నటు రాఁ గావింపుమీ యత్నముల్. 48

వ. అని సుబ్బావధాని కుత్తరంబు వ్రాయుటయు నట నవధానియు. 49

మ. భగవత్సన్నిధి దేశికోత్తములు సంవాసింపఁగా నుండి నా
తగురీతిం దెలియంగఁ జేసి రిట నే నాయాయికార్యంబులన్
దగులంబుంగొనియుంట యొప్పదనుచున్ స్వాంతంబునం దెంచుచున్
ముగురున్ శిష్యులు తోడునీడలయిరా మోదంబునం బొందుచున్. 50

వ. పయనంబై యాకెళ్ల రామచంద్రశాస్త్రియు సత్యనారాయణ
శాస్త్రియుఁ గోటీశ్వరరావనునాయుర్వేదశిష్యులు తన్నుఁ బరిచ
రించుచుండ గగనాక్షిధాత్రీభూసంఖ్యల నొప్పు హాయనవర్షంబునఁ
దిరుపతి పురంబునకుం జనియె నంతలో సోదరీసహిత యగుకనకాం
బయు నాహూతయై చనుదెంచి యున్నపదంబడి. 51

సీ. భూపతులం దెల్లర బోధించి యట నొక
వసతిగృహంబును బొసఁగఁ జేసి
తాను శ్రీ తిరుమల శ్రీనివాసుత్రిలింగ
మనఁగ విద్యాపీఠ మందు నిలిపి
దానికిం గనకాంబ ధర్మాధికారిణి
గా నవధానిఁ దత్కార్యములకు
నధిపతి గాఁ జేసి యపుడు తన్నర్థించు
వారికిఁ దత్త్వంబు పలుకుకొనుచు

తే. అతఁడు తనద్వితీయకళత్ర మప్పుడు కాపు
రమున కరుదేమి శిష్యులు రమణఁ గొలువ
ధ్యానయోగసమాధులు తా నొనర్చు
నట్టి కాలముం బుచ్చె నప్పురమున. 52

వ. అవధాని తనశిష్యుల నట దేశికునికడ గురుకులవాసముం జేయ
నియమించి తమ్ముఁడగు పార్థసారథిని గుటుంబముతోఁ దిరుపతియందు

వైద్యవృత్తితో గురుగృహమునకు సమీపమునం దుండి గురువరుల కుఁ జేదోడువాఁదోడుగ నుండఁజేసి తాను జిత్తూరిలో వైద్యశాల నెలకొల్పి వైద్యమును జేయుచు నప్పుడప్పుడు తిరుపతికి గురుదర్శనార్థము వచ్చి పోవుచు నుండె నప్పుడు. 53

తే. భూషణుని మేనమామకుఁ బుత్త్రుఁడైన
యడుసుమిలి సత్యనారాయణాఖ్యుఁ డటకు
నరుగుదెంచి యాయుర్వేద మభ్యసింప
భూషణస్వామి శిష్యులోఁ బొందుపడియె 54

తే. అమ్మణమ్మకుఁ బుత్త్రికు లైనబాల
కృష్ణగోపాలరాయలు విష్ణుభక్తుఁ
డైనరామానుజుండు నహర్నిశంబు
స్వామిఁ సేవించుచుండి రాస్థానమందు. 55

వ. అమృతానందుం డాబాలకులవిద్యాబుద్ధు లరయుచుండె నప్పుడు కనకాంబ క్వీన్ మేరీకళాశాలలో నుపన్యాసకురాలుగ నుంటం జేసి సెలవు దినంబుల నాత్మభగిని యగునమ్మణమ్మతోఁ గాని యమ్మణమ్మగారి జ్యేష్ఠపుత్త్రుఁడగు జగన్నాథరావుతోఁ గానియటకు గురుదర్శనార్థము వచ్చి పోవుచుండె నక్కాలంబున. 56

తే. అల్లవేంకటరెడ్డిమహాశయునకు
దైవయోగమువలనఁ బత్నిమరణిఁ
విరహమూట విరాగియై గురు భజించి
కొనుచుఁ బరమార్థదృష్టియై దినము గడపె. 57

క. ఎవ రెంత చెప్పి రేనియు
నవధారణ మాచరించి యా ననఁడు వివా
హావిషయమున యందు దిష్టత
లవమాత్రము లేనిమాటలం బచరించున్. 58

వ. ఆసమయంబున నమృతానందనాథుం డతనిం బిలువనంచి యిట్లని బోధించె. 59

శా. ఈ విప్రుల్ వివాహము ల్జరుపుకో కీరీతి నున్నంతనే
జీవన్ముక్తి లభించునే మునులు మున్ శ్రీరామకృష్ణాదు లెం
తే వైరాగ్యము గల్గియున్ సతులతో నేపార్చి వర్తించుచున్
జీవన్ముక్తిని గాంచి రెవ్వరికిఁ గానీ పెండ్లి రా దడ్డమై. 60

తే. మును వసిష్ఠుఁ డగస్త్యుఁడు మొదలు గాఁగ
నెందఱో మహాత్ములు జగద్ధితము పొంచెఁ
బెండ్లియాడి సతులఁ గూడి విహితధర్మ
నిరతులై పేర్మి గాంచిరి నీవు వినవె. 61

ఉ. ఈవు విరక్తిమై సతి గ్రహింపక నీదుస్వధర్మ మందఁ గా
భావము సేయ వేని నినుఁ బట్టినవాఁడు గురూపదేశ మీ
తేవకుఁ దెచ్చె సంచుఁ బ్రకటించుచు మమ్ముఁ దిరస్కరింపరే
కావున మాపరిబోధమును గాదనకుండుము నీవు గేస్తువై. 62

తే. వినుము తులాధారుఁ డను వైశ్యుఁ డనఘుఁ డింటి
యాతఁడై నిజధర్మమునందు నిలిచి
సకలసౌఖ్యములను బొంది సంతతిఁ గలఁ
డై పదంపడి మోక్షము నంద లేదె. 63

సీ. నిజకులోచితవృత్తి నీవు మెలంగుము
గార్హస్థ్యధర్మము గలిగి కొనుచు
బహ్వర్థము గణించి భాగ్యవంతుఁడ వయి
ధారుణీతలమునఁ బేరు గాంచి
సత్కార్యములకు నీసంపాదితార్థము
వినియోగ మొనరించి విజ్ఞుఁడ వయి
వేదశాస్త్రంబులు వెలయింపఁగాఁ జేసి
విహితధర్మములను విడవకుండి

తే. వేల్పులన్ నేలవేల్పుల విధివిధమునఁ
గొలిచి భజియించుచును భక్తి గురువరోప
దేశ మేమఱకున్న సిద్ధిని గొనంగఁ
గలవు పెండిలి యడ్డంకి గాదు నీకు. 64

వ. అని గురువరుం డానతిచ్చిన నతండు పెండ్లియాడుట కంగీకరించె నంత నందిపాటి గోవిందరాజు లనువణిక్పుంగవుని కుమారీమణి యగు లక్ష్మాంబ నుద్వాహ మయ్యె నాతఁడియును. 65

— కనకలక్ష్మీవర్ణనము —

సీ. ఆఁకొన్నవారల కమృతాన్నము నొసంగ
నన్నపూర్ణాదేవి యానెలంత
యొరు లెంతదూరిన నోరిమి నూపంగఁ
బంటఁ గలంతి యాపడఁతిమిన్న
బహుళార్తు లందైనఁ బతిభక్తి నెఱపంగఁ
బార్వతీదేవి యాపరమసాధ్వి
పావనశీలంబుఁ బతివ్రత్యముగఁ జేయ
జానకీదేవి యాసాధుచరిత

తే. యనుచు నెల్లరు నభినుతు లాచరించు
కరణిఁ బరమపాతివ్రత్యగరిమఁ దనరి
గొప్పతనమును గైకొని యొప్పుమీఱు
ననిశసంస్తుతవరలక్ష్మి కనకలక్ష్మి. 66

క. కలదాస ననుచు గర్వము
కల నైన నెఱుంగ దా యకల్మషమతి మి
క్కిలిభూషలు పెట్టదు పే
దలపడుచట్టులు మెలంగుఁ దా నెవ్వేళన్. 67

సీ. తనబిడ్డ పెరబిడ్డ యను విభేదము లేక
ప్రజలఁ బ్రేముడిఁ జూచు పరమసాధ్వి
తనభర్త వేనవేల్ ధన మర్థులకు నీయఁ
గరము సంతోషించు గరితమిన్న
తనయింట దినదినమ్మును వేగురు భుజించు
చున్న సంతస మందు సన్నుతమతి
తనమనం బెప్పుడు ధనధాన్యములమీఁద
నిలుప కీశ్వరుమీఁద నిలుపు మేటి

తే. ధుమధుమలు లేక సుప్రసన్నముఖమునను
మెలఁగికొనుచును బతిభక్తి గలిగికొనుచుఁ
బొగడితం గన్నపూఁబోఁడి పొలుపుఁ గూడి
కొమరుమిగులును లక్ష్మాంబ గుణకదంబ. 68

క. మతిఁ గోపమెఱుఁగ దెప్పుడు
పతిసంరక్షణమునందుఁ బ్రాల్మాలక సం
తతముం గొని వాగర్థ
ప్రతిపత్తిని గలసి కొనుచు వదాన్యభక్తిన్. 69

వ. ఇట్లు సద్గుణగరిష్ఠ యగుకనకలక్ష్మీదేవిని. 70

తే. అట్టు పెండిలి యాడి వైశ్యాగ్రగణ్యుఁ
డైనవేంకటరెడ్డి భార్యాసమేతుఁ
డగుచు వర్తక మొనరించి ఖ్యాతిఁ గాంచి
తల్లిదండ్రులుఁ గురువులు దనియఁ దనరె. 71

తే. అపుడు కాంచనపలికనకాంబ గురువు
నిచ్చలును జేయుబోధముల్ సెప్ప మీఱ
వచనమున వ్రాసి వానినిఁ బద్యములను
జీవయాత్ర యనం గృతిఁ జేసె వాసి. 72

— జీవయాత్రా ప్రశస్తి —

క. గీతాశాస్త్రము వెనుకన్
సీతారామాంజనేయచిరసంవాద
ఖ్యాతగ్రంథం బిపు డీ
భూతలమున జీవయాత్రఁ బోలుం బొగడన్. 73

ఉ. పద్యము లెల్ల హృద్యములు పండితపామరవేద్యముల్ పవి
త్రోద్యమబోధకంబు లన నొప్పెడు నెప్పుడు నాత్మచింతయే
విద్య యటంచుఁ జెప్పు గుణవిశ్రుతురా లలకాంచనాంబ కా
వ్యాద్యము గా రచించినమహత్తరతత్త్వము జీవయాత్రలోన్. 74

చ. యమకము వచ్చునట్టిసమయంబున భాగవతంబు పోలికన్
గమకమురీతులన్ గనినకాలమునన్ మను వట్టు లర్థచి

త్రిము గలచోటులఁ వసువు దారిని భావగభీరతఁ హరి
క్రమమున జీవయాత్ర కుతుకంబు ఘటించుఁ గవీంద్రకోటికిన్. 75

మ. మొదలుం బట్టినదాది తుట్టతుదకుఁ బో కంతయుం గొంకిపా
టొవవం జేయదు హాయి హాయి యనన్నై యొప్పించు నెప్పట్టునఁ
బదసందర్భము పూలదండగరిమం బొల్చిం గుబాళించెడిఁ
జదువం బూనినజీవయాత్రి జగతిఁ సంతానముం బోలెడిఁ. 76

చ. సహజము పాండితీగరిమ సాధుతరంబు పురార్జితార్థయుక్
సుహితము సర్వముఖ్య మగుచొప్పున మె ప్పొనఁగూర సజ్జనో
ద్వహన మొనర్చ నేర్పుమెయి వ్రాసిన కావ్యము జీవయాత్ర తా
నిహపరసాధనం బగుచు నేర్పడు నెల్లజగంబులం బ్రభఁ. 77

తే. సాధుసమ్మతముగ నిటు సర్వమాన
వోపయోగము గాఁ దత్త్వ ముత్తమార్థ
బోధకంబుగఁ గసకాంబ పొంకపఱచె
ల్లరకు చీన నానంద మొసఁగుఁ గాక. 78

వ. అక్కాలంబున భూషణస్వామియు. 79

మ. పదియుం దొమ్మిది నూర్లు యిర్వదియు నా ర్వర్తించువర్షంబునం
దుదిమాసంబునఁ దల్లి నిఁ మఱియు నత్తోయంబువారి గడుఁ
ముద మొప్పం గొని కాశికిం బయనమై పోఁ గాంచనాంబాదులుఁ
నదుపాస్తిం గొని వారితోఁ జనిరి నానాతీర్థసేవారతిఁ. 80

వ. భూషణస్వామిప్రభృతు లగువా రెల్లరును విజయవాడ మార్గంబున
రాజమహేంద్రవరంబునకుం జని రది మార్కండేయేశ్వరక్షేత్రము
దానివృత్తాంతం బెట్టి దనిన. 81

## — రాజమహేంద్రవరము —

మ. మును ఘోరాటవిలోన మౌనివరు లీభూలోకసౌఖ్యంబు గా
దని దీక్షం దపియించుచున్నసమయం బం దొక్కనాఁ డీశ్వరుం
డనుకంపాకలితాత్ముఁడై మునివరాభ్యగ్రంబునం బొల్చి త
త్స్నపూజాదికముఁ గ్రహించి పతియుం దా నెంతయుం బ్రీతిమై.

తే. ఉన్నయప్పు డస్తాద్రిపై నుండి తపనుఁ
డరిగె సంధ్యాసమయ మయ్యె హరుఁడు తాండ
వము పొనర్చె మునీంద్రు డవ్వలననుండ
గద్దెపై నుండి పార్వతి గాంచుచుండ 83

ఉ. తాండవమున్ బొనర్చుకడఁ దత్పదఘట్టనఁ జేసి గోయి యై
యుండఁ దదీయదేహముననుండి స్రవించెడు ఘర్మబిందువుల్
మెండయి కుండమందుఁ బడి మీఁదికిఁ బొర్లఁగ నిండె నంతలోఁ
దాండవ మాగి శంకరుఁడు తత్పరతం గని మౌనిచంద్రులన్. 84

శా. ఏతత్కుండము నందు ఘర్మజల మెంతే నిర్మలంబై కడున్
బూతంబై యమృతప్రభావయుతమై పొల్పొందు సేవాప్తి యే
నీతీర్థంబును ద్రావె నేని మఱి యుం దీగాలి సేవించె నేఁ
బ్రేతత్వంబును గాంచఁ బో దనుచు నే విఖ్యాతిఁ గావించితిన్. 85

తరువోజ. అని చెప్పి హరుఁ డేగె నది మొద లెల్ల
ప్రాణు లాజల మాని యాగాలిఁ బీల్చి
తను వీఁగుటల్ లేక తగఁ జిరంజీవి
తనుగాంచియుండె నీ ధరణిపైనిముఁ
గని వేల్పులు యమలోకము పాడుపడుట
కాశ్యపి నభివృద్ధిఁ గాంచుట లెఱిఁగి
వనజాకృతిఁ దలిర్చుపర్వత మొకఁడు
వడిఁ దెచ్చి కుండంబుపై నిడి రంత. 86

ఆ. అవలఁ గొంతకాల మరిగినయప్పు డా
పర్వతంబు నొరసి పాఱె గౌత
మీస్రవంతి యమృతమిశ్రమంబున నట
నాడువారి కధిక మాయు వొసఁగు. 87

క. ఆమాడ్కి నైనగిరిపై
శ్రీమార్కండేయమౌనిశేఖరు నెంతేఁ
బ్రేముడిఁ గాచిన శంకరుఁ
డామునినామమున నచట నలరు ఘనుండై. 88

ఆ. అలుక రాణ్మహేంద్రుఁ డాఖేటమున కయి
వచ్చినపుడు శశము హెచ్చి జాగి
లము నెదిర్చి తఱిమె నృపుణి యన్నేలమే
లెఱిఁగి కట్టె నచటఁ బురవరంబు. 89

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమహేంద్రుఁడు రాజధానిగా
నైజభుజాబలంబునఁ బొనర్చి వసించుటఁ జేసి భూస్థలిన్
దేజము గాంచి సర్వగుణదీపితమై యవవైభవంబునన్
రాజమహేంద్రపత్తనము రాజిలు చుండెడు నిద్ధరాస్థలిన్. 90

ఉ. శైవలినీమతల్లి యని సర్వజగంబులఁ బేరుఁ గొన్న గో
దావరి యెల్లకాలమును దత్పురతీర నిజభంగసంగతిన్
బావనభూమిగాఁ జలుప బాసిలు రాజమహేంద్రపత్తనం
బీవసుధాస్థలంబున మహేంద్రుని పత్తన మట్టు లొప్పెడిన్. 91

చ. అమృతము దేవలోకమునయందు దొ[illegible]ల నడంగి యుండు న
య్యమృతము రాణ్మహేంద్రమునయం దగుపుష్పగిరీంద్రపాదభా
గమున నడంగి యుండు నటఁ గల్గినవా రిటఁ గల్గినట్టివా
రమరులు రాణ్మహేంద్రుఁ డమరాధిపుఁ డారయ నెల్లభంగులన్.

సీ. పాఱు నేయూరికిఁ బశ్చిమంబునయందు
రంగదుత్తుంగతరంగ గంగ
నలువొందు నేవీట నడుచక్కి నతిభక్త
బహుళార్తి మదనగోపాలమూర్తి
యలరు నేప్రోలిప్రాగాశాతటంబున
నవితభక్తకదంబ శ్యామలాంబ
వెలయు నేనగరంబు పొలిమేరలో సేవ
కులభుక్తి శ్రీముల్లగూరిశక్తి

తే. కలుగు నేపురమందు మృకండుసూతి
కల్పితేశ్వరలింగ మనల్పదివ్య
శక్తిమహిమాతిసంగ మొసంగు నద్ది
యింద్రవిభవాకరము రాణ్మహేంద్రపురము. 93

వ. అని పురాణంబు విని నాగభూషణుండు తల్లిలోనగువారితోఁ
బుష్పగిరితీర్థంబున జలంబాడి మార్కండేయేశ్వరు నర్చించి మదన
గోపాలమూర్తి కేటికో మ్రొక్కి శ్యామలాంబకు నమోవాకంబు
లర్పించి గోపాదక్షేత్రంబునకుం జని యటగోదావరీతీరంబున బంక
మట్టిలో నెల్లకడల నట నటఁ జిన్నపెద్ద లగు కలుఁగులఁ గని
యిదియేమి యని గంగాపుత్త్రుల నడిగిన వారును. 94

— గోపాదక్షేత్రము —

తే. పృథివి ద్వాదశాబ్దముల్ వృష్టి లేక
చేనుచెట్లులు పండమిఁ జెన్ను దఱిఁగ
కఱవు పుట్టుటయును జంతుగణము లెల్ల
మలమలన్ మాడిచచ్చె నాఁకలికి నడలి. 95

వ. అక్కాటికకాలంబున 96

మ. తొలుతన్ గౌతమపారికాంక్షి యధికోద్యోగంబుతో దక్షత్రిమూ
ర్తుల మెప్పించి కుటుంబరక్షకు నుపాధుల్ మేడ వారీవు భూ
స్థలమం దెవ్వాట నేని చేర ఉణువుల్ చల్లంగ నే మొల్చి ఖ
క్కాలి నైయె తత్క్షణమందుఁ బండు నని కోర్కిఁ దీర్చినా రత్తఱిన్. 97

వ. అట్లు వరం బంది గౌతముం డిచ్చోనాశ్రమంబు నిర్మించుకొని
సశిష్యుండై యుండి కఱవునంజేసి వచ్చినవారి కెల్ల నిష్టమృష్టా
న్నంబుఁ బెట్టుచుండె నని చెప్పుచు. 98

— గోస్తనీనది —

సీ. నిడుపళ్ళమెలికల నెఱి నొప్పు నది చూడఁ
గన వచ్చెడిం దొఱ్ఱిగడ్డ యనఁగ
నటనుండి యీదారి నటు నిటుం దిరుగుచుఁ
జేరె సంగ్రమము కోనసీమనుండి
తే. తచ్చరిత్రము విన దలఁపుము చెప్పెదఁ
గామధేనువు బిడ్డఁ గనియె నంది
నిని దాని గంచించి కొనిపోయె గరుడుండు
మొయిలుదారిం బట్టి భయము దక్క—

తే. తల్లి గరుడుండు గొనిపోవు పిల్లఁ జూచు
కొనుచు నంభారవ మ్మది కొనలుసాఁగ
ధరణి నడయాడె నందర్శిః దాఁక నప్పుడు
కారి పొదుగుపాల్ ప్రవహించి కాల్వఁ గట్టె. 99

క. అదియే గోస్తని యనఁగా
నది యయ్యెఁ గంగ లేని నాళులలో న
న్నది నాడి ఋషివరేణ్యులు
సదమలమతి జప మొనర్ప సాగుదు రవనిన్. 100

చ. గరుడియు నట్లు నందినిని గైకొని నింగి గమించుచు న్వడిన్
బురము లరణ్యముల్ గడచి పోవుచు గాంగతటంబునందు స
ద్గురుఁ డగుగౌతముం గనుడు కోరికమై నట డింపి లేఁగ స
త్వరముగ మ్రొక్కి వచ్చి కొని దాని రహిం జనెఁ దొంటిలీలుగన్.

తే. కామగవి యంతలో వచ్చి ప్రేముడి నటఁ
దనయునఁగుబిడ్డ నడచినతావులందు
నడచి తానును మానిచంద్రముని మ్రొక్కి
తరలెఁ దార్క్ష్యుని ముట్టెడుతఁ(ఫుఁ) జేసి. 102

తే కలుఁగులం బోలె నున్నవి కామధేను
వత్సపాదము లివి విప్రవంశతిలక !
యీప్రదేశమునం దెట నేని త్రొవ్వ
నరయ వచ్చు గోపాదచిహ్నంబు లివ్వి. 103

వ. దానంజేసి యిది గోపాదక్షేత్రంబు నాఁబడె ననంతరకాలంబున గౌతముం డీమార్గంబున గోదావరిం దెచ్చి ప్రవహింపం జేసె ననిన నతం డలరి గోపాదక్షేత్రంబునఁ దీర్థంబాడి చని పట్టసాచల వీరభద్రు నారాధించి మరలి దాక్షారామంబునకుం బోయి సప్త గోదావరంబున నాడి భీమనాథుని సేవించి పంచారామప్రభావం బాకర్ణించి మించిన వేడ్క మాతృగమనాఘహారి యనంబడుకోటి పల్లికిం జని రచ్చటి స్థలపురాణం బెట్టి దనిన. 104

—॰ కోటిపల్లి ॰—

ఆ. ధరణి ధర్మవరము దనరారు నందు ధృ
తవ్రతుం డనంగ ధరణిసురుఁడు
మహి యనంగ నొప్పు మగువయందున్ సనా
జ్ఞాతు సుతునిఁ గాంచి చనియె దివికి. 105

క. విశ్వైకబంధు వగు నా
విశ్వస్త్రయుఁ దా్రిత లేరు వెనకిన లేమిన్
బశ్వాకృతి నొం డరయక
విశ్వంభరఁ దిరుగులాడె బిడ్డను గొనుచున్. 106

వ. ఇట్లు తిరుగుచు జనస్థానంబుకడ నున్నగాలవాశ్రమంబున జాలి మాలి యప్పసిబాలు నటం బడవైచి పురాకృతకర్మపరిపాకంబున జవరాలు గావున వెలిచవులం దవిలి యెడనెడం గలుగునెలవా్రి యంపుమిండగీండ్ల నరయుచు జనస్థానంబున వచ్చుచుం బోవుచుండు వారికి శరీరం బమ్ముకొ్చుచుండెఁ గుమారుండును. 107

ఆ. మునికృతోపనీతుఁడును వేదవేత్తయు
నగుచు జవ్వనంబు తగిలినపుడు
తల్లివోలెఁ దాను నెల్లెడఁ దిరుగుచు
బొజుగువీథి నొక్కపురము చెంత. 108

మ. జిలుగుంబావడఁ గట్టి చల్వ పయఁటం జెన్నారఁగా వైచి చు
క్కలరైకన్ ధరియించి మానికపుజూకా ల్లోనికన్నాకుసొ
మ్ము లెసంగన్ జడ చుట్టి పాడి చిటికల్ ముమ్మాటికి న్వేచుచున్
దలుపోరం దగి తొంగిచూచెడుమహీతన్వంగిఁ దాఁ గన్గొనెన్. 109

చ. ఎనయఁ గులాంగనాకృతి యొకింతయుఁ జెల్లని యల్లతల్లిఁ గ
న్గొని యొకవేశ్యగాఁ దలఁచి కోరిక మీఱఁగ డాయ రా మహీ
వనరుహగంధి యయ్యలరుఁబా్రియపుబిడ్డని వెచ్చకాని గా
మనమున నిచ్చగించుచును మారుని బారికిఁ జిక్కి మక్కువన్. 110

చ. కనుగొని బంగరందియలు గల్లు రనన్ వడి లేచి కౌనునన్
జనుఁగవ కమ్మపౌజును గచంబును నల్లలనాడ వచ్చునా

తని కేదు శేగి జారవిహితం బగుకృత్యము లాచరించు చిం
పనువడఁ గేలఁ గేలు గొని యల్లన నాడుచు నింటిలోనికిన్. 11

తే. తోడుకొని పోయి పాన్పుపైఁ దోడరఁ జేసి
కడఁగి పన్నీటఁ గాళులు కడిగి తనదు
పైటఁ దడియొత్తి చక్కెర పాలకోవ
ప్రీతి నుపహారముగఁ బెట్టి విడె మొసంగె 112

వ. సనాజ్ఞాతుండును దానిచేఁతలకుఁ జేలెంబుగఁ బ్రీతుండై దానితోడం గూడిమాడె నంత. 113

క. తల్లి యని కొడుకు కొడు కని
తల్లియునుం దెలియనట్టి తత్తరుణులకున్
జెల్లెను దాంపత్యము ముని
తల్లజ యేమందు విధివిధం బకటకటా ! 114

వ. ఇట్లున్న కాలంబున సనాజ్ఞాతుం డొక్కనాఁడు గాలవాశ్రమంబునకు రా నతం డతని నెఱింగియు నీ వెవ్వండవు నీ పవిత్రవర్తనం బెట్టిది నన్నుఁ గన్నవా రెవ్వరు చెప్పు మనిన నతం డెల్లఁ జెప్పెద నని యింటికిం జని రాత్రి భోజనానంతరంబున మహిం గాంచి నీ వెవ్వరు నీ వృత్తాంతంబుఁ జెప్పు మనిన నప్పు డింతియు. 115

తే. ధర ధృతవ్రతుఁ డనియెడుధరణీసుతుఁడు
తనరుఁ దద్భార్య మహి యను దాన నేను
అతఁడు మడియ సనాజ్ఞాతుఁ డనెడు బాలు
గాలవాశ్రమమున వైచి జాలి లేక. 116

వ. కాలవశంబున నిట్లు స్వైరిణినై యుంటి నని చెప్పుటయు. 117

శా. హాహాకారము సేయుచున్ దిశలు మ్రోయంగా సనాజ్ఞాతుఁ డు
త్సాహంబున్ క్షిప్తిగఁ ద్రావి బాధము మహాదంభోళి పైఁ బడ్డతుం
గాహార్యం బనఁగా గుభుల్లు నెదునిర్హ్రాదంబునన్ గుంభినీ
దేహస్మారక మేది కూలి మృతిఁ బొందె న్నాఁగ మూర్ఛన్ బడెన్

వ. కొంతపడికి సేద దేరి. 119

ఉ. అయ్యయొ మోస మయ్యెఁ గదె యుల్లధృతవ్రతుఁడే తలంప మా
యయ్య మదీయమాత యగుఁ గన్మహిమాప్తి యగు చేసెన నాఁడు నీ
చయ్యెద శించుబాలుఁడ నహో! యని వత్సను మోహకొంచు నో
పెయ్యమ! మత్పురాకృతము దా నది యెట్టిదొ యిట్టు కూర్తువే.

వ. అని దైవోపహతికి మిగుల వగలం బొగులుచున్న నక్కాలికిఁ జుం
బలుకు లేక పుడమిం బడి బడి బడి యడలుచుఁ గొంతవడికి నిజా
త్మజసంగమస్మరణంబున గుండెలు జల్లు జల్లు మనఁ బెల్లుగఁ దల్ల
డిల్లు మఁ బట్టిం గట్టుకొని బెట్టు వాపోవుచుండె నంత నట్టకేలకుఁ
బ్రభాతం బగుటయు దుఃఖాక్రాంతచిత్తుం డగు ధృతవ్రతపుత్త్రుం
డు తల్లిం జోడుకొని గాలవుని కడకుం జని తన వృత్తాంతం బం
తయు నెఱింగించి యీపాపంబు వాపి మమ్ముద్ధరింపు మని పరిపరి
విధంబులఁ బరిదేవనంబు సేయుచుం బ్రార్థించినం బ్రసన్నుండై
గాలవుండు వత్సా! వగవకుము నీవు నీజననియు గౌతమికిం జని
పవమానసూక్తంబులు పఠించుచు నఘమర్షణస్నానంబు గావిం
పుఁడు మీదోషంబు పటాపంచ లగు మీకు మోక్షంబునుం
గాఁగల దనిన వా రట్లు కావించి ముక్తులై రని పురాణంబు విని
భూషణప్రభృతు లామాత్యసంగమాపహారి యగుతీర్థంబున నాడి
కృతార్థులై తరలి యటనుండి కోనసీమం జూచుతాత్పర్యంబున
నమలాపురోపమండలం బంతయు సంతసంబున సంచరించుచుండి
రప్పు డందు. 121

— కోనసీమ —

సీ. ప్రతిపల్లెకుం జేరఁ బ్రవహించుఁ గాల్వకి
తత్ప్రాంతమంతయు దైవతభువి
స్వర్గంబు దానితో సరిపోల్ప నొప్పదు
దుర్భిక్షమున నది దోఁగుచుండు
సూర్యరశ్మికి నందుఁ జోటు లే దట్లుండుఁ
జిక్కనై తోఁటలు చెన్నుమీఱు
నారికేళంబులు నారంగములు గున్న
మావులు పోఁకలు మంజుళములు

తే. పనస దానిమ్మ నిమ్మ దాసనములు మఱి
దబ్బలును నారదబ్బలుఁ జాళములు బ
త్తాయిలును దార్షిలును లోఁగ నై యలరెడు
తోఁట లవి యెల్ల నానందపేటిక లగు. 122

ఉ. ఈచెవిగాలి యాచెవికి నేఁగఁగఁ బాఱెడువేళ వేఁడికిన్
మైఁ జుఱుచుట్టుమం చుడిక మాఱెడువేళను నిండిపోయి నోర్
వాచవి పీడు వేళఁ గడు వందురువారలు లోటభూములన్
జూచినమాత్రఁ జల్వలకు శోషను దక్కి సుఖింప కుందు రే. 123

శా. గంగాబొండములోనినీళు లమృతాకారంబునుం దాల్చి స
త్సంగంబుం గొని జిహ్వతో నుదరగోళంబందు వ్యాపించి మే
నం గల్గించెడుఁ దాపశాంతికరమై నల్వొందు మేల్చల్వలన్
బంగారం బని కోనసీమ జగతిన్ వర్ణింపఁగా నొప్పెడిన్. 124

చ. మడుపుల లోయలన్ మిగుల మాఁగి తమంతన వీఁగి నేలపైఁ
బడి వడి విచ్చు పెంబనసపండ్ల స్రవించెడునెస మొంపుఁగొం
డడగొని జాలుకపర్పుటసంటులుగుంజును రాల్మరందముల్
జడిగొని జంటితేనియలు జాల్కొని డిగ్గియు లౌ నటన్ సదా. 125

శా. ఆదేశమ్మున నెల్లగ్రామములలో నాభూషణస్వామి నల్
వేదంబుల్ పఠియించువారి సభలన్ వేదార్థముం జెప్పుచున్
వాదంబుల్ పొనరించువారి జపముల్ స్వాధ్యాయముల్ యజ్ఞముల్
మోదం బేర్పడఁ జేయువారి నరసెన్ భూదేవతాచంద్రులన్. 126

వ. అట్లు కోనసీమ యంతయుం జుట్టి యటనుండి పయనంబై పీఠికా
పురంబునకుం జని రదియును. 127

## —— పీ ఠి కా పు ర ము ——

సీ. పదియునెన్మిది యగు పరఁగుపీఠములందుఁ
బురుహూతికకు నెద్ది పొదలుటింకి
చెలఁకుఁ బానకము నాఁ జెన్నారునేలేదు
పాటు నేయూరికిఁ బ్రిక్కనుండి

డేఁ వెలసినదుచక్కి నెప్పుడునుం బాయకను
చెఱకులకాలువ చెన్నమీఱు
కుంతిమాధవుఁ డనుగోవిందుఁ డేపిట
కుక్కుటేశ్వరుఁ గూడి కోర్కి నిచ్చు

తే. చోళినాటికి నీయూరు మొదటిలెక్కఁ
బావలుఁ జదువుల కేయూరు పుట్టినిల్లు
పట్టినుడికారమును గన్నయట్టి దగుచుఁ
నాపురంబున కొప్పఁ బిఠాపురంబు. 128

సీ. శక్తికాపురి నగుపాదగయ నాడి
పురుహూతికం గాంచి పూజసి మ్రొక్కి
కుంతిమాధవు నేటికో క్లిడి సేవించి
యన్నవరంబున కరిగి సత్య
నాడి రత్నాద్రిపై నలరు శ్రీసత్యనా
రాయణదేవుని వ్రత మొనర్చి
తీర్థప్రసాదముల్ దెచ్చి యీ వారు భు
జించి సింహాద్రి దర్శించి యచట

తే. యప్పలనృసింహునకు నతు లొప్పఁ జేసి
దలి శ్రీకూర్మమున దేవుఁ గడఁగి కొలిచి
శ్రీజగన్నాథమున కేగి కృష్ణు నెఱిఁగి
చెంత భువనేశ్వరమున శ్రీకాంతుఁ గొలిచె 129

— జగన్నాథ క్షేత్రము —

వ. ఆజగన్నాథ క్షేత్రంబునం దింద్రద్యుమ్నం బనునొక్కకొలను
గలదు దాని వృత్తాంతంబు చెప్పెద నాకర్ణింపుఁడు. 130

క. కలఁ డింద్రద్యుమ్నుం డన
వెలసినరాజర్షి తొల్లి విహితాధ్వరుఁడై
సలలితయశుఁడై భూమం
డలమున వెలుఁగొంది చనియె నాకంబునకున్ 131

క. ఇంద్రద్యుమ్నుఁడు పెక్కేం
డ్లింద్రోపముఁ డగుచు నిర్జరేంద్రునియింటన్

సాంద్రామలకీర్తిం గొని
చంద్రప్రభ నొప్పె నమరసన్నుతుఁ డగుచున్. 132

వ. ఇట్లు పెద్దకాలంబు గడచినంత దేవతలు నీకీర్తి భూతలంబున మాసె నీపుణ్యంబు సంపూర్ణం బయ్యె నింక నీ విట నుండఁ దగ దని వానిం బడఁ ద్రోచి రంత నతండును మార్కండేయునికడకు వచ్చి తనపేరు సెప్పి య న్నెఱుంగుదే యనుడు నతండును నిన్ను నే నెఱుంగను నాకన్నఁ బెద్ద యగుప్రావారకర్ణుం డను నులూకం బెఱింగియుండు ననిన నతఁ డతనితో హిమవంతంబునకుం జని యులూకంబుం గాంచి యింద్రద్యుమ్ను నన్నెఱుంగుదే యనిన నదియును నిన్ను నే బాగుగ నెఱుంగ నింద్రద్యుమ్నసరస్సునందు నాకంటె వృద్ధుండై నబకంబు గల దది యెఱుంగ నోపు నని యతండును వానితోఁ గూడఁ జని యన్నింద్రద్యుమ్ను నెఱుంగుదే యనిన నది యొకింత విచారించి. 133

క. నే నితని నెఱుఁగఁ జాలను
గాని మహాభాగులార! కల దిట వృద్ధై
తా నెఱుఁగు నకూపారుఁడు
నా నుడువం దగినకూర్మనాథుం డనుచున్. 134

వ. అందఱు నతని గొంతెత్తి పిలిచిన నతండును ప్రత్యక్షం బై వృత్తాంతంబు విని యి ట్లనియె. 135

ఉ. ఏల యెఱుంగకుండెదనొ యేను మహాగుణభూషణున్ మహీ
పాలుని వాని వానిదయ వాసముఁ జేయుచునుంటి నిందు నీ
కాలమునం దనేకశతకోటులు దక్షిణ లిచ్చి జన్నముల్
వేలకు వేలు చేసి నిలిపెన్ మణియూపము లెన్నియేనియున్. 136

ఉ. ఆతఁడు దక్షిణార్థముగ నర్థుల కిచ్చినగోగణంబు లీ
భూతలమందు మెట్టుటను భూరిఖురంబుల గ్రొస్సి గ్రొస్సి కా
దే తగి యీసరోవర ముదీరిత మయ్యెఁ దదాహ్వయంబునన్
బ్రీతికిఁ గారణం బతనిపేరు స్మరించితి నేను ధన్యుఁడన్. 137

వ. అని పలుకుచున్నంత దేవదూతలు విమానంబు దెచ్చి స్వర్గంబునకు రా నవధరింపు మనిన నింద్రద్యుమ్నుండు మార్కండేయాదుల

ద్వేషించి గర్హించి తిరస్కరించుచుండె నప్పు డతండు తనమనం
బున. 143

మ. తనయుం బోలి చరింతు నిచ్చలు నుపాధ్యాయాని న్నాపైఁ గడుఁ
గినియుం నానుడి యన్న మాడిపడు నేఁ గిం చట్టులై పోయితిన్
నఁ నాలించెడువాఁడు లేడు గురుని న్వాదింతు నీయంతయుం
జనఁ గొందుణ్ దగ దంచు మానుడు ని దెట్టా నోయటంచా ర్తిమై.

తే. గురునితోఁ జెప్పి శిక్షింపఁ గూడ దేను
దెగి బడులు దెట్టఁ బాఠంబు దగులుకొనును
నీయమకు శిక్ష సేయంగ నెంచి నేఁడ
నెట్లు చేయఁ జాలుదు నని యెంచి యతఁడు. 145

వ చదువుఁ జాలించి యుపాధ్యాయునకుం జెప్పి ప్రియాగరాజంబు
నకుం జని యామహద్వృక్షం బెక్కి నానావిధగద్యపద్యంబుల నీశ్వరు
నారాధించి. 146

సీ. నిదురమంచము నుండి నిచ్చ లేచినదాది
నాతల్లి గురుపత్ని నన్ను రోసి
తప్పెఱుంగనినన్ను నెప్పుడు దిట్టుచు
నేరము లేవేవొ యెంచుచుండు
నాయమ్మ వంచింప నేయుపాయము గాన
కిటు లెంచి వచ్చితి నిందిరేశ !
నే నాపెకడుపున నే పుట్టి కొడుక నై
ముద్దులు మురిపెముల్ మొదటఁ జూపి

తే. పెరిగి పెద్దవాఁ డన యయి పెండ్లి యాడి
యెల్లవైభవములఁ గల్గి యేను నాదు
నతివ నంటఁగ గడిలోని కరిగినపుడె
నాకు మృతి కల్గఁ జేయు మో నాదుతండ్రి! 147

వ. అని యామునప్రవాహంబునం గుభిల్లునం బడి ప్రాణంబులు విడిచె
నంతఁ గొంత కాలంబునకు. 148

చ. గురుకులమందు నగ్గురునికోమలి గుర్విణియై జగజ్జనుల్
గురువును శిష్యులున్ ముదము లోఁ గొనియుండఁగ నీరుమోసి భా

సురగతిఁ గాంచెఁ బుత్త్రుని విపక్షపక్షనృపాలభీకరాత్ముని
స్ఫురదురుపద్మపత్త్రనయనశోభితనేత్రుని నాయకోత్తమున్. 149

వ. అట్లు గాంచినకుమారునకుఁ దండ్రి జాతకర్మ నామకరణ అన్నప్రాశన చౌలోపనయనాది సంస్కారంబులు యథాకాలంబుగ నాచరించి సకలవిద్యలను నేర్పి యొక్కచక్కనిబోటిం దెచ్చి పెండ్లి చేసె నంత నక్కుమారుండును. 150

— [illegible] —

సీ. వేదశాస్త్రపురాణవిద్యావిశారదుఁ
డై కవిత్వముఁ జెప్పనేర్పరి యగుచు
నానావిధప్రబంధములు చేసి కవీంద్రు
లౌ ననఁ బ్రకటించె నవని గాని
బుద్ధి బృహస్పతిం బోలి నానసరసు
తి యాసంగఁ జెప్పఁడి తేజరిల్లి
రూపునఁ బ్రద్యుమ్ను జెప్ప మాపఁగఁ జాలి
గుణము సేర్పును గల్గి కోమరు మిగిలి
తే. వినయమును వివేకమును గల్గి విమలగాన
మును గ్రహించి మనోహరముగ వచించు
నట్టిదై యెల్లవారి కెల్లారు ముద్దు
గా మెలఁగె నిర్వ వేదులకోమలుండయి. 151

మ. తలిదండ్రుల్ సుతుఁ డుద్భవించినమొదల్ తాత్పర్యమెచ్చన్ మదిన్
గలసర్వస్వము నేలుకోఁ గలిగి లోకం బెన్నఁ జాల్ సద్గుణం
బుల కాణాచి జనించె ధన్యులము మాపూర్వుల్ కడుం ధన్యు లే
మలఁతుల్ గాని మహోత్తమక్రియలు సేయం జాలినా మెప్పుడో.

వ. అంతఁ దల్లియును. 153

మత్తకోకిల: చేతియొద్దది వాతియొద్దది చేరఁ జీరి యొసంగుచుం
బ్రీతిఁ జూచు నహర్నిశంబును వీడ కెప్పుడు వేడుకన్
జేతమందు వహించి వానికిఁ జిన్ననొప్పి జనించినన్
భూతజాత మ దెల్ల మున్గిన పోల్కిఁ జింతిలు నెంతయున్. 154

సీ. ఈరీతి సంతోషవారిధిఁ దేలుచుఁ
దలిదండ్రు లుండి ర త్తరుణమంగుఁ
గోడ లీడేరినజాడ లెఱుఁగ రాక
వారిఁ గూర్చ ముహూర్త మేరుపఱచి
బందుగులం బిల్చి పబ్బంబు గావించి
కైసేసి యొక రేయిఁ గౌతుకమున
దంపతులం గది కంపి రంతన పెద్ద
పిడుగు పడ్డటు భర్త పుడమిఁ బడియె
తే. నెల్లరును వచ్చి చూచెదునింతలోనఁ
బ్రాణములు వాసి కుణపమై కాసి మాలి
కానఁ బడె భూసురసుతుండు కన్నవారి
గుండె లవి బ్రద్దలై పోవుచుండె నపుడు. 155

మ. పసుపుంబట్టలతోడి బాలకుఁ డటుల్ ప్రాణంబులం బాయుటల్
ప్రసమీక్షించి జనిత్రియున్ జనకుఁడున్ బ్రజ్ఞావేశం బాసియున్
వెసఁ బ్రాణంబులు పోయివల్లగుచుఁ బృథ్వీవ్యాళి రథ్యాంతలో
వసుధన్ మూడుశవంబు లుండె నని తోఁప న్వచ్చె నెవ్వారికిన్.

వ. అంత బంధుమిత్రసమాశ్వాసితులై లబ్ధసంజ్ఞులై లేచి తల్లిదండ్రులు నోరు నెత్తియు మొత్తుకొనుచు హా కుమారు మని యేడ్చుచుఁ గుమారునకు నూర్ధ్వదైహికంబు గావించి నితాంతచింతాసాగరనిమగ్నులై నిద్రాహారంబులుమాని మంచంబు పట్టి యుండి రీవార్త దేశం బంతయు నింతలో మ్రోసె నది ప్రయాగవాసి యగునొక్కయతి వర్యుం డాకర్ణించి గురుకులంబు చెడు నని వగచి వారి నూరార్చు వాఁడై వారికడకు వచ్చి భవతి భిక్షాం దేహి” యని పలికిన నుపాధ్యాయాని దుఃఖించుచు ని ట్లనియె. 157

శా. అయ్యో! యోగివరేణ్యా! మే మధికపాపావిష్టకష్టాత్ములై
యియ్యోగ్యజం బడి యున్నవారము గృహం బీనాళ్ళలో దుఃఖసా
హాయ్యంబుం గొనియుండె నగ్ని వెలుఁగం దంధంబు సర్వంబునున్
దయ్యెం బిట్టిది మాకు రాదు మృతి మాతండ్రీ! చనం జూడుమా!

చ. ఇటువంటి పెండ్లివాఁడు కుసుమేషుసమానమనోహరాంగుఁ డీ
శ్వరకరుణాకటాక్షవిభవప్రభవిష్ణుఁడు సర్వసద్గుణా
కరుఁడెం సుధీవతంసుఁడు నొకానొకఁడుండు కుమారుఁ డీగ్లై నో
వరమునిచంద్ర! నే మనుచు వాకొన నుంటినో నీకు నిత్తఱిన్. 159

తే. అనిన మునియును లోకమునందు నెండ
రిట్లకాలమృతిం బొంద రెంప జిట్లు
పాకమార్యము పాజన్యసంపదయును
గల్గి యుండరు పా ప్మ్రం బోకం డితండు. 160

క. పుత్త్రుఁడం డయి పుట్టినయూ
శత్రుఘ్నునకు దుష్టమతికి స్వాంతములు చెడఁగా
గాత్రము లింకఁగ పీఁగతి
నాత్రము పడి కుండ వచ్చునా ? గురుపత్నీ! 161

ఆ. అనుజు నామె యునియె నందజుయట్టివాఁ
డనుట గాదు నాదునాత్మజుండు
శత్రుఘ్ని వనియు దుష్టసంగతిఁ గలుగువాఁ
డచటఁ బలుక రాదు ఘనుఁడు వాఁడు. 162

సీ. అనిన మునీంద్రుఁ డ ట్లనియె మీయింటిలోఁ
గలఁడు కణాదుఁ డన్ ఘనుఁడు మున్న
వానిఁ బోలినగుణవంతుఁడు వీఁ డన
వచ్చునో యన నామె మచ్చరమున
...ఁడు దుష్టుఁడు వానిఁ బలుకకుఁ డయ్య మా
తనయుండు సద్గుణాఢ్యుని యటందు
నా నతం డను నాతఁడే నీకు జనియించె
నన నేమి యందువో వినఁగ నయ్య

తే. ననుడు నా కట్టివాఁడు కడ్పునను బడఁడు
పడుటయే నిక్కువం బైనఁ గడుపు చీల్చి
కొందుఁ గని పెంప నెంచ నాకూళగొడవ
తేకు మోఋషివర్య! ప్రార్థింతు నిన్ను. 163

వ. మునీంద్రుండు వెండియు నిట్లనియె. 164

మ. కొడుకై వాఁడె జనించి నాఁడె యుని నీకుం దెల్లమై యున్నచోఁ
బడఁతీ! నీ విటు దుఃఖభారమునఁ బాపం బోవ చుత్తించితివో
జడుఁ డాతండు ఖలుండు దుష్టుఁ డని విశ్రాంతిం బోనం జూతువో
నుడువం గా విని యుంటి నే ననుటయుం గోలాక్షి శోకించుచున్.

క. తా దనుచు నేను జెప్పితే
నా చూడక యుంటి వినవు పలుకుదు వకటా
యాడోసకారి లేచె కొడు
కై దివి కేగినను దుఃఖ మందుదు నో కోమా. 166

వ. అనిన నతండు వెండియు. 167

సీ. అట్లైనఁ జెప్పెద నాలకింపుము తల్లి
యలకనాడాఖ్యు నీ వాడపోయెఁ
దాళఁ జాల కతండు తరలి పోవుచు నిన్ను
శిక్షింపఁగా మది జేసి యలప్రి
యాగమునకు వచ్చి యామునజలమందుఁ
బడి చచ్చె నిరీతి నడప నెంచి
వాఁడె నీకొడు కయి వైరంబు దీరుచు
కొనె నప్పు నే నిట్లు కని యెఱింగి

తే. యుంటి నీవార్త విని నీదునింటి కిట్లు
తెలుపఁగా వచ్చితిని గురుకులము చెడిన
దగు ననుభయుంబునంజేసి యనుడు నామె
భర్తతో దుఃఖమును బెడఁ బాయ నయ్యె. 168

వ. అని చెప్పి భూపణస్వామి మఱియు నిట్టిసిదర్శనంబు లెన్నియో
కల వని తత్ప్రభావం బభివర్ణించి త్రివేణీసంగమంబున నఘమర్షణ
స్నానం బాచరించి యట శుద్ధగంగాజలంబు స్వీకరించి యటనుండి
సపరివారంబుగా వారాణసికిం జనియె నదియును. 169

తే. తనమతమునస్వ్రనఁ బడునట్టిజనుల నెప్పుడు
వెండిఁ గూర్చుండి బంగారు వ్రేల నంటి
యష్టభూతు లనుభవింప గాచరెంతం
నను చుఁ గైఁ గంకణముఁ గట్టుకొనియెఁ గాశి. 173
తే. మున్ను ధన్వంతరి మహాంశమునను బుట్టె
యాల దివోదాసుఁడనుప్రభు వధివసించి
రాజ్యపరిపాలన మొనర్చెఁ బూజ్యుఁ డగుచు
నింద్రిముఖ్యుల కెల్లఁ దా నింద్యుఁ డగుచు. 174
తే. మొదట మణికర్ణికాతీర్థమున మునింగి
గంగ నాడి విశ్వేశ్వరలింగమునకు
భక్తి నభిషేక మొనరించి భుక్తిముక్తు
లొందఁ గలుఁ డని వేదములందుఁ గలదు 175
మ. వరణాసీనదు లీవ లావను నిల్వన్ వారణాస్యాఖ్య నై
కర మొప్పారును గాశికాపురము లోకప్రస్తుతం బై విభా
స్వరమాహాత్మ్య మెఱుంగ వచ్చునిని బంచక్రోశసౌధ్యంబునన్
వరగంగానది గ్రాహముల్ జనతతిం బట్టంగఁ బో వెప్పునన్ 176
శా. ఆపీటం గలయెల్లప్రాణులును బ్రాణాపాయమును బొందుచో
శ్రీవిశ్వేశ్వరుఁ డేగుదెంచి యుపదేశించున్ మహాతారకం
బేవేళన్ గుడికర్ణమందు స్మృతి ము న్నేరీతినిం బండినన్
పై వచ్చున్ గుడికర్ణమచ్చెరువు తోఁపన్ జేయుచు న్నేరికిన్. 177
తే. ఇట్టినుడికార మొకవిభుం డెఱిఁగి స్మృతికి
నైనగోమాత కుడిచెవి నడుగునఁ బడ
గొలుసులం బెట్టి బంధించెఁ గొంతలోన
నట్టె పైవచ్చెఁ గుడిచెవి కట్టు లెడల. 178
వ. అట్టిమహత్తరపుణ్యస్థలం బగుకాశీపురంబునకు సపరివారుండై చని.
సీ. అణిమాదు లోనఁగూర్చు మణికర్ణికం గొల్చి
గంగానదిం జలకంబు లాడి
విశ్వేశు నర్చించి విష్ణుని సేవించి
దుండివిఘ్నేశ్వరు దోఁగి కొలిచి

మండపాన భజించి గండికిఁ బైకవ్వలఁ బూ
జించి శ్రీకార్తిక నెంచి సుయోగ్య
గుహఁ గాంచి యుల్లహారహాము సాధ్వాకసా
సీపురిఁ దీర్థము నోపి కాంచి

తే. తల్లియును చెల్లెలుం బంధువర్గమ్ తమ్ము జేర
భూషణస్వామి యెంతయు బోధ మొసఁగ
నక్కడ విశ్రమించి పరమపవిత్రకీర్తి
ధ్యానపరతంత్రుఁడై యుండె ధన్యుఁ డగుచు. 180

— అయోధ్యాపురము —

వ. ఇట్లు ప్రత్యహంబును నిత్యసేవఁ గావించుచు నయ్యాశ్రమక్షేత్రంబునఁ గొన్నిదినంబు లుండి యటనుండి పరివారపరివృతుండై సాకేతంబున కేగి సరయువం దాడి సీతారాముల సేవించి శ్రీరామ జన్మస్థలంబును సీతాభూప్రవేశ ప్రదేశంబును రామాశ్వమేధస్థానంబును సువర్ణసీతాప్రతిమాప్రతిష్ఠానంబును జూచి హర్షించి పురవిశేషంబు లరయుచు. 181

మ. అపు డారామునకున్ సహాయతను జేయం గల్గియున్నట్టి యా
కపు లెల్లన్ విడి పోవ నోప కచటం గాలూచి యున్నారనన్
గపిసైన్యంబులు పెనవే లచట వేడ్కం జూచి హర్షింపఁగా
నిపుడుం దోఁచెడు నింగితం బెఱుఁగనై యుంపొందుచున్నట్లుగన్.

మ. సరిగా వచ్చునో రాదో మాట లచటన్ సర్వోన్నతిం గొన్నవా
నరసంఘంబుల కెన్న భావగతులుం హాసంబులుం జేష్టలున్
నరసంఘంబులకుం బలెన్ సకలవస్తున్ సంప్రాప్తమై యుండె న
ప్పురముం జేరిన తెరిఁగుం డిపను బప్పం బెల్లమున్ బిస్కత్యమున్.

క. ఒకదాని కైనఁ బెట్టిన
నిఁక నెవ్వియు రావు నరుని హింసింపఁగ న
ట్లొకదాని కిడక యున్నన్
సకలంబుం గోఁతిపిండు సాధ్వస మొసఁగున్. 184

వ. మఱియు నాసరయువునందు. 185

జెట్టుకొమ్మకుఁ గాళ్లు చుట్టి చేతులు వ్రాల్చి
వ్రేలాడుచుండి తపించువారిఁ
గనుపునేలను మోపి కళ్లు చేతులఁ బట్టి
విల్లునా వ్రేలి తపించువారి
తే. గండశిల కంటుకొని బొమ్మకరణిఁ జెరఁ
బడి శిల యనంగఁ జూపట్టి యొడ లెఱుంగ
కుండ మెండుగఁ దపియించుచుండువారి
నెందఱినో చూచె భూషణుఁ డందుఁ గాదు. 192

తరువోజ. ఒకలోయలోఁ బ్రాంతోన్నతశిలను
నొరసి త్రాళప్రమాణోన్నతిఁ గల్గి
సకలావయవములు సరిపడులావు
సన్నంబులం గల్గి సమకూరి యుండ
మొకమునం గన్నులు మూఁతలు వడఁగ
మొద్దునాఁ గదల కూర్పును లేక మేని
కొంకొంతకఠినతయును రోమచయము
నొసరంగ విగ్రహ మొండు చూపట్టె. 193

చ. పురుషుఁడు నాఁగఁ దోఁచు నిది భూరిశిలాకృతియేమొ కాదు మైఁ
బరుషమ యైనచర్మమును బాధతనూరుహముల్ గనం బడున్
గరమున వ్రేళ్లునుం బెరవి గోళ్ళుఁడలాడుఁ గదల్తు మేని యే
పురుషుఁడో తొంటినుండి తపముం బొనరించుచునుంట తోఁచెడిన్.

వ. అని యమ్మహావిగ్రహంబుకడఁ బ్రాణాచారంబువడి ప్రార్థించి
యొక్కించుక చనునంత. 195

మ. ఒకచోఁ బంచమహాగ్నిమధ్యమునయుం దొక్కండు యోగీశ్వరుం
డు కడున్ ఘోరముగాఁ దపించుచుఁ గనుందోయిం బడన్ భూషణుం
డు కడం జేరి నమస్కరించుచును సంస్తోత్రంబుఁ గావించుచున్
సకలాంగంబులు సంచలింప నిలిచెన్ సాక్షాత్ప్రశిష్యుండు నాన్.

ఆ. మునియుఁ గొంతలోనఁ గను విచ్చి కని "కృతో
సి త్వ మస్మదీయ! సిద్ధి రస్తు

తే॥ యనంగఁ బ్రిననఁ ద్విగుణంబుగాఁ జెప్పి
మ్రొక్కి నుదుటఁ జేర్చి మోడ్పుఁ గేలు. 197

శ్లో. అపరాధసహస్రసంకులం
నపి భక్తజనాన్ భవదంఘ్రినతి
ప్రివరా నవ సీదృశ మీశ్వర మాం
కృపయా పరిపాలయ కృష్ణనుత. 198

వ. అని మఱియును. 199

తే. నేను గాండిన్యుఁడను సుతీర్థానుయాయి
నగుచు వచ్చితి జగబాధ్యు లైననిమ్ముఁ
గాంచఁ గల్గితి నాపూర్వసంచయంబు
మంచి దని సంతసించెద మాన్యచరిత!. 200

వ. అనిన నమ్మునీంద్రుండును నిన్ను గాంచెఱుంగుదుఁ జెప్పెద వినుము. 201

మ. పటుతేజోనిధి యాంగస్త్యమౌని లోపాముద్రతోఁ గావురం
బిటఁ గావించెను దొల్లి వానికడ నీ వెన్నేనిసద్గోగ్యాలన్
దిట పేర్కొనగ గ్రహించినట్టిపృథమాం తేవాసి వెన్నంగ నీ
పటిమల్ సెప్ప నసాధ్య మయ్యె నపు డో బ్రహ్మాన్వయగ్రామణీ!.

ఉ. నీపొనరించుతప్పునకు నీపయి నల్గి గురూత్తముండు నీ
వాపృథివీస్థలి న్మఱియు నందుము జన్మ మటంచు శాపమున్
గోపమునఁ డై పొనర్చుటను క్షోణితలమ్మున నిట్లు పుట్టి తో
బాపఁడ! నీప్రభావము శుభప్రద మే సకలం బెఱుంగుమన్. 203

ఆ. తప్పుఁ డైననీవు సద్గురుపదపద్మ
ములను వ్రాలి నాడుసలిపినట్టి
తప్పు సైచి కావు మప్ప! నీ వని వేఁడ
నిట్టు లనియె నాతఁ డెసక మొసఁగ. 204

సీ. నాశాప మిది నీకు లేశ మైనను గీడు
గావించునట్టిది కాదు తెలియ
నాంధ్రదేశమునందు నవతరింతువు నీవు
హార్యంశమునఁ జేసి యార్యునింట

సకలవిద్యలు నీకు సమకూరింపఁగ వచ్చు
బ్రహ్మవిద్యాయుక్తుఁడవై ప్రతిభఁ గాంచు
నా గురూత్తముఁ డయి నలువు కీర్తిపెంపు పడసి
నసుఁడు సుబ్రహ్మణ్యుఁ డనఁగఁ బరఁగు
తే. నతఁడె శ్రీ వేంకటేశ్వరుఁ డనఁగ శేష
గిరి నెసఁగు చుండెడు స్వామికిఁ బరమసుతుఁడు
గా నెఱుంగుము తత్సేవ బూని చేయు
మతఁడె నీ వయి యుండు నపత్యవనియందు. 205
సీ. వేదశాస్త్రశ్రౌతవిద్యావిశేషముల్
కరతలామలకమ్ము లై చెల్లు నీకు
జ్యోతిషంబున మహాఖ్యాతిఁ గాంచెదవు నీవు
చూచి వచ్చినయట్లు జోడు చెప్పి
సకలామయములు నీ సన్నుతి చెప్పిన రేని
నిరువాములు దాటి పాఱిపోవుఁ
బ్రకృతిశాస్త్రము లెల్ల బ బట్టై నీయంటఁ
బడి నీ కమానుషప్రతిభఁ గూర్చు
తే. ఆడినది యాట యై నీవు పాడినదియుఁ
బాట యగు నీదునుడి మంత్రఫలము గలది
యవ్వను నీ కణిమాదులు స్వవశమందు
నుండు దేవేంద్రవైభవ మొందు దీవు. 206
తే. నీకు జన్మము లే దింక లోకమునకుఁ
దత్త్వబోధమ్ము పొసరించి ధర్మకర్మ
నిరతిమై నీవు తనువీగిఁ నిరతసౌఖ్య
మొందఁ గలఁ డయి ముక్తిని బొందఁ గలవు. 207

వ. అని నీగురుండు నీకు విశాపంబు నలికె నీ వింక నీవారిం గూడుకొని నీదేశంబునకు నిర్గమింపు మని తిరోహితుం డయ్యె నయ్యెడ భూషణుండును మరలి హరిద్వారంబునకు వచ్చి యచ్చట నున్నతనవారిం దోడుకొని నిజపురంబునకుం జనియె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వాలి వృత్తాంతంబుఁ జెప్పు మని సూతు నడుగుటయును. 208

— ఆశ్వాసాంతము —

ఉ. ఎంగిలి పెట్ట లేను నిను నిట్టటు మాఱిచి పాడ లేను నీ
యంగనవార్తలన్ శిరమునందు వహింపఁగ లేను రొట్టలన్
గాంగతటంబునందుఁ బడకం బొనరింపఁగ లేను నిన్ గృతిన్
సంగతిఁ గల్గఁ జేయుదును సాఁకవె నైకొని వేంకటేశ్వరా! 209

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబున
సప్తమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# అమృతానందము



## అష్టమాశ్వాసము

మచ్చుండు దేవంశ
శ్రీమహితుండు శేషాద్రినాయకుండు నన్నుం
గామించు నతఁ బ్రోవను
ప్రేమఁ లక్ష్మీసనాథ వేంకటనాథా. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె నట్లు నాగభూషణుండు కాశీగయాప్రయాగ అయోధ్యాదిదివ్యస్థలంబులు సేవించుకొని వచ్చి తిరుపతిపురం బను వేంకటేశ్వరపురంబున మహానందంబున నుండి యట్టి గాశీసమారాధనంబు గావించి యున్న యప్పుడు ప్రతిదినంబును దర్శనసమాగతు లగుభక్తు లమృతానందుని గాంచి మీ తీర్థయాత్రాప్రకారం బెంచుక చెప్పుఁ డనిన నతండు వారలం దిలకించి. 2

—॰ తీర్థయాత్రాప్రకారము ॰—

క. ఉత్తరదిగ్యాత్రలు పర
మోత్తరములు వారి మహిమ మున్నతిఁ దెలుపం
జిత్తమునఁ దేజు గలిగిన
యుత్తమునకుఁ గాక పెరకు నొప్పునె చెప్పన్. 3

క. వరణాసీమధ్యమునం
బరఁగెడుగంగ నొక్కసల్లు పట్టవు ప్రజలన్
మరణించునపుడు కుడిచెవి
పరికింపఁగ వచ్చుఁ బయికిఁ బరమాద్భుతమై. 4

ఆ. జీడికంటికొండఁ జెన్నారుగుంటలో
వారి యూరుటయును నూరకుంట

సరయువారిమయుట కొక్ఖ్యర్యమనక మూఁ
దన్మహత్త్వ మెన్నఁ దరము కాదు. 5

తే. కనఁగ వచ్చు స్వర్గద్వార మనఁగ నొక్క-
ద్వార మటనుండి శంకరస్వామి మున్ను
పోయి కైలాసమున నీశుఁ బ్రొక్కి వచ్చె
నందు రది కంటి కానందకంద మయ్యె. 6

వ. అని చెప్పిన వా రానందించి మహాత్మా! మీ కమ్మహారణ్య మధ్యంబున మహాయోగిదర్శనం బిచ్చి మీ పూర్వవృత్తాంతంబు చెప్పె నని చెప్పుకొను చున్నా రది యెట్టి దనుగ్రహించి చెప్పఁ డనిన నమృతానందుం డది యంతి ఘుృతిపర్వంబుగా దైనం గోరు చుంటిరి గానఁ జెప్ప వింటి వినుండు నే నట ననేకమహామహత్త్వంబు లరసి వచ్చుచుండ మార్గమధ్యంబునఁ బంచాగ్నిమధ్యంబున నొక యోగి కన్పట్టినంత నే నాతని పాదారవిందంబులకుం బ్రణమిల్లి. 7

తే. నేను గౌండిన్యుఁడను సుతీర్థానుయాయి
నగుచు వచ్చితి జగదాఢ్యులైనమిమ్ముఁ
గాంచఁ గల్గితి నాపూర్వసంచయంబు
మంచిదని సంతసించెద మాన్యచరిత 8

వ. అనిన నమ్మునీందు్రిండు నీ వగ స్త్యశిష్యుండవు. 9

క. ఎఱుఁగుదును మున్ను నీ విట
వఱలుదు నీగురునికోపవశమున జన్మాం
తర మిట్లు కొంటివెన్నఁగ
ధరణిశ నీవలన ధర్మతత్త్వ మెసంగుక్. 10

వ. అని పలికి యమ్మునీందు్రిండు వెండియు. 11

తే. నీకు జన్మము లే దింక లోకమునకుఁ
దత్త్వబోధంబు పొసరించి ధర్మకర్మ
నిరతిమై నీవు తను వీగిఁ నిరతసౌఖ్య
మొందఁ గలఁ డయి ముక్తినిఁ బొందఁ గలవు. 12

వ. అని చెప్పిన నందఱు నతని మహామహుఁ డని ప్రశంసించి ప్రణా మంబు గావించి సేవించి రనంతరంబ కొన్నిదివసంబులకు. 13

—॰ మాతృస్వర్గగమనము॰—

మ. త్తకోకిల: నాగభూషణయోగిమాతృక నాల్గుదిక్కులయాత్రలౌ
బాగుమీఱఁ బొనర్చి పావనపర్వ్రతమై బహుపుణ్యసం
యోగమును గొని ధన్యురాలయి యుంటఁ బుత్రుని చెంగటన్
భోగతిన్ విడనాడి స్వర్గముఁ బొందె నందఱు మెచ్చఁగన్. 14

తే. ఉత్తరక్రియలం దల్లి కుత్తమవిధిఁ
దిరుపతిం గృష్ణభూషణదేశికుండు
సలిపె మిక్కిలివైభవకలితముగను
బ్రస్తుతింపఁగ నెల్ల రాపత్తనమున. 15

తే. తిరుపతిమహంతు భూషణతీర్థపాదు
దివ్యమాహాత్మ్యమును విని దినము దినము
నతనిపై భక్తిఁ గలఁడయి యుప్పొంగిన
నెల్లవసతులు గలిగించె నెంచి యెంచి. 16

ఆ. కొండమీఁదనుండి కొన్నాళ్ళు తపియించు
నని యెఱింగి యచట నతని కేమి
వలయువాని నెల్ల వశఁ జేయఁగాఁ బరి
జనులఁ బుచ్చె ఘనత విని మహంతు. 17

వ. అనంతరంబ నాగభూషణుండు శేషాచలంబునం దపియించువాఁ
డయ్యె నదియును. 18

—॰ తి రు ప తి కొం డ ॰—

సీ. మలక లేడుగ వ్రాలి మస్తకంబునఁ బుచ్చు
కున శివకేశవులను ధరించి
కపిల విష్వక్సేన ఘనవరాహాది దే
వాయతనంబుల నతిశయిల్లి
కాపిల మాకాశగంగ తుంబురుకోన
మొదలగుఘనతీర్థముల నెసంగి
క్రీడాద్రి గరుడాద్రి వృషభాద్రి లోనగు
దివ్యనామాద్రులఁ దేజరిల్లి

తే. గరుడ శంఖ నాత్మారామ కంజజాత
ముఖ్యభక్తార్చనాస్థానపూజిత మగు
శ్రీనివాసనివాసమై శేషశైల
వర మెసంగెను వైకుంఠపురికి బోచ్చి. 19

మ. జలధారల్ సెలయేళ్లు కోళ్లు మునిరాట్స్నానంబులున్ దేవతా
విలసన్మందిరముల్ సుపుష్కరిణులున్ విఖ్యాతనోగర్భనా
మలసన్మార్గములున్ మహాగుహలు కామాంవస్త్రోద్దేశముల్
ఫలపుష్పాంచితదివ్యవృక్షము లటన్ భాసిల్లు నెల్లప్పుడున్. 20

శా. బాలాక్షేత్రము వేంకటాచలము మున్ వారాహరూపంబునన్
శ్రీలక్ష్మీప్రపతి రాక్షసాఃహ్వాతమై చె ల్వేమభూమిని దా
లీలం దెచ్చి యటన్ వసింప నము కేళిన్ దెలుచుం గొల్చె నా
బాలాదేవిని దాన నట్టినుడికై భాసిల్లె నట్టివరన్. 21

చ. అనుదినమున్ నిశాసమయమందు దలశేమనగంబుం జేరి సై
మునులు హిరణ్యగర్భగుహాముఖ్యనుపర్వలు వేంకటేశునిన్
గని గిరిమల్లెపూవులను సైకొని పూజలొనరి తద్దమున్
గొని గమియించుచుండ్రు తమకుం గలభక్తి ప్రపత్తి యొప్పంగన్

గీ. ప్రతిదినము వేంకటేశ్వరస్వామి కచట
బిల్వపత్రములం బూజ చెల్వ మలర
సల్పుచు దురు నాగభూషణుండు శ్రీని
వాసునకు నర్చకులు తిరుపతినగమున. 23

చ. తిరుపతికొండపై నపుడు దివ్యతరంబు తపం బొనర్పంగా
దొరకొని యొక్కమండలము తోరపుదీక్ష మెయి న్మెలంగి యా
శ్వరకరుణాకటాక్షము భృశంబుగ నొందఁగఁ బూని భక్తులన్
నిరత మనుగ్రహించుచు ముని ప్రవరుం డతండొప్పె మెప్పులన్.

—• దీక్షావిధానము •—

సీ. చైత్రవైశాఖమాసముల నుషఃకాల
ములను యోగాభ్యాసములు ననుక్ర
మమునఁ బంచోపాసనము లాసనంబులు
పొదలించి సూర్యోదు పుట్టిన పయి

సూర్యనమస్కృతుల్ సుప్రభాతసపర్య
లపుడు కల్యాణమండపమునందు
ఘనతరానుష్ఠానములను మధ్యాహ్నద
ర్శనముఁ బూజయు స్వామిపదములొద్ద

తే. భోజనానంతరమ్మున ముక్తిద మగు
జీవయాత్రాశ్రవణమును జెంత భక్తిఁ
జేర నుండినవారికి సారబోధ
మొనరుచుచు నుండు భూషణయోగి యపుడు. 25

తే. వర్ష వర్షము నీరీతిఁ బరమదీక్ష 1927
గా నుపాసించుచుండఁగా గ్రావ నేత్ర
ధాత్రి భూ సంఖ్యహూణవత్సరమునందు
నైనదీక్ష సమాప్తి యాయె నవసరమున. 26

తే. తిరుపతిమహాంతు భూషణుదివ్యమహిమ
తెలిసి గిరిమీఁద వేంకటేశ్వరునిసరస
నెప్పుడు నెట్టియాతంకము లెవరివలనఁ
గలుగ కుండెడునట్టు లాజ్ఞలు పొసఁగె. 27

మ. ఒకనాఁ డాతఁడు కృష్ణభూషణుని నెంతో గౌరవం బేర్పడన్
సకలోర్వీపతు లుండునైజగృహమున్ సమ్యగ్గతిం జేర రా
నొకజాబున్ లిఖియించి పుచ్చిన నతం డోంకారముం దెల్పుచున్
సుకలుం డైనమహాంతుచెంతకుఁ జనెన్ సూచించుచున్ బ్రహ్మమున్.

ఆ. ఆతఁ డతనిఁ గాంచి యార్యా! విచ్చేయుము
నాఁగఁ గదియ నరిగి నాగభూష
ణుండు కేలు మొగుప నుండునంత మహాంతు
హాతిరాము మ్రొక్కె నాన తిచ్చె. 29

ఆ. హాతిరామువిగ్రహమున కప్పుడు మ్రొక్కి
యమ్మహాంతుతోడ నతఁడు మాట
లాడి గౌరవంబుఁ బొంది వీడ్కొని వచ్చె
నిజగృహమున కపుడు నేర్పెసంగ. 30

వ. ఒక్కనాఁ డమృతానందస్వామికి స్వప్నంబున వేంకటేశ్వరుండు ప్రత్యక్షంబై రేపు నా భక్తుండైన యచ్యుతాచార్యుండు నా పంపునం జేసి మీ కడకు వచ్చి వేంకటేశ్వరాష్టోత్తరయు వేంకటేశ్వర గాయత్రియు మీ కొసంగును మీరవి వాని స్వీకరించి యంతట నుండి నా పేర వెలయఁ బడిన పీఠమునందు నా మూర్తిని బ్రతిష్ఠించి నాదు మంత్రోపాసన పూర్వకంబుగా నర్చనలు సలుపుచుండుఁడు. నేను బ్రీతుండనై యుండి నా సన్నిధి నొసంగెద నని పలికి తిరోహితుం డయ్యెనంత నతండు భక్తులకుం జెప్పుచుండు నంతలో నచ్యుతాచార్యుండు వచ్చి యమృతానందుం గాంచి వేంకటేశ్వరాదేశం బెఱింగించిన నతఁడు నత్యంతాశ్చర్యంబు నొందుచు భగవంతునకు మనపై నపూర్వానుగ్రహంబు గలిగె నని సంతసించుచుండ గురుండు భక్తు లందఱకు నాతనిచే నుపదేశం బిప్పించి పెద్ద సమారాధనంబు గావించె నంత భోజనానంతరంబున భాగవతకాలక్షేపంబు గావించుచుండ నా సమయంబున నవధాని యెల్లరు విష్ణుభూషణుని కడకు వచ్చి వినయంబునఁ జేతులు మొగిచి యిట్లనియె. 31

## —• సత్రియాగ విధానము •—

మత్తకోకిల. సత్రియాగ మనంగఁ దొల్లిట భూసురుల్ ఘనదీక్షమై
ధాత్రిఁ జేయుచునుందు రంచది తద్దయుం ఫలదం బనై
పాత్రితం గాని యూహ నంచును బల్కుచుందురు మహాత్ములో
ధాత్రి దేవకులావతంసమ! దానిఁ జేయఁగ నొప్పునో. 32

వ. అనిన నమృతానంద గురుం డిట్లనియె. 33

చ. ధరణిఁ బ్రసిద్ధి కెక్కఁ గలధన్యుఁడు విద్యల వృద్ధిచేయఁ గాఁ
బరఁగెడుపీఠ మొండు నిలుపం దగు నీవు త్రిలింగభూస్థలిన్
దిరుమలశ్రీనివాసుని నుతించుచు నట్టి దొకండు సల్పి త
త్పరమతి నుద్ధరింపుము సుతం బగు విద్యల నెల్ల దెల్లఁగన్. 34

ఆ. వేదశాస్త్రవిహిత విమలధర్మాచార
నిరతు లైనవారు గురుముఖమున

క. విద్య లన వేదసమ్మిత
విద్య లగుం గాని గోణిబిళ్ళలు బంతుల్
వాద్యములు కుట్టుపనులును
హృద్యంబులు గావు వాని కిట లే వేషముల్. 40

తే. ఇటఁ బరీక్షలు వాక్యార్థపటిమ నరుప
వలయుఁ గాని నూటికి నిన్ని వచ్చె నేని
చాలు నుత్తీర్ణుఁ డగునను సరణి తగ
దనుచు నియమము నొనర్పఁగ నగును జువ్వె. 41

తే. స్నానసంధ్యాగ్నిహోత్రార్చనలును దొట్టి
క్రియల నెల్ల స్వధర్మసూక్తిని దలిర్చు
నవి విడువ కాచరింప విద్యార్థి కగు న
టంచు నియమంబుఁ బాటింప సర్వ మగును. 42

సీ. అమరము సమరశేషము శబ్దమంజరి
వరధాతుమంజరి పంచకావ్య
ముల మాఘకావ్యముల్ పురుషసూక్తమును
సూక్తము మంత్రపుష్పోక్తవిధులు
నమకము చమకముల్ దశశాంతు లఘున్యాసు
పుణ్యాహవాచనమును గణేశ
పూజ యాబ్దికమంత్రముల్ ధ్యానగీతముల్
భాషాద్వయము నందు వాచకమ్ము

తే. ప్రథమకక్ష్యా పరీక్షకుఁ బాఠశాల
యందు విద్యార్థి పఠియింప నగును దాన
నాకళాశాలలోఁ బ్రవేశాధికార
మొంది గురుసన్నిధిం జేర్మి నందఁ గలఁడు. 43

సీ. ఋగ్వేదమును యజుర్వేదము సామవే
దమ్ము నథర్వవేదమ్ము శిక్ష
వ్యాకరణము ఛంద మానిరుక్తంబును
జ్యౌతిషకల్పముల్ న్యాయశాస్త్ర

ధర్మశాస్త్రార్థశాస్త్ర పురాణ మీమాంస
లును వరాయుర్వేదములను సుశిల్ప
శాస్త్రము నీతిశాస్త్రాలలోఁ జదువఁ
వలయు మతగ్రంథముల విచార

తే. మనిశము నొనర్పఁబడుచుండు నన్యదేశ
ములఁ బ్రవర్తిల్లు నట్లుగాఁ గలుగుతెంబె
యఖిల విషయంబులకు మేటి యగుచు నుండు
సర్వతంత్ర స్వతంత్ర వాక్యాలయమును. 44

తే. తీర్థయాత్రలు సేవించు తైర్థికులకు
నధ్వమధ్యమునం దగు నలసటలయి
బాపునీడయు నీరును భక్తి నొసఁగఁ
గట్టఁ దగు సత్త్రశాలలు ప్రఖ్యాతలముగ. 45

—• సత్త్రయాగదీక్షావిధానము •—

ఉ. మానసికశ్రమంబుడుపు మార్గములుం దెలియంగ వచ్చున
ట్లాని నెఱుంగఁగా వలయుఁ బండితగోష్ఠియు రాసనాము సం
ధానము నాత్మబోధమును దైవతభక్తియు శాస్త్రజన్య వి
జ్ఞానము వీనినిం దెలుపఁ జాలి తలిర్చును సత్త్రయాగముల్. 46

మ. భగవద్ధ్యానము కాలనిర్ణయమునన్ భక్తుల్ పొనర్పంగ ల
గ్గగు నంచున్ వచియింప నొప్పదు లయంబై పోవునందాఁక నే
తగులంబందును నెప్పుడుం బొనరుపన్ పథ్యంబుగాఁ జెల్లు నం
చుఁ గనుంగొనగు నెల్ల గ్రంథముల సంస్తోత్రాత్రి పాత్రింబుగన్.

క. జీవన్ముక్తునకు మనం
బేవేళ లయంబ యగుచు నేర్పడి యుండున్
గావునఁ దత్పర్యంతము
గావింపఁగ వలయు ధ్యానగతు లెవ్వేళన్. 48

ఆ. అట్లుగాన సత్త్రయాగమునం దెప్డు
ధ్యానధారణాదు లాచరింప
వలయు ననుచు శాస్త్రములు వచించెడుఁ గానఁ
దద్విధంబు మనకుఁ దగు నొనర్ప. 49

వ. మఱియుఁ నాసత్రియాగంబునఁ బ్రతిదినంబు నుదయాదిగం గ్రమం బున ధ్యానము సుప్రభాతము సంధ్యావందనము నగ్నికార్యము వేంకటేశ్వరప్రథమార్చనయుఁ బంచాంగశ్రవణము గణపతిపూజ సూర్యనమస్కారములు వేంకటేశ్వరద్వితీయార్చనయు నవగ్రహజ పంబు మధ్యాహ్నమున మహాన్యాసము నేకాదశవారరుద్రాభిషే కము సంధ్యావందన మగ్నికార్యము సాయంసమయంబు మొదలు కొని బాలాత్రిపురసుందర్యర్చనము వేంకటేశ్వరతృతీయార్చనయు లాలి మంగళారతులును బ్రహ్మపూజయందు నైవేద్యంబును నైవే ద్యానంతరంబునఁ దీర్థప్రసాదవినియోగంబును గావింపఁ బడు చుండఁ దగు మఱియును గురువారమురాత్రి పూలంగియు శుక్ర వారముదయ మభిషేకంబును జంగమగు భజన మెప్పుడును మాన నొప్పదు. వేంకటేశ్వరపురాణము శ్రీమద్భాగవతము దేవీభాగ వతము మహాభక్తవిజయము శ్రీమద్రామాయణము పారాయ ణము చేయంబడు మఱియు విద్యాశాలయం దుపయుక్తు ప్రస్థాన త్రయభాష్యము మధ్యాహ్నమున సాహిత్యము వ్యాకరణము ప్రథమ కక్ష్యలోని పాఠంబులును నఘనపారాయణము వేదపారాయణము వేదపాఠముం గావించునది మహాన్యాసంబును జరుగవలయు నని మఱియును. 50

చ. జపతపముల్ పౌనర్పుజనసంఘము ఋత్విజులున్ సమాగతుల్
సుపురుషులున్ గవీశ్వరులు చూడఁగ వచ్చినవార లెల్లరున్
సుపరిచితిన్ మహానసముచుట్టును వేసినయాకుటెంట్లయం
దెపుడు సమృద్ధిగాఁ గుడిచి యేగెడునట్లుగఁ జేయఁగా నగున్. 51

మ. అవధానీ! విను సత్రియాగ మన విఖ్యాతాఖ్యులై పుణ్యముం
దవిలింపం దగి యుండుఁ గాని యిపు డద్దాని బౌనర్పంగ నీ
భువి నెవ్వారలు నోప రర్థమును సంపూర్ణంబుగా నుండఁగా
నవు దీక్షన్ విధి యెంతయే ఘనతరంబై యుండుఁ జర్చింపఁగన్. 52

ఆ. ధనము సేకరించి ఘనదీక్ష గావింపఁ
జాలి యుంటె నీవు సత్రయాగ

మునకుఁ జెప్పి మనుదు వినయ మ్మిభినయించి
యాలఁ డిట్టు లనియె నదఁట వ మెంః. 53

ఉ. మీ కరుణా కటాక్ష మది మిక్కిలియై పరిగ్రహించె నేని నే
నీ కఠినంపుఁగాలమున నెట్లొ దనార్చన మాచరించి యీ సు
శ్లోకముగాఁ దదర్థ్యరమ్యముఁ జూడఁగ మెచ్చఁ బొనర్చ నేతు నో
లోకహిత ప్రభావ! మిము లో నిడుకొన్నను గాని ముందునే. 54

తే. అనిన గురుఁ డిట్టు లను నది యటు లైన
నాశ్వయుజమాస మా సత్రియాగమునకు
మొదలు వెట్టుము నీ వైద్యమును విడంగ
వలసి వచ్చు విచారింప వలయు ననిన. 55

సీ. అ ట్లందఱును సత్రియాగ మొనర్ప నే
కగ్రీవముగ నెంచి కార్యకలన
నవధానిపరిభృతు లాయాచోటులకు నేగి
పను లన్నియుం దీర్చుకొని పదపడి
నవరాత్రములకు మున్వారు నెట్లారు మం
డలమునఁ దుంబూరు నామపురికి
నరిగి యచ్చట సత్రమందుండి సత్రయా
గమును బ్రారంభింపఁగాఁ గడంగి
తే. భక్తబృందమునకు మహాభాష్యపాఠ
నిర్వచనము సేయుచు నుండు నిత్యసత్య
వచనరచనలు సల్పుచు వచ్చి పోవు
వారి కాసత్రయాగము వరద మయ్యె. 56

సీ. ఆసత్ర మానంద మనుభవించుటకు సా
ధనమై ప్రవర్తిల్లె ననుట నిజము
రసనేంద్రియమునకు శ్రవణేంద్రియమునకు
నేత్రేంద్రియమునకు నియతవృత్తి
పొనరించు టానందజనక మానన్దైధ్యా
నమునందుఁ గొంతకాలము పురాణ

మున గొంతకాలము సుసంసంబుసం గొంత
కాలము స్తుతిఁ గొంతకాల మొప్ప
తే. భక్తు లర్చన యొనరించి భక్తిపరత
నీశ్వ రారాధనము చేసి యిహము పరము
పొందఁ జాలుదు రని శ్రుతుల్ పొగడి చెప్పఁ
గాన నాసత్ర మున్నత మౌ నటం చను. 57
ఉ. కొందఱు కర్చనల్ మఱియుఁ గొందఱకుర్ భజనప్రవృత్తియుర్
గొందఱకుం బురాణములు గొందఱకుం బరమోపదేశముర్
జెందమునర్ మురం బమఁ గడిందిగ సత్రము జూడ వచ్చువా
రందఱు నన్నిచందముల నాపసంబుల నొంది రిష్టతర్. 58
ఉ. వాలుగఁ బర్ణశాలలు సువర్ణముఖీతటమందు మెండుగా
నాలుగు దిక్కులందు మఱి నాలుగు మూలలయందు బుత్విజుల్
నాలుగుజాముల న్విడ కనారత మందు వసించి సత్క్రియల్
పోలఁగఁ జేసి రొప్పు నటు పూర్ణవిధుల్ విశదుండు నట్లుగర్. 59
తే. నడుమ వైశాల్యముంగల్గి నాల్గు తట్టు
లందు జరిగెడి సత్క్రియ లరయుటకును
ప్రేక్షకుల కింపు నింపెడువిధ మొసంగఁ
గట్టి రటఁ జతుశ్శాలను గను ముదమున. 60
తే. యాగశాలయు జపశాల యోగశాల
వేదశాల భజనశాల వివిధసత్పు
రాణశాలయు సంగీతరమ్యశాల
లోను గాఁగల శాల లాలోన నయ్యె. 61
సీ. మును సత్త్రయాగముల్ మునులు చేసిరి వేన
వేలేండ్లు దీక్షనై విధివిధమున
దాన జగత్సృష్టి హీనమై పోవ మ
హావ్రతంబులు చేసి రపుడు జ్ఞప్తి
కట్టి మహాదీక్ష లా వ్రతంబులు లేవు
గాని వత్సరదీక్ష లౌ నిపుడును

సూర్యోదయంబు నాది సూర్యోదయము దాక
సత్త్రియాగక్రియల్ జరుగు నందు

తే. మొదలు పెట్టిన జపతపోముఖ్యము లవి
విడక సతతము సర్వదిగడియలు నల
జరుగుచుండును భోజనశాలలందు
మూడు ప్రొద్దులు దొరకును భోజనములు. 62

తే. అచట శాలాముఖంబున నుండు నపుడు
నపుడు నడచు విశేషము లఖిలజనుల
కెఱుక పడునట్లు పత్త్రము లెపక మొగల
వ్రాసి ప్రకటింపఁ బడుచుండు నహరహమును. 63

సీ. అగ్నిహోత్రములందు నచట ఋత్విక్కులు
స్వాహాది హోమముల్ సలుపుచుండ్రు
సామాది వేదముల్ సతతపారాయణ
మొనరించుచుండ్రు విప్రోత్తము లట
సూర్యనమస్కృతుల్ శుభనవగ్రహజపం
బులు వేదమాతృకాముఖ్య మంత్ర
జపములు గీతాదిసద్గ్రంథ పారాయ
ణములు భాగవతాదికములు మఱియు

తే. భజనములు గానసభలును భక్తిభరిత
హరికథలు మేళతాళముల్ సరసవాద్య
ములును వీణాదిజంత్రముల్ సలలితముగ
జరుగుచుండు నజస్ర మా సత్త్రమందు. 64

తే. పలు తెఱంగు లుపన్యాసములు నొసంగి
జనుల మదులను గఱఁచెదు సాధుజనులు
సకలసుజనాభివంద్యులై సత్త్రశాలఁ
గాన వత్తురు పెక్కు రక్కాలమందు 65

చ. ప్రతిదినమున్ వినోదములఁ బర్వఁగఁ జేయుచు వేషగాండ్రు ప్రా
కృతగతిఁ బెక్కు వేషములు నేర్పడ వేయుచుఁ బ్రేక్షకావళిన్

గుతుకనునందుఁ గూర్చుచున్న గొంచెము గానివిలాసనైఖరిన్
సతతము సంచరింతు రట సత్త్రిమహాగ్రహాసీనులంచునన్. 66

తే. సతతమును వచ్చి పోయెడుజనుల గోడ
వించి లోనికిఁ గొనిపోయి వేసి వేనిఁ
జూడ నానంద మూ వారిఁ జూపి సంపి
వేయుచుందురు వాలంటీర్లు పాయు కచట 67

ఉ. జోలెలు గట్టి బియ్యమును జొన్నలు చోళ్లును బప్పు నుప్పునన్
బాలును బంచదారయును బల్లెలనుండియు నాళ్లనుండియున్
జాలుగఁ దెచ్చి నిచ్చలును సత్త్రిగృహంబునఁ జేర్చుచుందు రి జం
ఘాలుర మై తదీయులగు నొకపకార్యవహుల్ ప్రియంబునన్. 68

వ. అట్లు సత్త్రియాగంబు ప్రవర్తిల్లుకాలంబున నొక్కనాఁడు. 69

—♦ గోపాలరావు నూతిలోఁ బడుట ♦—

శా. అమ్మాణమ్మతృతీయ పుత్త్రుఁ డగుచున్ హర్యాందుగోపాలరా
వమ్మె నేమ మొసంగఁగా పిడిచి యాహారంబు ముద్ద్వాద్దు కన్
సమ్మోదంబున దేవతార్చన లటన్ సర్వాత్మ తోఁ జేయుచున్
నెమ్మిన్ మెచ్చ గురుండు భూమణుఁడు నిర్ణిద్రానుకంపామతిన్. 70

తే. అచట సత్రియాగ మొనర్ప నైనకొన్ని
నాళులకు నొక్కనాఁడు గోపాలరావు
నీళ్ళు చేదుచు నూత గుభిల్లు మనుచు
ధ్వాన ముదయించి నలుగడఁ బర్వఁ గూలె. 71

ఉ. అప్పుడు చెంత నున్నజను లాఘణిభూమణుఁ డున్నచోటికిన్
జప్పునఁ బోయి యమ్మణమనందను డందఱు చూడ నూతిలో
నిప్పుడ కూలె నోప్రభువ! యేమి పొనర్తుము ప్రాణరక్ష యే
చొప్పున నయ్యెడుం దెలుపఁ జూడుము నావుడు భూమణుం డనున్.

శా. ఆపద్బాంధవుఁ డైన శ్రీహరి కృపన్ బ్రాణంబు గాపాడఁగా
నీ పట్లన్ గనుపట్టకుండఁడు భయం బేగన్ హరిన్ వేఁడుఁ డీ
గోపాలున్ బ్రదికింపుమంచుఁ జనుఁ డాకూపాంతికంబందు కో
నాపై భారవహుండు దేవుఁ డని మీ రాశించు చుండన్ దగున్.

క. అని చెప్పి పుచ్చి వారల
ఘనుఁ డాఫణిభూషణుండు కడుభక్తి మెయిన్
వినుతించె లోకరక్షకు
మనమున నిడి కొలుచు నిట్లు మఱి మఱి మఱియున్. 74

మ. జనసంఘంబునకున్ శివం బొదవ దేశక్షేమమున్ గోరి మే
ము నిరుం గొల్వఁగఁ బూని రాఁ గిటు లోభూదేవతారాధ్య ని
శ్చనిశంబున్ భజియించు బాలునకు బ్రాణాపాయమై పోవ నా
తని ప్రాణంబులు నిల్పి కాచుటకు నిన్ ధ్యానించి ప్రార్థించెదన్. 75

వ. అని ప్రార్థించుచుండె నాసమయంబున గోపాలుండును. 76

మత్త. నూతిలోఁ బడి మున్గిపోవ ఘనానభక్తియుతాత్ముఁడై
యాత గొబ్బఁగ లేనివాఁడయి యీశ్వరున్ నుతియించుచున్
శ్వేతతల్పమునందు బండిన చెల్వుగాం బడి నీటిపై
నాతఁడిన్ శయనించి యుండె మహాప్రభూ ! యని పల్కుచున్. 77

వ. అంతలో నింటి పరివారగువారు వచ్చి నూతిలో నారాయణ స్మరణం బొనర్చుచుండు వానిఁ బైకి తీసి కృష్ణభూషణునికడకుఁ గొనిపోయి రతండుఁ నతనిశిరంబున గరంబు వెట్టి దీవించి దేవతార్చనమ్ము జేయం బొమ్మని నేఁడు నీ చిత్తం బన్యాయత్తం బగుట నిట్లయ్యె నిఁక నట్లు కాకుండు మీశ్వరుండు నిన్ను రక్షించు నని యంపి పుచ్చె నంత మఱియొకదినంబున నవధాని గురువర్యుం గాంచి యిట్లనియె.

— భూషణస్వామి భిక్షాటనము —

తే. నాఁడు నాఁడును భిక్షాటనమున మనకుఁ
బ్రాప్త మగుచుండు ధనముఁ బదార్థములును
సత్రమును నిర్వహింపంగఁ జాలియుండ
దేమి చేయంగ వలయునో యెఱుఁగఁ జెపుడ. 79

చ. దినదినమున్ సమీక్షకులు దేశము దేశమునుండి వేనవేల్
మనసవనంబుఁ జూచుటకు మానక వచ్చుచుఁ బోవుచుండి రేఁ
గనుఁగొనుచుంటి నెల్లరు నిఁకన్ భుజియించుట లెట్లు సాఁగెడిన్
ధనము ప్రధాన మన్నిటికి దైవలలామ యెఱుంగఁ జెప్పితిన్ 80

తే. అనిన గురుఁ డను నీ వనునది యథార్థ
మర్థము ప్రతిభాస మన్నింటి కని మొఱఁగుదు
నేఁడు కానిమ్ము మఱునాఁడు నేను మిమ్ము
గూడి వచ్చెద భిక్షింప నాడ నాడ. 81

వ. అని మరు నాఁ డరుణోదయంబున లేచి కాల్యకృత్యంబుల నిర్వ
ర్తించి నిజశిష్యపరివారపరివృతుండై గురుదేవుండు చుట్టుప్రక్కల
నుండు గ్రామంబుల భిక్షాటనంబు గావించె నప్పుడు. 82

సీ. ప్రతిపల్లియందును బ్రతిగృహంబందును
భూషణస్వామినిఁ బోలఁజూచి
వివిధపత్రిజలు దేవ! విచ్చేయుఁ డని వాని
కర్ఘ్యపాద్యంబులు నాచరించి
మంత్రిపుష్పములతోడ మాడలు వరహాలు
దీనారటంకాలు తెచ్చి యిచ్చి
పప్పు నుప్పును బియ్య మొప్పుకూరలు గోత
ములు నిండఁగాఁ బోసి ముంతఁ బెట్టి

తే. మంగళారతు లిచ్చియు మఱియు మఱియుఁ
గానుకలు పెట్టి పూజించి కడు నుతించి
గ్రామములు లవెల్ల నుత్సాహకలితము లయి
నాఁగనంపిరి భూషణస్వామి నపుడు. 83

తే. పల్లియలనుండి ప జ గురుతల్లజు వెను
వెంటఁ బడి వేనవే లయి నడలు చుండ
భూమి యూఁగినదో యను పోల్కి నపుడు
కనఁగ వచ్చెను జూపఱు కన్నుఁగవకు. 84

మ. పరివారంబులు చుట్టువారు కొని తేవన్ స్తోత్రపాఠంబులన్
బరిపూరింపఁగఁ జేయుచుండ భజనల్ పాత్రింతంబులన్ గ్రామ నా
పురవాసుల్ పరిచర్యలన్ సలుప సమ్మోదంబు సంధించుచున్
గురునాథుండు సశిష్యుడై నడచెఁ గోర్కుల్ మీఱఁ దుంబూరునన్.

క. వెనువెంట స్వస్తి చెప్పుచు
మునితుల్యులు విప్రులెల్ల ముద మెదఁ బొడలన్

ఘనుఁడౌ నాగవిభూషణు
వినుతించుచు వచ్చి రపుడు వేడుక మీఱన్. 86

తే. పూలు పండ్లును పసుబండములును గలుఁగు
పెందుకాణాలు నాయని పేటనుండి
వచ్చి తుంబూరతఁగుసత్రిభవనము కడ
నిలిపి రెంతయు సంతోష విలసముగను. 87

క. అయ్యొక్కనాఁడు గూడిన
బియ్యము నెయ్యియును పప్పు వివిధపదార్థం
బయ్యాగ మాఱుమాసము
లెయ్యెక్కటు లేక నాఁగ నేర్పడెఁ బేర్మిన్ 88

—• స త్త్రిమున నతిది సత్కారము •—

చ. అచట మహానసంబుల నహర్నిశముం బచనాగ్ని సేవలన్
బ్రచురము గాఁ బొనర్చుచును వంటకముల్ బహుళాన్న రాసులన్
శుచి యగుచోటఁ జోయుదురు చూపఱుమెచ్చఁగనంతయన్నముల్
సుచరితు లెల్ల వారలకుఁ జొప్పడఁ బెట్టుదు రట్టి పట్టునన్. 89

క. ముప్పొద్దు భోజనం బని
చెప్పుటయే కాని యచటఁ జేరుజనుల కె
ల్లప్పుడు బెట్టుచునుందురు
ముప్పాతిక మూడువీసములు రేఁ బవలున్. 90

సీ. అన్నశాలలయందు నన్నంబు వడ్డింతు
రతిథు లౌవారల నాదరించి
యది యేమి యిది యేమి యని యడిగినవారి
కిది యిట్టి దని కొంద ఱెఱుక పఱతు
రీరేయి నిట నుందు మే మనువారికిఁ
బడక లాశాలలలో పరుపఁగూర్తు
రెది యెవ్వ రడిగిన నదివారికిం దెచ్చి
యింతలో నిడుచుందు రికొంతమంది

తే. ఎవరి కేలోపమును రాఁగ నీయకుండ
సత్క్రియాగ మొనర్చు నాసమయమందు
భూషణస్వామి యాజ్ఞచే నాశ్రితకోటి
లైనవారెల్ల సేవ చేయంగ నైరి. 91

— భూషణస్వామి చర్యలు —

సీ. హోతల కిట్లు హోమమార్గముల్ సెప్పు
వేదముల్ చదువు ఋత్విజులతోడ
గ్రహముల నర్చించు గతు లిట్టివని చెప్పు
సూర్య యంత్రంబిటి చొప్పయనుచు
మను బీజముల లోని జను ప్రభావముఁ జెప్పు
గీతా మహత్త్వము ప్రీతిఁ జెప్పు
భాగవతంబున భగవంతు నెఱిఁగెడు
పథ మొక యింపులో పలుకఁ జెప్పు

తే. గానసభలకుఁ జని రాగ గతులు సెప్పు
వేణు వీణాది జంత్రముల్ విశద పరచు
సకల విద్యా విశారదుఁడై వెలుంగు
భూషణ స్వామి జనుల కౌతుకము దోఁప.

చ. అపుడపుడున్ మహానసము నందు నొకింత వంట గాని చో
నపుడట కేగి కన్నెఱ చుసంతటి లోపల శాక పాకముల్
సుపరిచితిం బొనర్చు మఱి చూచుచు నుండఁగ వడ్డనంబు న
ప్డపుడును జేయుచుండు నమృతాఖ్యమహామునిముఖ్యుఁడత్తఱిన్ 93

ఉ. వంటక మింతయై కుడువ వచ్చిన వారధికంబుయైనచోఁ
బంట వలంతినిన్ దలఁచి భావమునం దలభూషణుండు చే
నంటి తదన్న రాశి పయి నప్పలు చల్లి సమంత్రకంబుగా
వెంటనె వడ్డనల్ సలుప వేడ్క వచించును హెచ్చు నన్నముల్. 94

ఉ. భాగవతంబు చేతఁగొని పండితు లెల్లరుఁ బ్రక్కనుండి యి
చ్ఛాగతి నాలకింపఁగ బ్రజల్ చను దెంచి వినన్ బ్రియంబునన్
యోగి వరేణ్యుఁడా ప్రభుపనూన విధంబునఁ దత్త్వ మార్గమున్
బాగుగ విస్తరించి నుడువంగలఁడై ప్రభఁ గాంచు నెంచఁగన్ 95

మ. అవధానం బొనరించువారలకు రా నా భూషణస్వామి యీ
యవధానుల్ కవితావిశారదులు కానన్ జెప్పి కాపాడుచు మీ
యవధానం బెటువంటిదో తెలుపుఁ డీ యన్యాయ మంచు భావించుచున్
సవిమర్శంబుగ వారినిం దెలిసి యిచ్చున్ మెచ్చు సర్వేళలన్. 96

సీ. శాస్త్రవాదంబులు సలుపుచు శిష్యోత్త
ములకు బహుమతు లిచ్చు సుకవులఁ దగఁ జూచుఁ
ఘనులను రక్షించి కవితార్థగోష్ఠులఁ
గావించు చుండును గౌతుకమున
విప్రవినోదుల వేడ్క రక్షించి త
ద్విద్యావినోదముల్ దెలిసి మెచ్చు
నాగస్వరమున విన్నాణ మొకింత చూ
పెడువాని మెచ్చి యిచ్చును గడుధనంబు

తే. నతిథుల సమాదర మొనర్చు సత్కృపాశ్వ
జనుల నందఱఁ బిలిచి తా ననునయించి
మంచిమాటలు చెప్పి తన్మనము లలర
సలుపుచుండును భూషణస్వామి యపుడు. 97

సీ. అనుదినమున్ వచ్చునతిథుల నాదరిం
పఁగఁ బుచ్చుఁ గొందఱఁ బ్రజ్ఞ మెఱయ
దినము వచ్చుపదార్థమును జూచి కాపాడ
నియమించుఁ గొందఱి నేర్పు మీఱ
ఋత్విగ్గణంబు లే మేమి చెప్పిన నెల్ల
నొనరింపఁ గొందఱి ననువుపఱచు
సత్రశాల జనాళి సంరక్షణ మొనర్పఁ
గొందఱి దక్షులఁ బొందుపఱచుఁ

తే. బ్రతిదినంబును వచ్చెడువసుచయంబు
నొక్కచోఁ జేర్చుకొని వ్యయ మొనరుచుటకు
దంటల న్నిల్పుఁ గొందఱి దంటువంశ
భవుఁడు సుబ్బావధానితోడ్పాటు గలుగ. 98

మ. కనకాంబాసతి తోడఁ బుట్టువగు సత్కాంతామణి పుత్త్రులున్
మనసుజ్ఞాఖ్యవధానియు న్మఱియుఁ దన్మాన్యానుజుల్ బంధువుల్
ఘనులున్ మిత్త్రులు భృత్యులుం బెరలు వేడ్కన్ సత్త్రయాగంబునన్
ఘనులై కార్యభరంబు పూనఁ కొనసై కన్పట్టి రప్పట్టునన్. 99

ఉ. ఎందఱొ పండితప్రముఖు లెందఱొ సత్కవిరాజచంద్రు లిం
కెందఱొ భూసురప్రవరు లెందఱొ యోగికులాగ్రగణ్యులిం
కెందఱొ భూతలాధిపతు లింకను నెందఱొ వైశ్యసత్తముల్
సందడి గాఁగ వచ్చి రట సత్త్రముఁ జూడఁగ సంతసంబునన్ 100

మ. కనకాంబాసతి తన్మహోత్సవమునం గాలేజికిం బోకయున్
విని వృత్తిం గొని తుంబురుగానమనఘ యనకున్ విచ్చేసి తత్సత్త్రముం
గొనసాగించె గురూత్తముం గొలుచుచున్ గోర్కిం దయార్ద్రవృత్తిం
గొనసై సజ్జనగోష్ఠుల న్మెలఁగుచున్ గుర్వర్థమర్పించుచున్ 101

ఉ. కమ్మనిహోమధూమ మటఁ గాప్రలెదు వారల మేనఁ దాఁకి నే
త్రమ్ములనుండి శోత్రత్రములదారులనుండియు ముక్కుపుటమ్ము మా
ర్గమ్ములనుండి లోనికి నిరంతరముం జని కల్మషంబు స
ర్వమ్మును బాపునట్టి దయి శాంత మొసంగును సత్త్రవాటికన్. 102

తే. అచట నాల్గును నాల్గు రెం డైదు రెందు
గతులుగా హోమముల్ సేయుకాలమందు
నిందచంద్రాది దేవత లేగుదెంచి
హవ్యములు స్వీకరించెడు నట్లుదోఁచు. 103

స్రగ్ధర
సీతారామాంజనేయాంచిత మగుకృతినిం జేతఁ గైకొంచు లోకా
తీతౌజస్సారుఁడున్ సద్వినుతుఁడు ఫణిరాడ్దివ్యభూషుండు పల్కెన్
సీతారామాంజనేయుల్ చిరకరుణ నటన్ జేరి మాటాడి నట్లై
చేతఃప్రీతిన్ ఘటించున్ శ్రితజనులకటన్ జిత్సుఖంబుప్పతిల్లన్.

మ. ప్రతిఘసప్రంబును వచ్చిపోవుచు నటన్ వ్యాపారమున్ సల్పుచున్
స్తుతులం జేయుచునుండుఁ బ్రేక్షకులయున్ సోమస్థితార్త్విగ్జనో
న్నత సామాదిరవంబు తూర్యనిచయానంతస్వనం బేకసం
యుతమై జానుగుల న్పడుం దగ సతం బోంకారనాదం బటన్. 10

— మాయాపుల్కసునిచరిత్రము —

తే. అట్లు పవనము జరిగెడునప్పు డొక్క
వాఁడు రాతిరి మూఁడుజాల్ గడచుటయును
బుల్కసుఁ డొకండు శ్రీకృష్ణభూషణుండు
పదముకొని యుండు చోటికి వడిఁ వచ్చె. 105

చ. ప్లుతిరవ మేర్పడంగ ఫణిభూషణమూర్తి! మహేశ్వరా! యొకల్
చితికినవాఁడఁ బుల్కసుఁడఁ జిచ్చువలెన్ క్షుధ చుమ్మ చుట్టి లో
నతికి కొనెన్ సహించుటకు నైన కొనక యింత పనాద మిష్టగా
గ్రతికను వేఁడి నిడఁగఁ గోరుచు నుంటిని మేను నిల్వఁగన్. 107

ఆ. మూఁడు నాళ్ళనుండి బుక్కెఁడన్నము నాకు
దొరక లేదు నాల్క యెట్టిపడియె
మేను నిలువ దింకఁ బ్రాణరక్షణముగా
వించి నన్నుఁ బ్రోవ వేఁడుచుంటి. 108

వ. అని యుచ్చైస్స్వరంబున బలికిన పలుకు లాలకించి శయ్యాగతుం డగు భూషణుం డులికిపడి లేచి వానికడకుం జని యిట్లనియె. 109

ఆ. వంటకంబు నిల్లె వంట పాత్రిల వెల్ల
బయట వైచి రిపుడు భక్తమెట్లు
వచ్చు నదిగో తెల్లవారు నొక్కింతలో
వండి నీకుఁ గడుపునిండ నిడుదు. 110

మ. అనినన్ మాలఁ డొకింతసే పయిన నాప్రాణంబు నిల్వంగఁ బో
దని సత్యంబు వచింతు సామి! యెట నే నాపాత్రలం దింత మా
డిన దైనన్ పసిమైన దైన నొకమాడ్కిం గల్గినేఁ జూచి నా
చదుజీవరంబులు నిల్వఁ బెట్టఁ గదవే శ్రౌతదేవతావల్లభా! 111

వ. అనిన నమృతానందుండు వెండియు. 112

ఆ. అంట్లలోన నుండ దణుమాత్ర మన్నము
పండ్లు నిత్తు దినుము బ్రదుకుపోంట
వేఁగుచుక్క పొడిచె నేగుదెంచెడి సూర్యుఁ
డిదిగో వంట చేసి యిడుదు నీకు. 113

వ. అనుచు నమ్మూర్ఖుండు పుల్కసునితో. 114

చ. అనఁటులు లోనిపండు లవి యాఁకలి దీర్పఁగఁ జాల విట్టివో
దిన నవి కుట్లు వచ్చు నని దేవరకు న్వినిపింతు నట్టులే
జని కని ర మ్మొకింతయిన సామికటాక్ష లభియింప కుండ దో
మునివర ! యన్న నాగవరభూసురుఁ డేగెను వంటయింటికిన్. 115

ఉ. దీపము వెట్టి నల్గడల దివ్యతరం బగుదృష్టి పెంపునన్
జాపలకింద బిందియలసందున మూలలఁ బొర్లియ్యచాటునన్
దాపటికంపుఁ జోటులను పచయుఁ గన్గొని లేమి నార్తుఁడై
శ్రీపతి నెంచుచుం జనియెఁ జెప్పరు బోళ్ళవి యున్నచోటికిన్. 116

మ. ప్రతిపాత్రింబును బట్టి చూచి యొట నేపాత్రింబునం దన్నపు
న్మెతు కొక్కండును గానరామి మిగులన్ విభ్రాంతుఁడై మట్టిలో
నతుకం బోయినపాత్రిలో నడుగునం దత్యంతము న్మాడి నీ
ళ్ళతడిం గూడినముక్కఁ గాంచి వగ పుల్లంబందు సంధిల్లఁగన్. 117

తే. చేయునది లేక పాత్రిముఁ జేతఁ గొనుచు
మాలచెంతకుఁ జనుదెంచి మాడు గాని
మక్కి గాని లేకుండె నేమాడ్కి నీదు
నాఁకలి శమించునో తోఁప దక్కటకట! 118

వ. ఇదిగో చూడు మంచును దాని నెదుటం బెట్టె. 119

క. అతఁడు దానిం గని నీ
పీతటి లే దంచుఁ బలికి తే మందు నినుః
బూతికిఁ జాలినయన్నం
బీతపెలం గలదు చూడు మిదిగో యనుచున్. 120

వ. భూసురుండు చూచి విభ్రాంతుపడి పాత్రింబు వానిపాదంబులకడం
బెట్టి చేతులు జోడించుకొని ప్రణామంబు గావించి యి ట్లనియె. 121

ఉ. మాలఁడ వీవు గా వరయ మాధవమూర్తివి నన్నుఁ బ్రోవ నా
పాలఁ బ్రసన్నచిత్తమున వచ్చితి విట్టులు పుల్కసాకృతిన్
బాలిశుఁడన్ నృశంసుఁడను భావవిహీనుఁడ ని న్నెఱుంగఁగాఁ
జాలనివాఁడ నైతి నెద నైపవె నాదగుతప్పు గోపప్రభూ ! 122

చ. సనకసనందనాదిమునిచంద్రుల కైన నసాధ్యమైన నీ
ఘనతరదర్శనం బిప్పుడు గంటిని ధన్యుఁడ నైతి నా కులం
బును గడుధన్యమయ్యె నను బోలినవాఁడు ధరాతలంబునన్
జనుఁ డొకఁ డుండు లేఁ డనుచు సంతస మందుచు నుంటి నో ప్రభూ.

క. అనుచుం బలుకుచు నుండఁగఁ
గనులకు మిఱుమిట్లు గొలుపుకరణి మెఱయుచున్
వనజాక్షుఁ డగుచుఁ బుల్కసుఁ
డనుభావముఁ జూపి చనియె గగనపథంబున్. 124

వ. భూషణుండును సంతోషసంభ్రమాశ్చర్యదుఃఖంబులు మనంబునఁ బెనంగొన నున్నవాఁ డన్నటయుండి యోగేశ్వరేశ్వరు నంతరంగం బునం దిడుకొని యోగానుసంధానంబు గావించె నంతలో సూర్యో దయం బగుటయు సుబ్బావధానిప్రభృతులు వచ్చి యేమియు నెఱుం గనివారై యతనిం బరివేష్టించి కొలిచి రంత. 125

తే. భూషణస్వామి యది మొదల్ మూఁడునాళ్లు
నిద్ర నీళ్లును దిండియు విడిచి మౌన
ముద్ర ధరియించి యొక్కచో మోడ్చి కన్నుఁ
గవను గూర్చుండి సద్ధ్యానకలితుఁ డయ్యె. 126

—• కుహనాజనక వృత్తాంతము •—

ఉ. వేపి యొకండు భూషణుని వెంబడి రాఁగ నతం డొకప్పు డా
బాపలు బానసంబునను బంక్తులు దీరి భుజించుచుండఁ గా
నోపి పరిభ్రమించునపు డొకఁడు వచ్చెడుకుక్కఁ జూచి ఛీ
పో పద మంచుఁ గొందఱనఁ బోయె నదృశ్యమయై వెఱుంగుగన్.

ఆ. సవనశాలలోనిసామముల్ హోమముల్
ముందుఁ దవులనున్న భూషణార్యు
శాలలోనజరుగు చందమునం దోఁచు
నొక్కొకపుడు ప్రజల కక్కజముగ. 128

—• భూషణుఁడు వృష్టినాఁగుట •—

ఉ. పందిరిక్రిందఁ బంక్తులయి బ్రాహ్మణవర్యులు వేగురొక్కనాఁ
డందు భుజించుచుండఁ బ్రళయంబని తోఁపఁగ వచ్చు నట్టు ల

య్యంగదలు లేచి పోవు గతినై పెనుగాలియు వాన రాఁగ నా
నందమయుండు భూసురుఁడు నవ్వుచు రా దని పల్కె నంతటన్ 129

ఆ. కొండ పెల్లగించు ఘోరవాయువు కుండఁ
గుమ్మరించు నట్లు కురియు వాన
యింతలోన నణఁగ నెల్లను లేవక
తృప్తిగా మొసంగి రెలమి నపుడు. 130

వ. మఱియు నొకప్పుడు. 131

సీ. ఇండ్లకప్పులు నింగి నెక్కి దిగ్దేశముల్
బడిపడిగా దిసగాడి పడినవయ్యెఁ
బెనుమ్రాఁకు లవి తునాతునియలై పడి దారి
యును దెన్ను లేకుండునోజ కయ్యె
సర్వోధరము లెల్ల నుఱ్ఱూఁత లూఁగ నై
పడఁ గూలునో యన కడిమి నయ్యె
నిసుము కంకరలతో వెస లేచి నెలుఁగుల
దోరఁ గప్పి ధర నిండఁ గరల నయ్యె
తే: ఇసుములతో జాలతో ముండ్లకసువుతోడ
వఱలు నేలలు చిందరవందర లయ్యె
నెన్నఁగొండము లన ధార లేర్పడంగ
వర్షమెంతయు వింతగా వఱ్ఱువాఱె. 132

ఉ. తుంబురు గ్రామమం దపుడు తోఁపగ వచ్చెడు నెల్లవారు నా
డంబర మెచ్చి పెచ్చయి వడంకు జనింపఁగఁ జేయుగాలివా
నం బడి వంటకంబుల నొనర్పఁగఁ జాలనివార లై యుపా
సంబుననుండియుం బ్రతుక సందియమందుచు నుండిర య్యెడన్.

తే. దేవళంబులతలుపులు తెఱవ లేదు
గృహములం దగ్ని వెలుఁగదు గేహము లవి
మూయఁబడి యుండె నప్డు తుంబూరులోన
జనులు వసియించుచున్నట్లు గనఁగ రాదు. 134

సీ. శీతసన్నిధి యథావిధివిధంబునఁ గస్న
హాసప్రసామార్చనాద్యఖిలవిధులు
పంచాయతనపూజ వరజపతపసుః త్రే
కాదశవారరుద్రాభిషేక
మర్చనమస్కృతుల్ శర్కరాపూపనై
వేద్యముల్ హృద్యముల్ ఖాద్యము లసు
బాలుమీఁగడలును బవళింపు సేవలు
నాఁడు నాఁడును బలె నడచె నాఁడు
తే. భాష్యపఠనప్రవచనము భాగవతము
నమృతనాథుని బోధముల్ విమలశాస్త్ర
చర్చలును జీవయాత్రావిచారములును
విడువ కాగాలివానలో నడప నయ్యె. 135

—: జీవ దేవ ప్రశ్నము :—

వ. ఇవ్విధంబున సత్సంయోగంబు సాఁగుచుండ నొక్కనాఁ డుదయంబున భాష్యకాలక్షేపం బగుచుండ నాయనిపేటనుండి రాఘవార్యుండను నొక్కయుద్యోగి వచ్చి యెల్లరు వినుచుండ నమృతానందనాథునిం గాంచి జీవుఁ డెవఁడు దేవుఁ డెవఁడు జీవునకు దేవునకుం గలసంబంధం బెట్టిది వినవలతుం జెప్పుమనిన నతం డందఱు విన ని ట్లనియె. 136

సీ. ఇట రెండు రెం డెల్ల రీప్రశ్న మరయ నెం
తయును బెద్దది దీనిఁ దగినయట్లు
చెప్పి సమాధాన మొప్పింపఁగా నగు
నంతవఱకు మీర లన్నపనులు
మాని సత్యాన్వేషణానూనచిత్తులై
శ్రద్ధమై విన నొప్పు శాస్త్రఫణితి
నపుడు కొందఱు వంట నాచరింపఁగ నైరి
కొందఱు పూవులు గోయఁ జనిరి
తే. కొంద ఱాపగ కరిగి నీ రొంచు రాఁగఁ
జనిరి కొందఱు దేవపూజను బొనర్ప

నరిగి రిట్లున్న శక్తుల నందఱు నట
నిలువఁ గాఁ జెప్పి యి ట్లని పలికె నతఁడు. 137

మ. పరమప్రాప్యము ప్రశ్న మిద్ది వినుఁ డీపంతుల్ ననుం బల్కె నే
నరుదారన్ సరి దాఁకఁ జెప్పవలెనం బ్రారంభ మెద్దేని యె
వ్వరునుం జేయక యుండుఁ డద్వైతక నే భక్తంబుఁ జేకోఁ దగున్
బరిషత్స్థానము చేర రం డనుచు సంభాషించినంతం జనుల్. 138

వ. అమృతానందుం బరివేష్టించి కూరుచుండి రప్పు డారాఘవా
ర్యుండు లేచి చేతులు దోయిలించుకొని యి ట్లనియె. 139

శా. అయ్యా! నాకు గమింప నయ్యెడిని న్యాయస్థానమ్ముం దయ్యెడన్
వెయ్యేఱుల్ వెల సేయుకార్య మొకఁడై వేధించుఁ జిత్తంబు నే
నయ్యాకార్యములం దగుల్కొని యెడన్ వ్యాహారముల్ సల్పుచున్
నయ్యాటల్ పొనరించు చుండుటకునై చాలన్ గటాక్షింపుఁడీ. 140

తే. మఱియు నొక్కప్పు చనుదెంచి మాన్యులైన
మీకడన్ నాదుసందేహ మాఁక లేక
తెలిసికొని పోవ నెంచితిఁ దేరి నన్ను
సాఁగ నంపంగఁ బ్రార్థింతు సన్నుతాత్మ. 141

తే. వేడ్కమై నేను నాయని పేటనుండి
వచ్చితిని సత్ప్రయాగము మెచ్చు వినుచు
నిపుడు జిజ్ఞాసమొయిఁ బ్రశ్న మిట్లు చేసి
నాఁడను జీవ గా దని నాదుమనవి. 142

సీ. అనుడు భూషణుఁ డను ననఘ! నీవగుప్రశ్న
మున కుత్తరము పొంది పోవ నొప్పు
"సంశయాత్మా వినశ్యతి" యనుటం జేసి
సందేహయుక్తుఁడై చచ్చె నేని
జన్మకారణ మగు సన్నిహితము మృత్యు
వని పను లన్నియు నవలఁ ద్రోచి
నేఁ డిట నుండి రే పాడకుం బోనగు
ననినఁ గా దని రాఘవాహ్వయుండు

తే. చనియె భూషణమూర్తి యవ్వేనుక నచట
నందఱుకును జీవేశ్వరైక్యస్వభావ
మెఱుఁగ బోధించి పిమ్మట మృత్యుతత్త్వ
మంతయును జెప్పె నీరీతి శాంతమతిని! 143

— మృత్యుతత్త్వము :—

తే. మృత్యుతత్త్వ మెఱుంగ నా మృతిని నూఱు
వర్షములు మని పొందినవాఁ డకాల
మరణమును బొందినట్టిఁడె సురుచిరుగ్రి
హాయును గైకొని యానంద మనుభవించి. 144

తే. అంతలో మృతి నొందినయట్టిపురుషుఁ
డరయ మృత్యుంజయుఁ డన నగును మృత్యు
వెప్పటికి నేని తప్పనిదే నిజంబు
కాని తద్గతి తెలియుట కష్టతరము. 145

సీ. అనివార్య మగుమృత్యు వనవరు బ్రతికార
మొనరించు కొన లేఁడు జనుఁడు జడుఁడు
వగచు దానికి రేపు వచ్చెడు నురి యని
తెలిసియారే యెంతో కలవిలపడు
తినఁడును జాగ్రవఁడు తనుకఁడు బిడ్డల
ముద్దుముచ్చటలకు ముఱియఁ బోఁడు
చెలితోడ మాటాడఁ దలఁపఁడు మఱి సర్వ
మున కేవపడుచుండు మనమునందుఁ
తే. గాని తనన్యాయవాది యేకరణి నైనఁ
జేసి యురిశిక్ష తప్పింపఁ జేయు నేమొ
యనుచు నువ్విళులూరుచు ననిశ మదియె
తలఁపు చేయుచు నుండును ధ్రుఁపఁ డొందు. 146

సీ. రామకృష్ణాదుల కే మృతి తప్ప లే
దెందఱో మఱికంటిమెదుటఁ బోవ
నరసియు "జాతస్య మరణం ధృవం" బని
యెఱిఁగియునుం జీవుఁ డెపుడు నస్వ

తంతుస్రిం డనియుఁ జావఁ దలఁచిన వారికిఁ
జావురాదనియొకరు జాక బ్రతుకు
పై నాస గం వాఁడు బ్రతుకఁ బోఁ డనియును
దెలిసియుఁ దగునట్లు మెలఁగ లేక
తే. ఇట్లుచావునకుం జింత యెపుడు సేయు
చుండునే కాని చావక యుండుటకును
పొసఁగియున్నట్టి మార్గము బుద్ధి నెఱిఁగి
తత్ప్రయత్న మొనర్పఁగాఁ దలఁప రకట. 147
వ. కర్మక్షయంబై ముక్తిలభించుటకు మార్గంబు గలదాకర్ణింపుఁడు. 148
తరువోజ. నేరము లెన్నియేనిం జేసియున్న
నీతిశాస్త్రము శిక్ష నెరపుచు నున్నఁ
బూరుషుఁ డాతండు పోయినయేని
పొందఁడు తన నేరమున కందు శిక్ష
నారీతి గురుకటాక్షాదృతినొంది
నతఁ "డహం బ్రహ్మాస్మి" యని విశ్వసించు
ధీరుండు ముక్తుఁడై తెగఁ గర్మఫలము
తేలు బ్రహ్మానందదీధితియందు 149
తే. నిద్రయును బెద్దనిద్రయు నిశ్చయింప
రెండు దుల్యములే యనుచుండు శ్రుతులు
విధిదిన ప్రళయము నిద్ర పెద్దనిద్ర
యగు మహాప్రళయం బని తగును బలుక. 150
శా. రాగద్వేషములన్ జయించి విమలప్రజ్ఞా పరిభావంబునన్
లోఁ గన్గొంచును మృత్యుతత్త్వమును నిర్గ్లొలాత్ములై జ్ఞాను లా
యోగాభ్యాసవశంబునం దనువునం దొప్పారుజీవాత్మ వే
ర్గాఁ గావింపఁగ నేర్చి మృత్యువు నెదుర్పం జాలి యుం డెప్పుడున్.
తే. వారు కృతకృత్యులై మృత్యుభయవిరహితు
లై ప్రతీక్షింతురి మిత్తిఁ బ్రియాతిథివలె
నట్టియుత్తమపురుషు లీయవనియందుఁ
బరమపద మొంద నర్హులై పరఁగుచుంద్రు. 152

తే. నిత్యసన్నిహితం బయి నిలుచు మృత్యు
వనులకుఁ యుద్ధవీరుఁ డైకొనఁగ వచ్చుఁ
జావు బ్రదు కెప్పు డతని మూశ్వాసను రావ
యతఁ డనుక్షణమును మిత్రి సరయు చుండు 153

ఉ. యోగులు యుద్ధవీరులును నొక్కతెఱంగున సంచరించుచుఁ
యోగము యుద్ధముఁ సలుప నుండి జయంబును గాంత్రు రంతమై
పీఁగఁగ సూర్యమండలవిభేదము సేయుచుఁ దత్ప్రభంబునఁ
బోఁ గలవార లై సువదమం గొనియుఁ సుఖముండు రెప్పుడున్.

తే. రెండువర్షము లీరీతి మెండు కొనిన
వైభవంబులతోడ సాగుచుండు
సత్రియాగము సాగ నాసమయమందు
భూషణస్వామి యుపదేశములు పొసంగె. 155

తే. ఇట్లు పరమోపదేశము లెసక మెసఁగ
భూషణస్వామి చేయుచు భూరిసత్రి
యాగము పొనర్చుచుండినయప్పుడు వచ్చి
రొక్కనాఁడు వర్తకులు కోమటినుండి. 156

మ. అమృతానందమహర్షి బోధనము వా రాలించి సత్రింబునఁ
సుముఖుల్ చేసెడుపూజలఁ గని యటన్ సూర్యార్చనల్ గాంచి గీ
త మహాభక్తిఁ బఠించుచో విని ప్రమోదం బేర్పడన్ వారు స
త్రమునఁ భోజన మాచరించి యవలఁ దర్శించి రాభూషణున్. 157

—• జాతిమతభేదములు •—

సీ. పరమార్థదృష్టికిఁ బరఁగదు జాతి భే
దాదిక మని జీవయాత్ర నుడువు
చున్నది కద మీరు నిన్న నేఁడును జెప్పి
నట్టివిషయములు నట్టివ కద
సన్నిసముం డైన సర్వేశ్వరునకును
బ్రాహ్మణుం డనియును బంచముఁ డని
భేదభావము కల్గఁ బో దని యూహించి
పలుకుట సత్యము దెలుపుఁ గాదె

తే. ఎవరో శాస్త్రములు కల్పించి యిట్టు లందు
మిమ్ము వంచెరు కూడ భేదమ్ము మనము
నందుఁ బాటించుచుండు టర్హంబు గాదు
తెలుప సాహసించితి మేము ధీరవర్య. 158

తే. బ్రాహ్మణులు వ్రాసినట్టి శాస్త్రములె యిట్టి
భేదహేతువులై చాల పృథివిజనుల
నల్లతల్లడ పడునట్టు లాచరించు
చున్న వేమండ్రో వినఁగ మే ముంటి మిపుడు. 159

సీ. అనుడు భూషణమూర్తి యను బ్రాహ్మణాది భే
ద మొకండు మాత్రమే తలఁప నేల
ధనికదరిద్రభేదము స్వామిదాసభే
దమ్ము స్వనీచభేదమ్మును సుఖ
దుఃఖభేదమ్మును దొడరి శీతోష్ణభే
దము లోఁగ నైనభేదము ల వెల్ల
కల్పితము లనంగఁ గలమె కారకులు వి
ప్రు లనంగ మీనాల్క పలుకఁ గలదె

తే. వృక్షశాఖలు మీఁదికి వేళ్ళు క్రింది
కేగు నిత్యాదు లన్నియు సృష్టిభేద
ము లగు వీనికిఁ గారకుం డలరు నొకఁడు
వాఁడు విప్రుం డటంచును బలుకఁ గలరె. 160

తే. వినుఁడు నిద్రించునప్పు డేభేద ముండు
జాతి మత లింగ కుల భేద మాతరుణము
నందుఁ జూపట్ట దానిద్ర యైన పిదప
నెల్లభేదములుం గల్గు నింతలోన. 161

ఉ. జాగ్రదవస్థయం దితఁడు స్వామి యితండు భటుం డితండు నా
యగ్రజుఁ డీతఁ డయ్యొ యితఁ డాప్తుఁ డితండు పరుం డటంచు లో
నిగ్రహ మాగ్రహంబు గమనింపఁగ వచ్చెడు నిట్టిభేద మీ
వేగ్రహసంవిధానమున నేర్పడెనో గమనింపఁ గోరెదన్. 162

ఆ. నిదురలోన లేవు నీదు నీభేదముల్
నిదుర విడిసయంత నీవు నీదు
భేదమును గనంగరాదు గావున నీవ
కర్తవెల్ల భేదకల్పనకును. 163

క. నీకల్పితమగు భేదము
నే కొందఱ కంటఁగట్ట నెంచుట లేలో
వాకొను మిటి విభేదము
నీకే తెలియంగ వచ్చు నెఱి కెఱిఁగినచోన్. 164

ఆ. అనన నాతఁడనియె నార్య యీభేదము
తొలఁగు టెట్లు తెలుప వలయు స్వామి
స్వామి యనియె నీవు బ్రతికియున్నంతలో
భేదభావ మరుగఁ బోదు నిజము. 165

ఉ. చచ్చినఁగాని పోవ దది చచ్చుట యెట్లన మేనిప్రాణముల్
వ్రచ్చుట గా దహంకృతిని బట్టి వధించుట చచ్చిన ట్లనన్
వచ్చును గాన నీమనమునం గలహంకృతి వీడు మంత నీ
వెచ్చిన యెల్లభేదము లొకింతటిలో నశియించి పోయెడున్. 166

క. నిరహంకారులు వారని
ద్దురలో బలెజాగ్రదాత్మ దొరకొని నపుడున్
దరిజేర నీరు భేదము
లరుదుగ విశ్వమును మఱచి నట్లగుదు రొగిన్. 167

చ. మదిరయు మత్తుమందు క్షణమాత్ర మొనర్చును దేహవిస్మృతిన్
సదమలచిత్తుఁడై ప్రకృతిసంగము వాసినజ్ఞాని యెప్పుడున్
గదురఁగ దేహవిస్మృతి జగంబు నెఱుంగక తత్త్వదర్శియై
ముదమును బొందుచుండు నెదఁ బొందక యెట్టివిభేదభావముల్. 168

చ. వినుమొక పంచదార యది విన్ననువొప్పఁగ మావిపండు గా
నను వగు చిల్కగా మఱియు నప్పముగాఁ గడురూపు లందియున్
గనుఁగొన నొక్కఁడైన గతి గా జగమం దలబ్రహ్మ మొక్కఁడ
య్యును బహురూప భేదముల నొప్పుచుఁ గానఁగ వచ్చు నెప్పుడున్.

వ. అని చెప్పిన విని వారు సంతసిల్లుచు నిట నీసత్రియాగంబు నివ రి

ల్లిన పదంపడి మీరు కోడూరునను విజయముచేసి మమ్ము మా
పురంబును సుపవిత్రంబు గావింపుఁ డని మఱియును. 169

మ. విజావాహిని వేంకటేశ్వరపదావిఖ్యాతమై తత్పదో
ర్వరయందుఁ బ్రవహించి మాపురము ప్రాగ్భాగంబుఁ జేరంగ నై
గరిమం గాంచుచునుండెఁ దత్తటమునన్ గావించు సత్రంబు స
ర్వాంసాచక్రసమంచితంబు నగుచున్ శ్వశ్రేయసం బిచ్చుచున్. 170

మ. అని ప్రార్థించిన స్వామి మీ రనిన యట్లే గాక మీయూరనే
మునసత్రంబుఁ బొసప్ప సర్వవిబుధోక్తం బై వరం బిచ్చెదన్
జనసంఘంబున కీసు వోయి యచటన్ సంభారముల్ గూర్పుఁ డే
ము నిటన్ శాంతి యొనంగఁగా నవభృథంబుం జేసి యాపిమ్మటన్.

క. భక్తులు మీప్రార్థనచే న
భుక్తియు ముక్తియు నొసంగఁ బొలిచినవిగ్రహ
భక్తిమెయి సత్రమఖము ప్ర
సక్తిం గలిగింప మాకు స్వాంతంబ యగున్. 172

వ. అని వారిప్రార్థనం బంగీకరించి వారి నంపిపుచ్చి యవధానిం బిలిచి సర్వంబు నెఱింగించి తాను గార్యాంతరంబునఁ జెన్నపురంబునకుం జనియె నవధానియు సత్రసమాప్తిం గావించి పదియుందొమ్మిది నూర్ల యిరువది యెనిమిదవసంవత్సరంబునఁ బంచాయతన దేవతలతో వేంకటేశ్వరునితో భక్తులతో బంధుమిత్రపరివారంబుతోఁ బయనంబై తత్కాలసమాగతు లగుభూషణస్వామిని సోదరీసహిత యగు కనకాంబను బురస్కరించుకొని కోడూరు గ్రామంబునకుం జని యట నొకధర్మశాలం బ్రవేశించె నవధానియును. 173

## —• కోడూరు సత్రయాగము •—

మ. సువిశాలంబును సూర్యచంద్రవిమలాంశుప్రాప్తదేశంబు మృ
ద్భవనానావిధకీటసంకలిత ముద్యద్వాయుసంవాసితం
బవదాతారుణనీలభూతలరజోవ్యాప్తంబు నల్పాల్పశూ
న్యవిశేషావృత మాశ్రయంబుఁ దగు నాసత్రప్రదేశం బటన్. 174

చ. అనిశము శ్వానసూకరఖరాదిపరీవృత మైనధర్మశా
లను సదలంకృతం బయి చెలంగెడునట్టులు చేసి చుట్టునన్

ఘనతరశాలలన్ సలిపి కన్నులపండువుగాయె తలిర్చున
ట్లొనరిచి వేంకటేశ్వరసమున్నతపీఠము నిల్పి రచ్చటన్. 175

క. పంచాయతనంబులు న
ర్త్యంచితగృహమందు నిల్పి యభ్యర్చనలన్
మించిన భక్తిం బొనర్చిరి
పాంచత్నలపుష్పసమితి బహువిధగతులన్. 176

సీ. సంధ్యలందున్ సప్తసప్తసహస్రనా
మార్చన దేవతాపార్థనములు
భాష్యప్రవచనము భాగవతాదిస
ద్గ్రంథపఠనము సూర్యస్తుతులును
సతతంబు హరికథల్ సప్తాహభజనముల్
వేదపారాయణ మాదిశక్తి
పాదాభివందనప్రస్తావములు గాగ
వర్తిల్లును మంత్రభజనములును

తే. నిరతతూర్యత్రికంబును నిత్యసేవ
ధూపదీపనైవేద్యముల్ సోపచార
వందనంబు లజస్రము వరుస జరుగ
సత్క్రియాగ మెసంగె నాస్థలమునందు. 177

ఉ. తాళములున్ మృదంగములు దప్పటలున్ సుమనోహరంబుగా
నై లలి మీఱగా భజన మాదివసంబుల నాల్గుజాతులున్
గాలము తెంపు లేదనుచు గాన మొనర్చుచునుండ్రి నాల్గుజాల్
చేలును సంతతంబును వరించినఋత్విజు లద్దినంబులన్. 178

మ. ఘనపాఠుల్ సహశిష్యులై యట శ్రుతుల్ కర్ణప్రపేయంబు గాం
బొనరింపన్ వినువారు చిత్తములకుం బూర్ణానుమోదంబు గ
ల్గినదానన్ బెరచింతలన్ విడిచి భక్తింజేసి దేహస్మృతుల్
గనుఁగోనట్టిర నైయె భజింతు రచటన్ శ్రీమద్దేవతాచంద్రిలన్. 189

తే. అపుడు భగవంతు సేవింప నాగతులగు
భక్తులకుఁ బ్రత్యహంబు నా భవ్యసత్రి

శాల నిష్టమృష్టాన్నము సంతతముగ
నొసఁగఁ జేయుచుండె మా స్వామిజనులు. 180

తే. దినమునకు నొక్కసారి క్షీరమును భుజించి
యాఱుమాసము లాయూర సనఘుఁ డైన
భూషణస్వామి జపతపంబుల నొనర్చు
చుండి శిష్యులకుం బోధ మొప్పఁ జేసె. 181

వ. ఆకాలంబున నానాదేశంబుల నుండి నానాప్రముఖులు వచ్చి స్వామిని సేవించి పోవుచుండి రిట్లైదు సంవత్సరంబు లహోరాత్రంబు లవిచ్ఛిన్నంబుగ నపూర్వసంవిధానంబున నాసత్రయాగంబు సాగించి సమాప్తినొందించి సర్వజన సమారాధనంబు గావించి భూషణస్వామి కోడూరుగ్రామవాస్తవ్యులగు భక్తులం బిలిచి మేము పోయి వచ్చెదము మీరు మ మ్మేమరక యుండుఁ డని చెప్పి మఱియును. 182

— • గు రు మ హి మ ము • —

తే. గురువు ననురూప యగుభార్య నిరతము నను
కూలుఁ డగు ననుచరుఁడు నీక్షోణియందు
జన్మ మొందువానికి మనశ్శాంతి గూర్చ
ననుఁగుఁజుట్టము లని తెలియంగ వలయు. 183

చ. జగ మిది యెల్ల మిథ్య యనఁ జాలినయప్డు గురుండు బోధముణ
దగదొకొ మిథ్య యంచు నెడఁదం దలపోయ ననణ గురుండు న
ట్లగుననుకొన్న బోధ మది యట్లన రాదు ప్రబోధ మీయఁ గాఁ
దగునది తత్ప్రకారము ముదం బిడుఁ జెప్పెద నాలకింపుఁడీ. 184

సీ. కొమరుండు నూతిదాఁ గూలిన ట్లగుస్వప్న
మపుడు తత్ప్రీత భయ మంది లేచు
నాతఁడె నూయియు నూతిలోఁ బడుటయుఁ
బడినశబ్దమ్ము న్గను వట్టి కల్ల
యైనశబ్దము మాత్ర వానికి మెలఁకువఁ
గలిగించి భీతినిఁ దొలఁపఁ జాలుఁ

దద్విధంబున సగుణ తత్త్వబోధము జగ
జ్జీవేశ్వర భ్రాంతిఁ జెడఁగఁ జేసి
తే. శ్రవణమాత్రి నానంద మొసంగు చుండుఁ
గాన మిథ్యాత్వ మచల లోఁ బూనఁ బోక
భక్తియును శ్రద్ధయును గల్గి పరమగురునిఁ
గొలిచి మీరు కృతార్థులై మెలఁగ వలయు. 185

క. జీవితపరమార్థం బది
యేవిధమున మనకు ముక్తి యేర్పడుఁ దత్త్వం
బేవాఁడు చెప్పి శాంతిని
గావింపం జాలు నంచుఁ గనుఁ డహతహాలోకా. 186

ఆ. జగతి వెదక వెదక సాక్షాత్కరించిన
గురువరేణ్యు నెఱిఁగి కొలుచు శిష్యు
నకుఁ బ్రబోధ మంటి జ్ఞాని యెూ జిజ్ఞాస
లేనివాని కెల్ల లేనివ యగు. 187

ఆ. కాలికిందఁ బెట్టి గట్టిగఁ దోమిన
పాత్రమునకు నగ్నిపరమయోగ
మునను దగర మంటుపోలిక గురుశిక్షఁ
జేసి జ్ఞాన మంటు శిష్యునకును. 188

తే. తాము సర్వజ్ఞులైనను రాముఁ డవ్వ
సిష్ఠుఁ గృష్ణుఁడు సాందీపుఁ జేరి జనకుఁ
డల్లపంచశిఖునిఁ గొల్వ నగుచుఁ దత్త్వ
మెఱిఁగికొని రెల్ల జగతికి నెఱుకపడఁగ. 199

క. తనబరువు తనకుఁ దెలియదు
జనునకుఁ దెలియంగఁ జేయఁ జాలున్ ద్రాస
ట్లనిశము గురుఁ డాశిష్యుని
ఘనతన్ వెలయింపఁ జాలుఁ గడువత్సలతన్. 190

సీ. పలువురు వేషధారులు వారిలోన స
ద్గురుని గుర్తించుట కొంత శ్రమము

యైనశిష్యుఁడు నిర్మలాంతఃకరణమున
వెదకెనే సద్గురువిధ మెఱుంగు
నేయవతారము నెత్తి యీశ్వరుఁ డెట్లు
వర్తించుచున్నను వానిభక్తుఁ
డెఱిఁగి సేవించు నట్లె శిష్యుఁడును గురు
నెఱిఁగి సేవించి తా నెసక మెసఁగు

ఆ. దర్పణమునఁ జూచి తనబొట్టు సవరించు
కొనిన యట్టు చట్టు గురునివలనఁ
దనదులోటుపాటులను సవరించుకోఁ
గలిగి యుండు ననుచుఁ దెలియవలయు.

చ. తనతిలకంబు వంకరలు దర్పణమందలివంకరల్ బలెన్
గనుఁగొనవచ్చినట్లుగ నొకానొకశిష్యునిలోటుపాటు లా
యనఘుఁడు దేశికోత్తమున కంటఁగఁ గట్టినయట్లుగన్ గురుం
డనయము నిర్మలంబగు స్వాంతమునం బొలుపొందు నెప్పుడున్

క. కోపము తాపము సద్గురుఁ
డేపట్లం గలుగఁ బోక యెప్పుడు కరుణన్
జూపుచు శిష్యునిస్థితిని ని
రూపించుచు నుండు నెల్లరుం దెలిసికొనన్.

సీ. గురునిసన్నిధి శిష్యవరుఁడు సత్యవ్రత
శీలుఁడై చరియింపఁ బోలు నెపుడు
సత్యవ్రతంబున సతతంబుఁ ద్రికరణ
శుద్ధిగా మెలఁగెడుచొప్పె యగును
గురుని సంకల్పము నెఱవేర్చుశిష్యుండు
క్రమముగా నున్నతి గలిగికొనుచు
నీశ్వరారాధన మెపుడు చేయఁగ నయి
యిష్టార్థసిద్ధుల నెపుడు వడయు

తే. స్వానుభవముచే బ్రహ్మతత్త్వము నెఱింగి
యన్యథా వాదిగాక యథార్థ మెఱుఁగ

తెలుపు నతఁడె సద్గురు వగు సత్యమును బ్రీత
ముగ మెలఁగువాఁడె శిష్యోత్తముఁడు తలంప. 194

క. గురుశిష్యుల కన్యోన్యము
పరసంబంధంబు కలిగి వ్యక్తివిభేదం
బరయుంగ వచ్చు మీఁదికిఁ
బరమాంతఃకరణ మైక్యభావము నొందన్. 195

తే. గురుఁడు సత్యస్వరూపుఁడై పొంగు శిష్యుఁ
డనిశ సత్యజ్ఞుఁ డగుఁ బ్రయోజనము తెలిసి
వచ్చు నిత్యానుభవము సంబంధ మైక్య
మనఁగ ననుబంధము చక్షుష్యమగుచుండు. 196

వ. ఇది యాభాసరూపంబుం బొందిన విపరీతగ్రహణంబై శుక్రాభ్రష్టుఁ డుండు లోపంబు గలిగి త్రికరణంబున కన్యథాత్వంబు గలదై రసాభాసం బగు నని బోధించి వారియనుమతంబు వడసి సకలపరివారపరివృతుండై సతీసుతసమేతంబుగా శ్రీరాధిదేవతలం గొని కతిపయప్రయాణంబులఁ దిరుపతిపురంబునకుం జనియె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలి వృత్తాంతంబు చెప్పుమని సూతు నడుగుటయును.

—• ఆశ్వాసాంతము •—

మాలిని. దళితమునిజనార్తీ! ధాంకణీ చక్రవర్తీ!
జ్వలదమలిన మూర్తీ! సర్వలోకానువర్తీ!
కలితవిపులకీర్తీ! కావ్యకృచ్చిత్తవర్తీ!
సులలితగుణపూర్తీ! స్తోత్రకృత్కృష్ణమూర్తీ! 198

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబున
అష్టమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# అమృతానందము



## నవమాశ్వాసము

మద్విజవాడపురీ
ధామా! సోమార్కనేత్రదర్శితధామా!
కామితభక్తస్తోమా!
ప్రేమావితమానిసోమ! వేంకటనామా! 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె నట్లు కోడూరునుండి పీఠాధిదేవతలం గొని తిరుపతిపురంబునకుం జనిన పదంపడి. 2

### —• తిరుపతిపురనివాసము •—

సీ. ఫణిభూషణుండు తిరుపతిపురంబున నుండి
నప్పుడు తనయింటియందు సతము
పరమార్థచింతతోఁ బనిసేయు సేవకుం
డొక్కండు మాత్రమే యుండ వలయుఁ
దిండియు గుడ్డ లయ్యుండిన సేవకుం
డాశింపఁ దగు ' తరాశ తగదు
భాగవతులు భక్తవరులు గా కితరులు
స్వామితో మాటాడ వలదు రాఁగ
తే. ధ్యానయోగ సమాధిలోఁ దగిలి యున్న
కాలమున నెంత లెంతలు గాని రాఁగ
స్వామి మాటాడకుండు నీజాడ లెఱిఁగి
శిష్యులును గూడ వర్తింపఁ జెల్లు నపుడు. 3

వ. అని నియమించి మించిన వేడ్క. 4

క. కనకాంబా గృహాపరిసర
ముననుండిన స్థలముఁ గొని సముచితగతి నలర్
బొనరించి గృహము నందున్
మనపీఠస్థాపనంబు గావించెఁ దగన్. 5

వ. అప్పు డప్పీఠంబునఁ బంచాయతన దేవతార్చనను గృహదేవతా ర్చనగ నెంచి వేదాంతవిచారంబె ప్రధానం బగునట్లు లేర్పరించె నవధానిప్రభృతు లప్పు డన్యగృహంబుల నుండి దేవతార్చనాది కార్యంబులకుఁ జేదోడు వాదోడుగ నుండఁ బీఠసన్నిధిని భూషణ స్వామి భక్తులతో నివసించి భగవద్భాగవత కైంకర్యం బొన ర్చుచు నొక్కనాఁడు భక్తు లెల్లరు విన సిట్లనియె. 6

—• తత్త్వోపదేశము •—

సీ. నాలుగుగోడల నడుమన పరమార్థ
చింతయు వ్యవహారచింత బాహ్య
మై యుండ నగు ధ్యాన మభ్యసించుటకు నై
సత్ప్రయాగంబును పలికితి మటు
ప్రతివిద్యయు నవిద్యఁ బరిహసించుట కగుఁ
దగు శక్తితుల్ కార్యసాధనముపొంటె
సర్వశాస్త్రములును జదివి సారము జీర్ణ
మగునట్లు చేసికో నగును గాని

తే. అంధుని తెఱంగునన్ వాని ననుసరింప
రా దుపనిషత్తులం దీశ్వర ప్రదర్శ
న మగు నద్దియ వేదాంత మమరు జ్ఞాన
మనుభవించుట యని తెలియంగ వలయు. 7

తే. ఇంద్రియార్థానుభవ మగు నెంతవఱకు
నంతవఱకును జ్ఞానము ననుభవింప
నలవడదు గాన నింద్రియార్థానుభవము
వదలుటకు మున్న జతనింప వలయు జనుఁడు. 8

చ. ఇటురకపు పుస్త్ర శాల్యపయి నిర్మలవస్త్రము వేసి దానిపైఁ
బదిలము గాఁగఁ బండ నగుఁ బైఁ జనుపెంచెదనిద్ర యగ్గతిన్
మొదటను గర్మముల్ సలుపఁ జోలును దాన జనించు జ్ఞాన మ
ప్పదనున శాంతిదాంతి కలవాఁడయి మర్త్యుఁడు ముక్తినొందెడున్.

తే. కాయకష్టము పడిమెదాటోయ యింత
మాత్రిలో నిద్ర ప్రొద్దు నాపాద్రి జనున
కల్బైసంబునఁ జేసియు నంతలో స
మాధి కుదిరెడు ననియుట మనకుఁ దెలియు. 10

సీ. దేహముపై నింత దెబ్బ తాఁకిన దాని
వలన మదికి బాధ కలిగినట్లు
శబ్దము బ్రహ్మ మాశబ్దమూలమునఁ బ
రబ్రహ్మము నొగిఁ జేంగఁ గలుగు
నామరూపములతో నలువగువాని ను
పాసించిన గల్గు బ్రహ్మపదము
తను వాత్మ కాకాశ మన నగు దానికి
శబ్ద మాధారమై చనెడుఁ గాన

తే. మనుజుఁ డాకాశరూపుఁడై తన రెడుపర
మాత్మఁ జేర్చుటకును శబ్ద మైనమంత్ర
మును జపించుట యుత్తమ మనఁగ వచ్చు
నిది సనాతనమత మని యెఱుఁగ వలయు. 11

క. మఱమేకు మీఁదఁ ద్రిప్పినఁ
గర మరుదుగఁ జెక్క లంటుగతి గా నామ
స్మరణమున మనసు నాత్మయుఁ
బరికింపఁగ నేక మగుచు భాసిలు చుండున్. 12

సీ. నిదుర నొందినయప్డు జెదియును దెలియని
యట్లు సమాధియం దగుజనునకు
దూషణభూషణాదులు నుపకారాప
కారముల్ దెలియ వాగామిసంచి

తములు ప్రారబ్ధములోఁ దలఁప వానికి లేవు
సంతతధ్యాన ప్రసంగమున స
మాధి నొందినజ్ఞాని నైన వీడినప్పుడే
మరణించె నందు రాపురుషుఁ డెపుడు

తే. తత్త్వ మెఱిఁగి సమాధినైనఁ దనరునాఁడె
స్మృతిని బొందినవాఁ డని యెఱిఁగికొనుట
దుర్లభం బమ్మహాత్ముఁడు దోఁప వచ్చు
జ్ఞాని యయి శాంతుఁ డగు వాఁడు మానసమున. 13

ఉ. నిమ్మకు నీళ్ళు పోయుటయు నిత్యము దానినిఁ బ్రోచుచుంట యు
త్తమ్ముగఁ జేసి సాధ్య మగు దానికిఁ బుట్టినకాయ పుల్లనై
యిమ్మహి నుండు నట్లెవరికేని యొసఁగుట సాధ్య మైన ధ్యా
నమ్మొనరింప నా మన కనంతర మందున వచ్చు జ్ఞానముల్. 14

తే. అహ మసంగను ముక్తుఁడ ననఁగ రెంటఁ
గర్మ మగు నేను లే నాత్మ గల దొకండ
యనెడు వానికి జీవత్వ మదియు లేదు
మఱియు ముక్తత్వమును లేద యరసి కొనఁగ 15

క. జీవత్వలక్షణమ్ములు
గా వెలయుఁ గర్మమును నకర్మము నవియున్
లే వాత్మకు నీరెండున్
గావున విజ్ఞాని యెఱుఁగఁ గాఁ దగు దీనిన్. 16

తే. మేరుగిరి కీవ లావల సూర్యుఁ డుండఁ
బగలు రాత్రి యనన్ భ్రమఁ దగిలి జనులు
పలుకు చుందురు తత్త్వము దెలిసినట్టి
వార లీరీతిఁ గాకుండ్రు వసుధయందు. 17

తే. కర్మమందు నకర్మ మకర్మమందుఁ
గర్మమును జూచుచుందురు జ్ఞాను లైన
వార లావిధ మంతయు వరుస నెఱిఁగి
తత్త్వదర్శన మిట్టిది తథ్యముగను. 18

ఆ. కాళ్ళు ముక్కు కనులు గలిగి చూపట్టెడు
పంచదార చిలుక మెచ్చి పొడఁ
బంచదార యటంచుఁ బరికింప నగునట్లె
మెల్లవిద్య మీరుఁ దెలుగ వలయు. 29

తే. విశ్వమం దెల్లవానికి నీశ్వరేచ్ఛ
యే స్వతంత్రతఁ గాని యుండ దితర మెల్ల
నస్వతంత్రము లనియు సాధ్యములు లని య
సత్తు లనియును నెఱుఁగ నౌఁ జిత్తమందు. 30

— ధర్మము —

సీ. అరయ ధర్మము స్థూల మనియు సూక్ష్మ మ్మని
రెండు తెఱంగుల దండి కెక్కు
నయథార్థమును బాప నలస్థూలధర్మమౌఁ
బొసఁగు యథార్థమ్ము బ్రోచుటకును
సూక్ష్మధర్మం బగు సూచింపఁ బడు నుదా
హరణ మొం డిచ్చుట నగును వినఁగ
గాయకుం డొకసభ గానంబు చేసినఁ
దలలు దిప్పిరి జనుల్ బళి యటంచు

తే. నపుడు మంత్రి వీ రెల్ల యథార్థముగను
దెలిసి తల ద్రిప్ప రని రాజు దెలియఁ బలికి
విభునియనుమతి మఱియును సభ యొనర్చి
తలలు గొట్టెదఁ గదలింపఁ గలిగి రేని 31

వ. అని విచ్చుకత్తులవారి సభామధ్యంబున నిలువం బెట్టిన భయంబు నంజేసి యెవ్వరుసు దొంటివలె శిరంబు లూఁగింపరైరి రప్పు డిరువు రాసంగీతంబునకు నోడలు మఱచి శాసనంబు సరకుగొనక బళి బళీ యని తల లూఁచి రప్పుడు మంత్రి రాజునకు వారిం జూపి వీ రిద్దతే సంగీత విద్వాంసు లని చెప్పి యొప్పించె నిందుఁ దలలు గొట్టెద మనుట స్థూలధర్మంబు గొట్టకుండుట సూక్ష్మజ్ఞానము వీనిఫలితమే యథార్థజ్ఞాన మని మఱియును. 32

తే. జగతి వ్యవహారమునకు శాస్త్రములు పనికి
వచ్చినను యధార్థజ్ఞాన మెచ్చుటకును
ననుభవమె కాని యాలోచనాదికమ్ము
కాదు స్థూలము వ్యవహార గతుల కగును. 33

తరళము. పురుషయత్నమునకా ఫలంబును బొంద వచ్చు నటన్న న
ప్పురుషకోటికిఁ గర్మకాండము పొల్చి చెప్పును స్థూలధ
ర్మరతి గాన నివృత్తికై చనుమార్గముం గొని యున్నచో
నరయ వచ్చును సూక్ష్మధర్మ మటంచుఁ జెప్పును వేదముల్. 34

సీ. తలఁప "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" యని యెఱిం
గినపండితోత్తముల్ కనఁ బడినది
యెల్ల సర్వేశ్వరకృతము సర్వము నీశ్వ
రాయత్త మని చిత్తమందు నమ్మి
తగ చేరు పొగడినం దెగడిన నెప్పుడు
హర్షవిషాదంబు లందఁ బోరు
తత్పరిజ్ఞానముం దగులనివారలు
నరకమునం బడి నవయుచుందు

తే. రితరులకు మహాత్మ్ము లగువా రిట్టిసూక్ష్మ
ధర్మ మెఱిఁగింపఁ బోవక కర్మగతుల
స్థూలధర్మము నెఱిఁగింతు రి చూచియు నధి
కారితను వారి కది యెల్లఁ గలది యనుచు. 35

వ. స్థూలదేహము నాశయించినది స్థూలధర్మము లింగదేహము నాశయించినది సూక్ష్మధర్మంబు నాఁబడు ననధికారికి ధర్మసూక్ష్మంబు దెలిపినవాఁడు నరకంబునం బడు దీనికి నొక్కదృష్టాంతంబు గలదు చెప్పెద వినుం డని వెండియు. 36

—— పా ము క థ ——

తరువోజ. అడవిలో నొకసర్ప మరుదెంచువారి
నరసి కఱచి చఁపు నట్టిదై యుండుఁ
గడచె దినము లిట్లు కడపట నొక్క
ఘనుఁడు సన్న్యాసి యక్కాలిమార్గమున

నడచుచుఁ గనుఁగొని నడచుచూడఁ గాను
నగుచు మంత్రిబలంబునం జూచి చేసి
నిడుపఁ దంతం దననిభృంగ దాష్ట్రంబు
నెఱి వీడి చని యాతఁడు దేశమునకుఁ. 37

*శా. స్వామీ! నా కేది యూజ్ఞ నాప్రపుడు మునిదప్పురుండడనుం డానితో
నీమార్గంబున చేరినిం గలవ రా దేఁ జెప్పలిం బొ మ్మటం
చామీఁదం జనె నాతఁ డంత నిడుపం జత్యంతసాధుత్వముఁ
సామంబుం గొని బుఱ్ఱతస్స వలె నిస్సారంబయై సాల్కఁ డెన్. 38

ఆ. అట్టు లున్నదాని నరసి బాలుఁ డొకఁడు
బీతు లేక జాత ద్రవేసి మొత్తె
దాన నడుము విఱుగ దర్వీకర మ్మొక్క
పుట్టలోనఁ జొచ్చి యెట్టొ బ్రతికె. 39

వ. అంతం గొంతకాలమ్మునకుఁ దొంటిసన్న్యాసి వచ్చి పుట్టలోనం బడి యున్నపాముం గాంచి దానివృత్తాంతంబు విని యి ట్లనియె 40

క. కఱవకు మంటిని కానీ
హరహర బుస కొట్టవలవ దంటినె? పామా!
నిరతము బుసగొట్టుడు బా
లురు నిను హింసింపఁగాఁ గలుగుదు రె తెలుఁపక. 41

వ. అని యెటకేనిం జనియెఁ గావున ధర్మసూక్ష్మ మనధికారులు తెలిసి కొనం జాలనివారై వారనివిపత్తుం దెచ్చుకొందు రని మఱియు నాశ్రమంబులఁ గ్రూరజంతువులు జాతివైరం బుడిగి వర్తించు సాధు వగువాని సర్పాదులును ముట్ట పిడి సహజధర్మం బీశ్వరసంకల్పము గావునఁ బురుమప్రయత్నసంభవంబు లగుదోషం బుల నివారించుటకు స్థూలధర్మంబును సహజంబు లగుదోషంబుల భరించుటకు ధర్మసూక్ష్మంబును దగి యుండు వినుండు. 42

మ. సభలో నల్లరి సల్పరా దనుడు నే సల్పంగ నవ్వానిని
రభసం బేర్పడ శిక్షఁ జేయుదురు రారాజుల్ వెడం గైనచో

* బుఱ్ఱతస్స = నీటిపాము, డుండుభము.

నభయం బిచ్చి క్షమింత్రు శాసనము చేయం బోరు మనిట్టు లా
ప్రీణనం జేస్నిద ధర్మసూక్ష్మ మరయన్ వచ్చున్ జగద్వర్ణ్యమై. 43

సీ. మనుజ లిల్లెఱిఁగి కర్మము లొనర్పంగ నగు
 ననియు గృహస్థులై యాత్మజులను
గన వలె ననియును గంటకన్నఁ బున్నామ
 నరకంబునం బడి నవయు ననియు
ధర్మ మధర్మము తగ నెఱింగి చరింపఁ
 దగు ననియుఁ జరింపఁ దలఁప రేని
రౌరవాదు లగు నరకములపా లయి
 వేగుచుండ్రని పలుకు వేదము లవి

తే. ధర్మమునకును మఱియు నధర్మమునకుఁ
దవులకుండెడు నది మహాధర్మ మదియె
ధర్మసూక్ష్మము నా నొప్పు దానికి నధి
కారి ప్రాజ్ఞుఁడ యగుఁ గాని కాఁడు పరుఁడు. 44

తే. కృష్ణుఁ డర్జును నానాఁట నెల్లధర్మ
ములను విడనాడి శరణముం బొందు నన్ను
నొకని నని పల్కె ధర్మజు సకలధర్మ
ములను గాంగేయుకడ వినఁ దలఁపు మనియె. 45

వ. తత్త్వజ్ఞాన మూహించుటకు లోఁబడునది కాదు ధర్మసూక్ష్మము గురువులవలన నెఱింగి బంధుమిత్రాదులయెడ స్థూలధర్మము విడనాడక సంచరించి మనుజుండు తరించు నని మఱియు ననేకోపదేశంబులు చేయుచు భూషణస్వామి యొక్కనాఁడు కనకాంబం గాంచి యిట్లనియె. 46

మ. కనకాంబామణి! సుప్రసిద్ధు లగుచున్ గన్పట్టువా రెందఱో
మును రామాయణముం బొసర్చినవిధంబుల్ తోఁపఁగా వచ్చు నీ
వును రామాయణ మొండు చేయు మనుచున్ బోధింప నాయమ్మ యా
నని సూర్కాండములన్ రచించెఁ గనకాఖ్యన్ స్వామికిచ్చెం గృతిన్.

వ. అనంతరంబ తిరుపతిపురంబున నెండలు మెండుగాఁ గాయుచుంటం జేసి భూషణస్వామి యవధానిప్రభృతులతోడం బయనంబై కుట్రా

లను [illegible] గొన్నినా ళ్ళండి యటనుండి
[illegible] జనియె నచ్చట
మ. [illegible] వెన్నియేసియు [illegible] కూర్చుండియున్
బువంగాఁ బడియున్ [illegible] చియును [illegible] గల్గిచేయంగ నా
గల వాతీరమునన్ గృహంబు లచటన్ గాంచి వాసించి ని
చ్చలు [illegible] శాంతిన్ మది గోరుచున్.

— మ ధ్యా ర్జు న క్షే త్ర ము —

వ. అందుఁ గొన్నినాళ్ళుండి యచ్చటనుండి కృష్ణభూషణుండు మధ్యా
ర్జునక్షేత్రంబునకుం జనె నదియును. 50

క. చోరత్వంబునఁ గాని
జారత్వంబునను గాని జనుఁ జొచ్చిటన్
గోరిక నొకదిన ముండిన
వారికి మోక్ష మగు నసుచుఁ బలికెడిని శ్రుతుల్. 51

సీ. పరమభక్తుం డగుపట్టణత్తారు మున్
మధ్యార్జునమునందు మహిమ మీఱఁ
జాలకాలము నివాసంబుండె శ్రీకాళ
హస్తిలోఁ గన్నప్ప కట్టు లచట
నాతనికిని విగ్రహము చేసి నిలిపిరి
మునుమున్ను భక్తు లాతనిని గాంచి
యవల నీశ్వరుఁ గాంచ నగు నని చెప్పుదు
రచట నెన్నేనిమహత్త్వము లగు
తే. వినుఁడు గర్భాలయముచెంత వింతవిగ్ర
హ మ్మొకండు చూపట్టెడు నతివికార
ముగను దానిపరికారము పూర్వు లిట్లు
గ్రంథముగ వ్రాసి యుంచి రబ్రంబు దోఁప. 52

మత్తకోకిల. చోళదేశపురాజు మున్నొకక్షోణిదేవునిఁ జంపుటన్
బాలిశుం డగువానిఁ బట్టఁగ బ్రహ్మహత్య కడుం గడున్
వైళమాతని వెంబడింపఁగ వచ్చినం గని బీతునన్
దాళఁ జాలక పాఱె మిక్కిలి తత్తఱించుచుఁ గించునా. 53

శా. దుర్వ్యాసుం డొకనాడు చక్రి మది తన్ దుర్హింపంగ నెన్నంటి రా
గవ్యం బేది ధరాతలంబున నెటం గా బ్రాచుసో లేక తాఁ
బవ్వల్ పెట్టి రీతిఁ జోళవిభుఁ డాబ్రహ్మహత్యకు మంటంగ ని
యుక్త్యం గల్గుసమస్తదేశము ల నెంతో క్రిత్తి దాఁటెన్ వడిన్. 54

తే. ఎందు నెవ్వరు దానికి నెదురు వచ్చి
వానినిం గాఁచువారలు గాన రామి
దారి మధ్యార్జున మ్మది దారసింప
నలఁడు వడి వడిఁ జొచ్చె శివాలయమున. 55

చ. శరణము వేఁడి భక్తుఁడను శంకర ! నన్ను ననుగ్రహింపవే
ఖర మయి బ్రహ్మహత్య ననుఁ గట్టెడుఁ బట్టెడు దిక్కు నీవ నేఁ
బెరల నెఱుంగఁ గావఁ గదవే యని లింగము గౌఁగిలించిన
హరుఁడును వాని లోఁ గొనియె నైక్యము నొందె నతండు వింతగన్. 56

ఆ. బ్రహ్మహత్య వానిపజ్జకుఁ జన నోడి
జేఁడు వెలికిరాఁగఁ గూడ ముట్టి
పట్టుకొందు ననుచు వాఁకిట మోఁకాళ్ళ
మీఁదఁ దలను బెట్టి మిట్టిపడుచు. 57

వ. వికారవత్కారంబునం గూర్చుచుండె నట నీనాఁటికిని జోళరాజుం
బట్టవచ్చిన బ్రహ్మహత్య చూపట్టుచుండె ననియు నాధివ్యాధులు
బ్రహ్మహత్యాపాతకంబులు నాశివాలయంబునకుఁ బ్రదక్షిణించిన
వానికి నశించు ననియుం జెప్పుదు రెందఱో భక్తు లట వచ్చి
స్వామిని సేవించి పోవుచుందురు దీక్షాపరుల కటఁ దపస్సిద్ధి
యొక్కింతకాలంబునఁ గాఁ గల దని భూషణస్వామి యాక్షేత్ర
మునఁ గొంతకాలము తపమ్మొనర్చుచుండె నప్పుడు. 58

క. మధ్యార్జునంబునందున్
సాధ్యము లగుసిద్ధు లెల్ల స్వామ్యర్చనలన్
నిధ్యానస్థితమునుల క
సాధ్యము గా దెదియు నచట శంకరుకరుణన్. 59

వ. అని యెఱింగి యవధాని. 60

చ. గురుని యనుగ్రహంబు తనకుం బరిపూర్తిగ నించుచుండఁగన్
పరమశివాలయంబునకు భక్తిఁ బ్రదక్షిణముల్ బడిన్ దశో
త్తరశతసంఖ్య సల్పుటకుఁ దా నియమంబు నొనర్చి పేర్చి సం
బరమున దంటువంశభవ భాగవతుండు కరంబు దీక్షమై. 61

మ. అరమై లోకప్రదక్షిణం బగును దేవాగారభూభాగమం
దరయన్ సుబ్బవధాని ప్రాహ్ణమునఁ దా నారంభముం జేసి మూ
డగుగన్ జాములు భోజనంబునకు నేనాసించి పోకెద్దియున్
బరికింపంగ మనంబు సేయ కతితీవ్రం బై సభక్తిస్పృహన్. 62

తే. సంజ కెంజాయ లడరెడు సమయ మయ్యె
ఛాత్రుఁ డరుదేమి గురువస్యుఁ డాత్రపడుచుఁ
గబురుఁ జేసిన రామికిఁ గడు తపించి
తాన తనవారితోఁ గూడి తరలి యటకు. 63

తే. మండపంబునఁ గూర్చుండ మార్గమందు
నంతలోనఁ బ్రహారిచుట్టు నవ్వధాని
"హర! మహాదేవ! మాం పాహి" యనుచు భక్తి
భరితుఁడై మోడ్పుఁగేలితో నరయ వచ్చె. 64

క. కనుఁజీఁకటి పడునప్పటి
కిని నియమితసంఖ్య పూర్తికిం గొన్ని కొఱం
తను బొందఁ బ్రదక్షిణములు
గని గురునిన్ మ్రొక్కి కదలు కాలమునందున్. 65

వ. అమృతానందుం డతనిం గాంచి యి ట్లనియె 66

చ. గురులయనుగ్రహంబు గయికోఁ గద యిట్లు ప్రదక్షిణంబులన్
నరగఁ బొనర్చుచుంటి వికఁ జాలుఁ గొఱంత కొఱంతగా మదిన్
బరిగణియింపఁ గాఁ బడదు భక్తజనాగ్రణి! రమ్ము భోజనో
త్తరమునఁ జూచు కొందవ వధాని కరంబులు దోయిలించుచున్. 67

క. గురురూపంబున శంకరుఁ
డరుదెంచి ప్రదక్షిణంబు లాఁగు మనంగాఁ

బరికింప కే నొసఁగిన
గురుభక్తి ప్రతి యశము మఱియు నగు నహంకృతియున్. 68

వ. అని గురుమూర్తికి హరమూర్తికి నమస్కరించి శేషప్రదక్షిణం
బులదెస మనంబు వెట్టక గురువితో నిల్లు చేరె ననంతరంబ గుహుం
డును సపరివారుండై మగిడి తిరుపతిపురంబున కరుదెంచి సుఖం
బుండె నంత. 69

—॥ గురుపుత్త్రులు ॥—

తే. ఘనుఁడు కోడూరులో నున్న కాలమంద
మొదటఁ బుత్త్రుఁడు జన్మించె పిదపఁ దిరుప
తికి పరుగు దెంచినంతట దేవదేవు
కరుణ రెండవపుత్త్రుఁడు గలిగె మఱియు. 70

క. హరిపేర రాముఁ డనియున్
హరుపేరన్ సోముఁ డనియు నతఁ డాసుతు లి
ర్వురకును బే ళ్ళిడి పిలిచెన్
జిరజీవులు సుతులు నాఁడు చెలఁగుదు రవనిన్. 71

సీ. అంతటఁ బీరకార్యము లవధానిము
ఖ్యులమీఁద నిడి బంధువులయు భక్త
వరులయు క్షేమంబు నరయువాఁడై కృష్ణ
భూషణుం డవ్వారిభాషణముల
నాడాడకుం బోయి వేడుకమై వచ్చు
వాఁ డయ్యె వేసంగి వచ్చినపుడు
తిరుపతికొండపైఁ దిరుగుటయుం గాని
చెన్నపురిని నివసించి కాని

తే. మఱియుఁ జల్లనిచోట్లకు నరిగి కాని
కాలమును బుచ్చు భక్తులక్కాలమందు
సెలవు లగుటఁ బదస్థులు చేర వచ్చి
స్వామిబోధామృతముఁ గ్రోలి వఱలుచుండ్రు. 72

వ. ఇట్లు ప్రచారమ్ము గావించుచు నమృతానందుండు దేశాటన
తత్పరుండై యుండు కాలంబున. 73

—: ఆదోనిపురము :—

తే. కలుగు నాదోనిపురములోఁ గలిబిజోగి
సోమయాజులు భూషణస్వామియెడల
గురుత వాటించి యొకనాఁడు గురుని దనదు
నూరికిం గొనిపోయె ననూనభక్తి. 74

ఉ. శిష్యసమేతుఁడై యటకుఁ జేరెనభూషణమూర్తి గీతలకా
భాష్యముతోడ భక్తులకుఁ బారము చెప్పుచు సోమయాజితో
ఋష్యనుకూలశాస్త్రముల నింపు జనింపఁగఁ జేయుచుండి తా
నేష్యవచఃప్రసంగతుల నేర్పడఁ జేయుచు ధర్మపర్మముల్. 75

ఆ. సోమయాజి! యిచట హేమించు వెలివాడ
వనిత లక్ష్మమాంబ యనెడుపేర
యోగినీవతంస మొక్కతె యని యిందు
నామెఁ జూచుచిత్త మిూమెయి నగు. 76

వ. అనిన నతండాఁ గాత మని భూషణస్వామి నామె యున్నచో
టికిం దోడుకొని పోయి చూపె నామెయును. 77

సీ. కదలక మెదలక కనులు మూఁతలు పడ
నిగిడించి మెడ వెన్ను నింగి నిలిపి
జ్ఞానముద్రం గల కరములు తొడలపై
మడిబంధసంధులు మలఁగ మోపి
చిన్ముద్ర ధరియించి చిత్త మన్యాయత్త
ముగఁ జేసి స్మృతి లేనిపగిది నగుచు
నొంటూరు పేనియుఁ గంటఁ బడనియట్టి
గతి కయి ప్రాణముల్ గలియఁ బట్టి

ఆ. కట్టెవోలె నొక్కపట్టునఁ గూర్చుండి
బ్రదికెఁ జచ్చె ననుచుఁ బలుక నగుచు
నాదవానిపురిని మాదిగగూడెమం
దరయ నయ్యె లక్ష్మి యనెడునామె. 78

క. మూఁసక చీమలు నీగలు
మేనిపయిం బ్రాకులాడి మెలిగొనుచుండన్

గానంగఁ జాలక కోకిల
మౌనముఁ గాపాడునెఱుక మాలి మెలంగన్. 79

క. అమృతానందుం డాయమ
సమ్ముఖంబున కేగి నిలిచి శ్రవణసుఖముగా
నమృతానందుఁడ వచ్చితి
నమ ! కందుగ విచ్చి నన్ను నాదము మనుచున్. 80

వ. వరదాభయహస్తంబులఁ బ్రదర్శించుచు నిలిచి యున్నంతఁ గొంతలో
నామాతంగికన్య కన్ను విచ్చి క్రిచ్చ ఆ చేతులు జోడించి నమస్క-
రించి ధన్యురాల నయితి నీశ్వరసాక్షాత్కారం బయ్యె నని పలు
కుచుం బల్కుచు నంతలో నురలఁ గన్ను మూసికొని సమాధి
నిశ్చల యయ్యె నయ్యెడ. 81

మ. అమృతానందుఁడు దేవతాంశభవుఁ డం చందున్న వా రందఱున్
దమశీర్షంబులు వానిపాదములపైఁ దాఁకించి కీర్తించుచున్
బ్రియమనస్త్వంబున సేవచేయుచు నమోవాకంబు లర్పించుచున్
సుమసందోహమునన్ యజించి రతనిన్ స్తోత్రాహ్రదివ్యార్చనన్.

వ. అంతఁ బతం డెల్లర నానందంబున నోలలాడం జేయుచు సోమయాజి
ప్రభృతులం గూడి యథాగతకృతగమనుం డయ్యె నంత. 83

మ. నయ నాగద్వ్య బ్జజ భూమిసంఖ్యలను హూణాఖ్యాతసంవత్సరం
బయి యున్నప్పుడు భూషణప్రభువు భార్యాపుత్త్రయుక్తంబుగాఁ
బ్రియ మొప్పం జనుఁదెంచి చెన్నపురికిన్ శ్రీకాంచనాంబావరా
లయమందున్ వసియించె నెల్లరకు నాహ్లాదంబు సంధిల్లఁగన్. 84

తే. అవల మేనగోడ లగుసత్యవతి కరుచి
తోఁ క్షయవ్యాధి చూపట్టఁ దోడుకొంచుఁ
దోడఁ బుట్టువు మేనల్లుఁ డాడ కరుగు
దెంచి భూషణుని సమాశ్రయించి రపుడు. 85

వ. స్వామియుం దిరుపతినుండి యొకఁ ఘానిం బిలువ నంచి మంచి యౌష
ధంబులు చేయించి యామెకు నారోగ్యంబు గలిగించి వారిం బుచ్చె
నప్పుడు. 86

—॰ విల్లివాకనివాసము ॰—

ఆ. విజయవాడలోన వేంకటరెడ్డికి
దక్షిణాశయమందుఁ దాళఁ జాల
నట్టిబాధ పుట్టి నట్టు లాఁగ్గించి
భూషణుండు మిగుల పొగిలి పొగిలి 87

ఉ. ఆపుని బుచ్చి చెన్నపురమందు వసింపఁగ నీవు భార్యయుఁ
బ్రాపను సంస్కరించుచును రాఁ దగు నంచును వార్తఁ దెల్ప నా
గుప్తుఁడు దేశికోక్తిఁ దగఁ గొంచు గిమింగ దెను బత్నితోడ భ
క్తాప్తుఁడు నాగభూషణమహాత్ముఁ డెసఁగెనుచోటికి సత్వరిన్. 88

వ. అట్లు వచ్చినశిష్యు నాదరించి. 89

తే. గురుఁడు చెన్నపురమ్మున బరఁగువైద్య
వరుల రప్పించి మనరెడ్డిబాధ దెలిపి
వైద్య మొనరించఁ గాని యోవైద్యమునను
భుజమునొప్పి యొకింతయుఁ బోవ దయ్యె. 90

వ. అప్పుడు భూషణస్వామి యువధానిసహితుండై గ్రంథములఁ బరిశీ
లించి పరమౌషధంబులను వైలంబుల నుత్తమోత్తమ మ్మగువిధ
మ్మున నంతరించి మదరాసున కొన్నంబున నున్న విల్లివాకములో
నొకవిశాలభవన మద్దెకుం దీసికొని బంధువులతో భక్తులతో మిత్రు
లతో రెడ్డిదంపతుల వెంటఁబెట్టుకొని యట విశ్రమింపంజనె నంత.

తే. అచట వేంకటరెడ్డి వైద్యమ్ము నందె
స్వామి చెప్పినచొప్పునఁ బరఁగి పథ్య
పానములు భార్య జాగ్రత్తతో నొనర్ప
నాల్గుపదులు దినమ్ములు నడచి పోయె. 92

సీ. గురు వల్లశిష్యు వేకువజామునన్ లేవ
నాతఁడు లేచియు ధ్యానపద్య
ములు పఠించినపిమ్మటఁ బొసఁగఁ బ్రాణాయామ
మును బొనర్చుచుఁ గొంతదనుక దానఁ

గోలిమిఁ గాల్చిన ధాతుపులమలినత పోవు
నట్టు లింద్రియదోష మది నశించి
యెడకు నిర్మలత యేర్పడఁగ సూర్యాభివం
దనములు గావించి తసరి యవల

తే. సలుపు నాహారము విహార మౌషధంబు
నియమ మేర్పడఁ బ్రీతిదిన చయ మొసంగ
నతఁ డొనర్చుచు గురుశిక్ష కితవుపమచు
నట వసించె నాఁటికి రోగ మది శమించె. 93

మ. నియమాచారము లెల్లఁ జెల్లు నటు లాచిర్ణించి తేజోవిశే
షయుతుం డాగురుమూర్తి బోధనములన్ స్వాంతంబునం దెంచుచున్
నయ మెచ్చం బచరించు రెడ్డికిని గొన్నాళ్లకుం దర్కగా
మయ మంతన్ శమియించె దేశికునసామాన్యప్రభావంబునన్. 94

వ. ఇట్లు వేంకటరెడ్డికిఁ గరాచుయమ్ము శాంతించినంత నొక్కనాఁడు భూషణస్వామి భోజనానంతరము సుఖాసీనుఁడై భార్య వీవన వీచుచుండ నవధానియు నతనిభార్యయు రెడ్డియు నతని భార్యయు నమ్మణమ్మయుఁ గనకాంబయుఁ నమ్మణమ్మపుత్రిక జానకమ్మయుఁ బరివేష్టించి యుండ నందఱు వినుచుండ నిట్లనియె. 95

మ. వినఁ డే నెవ్వరికే నగోచరమునై వెల్గొందుచున్నట్టి చో
టును జేరం దలపోసినాఁడ మఱి యెప్డున్ రా నటంచున్ వచిం
పను గానీ తడవౌ నటంచుఁ దలఁతున్ భక్తాగ్రగణ్యుల్ మిముం
గని మీతోడఁ బ్రసంగముల్ సలుపఁగాఁ గాంక్షించితిన్ విందు రే.

తే. నాపరోక్షమునం దీరు నయము మీఱ
మనత్రిలింగవిద్యాపీఠమును గుఱించి
యెవ్వ రెవ రేమి కార్యము లెట్టు లెట్లు
చేయఁ గల్గుదురో వినఁ జేసితి మది. 97

వ. అనిన నెల్లరు నంతరంగంబుల ననేకవిధంబులఁ దలపోయుచుండి రా సమయంబున భూషణస్వామి సుబ్బావధాని దిక్కు ముఖంబై నీవు దేవసేనానాయకుం డైన సుబ్రహ్మణ్యునిం బోలినవాఁడ వేమి

చెప్పెదుమో చెప్ప మనిన సతంబు కంట నీరు పెట్టుకొనుచు నిలిచి చేతులు మొగిడ్చి గద్గదకంఠంబున ని ట్లనియె. 98

—॰ వీ ర భ క్తు ల కృ త్య ము లు ॰—

శా. స్వామీ ! నేను భవత్ప్రబోధమున నీ దేశంబందుఁ గీర్తించుచున్
క్షేమస్థైర్యజయాభయాదులు ఘటింపం జెన్నార ధర్మప్రచా
రామోదమ్మునఁ దేలుచున్ గురువరప్రాప్తాతికీర్తిన్ జన
స్తోమం బెల్ల నెఱుంగ శక్తికొలఁదిం దోడ్పాటు గావించుచున్. 99

తే. వీరవృద్ధికిఁ దగునట్లు పెద్ద పెద్ద
కార్యములు సేయ యత్నింతు ఘనుల నెందుఁ
జేరునట్లు స్వయంకృషి చేయుచుందు
గురువరాదేశమును బూని శిరమునందు. 100

వ. అనినంత గురువరుండు సంతసించుచు సహబ్రహ్మచారిణి యగు సుప్రసన్నమం జూచి. 101

సీ. సుప్రసన్నా ! విను సుప్రసన్నవు గాక
యే నెట్టివాఁడనో యెఱిఁగి కొమ్ము
వామదేవునివంటి వాఁడను రెడ్డి కు
బేరుఁ డీకనకాంబ విష్ణు వట్టి
దవధాని సేనాని యగు నంజయుం గూడి
నప్డు డీశుఁ డైశ్వర్యమందఁ గలుగు
నటు గానిచో శ్మశానావాసియుఁ గపాల
ధారియు భిక్షాటుఁ డై రహించు
తే. నిట్టిచో నేమిసేయుదు వీవు తెలుపు
మని యడుగ నామె యేమియు ననఁగ లేక
యూరకుండుఁడు నమ్మౌతుఁ డేమొ పలికి
యును మఱియు నిట్టు లందఱు విననఁగఁ బలికె. 102

తే. నేను నీకడ లేకున్న నోనెలంత !
నాదుభక్తులు నీకును నీకుప్రజకుఁ
దగినపెరవులు గలిగించి తనరఁ జేయఁ
గలరు నీదుయోగక్షేమముల నరయుచు. 103

వ. అని పలికి తత్సమీపగతుం డగు రెడ్డిదొర మొగంబు వైచి. 104

తే. నేను లేకున్న యప్పుడు నీవు నీదు
గురుసతికి నామె పిల్లల కరసి రక్ష
ణమునకుం దగినసదుపాయములఁ జూచు
చుండ వలె నని చెప్పుదు నోయి రెడ్డి! 105

ఆ. వల్లె యనుచు రెడ్డి పలికినాతం గన
కాంబ నవ్వధానిఁ గాంచి మీరు
గంటి జెప్ప వోలెఁ గట్టిపెట్టుచుండుఁడీ
యనుచుఁ బలికె రెడ్డి నవ్వె నంత 106

సీ. నిలిచి వేంకటరెడ్డి నెఱి మీఱఁ జేతులు
మొగిచి యిట్లను గురుమూర్తి! వినుఁడు
నాతండ్రి నా కిచ్చినధనంబుతోఁ దృప్తి
పడి భగవద్ధ్యానపరుఁడ నగుచు
మీసేవ చేయుచు మీసమక్షంబున
నే నుండు నట్లు చెప్ప నీరు కాదు
వర్తకం బొనరించి వసువు గణించియు
ధర్మకార్యమ్ములు దగ నొనర్పు

తే. మనుచు నాకు నాదేశించి రందువలన
నేను వర్తక మొనరించి దానివృద్ధి
సలుపుచును బీరసంబంధము లగుపనులఁ
బాలుకొనుచుందు నవధానిపలుకుఁబడిని. 107

తే. నాకు నేమరుపా టెందు నైన కల్గినఁ
దల్లి వలెఁ గనకాంబిక తగ నెఱింగ
సలుపుచును నాకు హెచ్చరికలు వచింప
వలయు నని యామెఁ బ్రార్థించి పలుకుచుంటి 108

మ. అని వెండిన్ వచియించు నిల్చి గురువర్యా! మీరు వాకొన్నచొ
ప్పున నేనాఁడును ధర్మకార్యములు పెంపుల్ గూడ సంధించుచున్
బొనరింపన్ జతనింపుచుండెదను మీబోధంబు లెల్లప్పుడున్
మననంబున్ బొనరింతు సత్కృతులం బారంబు గావించుచున్. 109

తే. వేదశాస్త్రములందును విప్రులందు
దేవతలయందు భక్తియు భావముఁ గల
వాఁడనై ఋషిప్రవచనపద్ధతి మెయి
ధర్మపరిపాలన మొనర్పఁ దనరుచుందు. 110

వ. అనిన సంతసించుచు భూషణస్వామి రెడ్డిసహధర్మచారిణిం బిలిచి
నీ వేమి చెప్పెదు చెప్పు మనిన నప్పడంతి యి ట్లనియె. 111

తే. ఏను నాథ రక్షక ఛాయయే యనంగ
నెప్పుడును మెలంగుచు వారు చెప్పినపని
నేమఱిల్లక చేయుచు నెసఁగుచుందు
నమ్మయందును బీరమం దలరుభక్తి. 112

క. అనఘాని భార్య గనుఁగొని
యనఁలక నీ వేమి చెప్పె దని గురు వపుఁగం
గ వచించె నామె నాథ
త్రవలెఁ మెలఁగం దలంతుఁ దత్త్వద్వియలన్. 113

వ. అంత భూషణుండు. 114

శా. అమ్మాణమ్మను గాంచి యో మనెదు నీ నం చంతలో నీవు రం
గమ్మం గూఁతును బోలెఁ జూచుకొనుచున్ గారమ్ము పేరంగఁ బీ
రమ్మందున్ గడుభక్తిఁ గల్గి యెట నీ తావైన నిం దున్నయ
ట్లెమ్మిన్ జూపుచు దేవకార్యములయందే యుండఁగాఁ గోరుదున్. 

వ. అనిన నామె మీయాదేశమ్ము నం జేసి మీచెప్పినచొప్పునం బ్రవర్తిం
చెద నని చెప్పినంత నమ్మతానందుం డానంద భరితాంతరం
గుండునై యెల్లరం గలయం బరికించి. 116

మ. కనకాంబామణి తాను పీఠమునగ్నై కన్పట్టి మద్భక్తియు
క్తిని దీపించుచునుండి సన్నెహారిగాఁ గీర్తించుచుం బాల్పుమా
నిని యోఁ గావున నేమి చెప్పు దనుచున్ నే నిట్లు ప్రశ్నింపఁగాఁ
బనిలే దైనను మీకు నేఁ దెలియగా వాకుత్తు గర్తవ్యమున్. 117

ఆ. తల్లివోలె మిమ్ము నెల్లవిధమ్ముల
నరయుచుండునట్టి గరిత గాన

నామెయందు వివేక లతిభక్తిఁ గలరయి
మెలఁగ వలయు ననుచుఁ బలుకుచుంటి. 118

తే. ఆమె చెప్పెడుబోధము నామెనసుడుఁ
నేను చెప్పఁగ బోధము నానుడు లని
యమ్మహాసాధ్వియుఁను నాయందుఁ బోలెఁ
బరమభక్తి గలారలై వఱలఁ వలయు. 119

సీ. అంతని ట్లిండఱు నన్నిచందంబులఁ
జెప్పినంతట గురునొప్పఁదలను
విజయమువా డను రెడ్డి వెడలనై సహధర్మ
చారిణి నట నంబ సరస నుంచి
చనినంత నెల్లరు చనిరి మదాసున
కప్పుడు గురువర్యుఁ డతివతోడఁ
బీఠసన్నిధి నుండఁ జేరిమి గావించి
తిరుపతిపురమున కరిగె నవల

తే. మేనగోడలికిఁ రోగ మైన వార్త
విని గురుండు గుంటూరికిఁ జనియె దానిఁ
దెలిసి వేంకటరెడ్డి యత్తలమునకును
నరిగి గురువర్యు దర్శించె నధికభక్తి. 120

క. గురువపుఁ డను రెడ్డీ! నే
నరితిఁ మదాసుపురికి నరిగెద నీవున్
అరమర లాడక నాతో
నరుదె మ్మటఁ గలదు కార్య మని చెప్పటయుఁ. 121

వ. అతం డొం డాడక యంగీకారం బభినయించిన గురువర్యుం డతనిం గూడి చెన్నపురంబునకుం జని కవితిలక నివాసంబున విశ్రమించి కనకాంబం గాంచి జీవయాత్రార్థంబు సర్వసుగమం బగునట్లు హాంసవిజయం బనుపేర దృశ్యకావ్యము గావింపు మని ప్రతిదినంబు నందలిబోధంబులు సశిష్యుండగు నాతఁడు విని యానందించు చుండె నప్పుడు గుంటూరిలోఁ గాన వచ్చిన తుంటికురుపు బాధించు చుండ గురువరుం డది నెత్తుగడ్డ యని యుపేక్షించె రెడ్డియు

కాన నిరర్థక మై నప్పిగలిగించు
నాలోచన సమీపమునుండుఁ జేరఁ

తే. సభలు, మిచ్చెడుగాయత్రి యైన గాని
మంత్రి మైనను శబ్దమునూత్రి గాఁగఁ
బ యుంటిమె మోని యద్దానిఁ ద్రుంచి
బ్రహ్మసాక్షాత్కృతిం బొంది పరఁగ వచ్చు 125

తే. అశ్వశకటంబుపై మన మరుగునప్పు
డశ్వ మలవాటుపడిన తె న్ననుసరించు
నట్లు గాకుండఁ దత్పూర్వపుంది యొక్క
పెట్టు పెట్టినఁ దె న్నెరి గట్టె పిడిచి 126

ఆ. వారువమ్ము బండివానిమార్గముఁ బట్టి
నట్టి చెడుతలంపు లగు ననంగ
మనువు నాత్మలోనఁ గొని ధ్యాన మొనరింపఁ
జెడుగు లెల్ల నడఁగుఁ జటకె లోన. 127

తే. జీవుఁ డాత్మస్వరూపముఁ జెందినపుడు
నిర్గుణుఁడు కర్మరూపము నెఱి వహించి
నపుడు సగుణుండు నాఁబడు నరయ నాత్మ
యే పరబ్రహ్మ మనుచు లో నెంచ వలయు. 128

సీ. కాల్వ దాఁటఁగ మీఁదఁ గలపట్టెపై నడ
చెడువాఁడు నడపట్టు చెడక యుండ
నిలువఁ బెట్టుకొనంగ నెఱిఁ జేతు లాడించు
నటు సగుణారాధనాతిశయము
భక్తిప్రపత్తులు వ్యక్తపఱచు నద్ది
విప్రలంభము నందుఁ బ్రేమ మెట్లు
నాయకులకు నొప్పునో యట్ల యని మన
మూహింపవలయు నేయోజ నైన

తే. నాయికానాయకులప్రేమ మేయెడలను
ననుభవైక వేద్యము కాని యలవికాదు

సీ. అప్పు డెన్మిదినాళ్ళ తడి పక్వమైనంత
మస్త్రముం దిడకయే మఱియు శస్త్ర
మొనరించితిమి నన్నింక బాంధవ్య చయం బయ్యొ
కట్టిదియును నాదు పాప నటంచు
ఘనుఁడు రంగాచారి యనువైద్యుఁ డెచ్చి
చూపిన నాతండు చూచి నాల్గు
దినములలో శస్త్రసముప జేము నగు నివె
సులభసాధ్యం బని పలికి చనియె

ఆ. నప్పుడు మదనపల్లియం దున్న మేనల్లుఁ
డును దినపతి నున్నత కుటుంబ
మును నచటికి జాబులను జూచి వచ్చిరి
యహివిభూషు నారయ నాసఁ జేసి 136

క. కనకమయుఁ గొడుకుసుజ్జలు
వనితయుఁ జుట్టలును శిష్యవర్గము భక్తుల్
అంతమును హరిసంకీర్తన
మొనరుచుచుఁ జెంత నుండి దృఢతరభక్తిన్. 137

ఉ. శోభ చెలంగ భాద్రపదశుద్ధమునందు ద్వితీయఁ బ్రాహ్ణ మం
దా భగవానుఁ డైనహరిదర్శ్యుఁడు కానఁగ వచ్చినప్పు డే
వాభుఁడు కృష్ణభూషణుఁడు స్వాంతమునన్ స్తుతి నాలకింపఁగా
లోభము చేసి తెల్పుటయు లోగిలిలోఁ గలవార లంతటన్. 138

మత్త. వేదపాఠులఁ బిల్వఁ బంచి పవిత్రమై స్తుతిపేయమా
వేదమున్ బఠియింపఁ జేయుఁడు వించు భూషణమూర్తి తా
నేదియు న్మదిఁ నుంచఁ బోవక యీశ్వరున్ స్మరియించుచున్
వేదమున్ విన రేఁబవళ్ళను వీడ కొక్క నిమేషమున్. 139

క. ఆనాఁడె కురుపు చిదికెను
గానీ వేదన శమింపఁగా లే దొకఱుం
తేని యశైనన్ భూషణుఁ
డానందముతోడ వినియె నావేదంబున్. 140

ద్విపదము. అయణాస్మ కస్తూరి యడి కొని వచ్చి
సముఖమ్మునఁ నూటి సంధించుచుండ
గురువర్యుఁ డిది నన్ను గొంచు రక్షింప
గరిమంబు గల దనఁ గా వచ్చు నొక్కొ
కాదు నీ విది తి గాన శేఁ గొండు
నేది తె మ్మని తా వె నింతలో డాని. 147

క. ఆగతి నండియు రెడ్డిని
భాగవతము డెచ్చి చదువ వలయు నని కడుఁ
యోగస్థను బూని భూషణ
భాగవతుం డధికభక్తి భరితుం డయ్యెఁ. 148

సీ. భాగవతం బొకవంక వేఱొకవంక
వేదపారాయణావిష్కృతియును
రామాయణం బొకప్రక్క నింకొకప్రక్క
జీవయూతాత్రిచరితాత్రిస్మృతియును
భగవద్భజనఁ మొకపైపు వేఱొకవైపు
రాగతాళమ్ముసంగరమ్యారవము
కృతితరంగము లొకకేవ నింకొకకేవ
హాదిభాలాపటు లష్టపదులు

తే. నామసంకీర్తనమ్ములు సాగఁగాన
ముపనిషత్ప్రవచనమ్ము సముచితమంత్రి
రాజసంశోభనము నారాత్రి పవలు
సంతతముగ వర్తించె నాస్వామి కెలన. 149

శా. సప్తాహమ్ము లొనర్చునప్పు డెటు తా సత్సంవిధానమ్ము లీ
సప్తాహమ్ములు రాత్రులుం బవలు నా చందంబునఁ సంతతం
బాప్తుల్ మిత్రులు భాతృపుత్రులును భక్తాళుల్ భజింపంగ సత్
క్ష ప్తిఁ భాగవతప్రసంగములం సంకీర్తింపఁ గా నయ్యెడిఁ. 150

సీ. స్వామి యె ట్లున్నది నా మంచిగా నుండె
నుపవత్తులు పల్కు ముచ్చగతుల

చిత్రరీతిం గననై క్రియాక్రమంబులుగాఁ జిక్కాడుచుం జేరెఁ ద్వి
ట్ప్రతిబింబంబునయందుఁ దేజ మది దివ్యప్రాభవం బేర్పడఁగ. 163

వ. అంత నమృతానందశిష్యప్రశిష్యులును బంధుమిత్రాదులును గళత్రంబును బ్రాకృతుల తెఱంగున దుఃఖించుచుండ నప్పుడు సుబ్బావధాని గంగాజలంబున నమృతనాథుని కళేబరమ్మునందు శతరుద్రీయంబున మహాన్యాసపూర్వకంబుగా నభిషేకంబు గావించి క్షీరాంబరంబులు గట్టి పుష్పమాలాలంకృతంబు గావించె నంత నందఋను నానావిధపుష్పంబులను దులసీబిల్వపత్రంబులను విష్ణుసహస్రనామంబులఁ బూజించి ధూపదీపనైవేద్యంబులు గావించి రంత నవధాని గురుకళేబరంబునకుఁ బ్రదక్షిణనమస్కారంబు గావించి పశ్చాద్భాగంబునఁ బదంబులకడ నిలిచి చేతులు దోయిలించుకొని కనుల నీరు వెట్టుకొనుచు. 164

సీ. కన్నకొడుకు వోలె గనుఁగొంచు నతిశంబు
నను నక్కటికమునఁ గనెడుగురుఁడు
ఘనతరధ్వాంతము నను గూలఁ బడియున్న
న న్నుద్ధరించిననాదుతండ్రి
నామాటమంత్రమై నలువురిలోఁ జేసి
నాకుఁ బే రిచ్చినలోకనుతుఁడు
సాగరంబునఁ బడి చావఁగా నుండిన
నను దేవయై తేర్చుకొనిన మేటి

ఆ. కన్నతండ్రికన్న నెన్నో మడుంగులు
నన్నుఁ గాచి ప్రోచునాగురుఁడు
నాదుతండ్రి మఱియు నాదుదైవం బిట్లు
కాలధర్మ మొందెఁ గట్ట! కట్ట! 165

వ. గురుపత్ని నోరును నెత్తియు మొత్తుకొనుచు 166

క. నీవే దైవమ వనుచున్
భావించి భజించుచుంటి భావమునం దిఁక
దేవర! నాకుంకుముబొ
ట్టీవరుస నశించె నింక నే మనుదానన్. 167

వ. కనకాంబ చేతులు జోడించుకొని. ౧౬౮

శా. నన్నుం గన్నకుమారివో లె మిగులన్ గారంబునం గాంచుచున్
గన్నాకై నవపథంబునన్ నిలుపుచున్ జ్ఞానోపదేశంబునన్
దన్నుం దాన యెఱుంగఁ జాలినమతిన్ వర్తింపఁగాఁ జేయుచున్
బన్నంబుల్ దెగఁ గోసి వాసి గలుగం గావించి తో దేశికా. ౧౬౯

క. అమరుఁడవై నాయింటన్
సుమములఁ బూజింపఁ బడుచు సుమనస్కులతో
నమృతానందుఁడవై యుం
డి మమ్ముం గరుణింప రమ్మ నేఁ బ్రార్థింతున్. 170

వ. వేంకటరెడ్డి చేతులు గట్టుకొని 171

చ. గురువర ! నీగురుత్వమును గొన్న మొదల్ సకలప్రపంచ మి
వ్వరుసది యం చెఱింగికొని వర్తిల నేర్చినవాఁడ నైతి నా
సిరియును నాఁడునాఁటికిని జెప్పఁగఁ జొప్పడుచుండె ధన్యతా
గరిమ నెసంగుచుంటి నినుఁ గన్గొనఁ గన్గొనఁ గల్గియుండుటన్. 172

ఆ. మృతుఁడ వైననీ వమృతుఁడ వే యని నిన్ను
శ్రీనివాసపీఠసీమ నిలిపి
కొలుచుచుండి నీదు పలుకుబడిని జేసి
సకలధర్మములను సలుపుచుందు. 173

క. ఎపుడే నజ్ఞానంబున
విపరీతపుదారిఁ బడినవిధ మెఱిఁగి వనున్
గృపతోడఁ గాచి పుచ్చుము
సుపరిష్కృతమతిగఁ జేసి సుమనోనాథా. 174

వ. అంతఁ దక్కనుం గలవారు నొక్కొక్కవిధంబున నమృతానంద
నాథుం బలుకుచున్నసమయంబున సుమసందోహంబుల నానందిం
గట్టి పట్టుబుట్టంబులతో గురుకళేబరం బందుఁ జెట్టి పరమాత్మ
వంబు గావించుచు రుద్రభూమికిం దోడుకొనిపోయి చందనాగురు
తరువరంబుల నక్కళేబరం బగ్నిసాత్కృతంబు గావించి రని చెప్పిన

చిత్రరీతిం గన్నైనె క్రమక్రమముగాఁ బ్రజ్ఞానుభవుం జేరెఁ ద్వి
ట్ప్రతిబింబంబునయందుఁ దేజ మది దివ్యసాక్షిత్వం బేర్పడన్ 163

వ. అంత నమృతానందశిష్యప్రశిష్యులును బంధుమిత్రాదులును గళత్రంబును బ్రాకృతుల తెఱంగున దుఃఖించుచుండి రప్పుడు సుబ్బావధాని గంగాజలంబున నమృతనాథుని కళేబరమ్మునందు శతరుద్రీయంబున మహాన్యాసపూర్వకంబుగా నభిషేకంబు గావించి పీతాంబరంబులు గట్టి పుష్పమాలాలంకృతంబు గావించి యంత సందఱును నానావిధపుష్పంబులను దులసీబిల్వపత్రంబులను విష్ణుసహస్రనామంబులఁ బూజించి ధూపదీపనైవేద్యంబులు గావించి రంత నవధాని గురుకళేబరంబునకుఁ బ్రదక్షిణనమస్కారాదులొనర్చి పశ్చాద్భాగంబునఁ బదంబులకడ నిలిచి చేతులు జోడించుకొని కనుల నీరు వెట్టుకొనుచు. 164

సీ. కన్నకొడుకు వోలె గనుఁగొంచు సతతంబు
నను నక్కుటికఁ గనెను గురుండు
ఘనతరధ్వాంతము నను గూలఁ బడియున్న
న న్నుద్ధరించిన నాదు తండ్రి
నామాటమంత్రమై నలువురుమిఱఁగఁ జేసి
నాకుఁ బేర్దెచ్చిన లోకనుతుఁడు
సాగరంబునఁ బడి చావఁగా నుండిన
నను దేవరై తేర్చుకొనిన మేటి

ఆ. కన్నతండ్రికన్న నెన్నొ మడుంగులు
నన్నుఁ గాచి ప్రోచునాగురుఁడు
నాదుతండ్రి మఱియు నాదుదైవం బిట్లు
కాలధర్మ మొందెఁ గట్ట! కట్ట! 165

వ. గురుపత్ని నోరును నెత్తియు మొత్తుకొనుచు 166

క. నీవే దైవమ వనుచున్
భావించి భజించుచుంటి భావమునందున్
దేవర! నాపుణ్యముగా
ట్టీవరుస నశించె నింక నే మనుదానన్. 167

వ కనకాంబ చేతులు జోడించుకొని. 168

శా. నన్నుం గన్నకుమారివోలె మిగులన్ గారాబునం గాంచుచున్
గన్నాకైనపథంబునన్ నిలుపుచున్ జ్ఞానోపదేశంబునన్
దన్నుం దాన యెఱుంగఁ జాలినమతిన్ వర్తింపఁగాఁ జేయుచున్
బన్నంబుల్ దెగఁ గోసి వాసి గలుగం గావించి తో దేశికా. 169

క. అమరుఁడవై నాయింటన్
సుమములఁ బూజింపఁ బడుచు సుమనస్కులతో
నమృతానందుఁడవై యుం
డి మముం గరుణింప రమ్మ నేఁ బ్రార్థింతున్. 170

వ. వేంకటరెడ్డి చేతులు గట్టుకొని 171

చ. గురువర ! నీగురుత్వమును గొన్న మొదల్ సకలప్రపంచ మి
వ్వరుసది యం చెఱింగికొని వర్తిల నేర్చినవాఁడ నైతి నా
సిరియును నాఁడునాఁటికిని జెప్పఁగఁ జొప్పడుచుండె ధన్యతా
గరిమ నెసంగుచుంటి నినుఁ గన్గొనఁ గన్గొనఁ గల్గియుండుటన్. 172

ఆ. మృతుఁడ వైననీ వమృతుఁడ వే యని నిన్ను
శ్రీనివాసపీఠసీమ నిలిపి
కొలుచుచుండి నీదు పలుకుబడిని జేసి
సకలధర్మములను సలుపుచుందు. 173

క. ఎపుడే నజ్ఞానంబున
విపరీతపుదారిఁ బడినవిధ మెఱిఁగి నను
గృపతోడఁ గాచి పుచ్చుము
సుపరిష్కృతమతిగఁ జేసి సుమనోనాథా. 174

వ. అంతఁ దక్కునుం గలవారు నొక్కొక్కవిధంబున నమృతానంద
నాథుం బలుకుచున్నసమయంబున సుమనందోహంబుల నానందిం
గట్టి పట్టుబట్టంబులతో గురుకళేబరం బందుఁ జెట్టి పరమోత్స
వంబు గావించుచు రుద్రభూమికిం దోడుకొనిపోయి చందనాగురు
తరువరంబుల నక్కళేబరం బగ్నిసాత్కృతంబు గావించి రని చెప్పిన

నైమిశారణ్యవాసు లమృతానందనాద ప్రతిష్ఠితం బగు శ్రీ విద్యాశరం బెవ్విధంబున నుండె భక్తు లెవ్విధంబునఁ బ్రవర్తించుచుండి రవ్వలి వృత్తాంతంబును వినవేంచితిమి చెప్పు మని సునడుగుటయును.

— ఆశ్వాసాంతము —

సుగంధి. వేడికోలు రాక మున్నె వేనవేలు సొమ్ములన్
గూడు నర్థికోటి కిచ్చి కోర్కి దీర్చుదాత నే
లాడువాఁడు వేంకటాఖ్యు నైనరెడ్డి వానికిన్
వీడనట్టి సౌఖ్యమిచ్చి వేడ్కఁ బ్రోవు మీశ్వరా.

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబున
నవమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు.

# అ మృ తా నం ద ము



## ద శ మా శ్వా స ము

యమృతానందున కిడి
సాయుజ్యము శిష్యశిష్యసద్భావమునన్.
బాయక బెజవాడపురిన్
శ్రేయములం గూర్చు చుండు శ్రీపరమేశా! 1

అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె న ట్లమృతానందుండు దేహత్యాగంబు చేసి దివంబునకుం జను నప్పుడు తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠాధిదైవమునుం దలంచుకొనియెం గావున "యాం తే మతి స్సా గతి" యను న్యాయంబున నాతండు శ్రీనివాససాయుజ్యంబు నొంది త్రిలింగవిద్యాపీఠస్థితుం డయ్యె ననంతరంబ. 2

—• పీఠపూజ జయంత్యుత్సవము •—

మధురసపురమందు మనభూషణస్వామి
యట్లు నిర్యాణము నందినపయిం
గాలేజి కార్నెలల్ కనకాంబ సెల వొంది
తిరుపతిపురమున కరుగుదెంచె
స్వామిభార్యాసుతుల్ చనిరి మాతృగృహంబు
పోషకభృతి రెడ్డి పొందుగ నిడ
సృష్టి మైంజగంబు సృష్టి వెంజియును సృ
ష్టించి నట్లు గురుండు చేసినవియుం
జెప్ప నవి యైనకార్యముల్ చేసి రపుడు
పీఠవిధు లెల్లభక్తులు వెనుకటి వలె
లోటుపాటులు లేకుండ మేటి యైన
దేశికుడు లేనిలోపము తెలియనట్లు. 3

క. పంచాయతనార్చనలు స
మంచితపాషాణపూజ లభిషేకములుం
గొంచెము పడ నీయక సా
గించుచు భక్తులు త్రిలింగపీఠమునందున్. 4

తే. జీవయాత్రాపురాణముల్ సిద్ధబోధ
ములును బరమయోగాభ్యాసములు మొదలగు
నెల్ల నవధాని కనకాంబ యెప్పుడు విడక
నడపుచుండిరి పీఠార్చనలును భక్తి. 5

ఉ. వేంకటరెడ్డి దేశికునివిగ్రహ మెంతయు వింతగాఁ గడున్
బొంక మెసంగఁ జేసికొని భూషణనామము సార్థకంబుగా
నంకిలి లేక తిర్పతికి నాఁతఁడు దెచ్చె ననంతరంబునన్
వేంకటనాథుచెంత నది విన్నను దొప్పఁగ నిల్పె రొప్పుగన్. 6

తే. కృష్ణభూషణుఁ డప్పు డావిష్ణుభూష
ణుం డయి తలిర్చె లేక విష్ణుండ యయ్యె
ననుచు నానందకందళితాంతరంగు
లై తగం గొల్చి రప్పు డద్వైతభక్తి. 7

మ. గురునిర్యాణదినంబునన్ వ్రతము భక్తుల్ వర్షవర్షంబు భా
స్వరరీతిం బొనరింపఁగాఁ దలఁచియున్ వారప్డు యోజించి యీ
శ్వరుఁ డాతండు మృతించె నంట తగ దేవంరీతిఁ దన్నామమే
పరికింపం దెలియంగఁ జేయు ననుచున్ భావించి యప్పిమ్మటన్. 8

క. అమృతునకు మృతి ఘటించుట
సముచిత మని తలఁప కచటిసజ్జను లెల్లన్
బ్రమను లయి జన్మదినమున
నమరెడిని జయంతి శంకరార్యునకు బలెన్. 9

వ. అని యేకగ్రీవంబుగ నిశ్చయించి గురుమూర్తి జన్మదినం బగు కార్తిక బహుళదశమిన్ జయంత్యుత్సవము సలుపువారై పదియుం దొమ్మిది నూర్లముప్పదిమూఁడవహూణవత్సరంబునఁ దిరుపతిపురంబున నెల్లర నాహ్వానంబు గావించి పీఠసన్నిధిం గల

పర్ణశాలయందు మహోత్సవముఁ గావించి గురుబోధనలు సంప్రదాయములు లోనగు వివిధవిషయంబులం గూర్చి మహోపన్యాసంబులు గావించి జీవయాత్రయందు రామాయణమునందుఁ బరీక్షాపత్రికను లిచ్చి యందుత్తీర్ణులయినవారికి బహుమతుల నొసంగి యిట్లు లా పయివత్సరంబును జరిగె నంత. 10

— కన్యాకుమారీ క్షేత్రము —

సీ. అరయేటఁ గనకాంబ కారోగ్యమది చెడఁ
గుత్తాలమునఁ జల్వకును నిలంగ
నవధానిముఖులు త న్ననుసరింపఁగ నామె
యరిగి యౌషధసేవ యాచరించు
చును నూర్వుఁ గొల్చుచు మనువు జపించుచు
నలజీవయాత్రను హంసవిజయ
నాటకంబుగఁ జేయ నాఁడ గుర్వాజ్ఞయై
నది గానఁ దదర్చనం బొనర్చఁ

తే. గడఁగి కుత్తాలమున నుండి వెడలి రెడ్డి
సతియు నవధానిముఖ్యులు నతికి రాఁగఁ
దరలెఁ గన్యాకుమారిక్షేత్రమును జూచు
వేడ్క నమ్మహాదేవి సేవించుకొంచు. 11

వ. ఆకన్యాకుమారీ విగ్రహంబు. 12

మ. కలదృశ్యంబు ల వన్నియుణ్ లయము గాఁగణ్ బంధురధ్వాంతమై
తిలకింపం దగుస్థానముల్ గడచి పైతేజంబు వీక్షించుటల్
దెలియం జేయుచు నున్న వో యనఁగ నుద్దీపించు కన్యామణీ
విలసద్దేహసముద్భవద్ద్యుతులు భావింపంగ నాశ్చర్యమై. 13

తే. కాశ్యపికిఁ జిట్టచివరిభాగంబునందు
నప్పరాశక్తి తనదృష్టి యవనినుండి
త్రిప్పి రత్నాకరముపంకఁ జేరి చూచు
చుండె నయ్యగ్రమునయందు నొప్పు మీఱి. 14

మ. పదిరెండేడుల బాలికామణి రేసన్ భాసిల్లుచున్ నిల్చి మే
మదిలాక్కట్యతులన్ రహించునది సైమె రౌప్యన్ పుష్పాలంకృతిః
బొదలింపం బడు మూడురత్నములు రేఫుల్ మాపు లర్యాకజన
హ్లాదశం గైకొని యెల్లచీకటుల మూయింపంగనై యుండెడిన్

చ. కలకల లాడు నామె ముఖకాంతులు వింతగ నల్కలంకలన్
గల యటగం బర్వి లోకములం గాతును బోవ్తు నటంచుం దెల్పున
ట్టులు కనవచ్చు తేజము కదంగ నడ హెచ్చంగ భార్గవాన్వయో
జ్జ్వలుం డగురాముని నర్మముచుస్వాంత మదెంతయువింతగొల్పుచున్.

ఉ. కశ్యపువేత నోటువడి కారియ నొందుచు భార్గవుం డొగిన్
కాశ్యపి నుడరాదనెడుకట్టడి కైపిడి వచ్చి యిన్చొటన్
వశ్యతహోమహత్వమున వార్ధి ధరన్ సృజియించి యెన్నన్
వశ్యము గాని వైఖరి బొనరి, భజించెను బేర్మి పెంపునన్. 17

మ. అమృతానందు భక్తు లాత్రిజగదధ్యక్షున్ గుమారీమణిన్
సుమసందోహమునన్ యజించి రపు డెంతో వింతగా దేవిపా
దమునం దుండెడుపుష్ప మొం డెగిరి మోదం బేర్పడం గాంచనాం
బముఖంబందుం బడెన్ ప్రసాద మనుచున్ భక్తుల్ ప్రశంసింపఁగన్.

క. సుబ్బావధాని యప్పుడు
గొబ్బున నాపువ్వు చేతం గొని కనకమకున్
జబ్బపమృత్యువు వోవన్
బ్రిబ్బసభక్తిన్ మహేశు భజియింతు మిటన్. 19

వ. అని దేవికి మొక్కి యానిర్మాల్య మాకనకాంబకరంబునం బెట్టె
నపుడు వేంకటరెడ్డియు మన కింక దేవియనుగ్రహంబు లభించె
నని సంతసించె. 20

మ అట సందర్భంబున కంటి యున్న గిరిపై నత్యంతనిష్ఠన్ సము
త్కటతేజుం డగురామకృష్ణునకు వేడ్కన్ గూర్చి శిష్యుండు ప్రి
స్ఫుటవిద్యానిధి యా్నరేంద్రుడు తపంబుం జేసి తత్సిద్ధి నిం
కటిలోనం గొనె నంచుం జెప్పుదురు తత్రిత్యుల్ కడుం బ్రాజ్ఞతన్.

సీ. అట్టి మహాశక్తియైన కన్యాకుమా
రీదేవిని భజించి మోద మొప్ప
స్వామి భక్తులు స్వదేశ పరిదర్శనలాల
సు లయి యచటినుండి వెడలి చనిరి
కనకాంబ నెలలోన కడ ముట్ట హంసవి
జయ మొనర్చెను మేను నయముపడుట
నుద్యోగ మొనరింప నూనె వెండియు నవ
ఖాని ధర్మప్రబోధము పూనిక్కు
తే. వాఁడయె దేశదేశముల్ సరుసఁ దిరిగి
ప్రజలకుం బోధ మొనరించుచరియుఁ బీర
కార్యమును దాను నెఱవేర్పఁ గలిగి కొనుచు
స్వామిభక్తులలో స్తోత్రపాత్రుఁ డయ్యె. 22

తే. అట్లు చేయుచు నుండియు నవ్వధాని
కృష్ణనిర్యాణ మెప్పుడైనట్లు నరుఁడు
తా విగతవీర్యుఁ డైనని తలఁచె నట్లె
తాను నొక్కింత కాలము తలఁచు చుండె. 23

తే. అమృతనాథుని భక్తు లయ్యానఘుసంప్ర
దాయ . జగమ్మునన్ నిల్పఁ దలఁపుఁ జేసి
పుడమిజనులకుఁ దద్బోధములు సతతముఁ
దెలిపి విజ్ఞానులుగఁ జేయఁ గలిగి రపుడు. 24

చ. పుడమినిఁ బాతువిత్తనము పుట్టి యొకింతఁగ నైకక్రమంబునన్
గడుకొని వృక్షమై పువులు కాయలు పండ్లును గల్గి దేశమం
దడరెడునెల్లరం దనియునట్లుగఁ జేసెడురీతి భూమణుం
డిడినసుబోధ ముర్విపయి నెల్లెడలన్ ఫలదంబ యై తగెన్. 25

సీ. గుహాలలోఁ దపియించు గోవిందయోగీంద్రు
శిష్యత్తల్లజుఁ డయి చెన్ను మీఱు
శంకరాచార్యుఁడు సహాశిష్యుఁడై ధర
నద్వైతమతము మహత్తరముగ

స్థాపించినట్టిదై దీపింపఁడే రామ
కృష్ణపరమహంస కీర్తి మగుచు
నమలతత్త్వము వివేకానందముఖ్యశి
ష్యులు విస్తరింపఁగా సలుప లేదె

తే. అట్టి లోకవిభూషణుఁ డైనకృష్ణ
భూషణుం డమృతుండు తదోక్తిఁ దము లవి
శిష్యు లాంతరంగికభక్తశేఖరు లగు
వారు వెలయింపఁ జేసిరి వసుధయందు. 26

ఉ. ఆసమయంబునందుఁ గనకాంబిక చెన్నపురంబునం గమున్
భాసిలుసౌధమున్ నయనపర్వముగాఁ బొనరించి యిందిరా
వాసునిదివ్యపీఠము శుభంబుగఁ దిర్పతినుండి తెచ్చి య
చ్చో సమకూర్చి నిల్పుటకు సూచన చేసె వధానికిన్ దగన్. 27

తే. అతఁడు దానికి నౌ నని యనుమతించి
తనకుటుంబముతో బంధుజనులతోడ
వేంకటేశ్వరపీఠమున్ వేడ్కఁ దెచ్చి
కవితిలకకుటీరమునందుఁ గడక నిలిపె. 28

వ. తదనంతరంబ భక్తు లెల్లరును గూడి పీఠకార్యసమాలోచనా
యత్తచిత్తులై. 29

సీ. ఆర్యవిజ్ఞాన మయ్యది నశింపక యుండ
నోమంగ జతనించు చుండ వలయు
విత్తనాల్ బలె నార్యవిద్యలు చెడకుండ
నిలుపంగ వలయును బోలుపు మిగులఁ
గవిపండితులయందుఁ గలమహత్త్వ మెఱింగి
పీఠముదెస గౌరవింప వలయు
విద్వద్వరేణ్యులు విఖ్యాతు లగువార
లేటేట బహుమతు లీయ వలయు

తే. నిట్లు చేసినపీఠము పృథివిజనుల
కరయ నాదర్శకపాత్రియై మగును దాన

నవని ధర్మానురక్తి విద్యాప్రసక్తి
ప్రబలఁ గల దని యెంచుట భవ్య మగును. 30

వ. అది యట్టిదకావున. 31

—౹ అమృతానందనాథ ప్రథమ పారితోషికము ౹—

క. ఈయేడు గురుజయంతికి
నేయొక్కఁడొ పండితేంద్రుఁ డీవిద్యాసీ
తాయతపూజం గైకొన
నై యుండఁగ వలయు ననుచు నాశించి రెదన్. 32

తే. అపుడు కనకాంబ యీయేట నగుజయంతి
కేను బండితసత్కృతి కిత్తు నూఱు
పదియు నాఱు రూప్యమ్ము లాసయి నెసంగఁ
నంతకును రెడ్డి గలఁ డని స్వాంత మగును. 33

తే. కార్తికిక మంతఁ జనుదెంచెఁ గవులు శాస్త్ర
విదులు పండితులున్ జగద్విదితయశులు
ప్రభువులున్ భక్తులును రాఁగ వలయు ననుచు
నందఱకును నాహ్వానము లనుపఁ బడియె.

మ. అమృతానందబహూకృతిన్ బ్రథమమం దర్పింప నేపండితో
త్తముఁ డీదేశమునం దలిర్చెడిని విద్వద్వర్యుఁ డెవ్వాఁడు వే
ని మనం బార్యమతప్రవిష్ట మెవనిన్ గీర్తింతు రుర్వీజనుల్
సుముఖుం డాతని నెంచి చేయ నగు సంస్తోత్రార్హభవ్యార్హణల్.

క. "విశ్వశ్రేయః కావ్య మ
నశ్వర" మని దేవమునులనానుడికతనన్
శశ్వత్కావ్యకృదగ్ర్యక
వీశ్వరు లాద్యర్చనీయు లెన్న ధరిత్రిన్. 36

తే. కవి శుచి యటంచు శ్రుతి చెప్పఁ గానఁ గవులు
ఘనులు రామాయణము చెప్పఁ గలిగి పుట్ట
పుట్టువు పురాణములు చెప్పి మున్ను రేగు
గడ్డఁ బుట్టినమునియును ఘనతఁ గనిరి. 37

38

తే. అలసురయాజుఁడు నిజకవిత్వాతిశయము
వలన సూర్యసాక్షాత్కారము లభియింప
నధికుఁ డయ్యె నైషధమున హర్షకవి ము
ఖగద మెల్లఁ బోఁ గొట్టుకోఁ గలిగెఁ దొల్లి. 38

— కవిసార్వభౌమ ప్రశంస —

సీ. ముగురు మూఁడు శతాబ్దముల కెట్లొ వ్రాసిన
భారత మొకచేత వ్రాయఁ గలిగె
మఱి నూటయేఁబది వరకావ్యములు చేసి
కవిసార్వభౌమ విఖ్యాతిఁ గాంచెఁ
బంచగంగాంచిత స్వర్ణాభిషేకము
విరచించి రటు వేదవిదులు చేరి
వేనవేల్ పండితుల్ వినుతింప గండ పెం
డేరమంజీరము తీరి తాల్చె
తే. వేదశాస్త్ర విద్వర్యుఁడు వైదిక ప్ర
వర్తకుండయి శ్రౌతసంపద్వరిష్ఠుఁ
డయి మహామంత్రి తంత్రజ్ఞుఁ డయి తలిర్చుఁ
గృతివిశదకీర్తి శ్రీపాదకృష్ణమూర్తి. 39

ఉ. ఆతఁడు రాణ్మహేంద్రపురమందు వసించును నగ్నిపూజకుం
బ్రీతి నొసంగ నగ్నుఁ డయి పిల్చిన వచ్చును వచ్చినట్టి యు
ద్భూతచరిత్రునిం దెలిచి మున్ను బహూకృతి నాచరింత మం
చాతరుణంబునం గలుగు నందఱు నిశ్చితచిత్తులై రటన్. 40

సీ. ఆరీతి ప్రకటించి యమృతవర్ధంతికి
నాహ్వానములు చేసి రాప్తు లైన
సంపన్నులకును భూస్వాముల కిది దిక్ప్రి
దర్శనంబుగ నుండఁ దగు నటంచు
నెంచి బాణాగ్నిధాతృహిమాంశుసంఖ్య నా
నబ్దమునందుఁ బీఠాంతికమున
సభ చేసి రా సభాస్థలమున కరుదెంచి
పెక్కువిద్వాంసులు విదుషీమణులు

తే. అపుడు శ్రీకాశినాథాన్వయాగ్రగణ్యుఁ
డైన నాగేశ్వరుఁడు సభాధ్యక్షుఁ డగుచు
నగ్రపీఠముపై నెక్కి యార్యు లెన్ను
పగిది గంభీరముగ ని ట్లుపన్యసించె. 41

ద్విపద. అమృతనాథస్వామి కగుజన్మమహము
సుముఖతఁ బొనరింపఁ జొప్పడు నిట్లు
కవిసార్వభౌముని గౌరవించుటయుఁ
దవు నని వర్ణింపఁ దగు నెల్లరకును
గలియుగాధిపుఁడు వేంకట నాయకుండు
వెలయించుచుండు నీ పీఠంబుఁ బేర్మిఁ
గళలందు సాహిత్యగరిమంబునందు
సలలితతత్త్వశాస్త్రమునందు దీని
కెన యగుసంస్థ యొం డెద్దియు లేద
యన వచ్చు జగతి మహావిద్య కిద్ది
నిలయమై యొప్పెడు నిర్మించె దీని
నలయమృతానందుఁ డనఘుఁడు వాని
జన్మదినోత్సవ సమయంబునందు
సన్మాన మిట్టు లీసార్వభౌమునకుఁ
జేయుట యెంతయు శ్రేయఃప్రదంబు
వే యేల బహుకృతుల్ వెలయించినట్టి
పుణ్యమూర్తి యితండు పూజ కర్హుండు
వాణ్యవతార మీవసుధలో రాజ
కీయాదులఁ సేవఁ గీర్తింపఁ జేయు
నాయుద్ధతులకంటె నధికుండు సుకవి
యాతనికృషి నిల్చు నాచంద్రతార
మేతదర్థము మది నిడుకొని నేను
నగ్రాసనాధిపత్యము నిర్వహింప
నగ్రపూజ నొనర్తు నాకృష్ణకవికి! 42

వ. అని సభాహ్వానంబుగాఁ గర్పూరతాంబూలాంబరాభరణాదులతో మాటపదియాఱురూప్యంబు లొసంగె నంత సుబ్బావధాని ప్రభృతులు గద్యపద్యములతో వివిధవిధంబుల నుపన్యసించి రమృతానందుని చరిత్రి సంగ్రహముగాఁ జెప్పి ప్రీతాశయంబులం బేర్కొనిరి. పిమ్మటఁ గనకాంబికామణి యుపన్యసించుచు "యస్మిన్ తుష్టే జగ త్తుష్ట" మనునట్లు కవిసార్వభౌము నారాధించుట సకల లోకము నారాధించిన ఫలంబు నొందినట్లు మే మానందించుచున్నార మని యనేకోదాహరణములతో ననేకపద్యంబులు పఠించె నంతఁ గవిసార్వభౌముఁ డించుక యుపన్యసించి. 43

—• శ్రీకృష్ణపద్యములు •—

మ. అజరుం డై యమృతుండునై యమలుఁడై యానందనాథుండు నై
యజరుద్రాంచితకృష్ణభూషణము నై హార్ద్రాందుబ్రహ్మంబు నై
త్రిజగద్వంద్యపదాభిషిక్తుఁ డగుచున్ దీపించుమాదేశికున్
నిజహృత్పద్మమునందు నిల్పి సతమున్ సేవించి భావించెదన్. 44

చ. తనవరసౌధమందు గురుదైవసమంచితసత్యపీఠమున్
మునిజనసంప్రదాయమును బోహణఁ జేసి గురూక్తపద్ధతిన్
బొనరిచి మూడుప్రొద్దులను బూజ లొనర్చుచుఁ బుణ్యవిగ్రహం
బనఁ దగి ధన్య యైనకనకాంబ కెనంగుఁ జిరాయురున్నతుల్. 45

ఆ. జీవయాత్రితోడఁ జెల్మి వాటింపఁగ
హంసవిజయ మనెడునట్టినాట
కము రచించి భక్తసమితికి ముక్తిమా
ర్గప్రదాత్రి యయ్యెఁ గనకమాంబ. 46

ఉ. సప్తతిజన్మవత్సరలసన్మహముల్ పొనరించుకొన్నస
న్నాప్తులు మేలు నాఁ బిలిచి యఃగ్గురునాథజయంతినాఁడు వా
గ్గోష్ఠ యితం డటంచు సభికుల్ వినఁ బల్కి బహూకరించె నా
గుప్తమహాత్ముదార్థ యగుకోవిదురాల్ కవిగౌరవంబునన్. 47

చ. ధనము ప్రభావ మా బహువిధంబుల దాని గడింప వచ్చు వే
లను సమకూర్చ వచ్చు సభలన్ బుధు లెన్నఁగఁ గొన్నకాచమే

ఘన మగు కాంచనాద్రి కెన గల్గి ముదం బొనఁగూర్చు నాకు నీ
కనకము కాంచనాచలముకంటెఁ ఘనం బగుగౌరవం బిడెన్. 48

ఉ. నన్నయభట్టు తిక్కసుకవి నాచనసోముఁ డితం డటంచు న
న్నెన్నుట కే నొడంబడ నొకింతయుఁ గాని నుతించినందునన్
భిన్నము గానిప్రీతి గనిపించు నటంచుఁ దలంచి జీవయా
త్ర న్నడికెక్కు కాంచనముఁ బత్త్రపుదుత్తర సన్నుతింపెదన్. 49

— జయపురాధీశ్వరు నాధిపత్యము —

వ. ఇట్లు ప్రథమసన్మానజయంతి జరిగిన పదంపడి కొన్నినాళ్లకు జయపురాధీశ్వరుం డగు విక్రమదేవమహారాజచంద్రము నగ్రాసనాధిపత్యమున శ్రీమత్తిరుమలశ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠ పక్షమున నొక్క మహాసభ గావింపంబడె నందు విద్యాపీఠమున నొనరింపంబడు నార్యవిజ్ఞానబీజసంరక్షణ విధానము నిర్ణయింపఁ బడిన దపుడు తొల్లి కావించినయమృతానందనాథ సందేశం బిట్లు చదువం బడియె. 50

సీ. లోకకల్యాణము లోఁ గాంచి జను లార్య
విజ్ఞానముం బ్రోవ వెలయ వలయు
గాయత్రి నెఱిఁగినఘనులె ధర్మము నిర్వ
హింప బోధంబు గావింప వలయు
వేదవేదాంగముల్ వివిధకళలెసంగు
రీతి బుధుల సత్కరింప వలయు
నొక్కొక విద్యలో నొక్కొక్కరుని నైన
జ్ఞానబీజము నిల్ప సాఁక వలయుఁ
తే. గాలవశమున బహుళత గాక యున్న
సంస్కృతమ్మునఁ గలతత్త్వసార మెల్ల
నాంధ్రమున జ్ఞానలబ్ధికి ననువుపడుక్ర
మమున నుండెఁ ద్రిలింగపీఠమునయాము. 51

ఆ. ఇట్టిపీఠమునకు నీ త్రిలింగాఖ్యదే
శమున కొం డొకండు సాఁకి కొనెడు
శక్తి గలుగునట్టిసంకల్ప మీశ్వరుఁ
డెల్లనాఁ డనుగ్రహించుఁ గాక. 52

వ. అట్టి మహోన్నతసందేశమును జదివి తదర్థ మెల్ల నిర్వహించి రంతఁ బదియు౦ దొమ్మిదివందల ముప్పదియాఱవ వత్సరంబున. 53

సీ. గురుజయంతికి మున్న కొన్నిదినంబుల
క్రిందటనే శ్రుతిస్మృతిపురాణ
విజ్ఞుఁ డామ్నాయార్థవిద్యా వాచస్పతి
వడలివంశభవుండు బ్రహ్మవేత్త
సూరి లక్ష్మీ శ్రీపూర్వనారాయణుం డను
శాస్త్రి వర్యునిఁ దెచ్చి సదమలమతిఁ
బీఠసన్నిధియందు వేదార్థము వచించు
నట్లు వేడఁగ నతం డనుదినంబు
తే. శ్రుతులలో ముఖ్యఘట్టముల్ చూచి విశద
ముగ వచించెను బెక్కు- రవ్వారమువారె
గాక వ్రిక్కయూళులవారు గదలి వచ్చి
విని ముదంపడి మెచ్చి రాఘనుని ఖివుల. 54

వ. ఇట్లొక్కమండలంబు కడచనినంతఁ గార్తిక కృష్ణదశమి సమాగతం బయ్యె నాఁటిగురుజయంతి తొల్లిటివలె మహోత్సాహంబునం బ్రవర్తిల్లెఁ బలువురుమహాపండితులు చనుదెంచి సభ నలంకరించి రా సభకుఁ గవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి యగ్రాసనాధిపత్యము వహించి. 55

## —• ధాతృసంవత్సర పారితోషికము •—

సీ. ఆంధ్రదేశంబునయందె కా కెల్లదే
శములఁ గీర్తినిఁ గొన్నసదమలమతి
శాళికాపురమున ఘనత నామ్నాయార్థ
వాచస్పతి యనంగఁ బడిన ఘనుఁడు
శాబ్దవేదాంత శాస్త్రములందు మేటి యై
ప్రఖ్యాతిఁ గాంచిన పండితుండు
నాంధ్రభోజుం డగునలపీఠికాపుర
రాజునాస్థాని విరాజితుండు

తే. వదలివంశాబ్ధిచంద్రుఁడై వఱలినకవి
వరుఁడు లక్ష్మీనారాయణప్రథితుఁ డితఁడు
నేఁటిసభలోన బహుమతినిం గొనంగ
నర్హుఁ డని చెప్పుచుంటి నో యనఘులార. 56

వ. అని చెప్పిన పదంపడి. 57

సీ. కవితావిశారద కనకాంబ స్వాగత
నవరత్నమాలిక చవు లెసంగఁ
జదివె నంలటఁ గవిసార్వభౌముఁడు నూట
పదియాఱు రూపికల్ బహుమతిగను
వాచస్పతి కొసంగెఁ బదపడి పెక్కురు
స్వాగతపద్యముల్ చదివి రవలఁ
బిరబిశేషముల్ పేర్కొనంబడినంత
నాశీర్వదించి వేదార్థవిదుఁడు

తే. వివరణ మొసర్చెఁ బెక్కురు వివిధపద్య
గద్యములతోఁ బ్రసంగముల్ హృద్యఫణితి
నలిపి రవ్వాల సభ్యత్సుఁ డలర నిట్లు
చదివె నొకకొన్నిపద్యముల్ ముద మెసంగ. 58

మ. మనపూర్వుల్ శ్రుతిచోదితం బయినసన్మార్గంబు యోజించి భు
క్తిని ముక్తిం గలిగించు సంస్థలను బుద్ధిం జేసి కావించి రా
ఘనమార్గంబె శరణ్య మన్యగతులం గా ల్వెటినం బాపముల్
పొనరింపం గలవార మాదు మని యొప్పుగ జంక నా నేరికిన్. 59

ఉ. ఎంతయు జ్ఞానముం గలిగి యేము దలిర్చెద మంచు మెట్టవే
దాంతము లెల్లరున్ వినఁగ నాడుచు జేగురురంగుగుడ్డలున్
బొంతలు యోగదండములు పూని మెలంగుచు స్త్రీలు పూరుషుల్
వింతసమాజముల్ నిలిపి వేషము వేయుట లీ రెఱుంగరే? 60

ఉ. కుక్కలఁ జంప నొక్కదొర కోటులు మూలధనంబుఁ జేసె నిం
కొక్కరుఁ డైననోబిలు మహోన్నతవిద్యలకున్ బహూకృతుల్
దక్కఁగఁ జేయఁ బెంధన ముదారత నిల్పెఁ దలంప సంస్థ లీ
చక్కి నెఱింగి సత్త్రములు సల్ప నగుం దగ నెంచి కార్యముల్. 61

శా. దేవబ్రాహ్మణభక్తితత్పరతమై దివ్యప్రభావంబు సం
భావింపం జను నన్నవైదికవచఃపారిశస్త్యముం ద్రోచి దు
ర్భావుల్ కొందఱు దేశముం జెఱుప నై వర్తింత్రు వారిం బహి
ర్దేవపాపఫలం బొలంచుటకు నుత్తేజంబుం గావింపుఁడీ. 62

శా. భాషాతత్త్వమె బ్రహ్మ మంచు విబుధుల్ వ్యాకృత్తు రద్దానికిం
దోషంబుల్ గలిగించి కావ్యములలో దూర్లించి దుర్వాక్యముల్
వేషంబుల్ కడు వేసికొంచు నిపు డుర్విం వేగబాండ్లైన యా
దోషజ్ఞాఖ్యులఁ దోసి యా జనులకుం దోట్రిల్లఁగాఁ బోకుఁడీ. 63

చ. గురుఁ డొకయక్షరంబు తనకుం దెలియంగ వచియించి నట్టిఁ డా
గురు నిరసింపఁ బోయినను ఘోరతరాఘము గూడ వచ్చు నో
వరమతులార మీరు గురువాక్యమె బ్రహ్మ మటంచు నెంచి త
త్సరణి మెలంగుచుం సకలసౌఖ్యములం గొన నిచ్చగింపుఁడీ. 64

ఉ. వేదమతంబు గా దనుచు వేలకు వేలు మతంబు లిప్పు డీ
మేదిని నుద్భవించె నెది మే లగునో యని చర్చ సేయ కా
వేదురు లత్యధోగతికి వెళ్లుచు నుండిరి మీర లన్న నా
మాదిరి గానిసంఘముల మాద్యశులం గరుణింప నెంచుఁడీ. 65

చ. కనకమ దేశికోత్తము నఖండగతిం భజియించి వానిపే
రను బ్రతివర్ష మాంధ్రభువిఁ బ్రస్తుతి కెక్కినయొక్కపండితుం
గొనకొని తెచ్చి శక్తికిఁ దగుంగతిఁ బూజ యొనర్చు నిట్టు లీ
వననిధికాంచి నెల్లరును వర్తిలు చుంట మహత్తరం బగుం. 66

మ. గురురాజప్రతిపత్తిభక్తు లవి యేగొప్పం బ్రకాశించునో
పరికింపం దగు నిప్పు డీ కనకమాంబాకల్పి తానల్పస
ద్గురుపూజావిధు లెల్ల నారసిన మీరుం దెల్ల మా మీరు నీ
వరుసం సద్గురునిం భజించి సుఖసంపత్తిం బ్రవర్తింపుఁడీ. 67

మ. అహహా నాఁగ ఘనాంతవేదమును వేదాంగంబులుం నేర్చి తా
మహిమం బొల్చె దువారణాసిపురి నామ్నాయార్థవాచస్పతి
స్పృహణీయాహ్వాయ మొంది లోకనుతుఁ డై విద్యావ్రతుం డై మహా
మహుఁ డై క్షిప్రకులావతంస మెనఁగుం మాగొతమీమండలిం,

మ. శ్రీపీఠదేవాగ్రణి దేవసన్నిభుఁడు లక్ష్మీపూర్ణనారాయణ
ప్రీతిపాత్రాఖ్యుఁడు మాకు వేదమహిమల్ వాక్రుచ్చె సిద్ధేశ్వరున్
దలఁచెన్ నూటపదార్లు పుష్పములతో నర్చించు మా భక్తి సం
చితరీతిన్ వివరించి కొల్తు మెపుడున్ శ్రీవిష్ణుతుల్యుండుగన్. 69

మ. గురుపీఠంబున కాధిపత్యమును శ్రీగుర్వాజ్ఞ గైకొంచుఁ దా
ద్వారకాయుం బన నొప్పి కార్యభరముం దాఁ బూని విద్వత్కవీ
శ్వరసంపన్నముఁ జేసి వాసిగొన నైవర్తించు శ్రీదంటువం
శ్య రమానాథుఁడు ప్రోచుఁ గాత నతమున్ సుబ్బావధానిన్ దయన్.

వ. పదంపడి పడియుం దొమ్మిదివందల ముప్పదియేడవ సంవత్సరంబు
మొదట. 71

—• మొ ల్ల జ యం తి ఐ హు మా న ము •—

ఉ. మొల్లజయంతికిం గవనభూషణ మాకసకాంబ కుశ్ఘనుల్
నెల్లురిపట్టనంబున గణించి బహూకృతి గాఁగ నైదునూ
ర్లెల్లరుఁ బండితుల్ గనఁగ నిచ్చిరి హెచ్చి సభాస్థలంబునన్
మొల్లను బోలు నీమె యని ముచ్చట లెచ్చఁగ నుచ్చరించుచున్.

వ. అంత నక్కనకాంబయు. 73

శా. నా కేనూఱుపదార్లు రూప్యములు నెన్నంగా బహూకారముల్
లోకుల్ చేసిరి నే జయంతి కొఱకున్ లోభంబునం జేసి యీ
లేకుంటేం గదె యిట్లు చేయుటలు మేల్ లేమిం బ్రదర్శించెదన్
గా కీవర్షము మూఁడునూటపదియార్ గ్రా ముప్పురం దెల్పెదన్. 74

వ. అని నిశ్చయించి తర్కంబున శ్రీపాదలక్ష్మీనరసింహశాస్త్రివర్యుని
వ్యాకరణంబునఁ దాతా సుబ్బరాయశాస్త్రివరేణ్యుని వేదాంతంబున
దెందుకూరి నృసింహశాస్త్రితల్లజుని బహూకరింప నెంచి మొల్లర
నాహ్వానించి యుండు. 75

తే. దెందుకూరినృసింహశాస్త్రిని జయంతి
వచ్చుటకు మున్న పిలిచి యా సచ్చరిత్రు
వలన భాష్యత్రయోక్తప్రవచనములను
బ్రతిదినంబును విని యెల్లవారు భక్తి. 76

వ. అంత జయంతిదినంబు చనుదెంచుటయు. 77

—• ఈశ్వర సంవత్సర గురుజయంతి •—

సీ. కవిసార్వభౌముఁ డాఘనసభకధ్యక్షుఁ
డయ్యెఁ బిఠాపురాధ్యక్షు లాది
రాజేంద్రులును వేప రామేశముఖ్యు లు
ద్యోగులు వచ్చి రాయున్నతసభ
కపు డెల్లర సమక్షమందు బహూకృతుల్
పొనరింపఁ బడియె నాముప్పురకును
బండితపరిషత్తు నిండి యుండినయప్డు
వారికి బిరుదముల్ వరుస నిడిరి
తే. అపుడు పెక్కురు సత్కవు లమలమతులు
శ్రావ్యముగఁ బఠించిరి పద్యరత్నములను
దంటు సుబ్బావధాని కృతజ్ఞత నెఱిఁ
గించి పీఠోద్యమము విన్నవించె నపుడు. 78

వ. శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిగారినిఁ దార్కికచక్రవర్తి యనియుఁ దాతా సుబ్బరాయశాస్త్రిగారిని వైయాకరణసమ్రాట్టనియు దెందుకూరి నరసింహశాస్త్రిగారిని వేదాంతిసార్వభౌముఁ డనియు బిరుదంబులం బ్రశంసించుచు నొక్కొక్కనికి నూటపదాఱురూప్యంబు లిడి సత్కరించి నంత సద్గ్రాసనాధిపతి. 79

శ్లో. సృష్టిం తాం విరచయ్య ధాతుజబలా చ్ఛబ్దప్రపంచస్య య
స్సర్వేషాం గురు రాది రుత్తమకలాపూర్ణో ఽభవ త్తేజసా
బ్రహ్మాణం చతురాననం బుధనుతప్రారంభ మీడే ఽనిశమ్
తం తాతాన్వయసుబ్బరాయ బిరుదఖ్యాతం సువర్ణాంచితమ్. 80

శ్లో. ప్రహ్లాదోత్తమభక్తలోకకలనే శ్రీపాదవంశోదితో
వాంఛాంచద్ధృదయేన దుష్టహరణే యో ఽభూ న్మహాశాస్త్రవిత్
తం లక్ష్మీనరసింహ మచ్యుతపదం గోవింద మీడే ఽవ్యయ
వ్యాహారం వరకౌశికాదిబుధరాడ్బృందారకప్రస్తుతమ్. 81

శ్లో. తత్త్వజ్ఞానవినిశ్చితామలధియా పాపాంధకారద్విషమ్
హత్వా ఽద్వైతమతప్రవర్తకగణాన్ ప్రీత్యా నుగృహ్యా ఽనిశమ్

జిత్వా మృత్యుం మతంద్రితం పరశివం మత్వాత్మవ న్నేధతే
శం సేవే వరదెందుకూర్కులవరం లక్ష్మీనృసింహేశ్వరమ్. ౮౨

చ. కనకము కాంచనంబునను గల్గె నటన్న విశేష మేమి కాం
చనకనకమ్ము లొక్కటియె సన్మతియుం గనకమ్ము విద్యయున్
గనకము వర్తనంబు కనకమ్మ సుమల్ కనకమ్ము సర్వముం
గనకము నాఁగ నచ్చుఁ గనకమ్మకు సాటి కతీశునమ్మడే. ౮౩

మ. గురుభక్తిం గలఁడై గురూత్తమునిచేఁ గూర్పంగ వా పీఠముం
దురుభక్తిన్ భజియించి యూత్మసతితో నుత్సాహియై వచ్చి త
ద్గురువర్ధంతి మహోన్నతిం గొనుటకుం దోడ్పడ్డ చుండూరి పం
శరతున్ వేంకటరెడ్డినాముని ప్రశంసం జేసి దీవించెన్. ౮౪

— బహుధాన్య గురుజయంతి —

తే. పదియుఁ దొమ్మిదినూర్లపైఁ బదులు మూఁడు
నెనిమిదియు నైనవర్షమ్మునను గురూత్త
మునిజయంతి సమీపించు ననఁగ బీర
భక్తులును శిష్యులును గూడి భక్తిపరత. 85

మ. అమృతానందుని పారితోషికము లాయాయేండ్లలో వేదశా
స్త్రములుం గైతయు నేర్చి నట్టికవులున్ సత్పండితుల్ పొంది రీ
నమ నెవ్వాని బహూకరింప నగునో నత్పాత్ర మేప్రోడయో
నమకూరం గలఁడంచుఁ గొంతవడిఁ జర్చల్ సాఁగఁగాఁ జేయుచున్.

సీ. పాతకాలం దెల్గుపంతులుగా నున్న
సమయంబున న్వేని సంగతిమొయి
నేకలవ్యులు శిష్యులెందఱో నేర్చిరి
కైతఁ గట్టంగ నై కైసరులయి
రిల గీరతాదు లెన్నో పుస్తములు వ్రాసి
ప్రకటించె సరివారు బళి యనంగ
వానిలోనన్ శ్రీవణానంద మనునది
తనపేర్మి ప్రకటించుకొనెడు నద్ది

తే. తిరుపతిని గూడి యిర్వురై దేశములను
శతవధానము లొనరించి సద్యశంబుఁ
బెంపెం జెల్ల బ్రహ్మయ్యశాస్త్రిశిష్యుఁ డతఁడు
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి తల్లజుండు. 87

ఆ. కట్టమంచిరెడ్డి నట్టి పత్రిక నాడి
యేసె ఘనుఁడ ననుచు నెఱుఁగఁ బలికి
పొందుమై కళాప్రపూర్ణ బిరుద మొంది
వెలుఁగు చుండువాఁడు చెళ్లపిళ్ల. 88

వ. మఱియుఁ గింకవీంద్రఘటాపంచాననాది బిరుదంబులు నిరంకుశంబుగఁ దమకుఁ దామ పెట్టుకొని మాకుఁ జాలినవా రీలోకంబున లే రని యహామహమికం గొన్నధీరులలో నొక్కఁ డగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి కీవర్ష మమృతానందవారితోషిక మీ నగు నని నిర్ణయించి బులుసుసాంబమూర్తి పండితుని యధ్యక్షతను జయంత్యుత్సవ మతివైభవంబునఁ జరిపి మహాపండితుం డగు వేంకటశాస్త్రికి మహాకవిబిరుదంబుతో నూటపదియాఱురూప్యంబుల పారితోషిక మొసంగినంత సాహిత్యము జ్యోతిషము వేదాంతము వ్యాకరణము ధర్మశాస్త్ర మాయుర్వేదము సంగీతము మున్నగు విద్యలం దాఱితేఱినవారికి బిరుదంబు లీయఁ బడియె నంత నా చెన్నపురంబున ముప్పదినాలుగవసంవత్సరము మొదలు ముప్పదెన్మిదవ సంవత్సరమువఱకు నైదుసంవత్సరంబులు దిగ్విజయంబుగఁ బీఠప్రచారము గొనసాఁగె నాకాలంబునఁ బీఠికాపుర మహారాజును జయపూర్మహారాజు నుయ్యూరురాజు లో నగురాజేంద్రులును భూస్వాములును విద్వదగ్రగణ్యులును బెక్కురు పీఠసందర్శనము చేసి కృతార్థు లగు చుండి రంతఁ బదితొమ్మిదివందల ముప్పది తొమ్మిదవవర్షంబున. 89

— యుద్ధము —

ఉ. నిమ్మకు నీరుఁ బోసినటు నెమ్మది గల్గి సమస్తదేశముల్
ముమ్మర మైనసంపదల ముప్పిరి కెక్కి తలిర్పు చుండఁగా

సమ్మరయె బాబూ నాఁగ నుదయంబునుబొందె మహో గ్రమై సమీ
రమ్ము ప్రపంచ మంతయును గ్రమ్మిన దై కడుభీషణంబు నై. 90

ఆ. జర్మనీనియంత కర్మఠుం డైనహెర్
హిట్లరనెడు పురుషుఁ డేమొ యేమొ
తలఁచి పూర్వవైరముల నెంచి మన బ్రిటిష్
ప్రభుత నొంచ నెంచి బయలు వెడలి. 91

ఉ. లక్షలు కోట్లు గా నగుబలంబులతో వివిధాయుధాళితో
నాక్షణమంద యూరపున నైనపదంబుల నెల్ల గెల్చి ప్ర
త్యక్షయముండు నా నతఁడు తత్తదసూన ధరాతలంబు ల
త్యక్షయసంపదల్ గొనియె నా! యనునంతటిమాత్రలోపునన్. 92

తే. ఇట్లు బెల్జియ మేంట్వర్పు నెల్ల లైన
దేశములు గెల్చి పోలండు దేశము పయిఁ
బడఁగ నున్నప్పు డింగ్లీషువారు కడఁగి
ప్రబలసైన్యముతో వచ్చి పడిరి వడిగ. 93

సీ. చిచ్చుబాంబులు గోలెఁ జెప్ప నొప్పాంబులు
దివి భువి నిండంగఁ దేజరిల్లెఁ
బెద్దకొండలు నాఁగ మొద్దుట్యాంకులు వచ్చి
పిండిపిండిగఁ జేసెఁ బెద్దసేన
మోటారుసైకిళ్ళ మొనగాండ్రు రణభూమి
నడచుచు గుం డట్టె విడిచి పాతి
రాకసంబునుండి వీరె విమానముల్
వేనవేల్ బాంబులు విడిచి పోవ

తే. గాలిగుమ్మటముల యోధగణము డిగ్గి
శత్రుసైన్యమునం బడి సరభసమునఁ
జిందువందుగ నొనరించి మ్రింగఁ జేయు
నుభయబలముల నీరీతి యుద్ధ మొప్పె. 94

శా. ఏరోప్లేనులు వచ్చి బాంబు లిల్లపై నేయంగ నై శత్రులన్
ఘోరాజిన్ వధియించుటల్ మును కనుంగొంచుండు రి ప్డిప్పు డె

వ్వారున్ లేకయు ఆక్కబాంబులు కదుఁగ వైళంబ యేతెంచి సం
హారంబున్ బొనరించు భూమిఁ బడి హాహాకార ముప్పొంగఁగా.

క. మఱియు జలాంతర్గాముల్
పరతెంచెడుశత్రునౌకలన్ బట్టు మనన్
గురురపము పొడమఁ డార్పిడొ
పరపుచుఁ బగిలించు నొక్కపట్టున వడిపై. 96

తే. నబ్మెరై నది మొందుండి నన్ను మెఱఁగి
మెట్లు వచ్చునొ మెవ్వాఱి కెఱుఁక పడదు
గాని కొండంతనావనేఁ గన్ను తెఱచు
సంతలో ముంచుఁ బగిలించినట్టి దగుచు. 97

ఉ. భారతయుద్ధముం దెలియఁ బల్కుదు రెంతయుభీషణంబ యై
ఘోరమ యై ప్రవర్తిలెను క్షోణితలంబున నంచు నద్ది మే
మారసినార మార్యకృతులం దది యిప్పటియీరణంబులో
నూఱవవంతు కైన తగునో తగదో యని సందియం బగున్. 98

ఆ. ఒకటి రెండు లెక్క నున్న వోటు విమాన
ము లివి కోట్లు మేట్లు తెల్పెడు నేవి
నీట మునిఁగి యేగు మేటిమోడ ల వేవి
ఆక్కబాంబు లేవి యక్కట కట. 99

చ. అరు లరుదెంచి బాంబుల నిటట్టు పడం బొనరించి పో బ్రిటిష్
దొరలును జర్మనీకిఁ జని తోరపుబాంబులు వైచి వారికిన్
బరిపరిరీతులన్ వెఱపు పర్వఁగఁ జేయుచు నుండి రత్తఱిన్
బురముల నూళ్ళ శాత్రవులపాల్గగుబాంబులు పడ్డ బీతునన్. 100

ఉ. పల్లెలనుండి కాక మఱి పత్తనభూములనుండి భూప్రజల్
పిల్లల మేకలం గొనియుఁ బెద్దదవానల మేగుదెంచు నం
చల్లరివార లట్టు లయి యచ్చట నిచ్చట నిల్చి యుండు వా
రెల్ల ప్రియాణ మై చనిరి యిచ్చటి కచ్చటి కెచ్చుబీతునన్. 101

—• వేంకటరెడ్డి జాబు •—

మ. అవు డావేంకటరెడ్డి కాంచనమకున్ హాళిం బ్రదర్శించుచున్
విపరీతస్థితిఁ గాంచు చున్న దని యేవేళం బథం బెట్టు లా

నో పరాంబా! పయనంబు సేయుటకు మున్మ న్నెంతయో కష్టియా
నిపుడే పీఠముఁ గొంచు నిచ్చటికి రా నేఁ గోరుచుంటిన్ మదిన్. 102

ఆ. మీర లొక్కచోట మే మొక్కచోట వ
సించుచుంటకంటె సేమ మెంచి
మనము విజయవాటికను నొక్కచో నంద
అము వసింత మనుచు వ్రాసి జాబు. 103

ఆ. ఆంధ్రదేశమధ్యమందు గుండె యనంగ
నుండె విజయవాటి యోజనిత్రి!
తనరి యుండు నిచట ధర్మప్రచారము
నకు నటంచు నామనంబు వినుఁడు. 104

వ. మీరు మీయుద్యోగంబు విడనాడి యవధాని ప్రభృతులలో
నిటకు విచ్చేసి మాకు సంతతపీఠసన్నిధానము గలిగింపుఁ డని కోరు
చుంటి నాకుఁ బీఠాధిదైవత మగు వేంకటేశ్వరు దర్శనంబును
మీదర్శనంబును జేయుచుండు భాగ్యముఁ గలిగింపుఁ డని
ప్రార్థించుచు. 105

— పీఠము విజయవాడం బ్రతిష్ఠించుట —

సీ. వ్యాపారబాహుళ్యభరమున మునుపోలె
నేఁ జెన్నపురికి రా నెటి గలుగదు
పీఠసన్నిధి నుండు వేడుక నాకు నా
పత్నికి నుదయించె భగవదాజ్ఞ
వడసి భాగవతసేవఁ బొనర్చుటకు నన్ను
గలిగెడినట్లుగా సలుప వలయు
నట్టిన శాంతి నాస్వాంతంబునకు నగుఁ
బాటించి నామాట బయలుదేరఁ

తే. డనుచుఁ దెలిపినఁ గనకాంబ యవ్వధాని
తో సమాలోచనము చేసి తోడ తోడ
బయలుదేరుటకును వినిశ్చయము చేసి
పనులు సవరించుకొని శుభదినమునందు. 106

వ. ప్రమాధిసంవత్సర విజయదశమికిఁ ద్రిలింగపీఠమ్ముతోఁ గనకాంబా

ప్రభృతులం బఱుం గదలి విజయవాడకుం జనుదెంచి పీఠమ్ము ప్రతి ష్ఠించి నాఁడు మొదలుకొని ప్రతిదినంబును పుల్లాది రామకృష్ణ విద్వచ్ఛ్రేయసులుగారిచే రెండు సంవత్సరంబులు భాష్యకాలక్షేపంబు గావించి రాసంవత్సరంబున. 107

సీ. విజయవాటికయందు విద్యామహాపీఠ
మును నెలకొల్పి సమౌత్సుకతను
బంచాయతనపూజ లంచితంబుగఁ జేయు
చవల ముప్పదితొమ్మిదవ శరత్తు
నందు శ్రీమదమృతానందజయంతిని
సలుప నెంచి తదీయులలితసాత్వి
తోషిక మేమహాత్ముని కీయ నగు నని
పీఠభక్తులు చాల వెదకి వెదకి
తే. శంకరగ్రంథముల నెల్ల సంగ్రహించి
గురుకులము వెట్టి శ్రీరంగ పురమునందు
భక్తుఁడు నృసింహభారతీస్వామి గురుని
ఛాత్రుఁడైన సుబ్రహ్మణ్యశర్మ నరసి. 108

— పరిమాధి పారితోషికము —

వ. అవర్షంబునఁ బారితోషికము వారికీయ నెంచి వావిలాల వేంకటశివావధానిగారి యధ్యక్షతను మొదటిదినంబునఁ బారితోషికంబుగా నూటపదియాఱురూప్యమ్ము లొసంగి మఱునాఁడు శ్రీపరవస్తు రామానుజస్వామిగారి యధ్యక్షతను మూఁడవనాఁడు బెజవాడ రామచంద్రారెడ్డిగారి యధ్యక్షతను మహాసభలు గావించి త్రిలింగ మహావిద్యాపీఠముఁ బ్రశంసించుచు ననేకోపన్యాసములు గావించి వైద్యజ్యోతిషవేదాంతతర్కవ్యాకరణాదులందు నిష్ణాతు లగువారికి బిరుదంబులు శాలువలు నిచ్చి సన్మానించి రంత. 109

సీ. శ్రీమత్త్రిలింగ విద్యామహాపీఠము
మొదటఁ దిర్పతిపురమునను నిలిపి
తిరుపతినుండి తుంబురును గోడూరును
జెన్నపురంబును జేరఁ దిప్పి

కడఁ గీవిజయవాటికాపురంబునయందు
స్థాపించితివి కృష్ణతటమునందు
నీ కృష్ణమండలమీ కృష్ణభూషణు
నకు వానిగురువరులకును గణక

తే. మాంబకును రెడ్డి కవిదాని కతవిషాద
రులకు జన్మభూమియు వాసకలితభూమి
యగు విజయుఁ డిటన్ బాశుపతాస్త్ర మొందె
విజయములకును జాడ యీవిజయవాడ. 110

తే. కనకదుర్గామహాదేవికాపుర మయి
విజయవాటిక యెంతయు విజయ మొసఁగుఁ
గృష్ణవేణీపవిత్రతీరసంకీర్తిత మయి
తన్మహాత్త్వము వర్ణింపఁ దరము గాదు. 111

— విక్రమ గురు జయంతి —

వ. ఇట్టివిజయవాడ మాయుద్యమంబునకు విజయంబు నొసంగు ననియు నార్యధర్మోద్యమ మిట జయప్రదంబుగ సాఁగు ననియు నెంచి యిట నీత్రిలింగ మహావిద్యాపీఠమును స్థాపించితి మని ప్రశంసించి రావత్సరంబున నట్లు పరమోత్సవంబు జరిగినంతఁ బదితొమ్మిది నూర్లనలువదవవత్సరంబున కాశీ కృష్ణాచార్యులవారి యాధిపత్యంబున సుబ్బావధానికి బెజవాడ పౌరుల పక్షంబున బండితరాయ బిరుదం బొసంగఁ బడియె నంత గురుజయంతి మూఁడుదినంబులు ప్రవర్తిల్లం జేసిరి మొదటిదినంబునఁ గాశీసాంగవేదపాఠశాలా ప్రధానాధ్యాపకులు పండితరాయ రాజేశ్వరశాస్త్రివర్యుం డధ్యక్షుండై కార్యనిర్వాహకుం డయ్యెఁ గాశీకృష్ణాచార్యులకును జనమంచి శేషాద్రిశర్మగారికిని మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛాయనుల వారికిని ముగ్గురికి మూఁడు నూటపదియార్లొసంగి బహూకరింపఁ బడియె నంత. 112

క. మల్లాదిరామకృష్ణుల
నెల్లరు కని విని యెఱింగియే యుండ్రు ధరన్

జెల్లినవారలలో మున
మల్లాదికిఁ జాలినట్టి మాన్యులు గలరే. 113
క. వేదము శాస్త్రము శ్రౌతము
వేదాంతము లోనిసకలవిద్యలు విద్వ
ద్వేదండ మైన యాజికి.
నాదిన్ లభియించినట్టి వని యెఱుఁగ నగున్. 114
క. అవధానిశేఖరుం డని
ప్రవిమలబిరుదంబు గాంచి ప్రజ్ఞాసిద్ధుఁడై
భువి నొప్పుకాశీకృష్ణునిఁ
గవితల్లజు నెన్న వచ్చుఁ గమలాక్షుని గన్. 115
శా. బ్రాహ్మీసమ్మదదత్తవరప్రసాదమున విద్వద్వర్యుఁడై నేర్పునన్
బ్రహ్మాండాదులు పెక్కుగ్రంథములు ధైర్యం బేర్పడం జేసియున్
జిహ్మం బింతయు లేనిచందమున నై శేషాద్రి తా నై పర
బ్రహ్మంబున్ భజియించుచుండుఘనునిన్ బ్రస్తింపఁగా నొప్పదే. 116

—• వృషసంవత్సర గురుజయంతి •—

వ. అట్లాసంవత్సరంబు జయంత్యుత్సవంబు ప్రవర్తిల్లె నన్నలఁ బదియుం
దొమ్మిది నూర్ల నలువది యొక్కటవ సంవత్సరంబున గురుజయంతి
సందర్భమున నమృతానందనాథపరితోషిక మజ్జాడాదిభట్ల నారా
యణదాసున కొసంగం బడియె నాతండును. 117
సీ. బడిలోన జదువక పయిపయిన్ జదివియే
యింగ్లీషులోఁ గృతకృత్యుఁ డయ్యె
వేదశాస్త్రంబుల వినుకలిఁ బండితుం
డై జగద్విశ్రుతి నందఁ గలిగె
సంగీతపండితసాహచర్యంబున
గాయకాగ్రేసరఖ్యాతిఁ గాంచె
హరికథాకుశలుఁడై యఖిలదేశంబుల
ననితరసాధ్యసద్యశము నొందె
తే. ఆంధ్రగీర్వాణహూణ భాషాదులందు
ముద్దులొలుకఁ గవిత్వము పోషింప

నేర్చి పెక్కుప్రబంధముల్ గూర్చి పేర్చెఁ
బ్రథితగుణుఁడాటభట్లనారాయణుండు. 118

వ. ఆసభకుఁ జెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి యధ్యక్షుండై నాఁటపదియార్లు పారితోషికం బొసంగె సర్వతంత్రస్వతంత్ర కళాశాల సంస్థాపనము నకుఁ గార్యనిర్వాహక వర్గం బేర్పడియె మఱునాఁటి వంచీతాయ వర్ధంతికి వేలూరి శివరామశాస్త్రి యధ్యక్షపదంబు వహించె నప్పుడు.

సీ. హిందుసుందరి యనునెసగు పత్రిక నిల్పి
వెలుఁగు బాలాంత్రిపు శేషమాంబ
పీఠసన్నిధికిఁ దా విచ్చేసి కనకాంబఁ
గని యిట్టు లనియె నోగరితమిన్న!
నాట్యమహాలక్ష్మి సుందరమ మహాలక్ష్మి
మీయొద్ద నై దేండ్లదై యలరుచు
నక్షరాభ్యాసము నందెఁ బిమ్మట డబుల్
యం యె పరీక్షయుం దాఁటి తేటి

తే. శంకరుని ప్రబోధసుధాకరాంక మైన
కృతిని దెలిగించి యిరవదై దేండ్లు బ్రదికి
పరమపద మందె నట్టియాభవ్యచరిత
సుగతి శాశ్వతసుఖ మందఁ దగినయట్లు. 120

వ. తావింప నెంచితిం గావున మీ రామె రచించిన ప్రబోధసుధాకర గ్రంథమును సర్వాధికారంబులతోఁ బీఠంబునకుం జేకొనుండు మఱియు నా పితృదత్తం బగునొక్కయేకరంబు భూమి నాయమ్మ పేర మీ త్రిలింగవిద్యాపీఠంబునకు వ్రాసి యిచ్చితి నిదె కొనుం డని యిచ్చె నంతం బదియుం దొమ్మిదివందల నలువదిరెం డగు చిత్రభానువత్సరంబున శంకరజయంతి దినంబున. 121

—• చిత్రభాను జయంతి •—

తే. పీఠపక్షమునఁ జగద్విశ్రుత మయి
ప్రబలఁగాఁ గొడవ ట్లనుగ్రామమందు
గురుకులాశ్రమమును గట్టి గురుల నిల్పి
విద్య గఱపుచు నుండి రాపీఠపతులు. 122

వ. ఆయ్యేటిగురుజయంతికి నమృతానందనాధపారితోషికము జయంతి భగీరథశాస్త్రిగారికి సూరిభగవంతముగా రధ్యక్షులై సమర్పించిరి రెండవదినంబున భగీరథశాస్త్రి యాజమాన్యంబున సర్వతంత్ర స్వతంత్ర కళాశాలావిషయిక చర్చలును గౌముదీపూర్వార్ధోత్తరార్ధ పరీక్షలును బహుమానంబులును జరిగె మూడవదినంబునఁ బండిత రాయవర్ధంతి సమయంబున గుడిపూడి యిందుమతీదేవికిఁ గవయిత్రీ మణి యను బిరుదం బొసంగి సన్మానించి రంత నా ఫాల్గుణమాస శుక్లపక్షంబున. 123

—• అవధాని నిర్యాణము •—

చ. తణుకుపురంబునందు నవధానులు పెండ్లికి నేగి తత్సభన్
గణ గణ మాటలాడుచును గ్రక్కును నెత్తురు బొళుక్కు మ్మంచు దు
ర్గణ మది కానిరోగ మొనఁగూడె నొకొంతటిలోన వెండి పె
ల్లుణఁగక నేల నిండునటు లై పడె నల్ల భయంకరంబుగన్. 124

ఆ. వైద్యులేగు దెంచి పంపుఁడీతని నాసు
పత్రి కన నవధాని భయము లేదు
కొంతలోన శాంతి గొన వచ్చు నాయుష
న్యాస మాగఁ జాల నార్యులార. 125

చ. అని యను చుండఁగా వమన మయ్యె స్రవించి యసృక్కువత్తువా
తెను గని యెల్లవారును మఱిన్ మఱి సాధ్వస మొంది తత్క్షణం
బున నవధానిఁ దెర్చి కొని పోయిరి వైద్యముపొంటె నాసుప
త్రిని వసియింపఁ జేయుటకు దేవునిపై భరమెల్ల మోపుచున్. 126

ఉ. డాక్టరు వానినిం గడు గడంకఁ బరీక్ష యొనర్చి పేర్చె నీ
రక్తగదం బసాధ్య మని రంహ మునం దగునౌషధంబులన్
సక్తము గాఁగ నూఱి పెలుచన్ గల్పి త్రావక మందుఁ జేర్చి సం
రక్తి యొసంగ నోట నిడె రక్షకుఁడే కలఁ డంచు నెంచుచున్. 127

క. అంతకు నంతకు నెత్తురు
శాంతించెను గాని మేను చల్లం బడియెన్
కొం తన రాని విధంబున
వంతాపము సంభవించె నన్న చెవంగన్. 128

క. ఎటు వైచిన శాల్సేతులు
నటు లుండగ నెదిఁ దన్ను నరయఁగ లేకా
కటకమునం దారాతిఁ
దటుకున నవధాని కాలధర్మము నొందెన్. 129

వ. మఱునాఁడు విజయవాడ నుండి తంతివార్తా శ్రవణంబునం జేసి కనకాంబా పరిశ్రుతంబును దమ్ముఁబును గొమ్మయుఁ గొడుకు లోనగువారు తఱుకునకు వచ్చి వావృచ్చు చేయునది లేక ప్రేత సంస్కారము చేసి చని రంత. 130

—• స్వర్గాను పారితోషికము •—

సీ. అవ్విధంబునను సుబ్బావధాని గతింపఁ
బీఠకార్యము లెల్లఁ బేర్మితోడ
కనకాంబ యవధాని యనుజుల్ యథాపూర్వ
ముగ నర్చనాదికములు పొనర్చి
నడపించు చుండి రంతట నేత్రియుగ ధాత్రీ
భూసంఖ్య నగువర్షమున జయంతి
మహము చేయఁగ నెంచి మఱియు వేమూరి రా
మబ్రహ్మశాస్త్రికి మహితపారి
తే. తోషిక మొసంగ నెంచి విశేషవైభ
వము పొసంగక యుండినఁ గ్రమమొసంగఁ
బండితులఁ బిల్చి పూజలు పరఁగఁ జేసి
కాశికృష్ణార్యుఁ డధిపతి గా నొసంగ. 131

తే. నూటపదియారుఁ రూప్యముల్ మేటి యైన
ఘనుఁడు వేమూరి వంశచంద్రున కొసంగి
రపు డుపన్యాసము లొసంగి యార్యవర్యు
లభినుతించిరి పీఠ కార్యముల నెల్ల. 132

వ. మఱియు రెండవదినంబున సర్వతంత్ర స్వతంత్రక శాశాలాస్థాపనము విద్యాపీఠసమీపంబునఁ గావించి సంత వేంకటరెడ్డి తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రివర్యునిఁ బ్రధానాచార్యునిగను వ్యాకరణాలంకారోపాధ్యాయునిగను నియమించి మద్దులపల్లి మాణిక్యశర్మశాస్త్రి

వయస్సునఁ దర్క-వేదాంతోపాధ్యాయులుగ నిర్ణయించి పన్నిద్దఱు విద్యార్థులతోఁ బాఠశాలాప్రారంభము గావింపఁ బడియె దాని నిర్వహణమునకుఁ జిందూరి వేంకటరెడ్డి లక్షరూప్యంబులు విరాళ మొసంగె మూఁడవదినంబునఁ బ్రాఁసరాజప్రశస్తి గావింపుచుఁ బుల్యా ఉమామహేశ్వరశాస్త్రి పారుపల్లి రామకృష్ణయ్య ద్వారం వేంకటస్వామినాయుఁడు కవిసార్వభౌమ పుత్త్రిక యగు శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మ లోనగువారు బిరుదులతో సన్మానింపఁ బడిరి వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు సరిపల్లె విశ్వనాథ శాస్త్రి దేవరకొండ చిన్నకృష్ణశర్మయు నవధాని చరిత్రంబు వ్రాసి పఠించిరి దంటు శ్రీనివాసశర్మ తులసీదాస చరిత్రంబు వ్రాసి యవధానుల కంకితంబు గావించె. 133

తే. పుల్యవంశాబ్ధిచంద్రుఁడు పూర్ణయశుఁ డు
మామహేశ్వర శాస్త్రి విద్యామహితుఁడు
వ్యాకరణశాస్త్రపండితవర్యుఁ డగుచు
ఖ్యాతిఁ గాంచు ముంగొండాగ్రహారమందు. 134

క. పారుపలి రామకృష్ణయ
వారక సంగీతసార్వభౌమఖ్యాతిన్
ధారుణిఁ గైకొని విద్వ
ద్వీరులచేఁ బొగడఁ బడుచు విఖ్యాతి గాంచున్. 135

క. ద్వారం వేంకటసామి మ
హారాజాస్థాన వినుతుఁ డై మేలుఫిడే
లారూఢి న్వాయింపఁగ
నేరిచి పే రందె జగతి నిర్ణిద్రమతిన్. 136

తే సార్వభౌముని పుత్త్రి యై సౌరుమీఱు
శ్రీవిశాలాక్షి సుకవితం జెప్ప నేర్చి
భారతకథా మృతాదులు భవ్యకావ్య
ములు పొనర్చెను పెక్కులు బుధులు మెచ్చ. 137

ఉ. లక్షయనంగ రెం డయి చెలంగెడు నక్షరపంక్తి పోలెఁ దా
వీక్షణమునుం బొనర్చిమన వేంకటరెడ్డి మహాశయుం డెదన్

యుక్తులఁ గాదు కా దనుచు నాఁకఁగి జాలినదానకర్ణుఁడై
లక్షణసంఖ్యా విద్యల వెలార్చెనుసంస్థకు నొసంగె శాస్త్రికిన్. 138

ఉ. కర్ణునిఁ జెప్పి యుప్పుయి నొకానొక దాతను జెప్ప నొప్పున
కర్ణుఁడె వెండియుం గలియుగంబున వేంకటరెడ్డిపీఠ పే
పూర్ణ నవోఖిలం బొడమె నం చని యుం డ్రిటు కానిచో మహో
దీర్ణుఁడుఁ జూపు చిట్టులు మదింపక లక్షలిడంగఁ జాలునే. 139

క. అమరిక యుండిన సరికి
నిమ నడిగినఁ జెప్పనేల యేడే సిడు నా
పృకుకమణియట్లు రెడ్డికిఁ
పుంజమిం దీ కైనదాతఁ బోల్పఁ గలమే? 140

—• తారణవత్సర జయంతి •—

మ. పదునుం దొమ్మిది నూర్ల నల్వదియు నాపై నాల్గు నౌసంఖ్య కై
విదితం బై తగుతారణాబ్దమున శ్రీవిద్యామహాపీఠమం
దుఁ దగం బండితపారితోషిక మహోదోపజ్ఞనిం జేసిన
ట్లొడవం జేయుట చెల్లునంచు నెదలో నూహించి పేర్ప్రజల్. 141

వ. కాశీపురవాసిపండితరాజరాజేశ్వరశాస్త్రివర్యునకిలయనిశ్చయించి. 142

ఉ. శ్రీపదకృష్ణమూర్తికవిశేఖరునిం గవిసార్వభౌమునిన్
శ్రీపదభక్తునిం బిలిచి చెన్నలరార సభాధిపత్య మీ
నోపి యతండు నూఱు పదియు స్మృతి యాఱును రూపికల్ జగ
ద్వ్యాపకకీర్తి యైనవిబుధాధ్యున కిచ్చె బహూకరించుచున్. 143

తే. ఎందఱో పండితులు పీఠ మెక్కి వివిధ
విషయములను పన్యాసముల్ విస్తరించి
చెప్పి రెందఱో పద్యముల్ చేసి చదివి
రస్మృతనాథు నగ్గించుచు నతులితముగ. 144

వ. రెండవదినంబునఁ గాశీపండితుం డగు దేవనాయకాచార్యులయాధి
పత్యంబున నుమామహేశ్వరాదు లెందఱో పండితులు వివిధోప
న్యాసంబులు గావించిరి మూడవదినంబునఁ బండితరాయ శర్ధంతిని
రాజేశ్వరశాస్త్రిప్రభృతులు గీర్వాణోపన్యాసంబులు గావించి

రప్పుడు వేంకటరెడ్డి రాజేశ్వరశాస్త్రికి మున్నూటనలువదియెనిమిది రూప్యంబులను దేవనాయకాచార్యులకు మున్నూటనలువదియెనిమిది రూప్యంబులును గవిసార్వభౌములకును జెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రికిని జనమంచి శేషాద్రిశర్మకును హరినాగభూషణునకును హరిసోదరులకును నూటపదియాఱు నూటపదియాఱు రూప్యంబుల లెక్క నైదునూర్లయెనుఁబదిరూప్యంబుల నిచ్చి బహూకరించి రిట్లు జయంత్యుత్సవంబులు మహోన్నతగతిం గావించుచు బీరభక్తులగు కనకాంబా వేంకటరెడ్డిప్రభృతులు వేంకటేశ్వరారాధనంబు గావించుచు నమృతానందనాథుని సేవించుచు బంచాయతదేవతలం బ్రస్తుతించుచు నతిథిపూజలు గావించుచు నభ్యాగతుల నాదరించుచు విద్యాశాలన్ సంరక్షించుచుండి రదియును. 145

—॰ సర్వతంత్రస్వతంత్రకళాశాల ॰—

మ. ప్రకటింపం బడినప్పు డాదిఁ బదుగుర్ ప్రారంభవిద్యార్థు లు
త్సుకులై చేరఁగ నొప్పియుం గ్రమముగా ప్రత్యర్థముల్ శాస్త్రముల్
సకలార్థంబులు నేర్పుకో నహాంతస్సై సంధిల్లగా సర్వతం
త్రకళాశాల త్రిలింగపీఠభువి నిత్యశ్రీల నొప్పెం గడున్. 146

సీ. వేదపాఠముఁ జేయువిద్యార్థు లందఱు
వివిధభాగంబులఁ దవిలి చదువ
శబ్దశాస్త్ర మెఱుంగఁ జాలినఛాత్రులు
కౌముదిప్రభృతులఁ గడకఁ జదువఁ
దర్కశాస్త్రము నేర్వఁ దగినకళార్థులు
ప్రకరణాదుల జాల ప్రతిభఁ జదువ
వేదాంతశాస్త్రము విను వారు సిద్ధాంత
లేశసంగ్రహమును లీలఁ జదువఁ

తే. కవిత నేర్వంగ వచ్చినఘనులుసర్వ
లక్షణాంశములను సహాలక్ష్యములుగఁ
జదువుచును గవిత్వాభ్యాససరణిఁ దగిలి
మెలఁగుచుంద్రు కళాశాలఁ గలుగువారు. 147

ఆ. ఆంధ్రత్రిలింగ పీఠి నలరువిద్యార్థుల
కనుదినంబు భోజనాదివసతు
లేలుపఱుపఁ బడియె నెల్లవేళల యందుఁ
గట్టుబాటు లందుఁ గలిగి యుండు. 148

తరువోజ. మన దేశమునఁ గల మహితకళాగ్ర్య
మందిరంబులలోన మహిమమై నొప్పి
ఘనశాస్త్రములయందుఁ గల శాఖలందుఁ
గడుసమర్థతఁ గాంచఁ గలిగి విద్యార్థు
లొనరుచుండెద రింతయున్నతసంస్థ
యొండొకం డెందు లేకుండెడునట్లు
పోసరింపగా రెడ్డి ముఖ్యులు చిత్త
మును జేసియుండిరి రవ్వాడు కళాశాల. 149

తే. తర్కవేదాంతముల కుపాధ్యాయుఁ డయ్యె
నేర్చి మద్దులపల్లి మాణిక్యశాస్త్రి
వ్యాకరణ శాస్త్రమున కుపాధ్యాయుఁ డయ్యెఁ
దాడెపలిసాంబమూర్తి శాస్త్రజ్ఞుఁ డపుడు. 150

మ. వర తాడేపలి సాంబమూర్తికవి విద్వద్వర్యుఁడై తాను వ్యా
కరణప్రాంచిత పాఠముల్ సువిశదాకారంబునన్ దెల్పుచున్
హారుసం బేర్పడఁ బాఠశాలకుఁ బ్రధానాచార్యుఁడై బీరపుం
గరిమం జాటఁగఁ జాలినట్టి ఘనుఁడై కన్పట్టు నెప్పట్టునన్. 151

చ. ఇరువదినాల్గు వర్షములయీడు గలాఁ డయి శాబ్దతర్కముల్
వరుసగ నేర్చి పాఁడితిని భాసిలుచుండియు సత్కవీంద్రుఁడై
సురుచిరలీలఁ గావ్యములు సొంపు దలిర్పగ ముద్దు లొల్కఁగా
విరచనమున్ బొనర్పఁ గలవిజ్ఞుఁ డతం డని విన్నవించెదన్. 152

క. మాణిక్యశాస్త్రివిలస
న్మాణిక్యము నాఁగఁ బొలిచి మహితలమందున్
వాణీరూపము నాఁగన్
రాణించుచు నుండెఁ బీరరాజమునందున్. 153

— పీఠభక్తులు —

మ. అమృతానందుని మేనమామ కొడుకై హాల్వాంజి తద్భక్తుఁడై
సుమనస్కుండయి యాయురాగమము సంశోధించి మేధావియై
యమలుండై తగునమ్మిమిల్లి కులజుం డౌసత్యనారాయణుం
డమరున్ వేంకటరెడ్డి వైశ్యవరదివ్యాఖ్యాన వైద్యాంకనై. 154

శా. ఆకెళ్లాన్వయరామచంద్రుఁడు ఘనుండై స్కూలుఫైనల్ సమా
ఖ్యాకం బైన పరీక్షఁ దేఱియును వేడ్కం జేసి విద్వాన్ పరి
క్షాకార్యంబున నాఱితేఱి గురుభక్తవ్రాతమం శ్లాఘ్యుఁడై
వాణిన్ నొప్పును బీఠమున్ గురువుగా భావించి సేవించుచున్. 155

సీ. ఆకెళ్ల సత్యనారాయణశాస్త్రి వ్యా
కరణశిరోమణి పరపరీక్ష
విద్వాన్ పరీక్షను వేడ్క నుత్తీర్ణుఁడై
చదివె స్కూల్ఫైనలువఱకు నాంగ్ల
మిరువదిరెండవ యేటినుండియుఁ బీఠ
మందును గురువరునందు భక్తి
గలిగి శ్రీకనకాంబికను మాతృదేవి గా
భావించి నిశ్చలభక్తిఁ దనరి.

తే. మున్ను గురువు చెప్పిన బోధములను మఱక
పీఠసేవ యొనర్చుచుఁ బ్రీతితోడఁ
దత్తదుచితక్రియల నెల్లఁ దత్పరతను
సల్పుచుం గొల్చు గురువుల సంతతంబు. 156

ఉ. దేవకొండవంశజలధిన్ హిమధాముఁడు నాఁగ నై జగ
త్పావనవైదికాభరణభాసురుఁడై తగి చిన్నికృష్ణనా
మావృతపుణ్యమూర్తి యనునాతఁడు స్కూలుపరీక్షఁ దేరి శ్రీ
దేవికటాక్షముం గలిగి దివ్యకవిత్వము నేర్చి పేర్చుతన్. 157

తే. అద్దెపలివంశ్యుఁ డాదిశేషాహ్వయుండు
తేరి విద్వాన్పరీక్షలోఁ దెలుఁగు పీఠ

నుండుఁ బడియేండ్లనుండి భక్త్యంచితుఁ డయి
పొదలుఁ గనకాంబ కరుణకు సదన మగుచు. 158

సీ. ఇందఱు వీరభక్తు లయి యెప్పుడు శ్రీ గురుభక్తియుక్తులై
పొందుగ సేవ జేయుచును బొంపిరివోయెదుకూర్మిఁ గాంచనాం
బం దగఁ గొల్తు రామెయును వారల నందఱ బిడ్డలట్టు తా
డెందమునందు నెంచుచుఁ గడిందిదయం గనుచుండు నెప్పుడున్.

క. ఇందఱు భక్తులు గొలువఁగ
నిందిరతో గూడి వేంకటేశ్వరుఁ డెలమిన్
బొందినడెందముతో జన
బృందము రక్షించుచుండు బెజవాడపురిన్. 159

క. అని శౌనకాదిమునులకు
వినిపించెను సూతుఁ డట్లు వినయముతో దర్శ
జనులార! దీని వ్రాసిన
వినినను జదివినను విపులవిజ్ఞాన మగున్. 160

— ఆశ్వాసాంతము —

క. చందురునకు సూలుపోఁ గను
చందంబున భక్తి నీ కొసంగితి దీనిన్
డెందమున నెంచి కొని పెం
పొందఁగ మముఁ బ్రోచి యేలు మోగోపాలా. 161

మ. శరవేదాజహిమాంశుసంఖ్య సగువర్షంబందు శ్రీవేంకటా
ధ్వరికిం బుత్రుఁడు సార్వభౌమకవి శ్రీ త్రైలింగ్యపీఠాధిపుల్
గురుచారిత్రము నీ వొపర్పు మనుచుం గోరంగఁ దా నీ కృతిన్
గరిమం జేసి యొసంగె నీ కిటు దయం గైకొంచు మ మ్మేలుమా.

మ. అమృతానందుఁడు నీదునంశమున నిం డై సుప్రకాశప్రభా
వమునం బొల్చి యొడల్ త్యజించి నినుఁ గొల్వ న్నీవ మై చేరె నీ
సముఖం బీకృతి నీది యీచరితముం జర్చింపఁగా నీదియే
ప్రమనుండై కొని దీని మమ్ముఁ గరుణన్ రక్షింపు మోరక్షకా.

మాలిని. దలితమునిజనార్తీ! దైవభూచక్రవర్తీ!
లలితపరమమూర్తీ! లబ్ధవర్ణానువర్తీ!
ఫలితవిపులకీర్తీ! భక్తచిత్తప్రవర్తీ!
కలితసుగుణపూర్తీ! ఖండితాత్మీయజూర్తీ!

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ కవిసా
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబైన యమృతానంద మను
ఉత్తమభక్తచరిత్రంబున
సర్వంబును
దశమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ గురుభ్యో నమః

శ్రీ తిరుమల శ్రీనివాస శ్రీరంగ మహావిద్వాంసుల పాద పద్మములకు

విద్వాన్ శ్రీపతి కవిపుంగవ కనకాంబా ...

కాంచనపల్లి కనకాంబా ప్రణామము

గీ. ఆది కాలంబు నందు మహాత్ములైన
బాలుఁడై ప్రవర్తించి యోగిజ్ఞానమున
భాగవత మర్మసద్ధ్యాన మొసఁగె నెవ్వఁ
డాదిమగురుం డతండు నారాయణుండు. ౧

గీ. దిక్కు తోఁపక తమ్మిగద్దియను జేరి
లోకుపాతు తెలుంగక చేతగాక
పద్మనాభునిచేత "తప తప" యనెడు
పలుకు విన్నట్టి యాది తపస్విఁ గొలుతు. ౨

గీ. కౌశికుని క్షాత్రబలమెల్ల గంగఁగలిసి
బ్రహ్మతేజంబు నెఱయించు బలియుఁ డెపుడు
సప్త వంశాన కెవ్వఁ డాచార్య పదవిఁ
దాల్చె నట్టి వశిష్ఠ సత్తముని దలఁతు. ౩

గీ. దివికి నేగినఁ దన్నుఁ గన్నవరు గాంచు
శక్తిగల్గిన సుతుఁ గన్న శక్తిగల్గు
"శక్తి" నాల్గవ యాచార్యు భక్తిఁ గొలుతు
నంబ పేరిట గురుఁ డెవ్వఁడనఘుఁ డోరుఁడు. ౪

గీ. పాప మంటకయుండ నా పల్లె పిల్ల
కడుపునను వ్యాసమూర్తిఁ గన్న మేటి
తత్త్వనిష్ఠుండు సత్తపోధనుఁడు వార్య
తీర్థ పద సేవకుండు పరాశరుండు. ౫

గీ. పంచె వేదంబు రచియించె భారతము; పు
రాణములు చెప్పె; బ్రహ్మసూత్రములు చెప్పె
శ్రీని జేపట్టకయె మహర్షిని శుకుఁగనె
వ్యాసుఁడన నెవరె? యతఁడె నారాయణుండు. ౬

సీ. సప్త దినములలోన మోక్షమును గనిపె
శరణుఁ బొందిన యొక రాజవంద్యుఁ డెవఁడు
లింగభేదంబు నెఱుఁగఁడు సంగి గాఁడు
శుకమహర్షికి సాటి వేఱొకఁడు గలఁడె. ౭

గీ. కారికల నెవ్వనివి మోక్షకారిక లగు
పలుకు లెవ్వని వుపనిషద్వాక్య సమము
లతఁడు శ్రీ "గౌడపాదుఁడు" దీప్యత్ప్రభావుఁ
డాత్మసౌభాగ్యభోగ నిత్యానుభవుఁడు. ౮

గీ. గుహవసించియు బ్రహ్మాండకోటి నెవ్వఁ
డాకళించి జగద్గురు సంతవాఁడు
శిష్యుఁడై తన్ను భజియింపఁ జెప్పెఁ దత్త్వ
మున్నదున్నట్లు గోవిందయోగివిభుఁడు. ౯

శా. సర్వజ్ఞుం డన శంకరుం డనఁగ విశ్వశ్రేయముల్ గూర్పఁగా
నుర్విన్ దుర్మతసంతతిన్ దునిమి శ్రుత్యుద్దిష్ట తత్త్వంబు తా
త్పర్యంబౌనటు భాష్యపంక్తులను జెప్పం జాలె నాచార్యుఁ డం
తర్వాణుల్ వెఱగంది మ్రొక్కులిడి యద్వైతంబుఁ జేపట్టఁగన్. ౧౦

వ. ఇయ్యాచార్యపరంపరలోఁ బ్రాచీనులందుంబోలె నర్వాచీనుల యందును గొందఱు సన్న్యాసులును, గొందఱు గృహస్థులు నుందురు. గృహస్థులుగ నుండువారలు, శ్రీవిద్యాధురంధరు లనఁ బ్రథితులైన ధీరులెందఱో గలరు – అందు, ౧౧

క. శ్రీవిద్య బ్రహ్మవిద్య మ
హావిద్యయనంగఁ బాదుకాంతంబగు దీ
క్షావిధిఁ బెద్దలు వాల్తురు
కైవల్యప్రదము సిద్ధికరము జగమునన్. ౧౨

క. నతియును నుతియును లేకయ
యతులటు నీ పూర్ణదీక్ష నలరిన గురు లా
నత భక్తకోటి కిచ్చెద
రతిలోకంబైన పద మనాయాసముగన్. ౧౩

ఉ. భూపతిసేవ్యుఁ "డచ్యుతుఁడు" భూసురపుణ్యుఁడు, పాపకాంత్ర క్షి
త్యాపరిలింత్రుఁ డాప్తజనకల్పక భూరుహ దృష్టిదీప సం
దీపిత సర్వసంతుఁడు; సునిశ్చితతత్త్వ నేత నిష్కళంక స్వా
త్త్వాపనివారకుండు ప్రథితప్రతిభాయుతుఁ డాఢ్యుఁ డస్మిటన్. ౧౮

మ. అతిలోకప్రభుఁ డాప్తరక్షకుఁడు "కృష్ణానంద నాథుండు" స
న్మతుఁడై శిష్యుల కాతఁడుం గిరి జంఘాలాత్రియై, సంతత
స్తుత సంపూజిత తప్పితాశ్రిత మహామర్త్యాపజన్ముండై జగ
న్నుతుఁడై మించెనుపత్రయోగములఁ దన్నుం భూరివిద్యల్ గల్గగన్.

గీ. తనదు "మల్లాది" బిరుదు సార్థకముగాఁగ
బాహుబలజితవైరియై ప్రబలదీక్ష
నచ్యుతుం డన రాముండు నడఁగ నెగడె
నెల్లకడలందు మా పరమేష్ఠి గురుఁడు. ౧౯

మ. వరగోరాడ సుధాపయోధి విధుఁడై వాణీస్వరూపాకారుడై
పరమేశ ప్రతిమానుఁడై జపతపస్స్వాధ్యాయులోలాత్ముఁడై
సురభాషాకవిచంద్రుఁడై సకలుఁడై సుశ్లోకుఁడై మించె సు
స్థిరుఁడై యచ్యుత రామపూజ్యుఁడగుచున్ శ్రీరామచంద్రుండహో.

ఉ. తా మదిఁ గూర్చినట్టివి శతంబులు ధారణపట్టి పద్యముల్
ధీమహితుండు వ్రాయుఁ దనతీరిక వేళల సంస్కృతాంధ్రముల్
ఈమెయి సత్ప్రబంధములవే యొక నూటికి మించియున్న వృ
ద్ధామయశల్ కవీంద్రులు సదా ముద మొందఁగ నెంచు నేటికిన్,

మ. తన సాహిత్యము గానభంగులు కవిత్వ ప్రౌఢిమల్ ధీరు లెం
దు నపూర్వంబు లటంచు మెచ్చఁగ వరేణ్యుండైన శ్రీ శిష్టు కృ
ష్ణునిఁ గృష్ణున్ మునుగృష్ణుఁ డట్లు కొలిచెన్ గోరాడరాముండు శి
ష్యునకున్ సద్గురుమూర్తికిన్ గలిగె సద్యోగంబనన్ బండితుల్. ౨౧

శా. రామస్వామి బుధుండు "హింగు" కులపారావారపీహారరుక్
స్తోముం డాఢ్యుఁడు మంత్రదీక్షుల నగస్త్యుం డంబికాపాద ప్రా
జామాహాత్మ్య ధురంధరత్వమున నిచ్చల్ దన్ గటాక్షింపఁగా
శ్రీ మాత్రాకృతి "రామచంద్రకవి" కాంచెన్ నిత్యయోగంబునన్.

సీ. అల్లసాలూవఘ్యఖాన్వయాంభోరాశి
కమృతాంశుఁడై యెవ్వఁడవతరించె
వెలనాటికులమణి వేంకటరత్న ధ
రామసుం డెవ్వనికి య్యెఁ దండ్రి
స్త్రీలలామంబు మహాలక్ష్మి యెవ్వానికి
గడుపారఁగాంచి భక్తితతి కిచ్చె
సత్యనారాయణ సహజన్మఁడై యేని
శౌభాగ్యమెత్తఁగ బాల్యమ్మునందె
గీ. సోదరీమణి వేంకటసుబ్బమాంబ
బావ గంగాధరుం డేని బాంధవమున
నంబివార్తైరో జగమున నతఁడె "నాగ
భూషణ" గురుం డనంబడు భువనమందు.

చ. దినమొక విద్యగాఁగ మును దేశికునొద్ద నెఱుంగనేర్చు వె
న్నుని యవతారమే యని తనుం గొనియాడఁ గుశాగ్రబుద్ధులఁ
దని వినువీథిఁ బట్టి గురుతత్త్వము గాంచెను "కృష్ణభూషణుం"
డనితరసాధ్యమైన లవణాబ్ధిఁ దరింపఁడె వాయుపుత్త్రుఁడున్ .
ఉ. చదువుమనంగఁ దాఁ జదువు సద్గురుమూర్తికి నిద్రపట్టినన్
జదువుట మానఁడా ఘనము; నమ్మక మెట్టిదో దేశికేంద్రుఁడున్
జదివితె మేలునే ల్పయిన సాగఁగ నిమ్మను నభ్యసుజ్ఞనే
చదువులఁ బాడునొల్పెదరు ఛాత్త్రిల మానసమందు సద్గురుల్.
శా. ఏ దోదగ్గజతోఁ ప్రవ యుండవలెఁ గానీ కానిచో శాస్త్రముల్
భేదింపంగలఁ డెట్లు బాలకుఁడు వీక్షించుండు శ్రీకంఠునే
వాదంబందున గెల్చు నీతని ప్రభావం బద్దిరా యంచు స
ద్వాదుల్ మెత్తురు కృష్ణభూషణుఁడు తత్త్వంబున్ బ్రసంగింపుచ
ఉ. శ్రద్ధమహాంబె శాస్త్రముల నడ్డులు గడ్డలు లేపదెందు నా
యడ్డముతీరె నా తెలివె యాత్మ్మఁడనన్ గురుమూర్తి, తోడనే
గుడ్డను జోలె కట్టుకొని కొంకక భైక్ష్యముఁ బూని భాగ్యమే
యడ్డములేక జుట్టుకొనె నద్దిర కృష్ణవిభూషణుం డహో.

చ. పలుకు లవన్ని మంత్రములు వాక్యము లన్నియు భాష్యపాఠముల్
సలిపెడువన్ని లీలలగు సద్గురుమూర్తి శివుండె యంచహో
కొలిచెను కృష్ణభూషణుఁడు కోటికి నొక్కని కిట్టి భక్తి లే
దిలఁ గలివేళలం దనుచు వృద్ధులు దన్గొనియాడ గోష్ఠులన్. 33

ఉ. తాను శివోహమన్నుచుఁ వత్సరతేన్ గురుఁ డింట నుండ నెం
తేని ప్రమాణబుద్ధి గుడి కేగుచుఁ దా శివరాత్రివేళ మా
ర్గాన గురున్ భజించి తన కాయముఁ గప్పురమందె పెట్టి మై
క్యానుభవంబు నొందిన మహాత్ముఁడు పన్నగభూషణుం డహో.

చ. లౌకికమైన లాభమె ఫలంబగు విద్యలకంచు నెంచుచున్
ప్రాకటమైనభక్తి, ప్రణిపాతము, ప్రశ్నయు, సేవ, లేకయే
చేకొని భాష్యముల్ చదువు శిష్యులు చెప్పఁగ సిద్ధమా బుధా
నీకము సద్గురుం డెద గణింపఁడు తత్త్వము దానఁ గానమిన్. 34

శా. ఏ రామల్ సరివత్తురే! విభుఁడు తానే తా విభుండే యనర్ఘ
ధారాళంబుగ సర్వధర్మములలోఁ దాదాత్మ్యమున్ దాల్చి "సీ
తారామాంబిక" యున్న నాల్గుదినముల్ ధన్యాత్మయై పోయె న
య్యారే! మ్రొక్కెదఁ గీర్తి కాయ గురుజాయన్ ధీరగేయన్ సదా.

ఉ. ద్వాదశవర్షముల్ ఘనతపం బొనరించుచు సద్గురుండు స
మ్మోదముతోడ సోదరునిఁ బూన్చి గృహంబునఁ దాఁ ద్రిదండియై
పోదు నటంచు నుండఁగనె, పోయెను దమ్ముఁడు నీశ్వరేచ్ఛ యే
మాదిరివారి నెట్టటుల మార్చుదు తాను స్వతంత్రియాటచేన్.

ఉ. రోగమునిం గెసంచుఁ దలకొట్టుకయేడ్చెడు తల్లి దన్ను శా
సింపఁగ సద్గురూక్తినది సిద్ధముగా గణియించి యొండు చ
ర్చింపక "సుప్రసన్న"ను జేకొని కాంచె సుతద్వయంబుఁ దీ
ర్చింపఁ బితౄణమున్ గురుఁడు పెద్దలమాటలు పాటిసేయుచున్.

ఉ. "రాముఁడు" 'సోముఁడున్' హరిహరం బగు పేరులటంచునుంచె ద
న్నామము లాత్మజాతులకు నాగవిభూషణుఁ డన్వహంబు శ్రీ
రామ పదామృతంబును నిరంతరమున్ బవిగొంచు నన్యమున్
మామకమంచు నెంచఁ డనుమానము నొందఁడు నుండు దండిగన్.

మ. అమృతానందుఁడుయోగి,నిస్పృహుఁడు,ధీరాగ్ర్యుండు,శిష్టుండు,సా
శ్యము నశ్యంబగునంచు దానిపయి విశ్వాసంబు చేయండు, బ్ర
హ్మముగాఁ జూచును సర్వమున్, శివుఁడనే నర్చించు శ్రీకృష్ణుఁగా
శమసంపన్నుఁడు లక్షణంబులకు లక్ష్యంబౌర సద్గోష్ఠిలోన్. ౭౦

## సద్గురు సన్నిధి

[కీ. శే. పండితరాజ దంటు సుబ్బావధానులవారి బాగడ పూర్వులమండి]

ఉ. శ్రీకరపాదపంకజుఁ డశేషజనావన దీక్షితుండు ని
ర్భీకుఁ డహర్నిశాచ్యుత తురీయపదుండు కపీంద్రగీతసు
శ్లోకుఁ డనన్యభక్తజన శోకనివారకుఁ డస్మదీయప్ర
త్యాకృతి సద్గురుం డహరహంబు ననుం గరుణించుఁ గావుతన్. ౧

చ. గురుఁడవు బాంధవుండవు సఖుండవు దాతవుఁ దండ్రివిన్ శుభం
కరుఁడవు వల్లభుండ వుపకారపరుండవు స్వామివిన్ మనో
హరుఁడవు నీపదాబ్జము లహర్నిశముల్ మది సంస్మరించి సం
సరణమహాబ్ధి దాఁటెదఁ బ్రశాంతముగా ఫణిరాజభూషణా. ౨

సీ. తల త్రుంచుకొనిపోవు తఱి శిరస్త్రాణ మై
మించి ప్రాణాలు దక్కించినావు
పంచరాత్రిములఁ బ్రపంచతత్త్వము దల
పించి నన్నృపఁ గటాక్షించినావు
భ్రమలఁ గామాంధకూపమున మున్గెడు వేళఁ
గే లూఁత యొసఁగి రక్షించినావు
కన్నవాండ్రను జెలికాండ్రఁ ద్రించుఁ దమకింప
నిక్క మా స్నేహంబు నిలిపినావు

తే. భయముఁ బాపితి పాపితి భ్రాంతు లెల్ల
భక్తిఁ దెల్పితి నిల్పితి భక్తగోష్ఠిఁ
జెప్పఁ గల నెట్లు స్వామి నీచేయుమేలు
నంజలి ఘటించి నీకు జే యందుఁ గాక. ౩

సీ. వినుచుండి తద్ఘోషమును వీను లక్యంబు
సంధాన సేయక యుండె కిల్బిషు
ద్రిమ్మోక్క-చుఁ దర్శనాంబుజము లక్షంబుల
నంటు నోల్లక చేతు లంటె నిలుచు
నర్థిఁ దత్కారదత్త తీర్థప్రసాదంబు
లాని నాలుక యన్య మానసంబుఁ
బూర్ణేందుఁ బోలుతన్ముఖ మరీచులు చూచి
చ్ఛత్చకోరిక మంచె తృప్తిఁగాంచు

తే. బ్రహ్మవాసన లీలతద్వక్త్రిసార
భంబు గొని ఘ్రాణ మస్యంబుఁ బట్టనంపుఁ
గృష్ణభూషణ యోగీశ్వరేశ సన్ని
ధానము తదీయులకు భవతారకంబు. ౪

క. బాధించిన శోధించిన
వేధించిన లోక మెంతవిసిగించిన నే
సాధించెద నీభజనము
బోధము నను బాదివి నన్నుఁ బ్రోవుము కృష్ణా. ౫

శా. నాప్రాణంబు బలంబు నీ వగుటఁ గృష్ణా! నాదు సంకల్పముల్
నీప్రోత్సాహమునన్ జనించు ననఁగా నెంచు నా డంచు నే
లా ప్రాగల్భ్యము మూఢకామిత నల్పంబైన రానీక నీ
శ్రీపాదద్వయ పద్మ బంభరము నై జీవింపఁగాఁ జేయవే. ౬

ఉ. కాలము తప్పి వచ్చినది జ్ఞానము చిక్కదు వి త్తనాలకుం
జాలెడువారు చాలు నిది సార్వజనీనము గాదు నీపయిన్
జాలి ఘటించె మాకు నికఁ జర్చలు రచ్చలు గట్టిపెట్టి యీం
జాలునఁబోఁగదోయి మన సద్గురునాత్మ భజింతు నిచ్చలున్.

చ. త్రికరణశుద్ధి గాఁగ గురుదేవునిసన్నిధి సేవ చేసి యే
వికృతినిబొందకే మది నివృత్తిపథంబున నిల్పి పట్టికో
రికల నడంచి సంతతహరిస్తుతి భక్తులగోష్ఠి నుంట మా
మకదినచర్యగాఁ గడపుమా పరమావధి గాఁగ సద్గురూ. ౭

శ్లో. యోగక్షేమం వహామ్యాత్మభగ జ్ఞానం స్వయమ్
అకరోత్సార్థకం యో వై తం గురుం పర్యుపాస్మహే. ౪

శ్లో. శ్రీశ్రీనివాసత్రైలింగ్యమహాపీఠాధి దైవతమ్
సర్వతన్త్రకళాశాలామ్ పాతు సర్వవిభైస్సదా. ౫

---

శ్రీయుత విద్వాన్ దంబు శ్రీనివాసశర్మగారు బి. ఏ. బి. ఎల్.

మ. తమ మోక్షం దెలియంగ నీక ఫలసంతానంబు గర్వించు క
ర్మమునుం దీరిచి రాలిపోవు సుమజాతం బట్లు శోధించు ని
ర్మముఁడుం గీర్తిపరాఙ్ముఖుండు నయి ధాత్రీపావనాత్ముడై పంచుని
ర్తములం జేసి పరోక్షమైన యమృతున్ ధ్యానింతుఁ నమ్మ్రుద్గరున్. ౧

ఉ. శక్తులఁ జూపెనే వివిధశాస్త్రచయంబులు పేర్వఁగొర్తెనే
ప్రాక్తనవిద్య లన్నిటను బ్రౌఢిమ నందెనె భాషణుండు సు
వ్యక్తము గాకపోయెఁ దమ కించుఁ దదీయుతె పల్కు చుండు రా
భక్తులు తెల్ప కున్న భగవంతుని నేరవెఱుంగ లోకముల్. ౨

మ. గుహ నేకాంతమునందు శంకరుననున్ గోవిందయోగీంద్రుఁ డ
న్వహమున్ యోగము మంత్రమా నిగమమా న్యాయంబొ? వేదాంతమా?
గహనార్థంబు లిఁ కేమి తెల్పె నని యూకాంక్షింప నేలా? యను
గ్రహమై శిష్యము ధాత్రి సత్కృతులలోఁ గాన్పించదే తెల్లమై. ౩

సీ. తత్త్వోపదేష్ట్ర మూర్ధన్యుండు సు మ్మంచుఁ
గనకాంబ కృతులు సాక్ష్యం బొసంగు
సారస్వతాధి రాజ్యపద్ముం డంచు సు
బ్బవధాని గీర్వాణకవిత దెలుపు
భక్తులపాలిటిపారి జాతం బని
రెడ్డిసంపదలు గర్జించి చాటు
సిద్ధసంకల్పుఁ డాస్తిక శేఖరుం డంచుఁ
దైత్రిలింగ్యపీఠ సంస్థయు వచించు

క. పషణశోషణములును ప
నీషాజనకనులు దత్త్వనిష్ణులకుఁగా సం
తోషణములు శ్రీ విద్యా
పోషణములు నాగభూష బుధభాషణముల్. ౯

విద్వాన్ : పంగనామాల బాలకృష్ణమూర్తిగారు బి. ఓ. ఎల్.

మ. పరమార్థం బది యెట్టు లబ్బుఁ గలిలో భక్తిప్రపత్తుల్ వినా
గురుమూర్తీ! యది పూర్వపుణ్యఫలముల్ గూడంగనే గాని యు
ర్వర మాబోంట్ల కదెట్లు కల్గు గురులన్ భావించి సేవింపకే
గరుణన్ జూడుము కృష్ణభూషసుకృతీ! కారుణ్యసత్త్వాకృతీ. ౧

## గురుస్తుతి

కీ శే. కాళ్లకూరి మహాలక్ష్మి సుందరమ్మగారు, యం. ఏ. యల్. టి.

శ్లో. ఆనందనాథాయ మహేశ్వరాయ
శ్రీరామభక్తాయ నిరంజనాయ
జ్ఞానస్వరూపాయ మహోజ్జ్వలాయ ౧
గురుస్వరూపాయ నమశ్శివాయ

శ్లో. నమామి శ్రీకృష్ణవిభూషణాఖ్యం
గురుం గురూణాం హి త్రిలింగ పీఠే
యత్పాదపద్మార్చన శీలభక్తః
పారం పరం గచ్ఛతి వైభవాబ్ధేః. ౨

## అమృత సంస్మృతి

అభినవతిక్కన, సాహిత్యస్థాపక దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు. నెల్లూరు.

సీ. ప్రథితినెయ్యదనఁ గోరఁడు గాక కోరిన
విశ్వవిఖ్యాతుఁడై వెలయకున్నె
వాఙ్మఖకలన కొప్పఁడు గాక యొప్పిన
నెనయక యున్నె వాగీశసంజ్ఞ

పరిభవుల సన్నిధినిఁ జేరఁడు గాక చేరిన
సచివమూర్ధన్యుఁ డై చనక యున్న
అడిగినఁ గాని చెప్పఁడు గాక చెప్పిన
జ్ఞానసుధ సమోర్మిఁ జల్ల కున్న
తే. ఉన్న వని లే వనియుఁ జూప నొల్లఁ డనియుఁ
బరిచితులు భక్తు లొక్క రొక్కరు వచించు
సిద్ధులకు డప్పయి నిజాత్మసిద్ధి గన్న
పూర్ణపురుషుండు శ్రీకృష్ణభూషణుండు.

సీ. ఒకమాట చాలు నాటుక యున్న బహుజన్మ
విచికిత్సలను విశావిక లొనర్చ
నొకలీల చాలు వారక బ్రహ్మవిదునిచే
ష్ఠితము నిష్ఠించు నన్మతిఁ దలంప
నొకనవ్వు చాలు సంతికగతు లగువారి
దుర్దైవయాతనల్ దులిపివైవ
నొకగర్జ చాలుఁ బాయక యెంత స్వైరినే
విపథంబునకుఁ బాసి వినతుఁ జేయ
తే. నొక్కతుట్టి చాలు నితఁ డెవ్వఁడో మహాత్ముఁ
డరిది మనతోడ మాటాడె నని గ్రహింప
నపరిధృష్యుఁడు నభిగమ్యుఁ డార్ద్రబుద్ధి
పుణ్యచరితుండు శ్రీకృష్ణభూషణుండు.

సీ. "వైద్యరాజ"ఖ్యాతి వఱలినశ్రితునిఁ బం
డితరాజుఁ జేసినవితతదయుఁడు
"కవయిత్రి"మాత్రగాఁ గ్రాలుధీమతినిఁ బా
వనతత్త్వవేత్త్రిఁ జల్పినఘనుండు
"ఆనందనాథ" విద్యాసంప్రదాయంపుఁ
బరమదీక్షను గొన్నశాక్తవీరుఁ
డఖిలభారత భవిష్యద్భాగ్యకలన కే
తత్ప్రతి నిలిపిన ధర్మనిరతుఁ

తే. దమరగురునకుఁ దగిన ప్రతిష్ఠాతిశయము
బ్రహ్మవిదుని స్వత్వంబైన భయరహితత
కడఁగి మూర్తి ధరింప నేర్పడినవ్యక్తి
పూజ్యపూజ్యుఁడు శ్రీకృష్ణభూషణుండు. ౩

మ. ఎవఁ డేశాస్త్రమునం బ్రవీణుఁడొ యెవం డేవిద్యయం బాత్ముఁడో
యెవఁ డేయేకళలందు శిక్షితుఁడొ తా వీక్షించి తత్తన్మతి
వ్యవసాయంబున కుద్దిగాఁ బయి రహస్యార్థంబు లందిచ్చు నా
రవ మిం కేకడఁ గంటి మీ యమృతవాగ్వ్యాప్తంబులన్ దక్కఁగాన్.

చ. గణితము కాదు జ్యోతిషము కాదు నిరుక్తము కాదు కావ్య త
ర్కాణభుజవృత్తి యే దయినఁ గాని సమస్తము నిర్మలోపద
ర్పణమున నెట్లొ యబ్బె గురువర్యుని చిత్తమునందుఁ దోఁచు "భూ
షణ మఖిలజ్ఞుఁడా" యనెడిశంక సుహృత్తతి కంకురింపఁగాన్. ౫

ఉ. ఆంగలమందు సంస్కృతమునందుఁ దెలుంగునయందు వారిపా
రంగతి మెట్టిదో తెలియ రాదు తమక్తులు సూత్రపంక్తులై
కొంగున బంగరట్లు స్మృతికూలములన్ జెఱలాడు చుండుఁ ద
త్సంగతి నెట్టి చట్టయిన ధన్యుఁ డగున్ గతసర్వశంకుఁ డై. ౬

శా. సామాన్యోక్తుల నెల్లరుం దెలియదృష్టాంతంబులన్ హేలగాఁ
బ్రేమం జెప్పనియట్లు చెప్పెదవు గంభీరంపుఁదత్త్వార్థమున్
స్వామీ! తాదృగనన్యసాధ్యపటుదీక్షాస్ఫూర్తికిన్ మిమ్ముఁ బ్రే
మామాన్యుల్ నవశంకరుండ వని సంశ్లాఘించినం జెల్లదే. ౭

చ. పలికినపల్కు లాగమనిభంబులుఁ జూచినచూపు లెల్లఁ బే
శలకరుణామృతార్ద్రములు సల్పినలీలలు దత్త్వవిజ్ఞనం
బులకు మనోరమమ్ములు నృభూషణ నిన్ మఱువంగ వచ్చునే
యొలసి క్షణార్ధ మేని భవదుజ్జ్వలబోధము విన్నవారికిన్. ౮

చ. ఒకతఱి మౌనదీక్ష మఱియొక్కతఱిన్ బటుయోగదీక్ష వే
ఱొకతఱి ధ్యానదీక్ష మఱియొక్కతఱిన్ బరియాచకంబుఁ బా
లకలతితోడ నిం దొకటి లాఘవమున్ మఱి యొండు గౌరవం
బౌకొ యఖిలాత్ముఁ డాతనికి యోగ్యవినోదనలీల లన్నియున్. ౯

గీ. అతఁడు సామాన్యమానవుం డగునె యమర
గురునిఁ బోలెడు వాగర్థకోవిదుండు
శంకరాచార్యుఁ దలఁపించు సర్వవిదుఁడు
అమృతనాథుండు నాగభూషాఖ్యుఁ డహహ. ౬

శా. కోరాడాన్వయవార్ధిచంద్రు నకలంకుం బ్రాజ్ఞ నాగేశ్వరున్
ధీరాగ్రేసరు సర్వశాస్త్రవిదు సన్నిష్ఠాత్మునిం జూడనే
వారంభోన్నతిఁ గొల్చి సర్వనిగమాంతాచార్యశాపర్వతా
సారుం డౌనమృతాప్తినాథునిస్తుతుల్ సాయుజ్యముం గూర్చెడిన్.

---

ధర్మరంజన, విద్యాభూషణ, ధర్మస్థాపన, అమృతానంద నాదస్వామి జయంతి
మహోత్సవాభినన్దికా నవరత్నమాలా

బ్రహ్మశ్రీ రాళ్లభండి వేంకట సీతారామశాస్త్రి, బి. ఏ. బి. యల్
సాంగ వేదపాఠశాలా కార్యదర్శి, పిఠాపురే.

శ్లో. అద్వైతతత్త్వామృతబోధనే యః
స్వాభావికీ శ్చానుభవై రగమ్యాః
యుక్తః పరం సంకథయన్ మనాంసి
హ్యాచోరయ త్పండితపామరాణామ్. ౧

శ్లో. అద్వైతతత్త్వం పరిబోధనేన
క్షిప్రం చ హస్తామలకీ చకార
స్వశిష్యవర్గస్య త మేవ భాన్త
మానన్దభూమ్నా ఽమృతనాథ మీడే. ౨

శ్లో. బృన్దారణ్యే విబుధరుచిరే స్వీయశిష్య ప్రచారం
కుర్వ న్యశ్చ ప్రథమత ఇహ ద్యోతయామాస తత్త్వం
విద్యాపీఠం సకలవిదుషాం పోషకం స్థాపయిత్వా
సోఽయం సాక్షా ద్విబుధరుచిరే భాసతే సత్యలోకే. ౩

శ్లో. అమృతానన్దనాథస్య హ్యాద్వైతామృతవర్షిణః
జయన్తిః క్రియతే స్వీయైః శిష్యైః పండితపోషకైః. ౪

శ్లో. ఇత్థ మేవ సదా తస్య కుర్వన్తశ్చ మహోత్సవాన్
విదుషో మానయంత శ్చ త్రిలింగే ప్రథితాన్ ముదా. ౫

శ్రీమత్పంచాశత్తమోత్సవము

శ్రీ మ పి మ స్త్రా సం పా ఫ పం ప సు

విద్వాన్ శతావధాని దమ్మదపాటి అనంతశాస్త్రి

(రిటైర్డు సీనియర్ తెలుగు పండిట్ బోర్డుహైస్కూల్సు క్రిష్ణా.

ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్. బెజవాడ ...

సీ. తన శరీరంబందుఁ దగిలిన రోగపు
 బాధకు నొక్కింతయు బాధపడక
శస్త్రచికిత్స పరిశ్రాంతబనుచు వైద్యు
 మజాలు చేయు కృపఁ నెమ్మదిని గోరఁడు
బాధనొక్కింతయుఁ బరిగణింపక యాత్మ
 బోధముఁజేయు నేర్పును నిజంబు
చిమ్మకైనను మంచి క్షేమంబు చేకూర్చు
 తలఁపు తపంబును బారి తలఁడు.

గీ. బొమ్మలిండ్లలో దేవుని బొలుపునేర్పు
మనుజుఁడయ్యును దైవమహిమఁగాంచు
నందఱికిఁ దోడునీడయై యలరుచుండు
నట్టి శ్రీయమృతానందు నభినుతింతు

మ. విమలంబయ్యెఁ ద్రిలింగ రాజిత మహాపీఠంబు లోకోత్తరా
ర్థము వేదార్థము శాస్త్రబోధనయు నేర్వన్ సర్వతంత్రస్వతం
త్రము నిల్పన్ బెజవాడయందు గురువిద్యా పద్ధతుల్ మించ జ్ఞా
నము భాసిల్లెడిరీతి గూర్చె నమృతానందున్ బ్రశంసించెదన్.

---

విద్వాన్ దేవరకొండ చిన్నికృష్ణశర్మగారు

ఆస్థానకవులు. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము.

ఉ. చల్లనిచూపువాఁడు, శ్రితజాలము నేలెడుపూన్కివాఁడు రా
జిల్లెడుబ్రహ్మతేజమునఁ జెన్నలరారు మొగంబువాఁడు శో
భిల్లెడుకుందసంపుఁబసివెల్గుల మించెడుమేనివాఁడు నా
యుల్లమునందు నిల్చుత దయోదధి భూషణమూర్తి సర్వదా.

---